ఓం
ఓం నమో నారాయణాయ

శ్రీ వేంకటేశ్వర పరబ్రహ్మణేనమః

# శ్రీభాగవతము - ప్రశ్నావళి

రచయిత
**మారెళ్ళ వెంకట శేషారెడ్డి**




**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2024**

# SRI BHAGAVATAMU - PRASNAVALI

By
**Marella Venkata Sesha Reddy**

Editor
**Dr. Akella Vibhishana sarma**
Special Officer
Publications Division

T.T.D. Religious Publications Series No. 1457


First Edition : 2024

Copies : 100

Price :

Published by :
**Sri J. Syamala Rao,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507

**D.T.P.**
Publications Division,
T.T.D, Tirupati

Printed at
**Tirumala Tirupati Devasthanam's Press**
Tirupati - 517 501

## ముందుమాట

'పురాఽపి నవం ఇతి పురాణం' పాతదైనా విషయపరంగా కొత్తదనాన్ని సంతరించుకున్నది, నిత్యనూతనమైనది పురాణం. పురాతనకాలచరిత్రను తెలిపేది పురాణం. ఇవి పద్దెనిమిది.

అపౌరుషేయాలైన వేదాలలోని సారాన్ని సులభంగా ఈ లోకం అవగతం చేసుకోవాలి అనే సంకల్పంతో విష్ణుస్వరూపులైన భగవాన్ వేదవ్యాసులవారు పురాణ ఇతిహాసాల రచన చేశారు.

**విస్తారాయ చ వేదానాం స్వయం నారాయణః ప్రభుః ।**
**వ్యాసరూపేణ కృతవాన్ పురాణాని మహీతలే ॥**

అష్టాదశపురాణాలలో శ్రీభాగవతమహాపురాణం మోక్షప్రదాయక మైనది. శమీకమహర్షి పుత్రుడైన శృంగి శాపవశాత్తు ఏడురోజులలో పరీక్షిన్మహారాజుకు మృత్యువు ఏర్పడింది. శుకమహర్షి ఆ ఏడురోజులు భాగవతపురాణ ప్రవచనం గావించి పరీక్షిన్మహారాజుకు మృత్యుభయాన్ని తొలగించి ముక్తిని ప్రసాదింపజేశారు. భాగవత పురాణంలో 12 స్కంధాలున్నాయి. ఈ 12 స్కంధాలు శ్రీమహావిష్ణువుయొక్క శరీర అవయవాలుగా భాగవతమహాపురాణం పేర్కొంటున్నది.

ఇంతటి ప్రశస్తిని పొందిన భాగవత మహాపురాణాన్ని బమ్మెర పోతనామాత్యులు తేటతెలుగులో రచించి ఆంధ్రలోకానికి మహోపకారం చేశారు. పరమభాగవతోత్తముడైన బమ్మెర పోతన శ్రీరామచంద్రుని ఆజ్ఞమేరకు తన సహజ పాండిత్యంతో, అనితర భక్తితో, భాగవత రచనను చేశాడు. పోతనామాత్యుని లేఖిని నుండి జాలువారిన కవితాసుధాస్రవంతి ఆంధ్రజన హృదయాలనే కేదారాలను తడుపుతూ, తాపత్రయాన్ని హరిస్తోంది. పోతనభాగవతంలోని ప్రతిపద్యమూ హృద్యమే. తెలుగునాట పోతనభాగవత పద్యాలు ఒక్కటైనా రానివారు ఉందరనడంలో అతిశయోక్తి లేదు.

తిరుమల తిరుపతి దేవస్థానములు ధర్మప్రచారంలో భాగంగా ఇప్పటికే మతత్రయ వ్యాఖ్యానంతో సంస్కృతంలో వ్యాసభాగవతాన్ని ముద్రించడంతోపాటు, తెలుగులో పోతనభాగవతాన్ని తాత్పర్యంతోనూ, ఇటీవలికాలంలో టీకా తాత్పర్య సరళవ్యాఖ్యాన సహితంగానూ ముద్రించి భక్తలోకానికి అందించింది.

నేటితరానికి అనుగుణంగా పురాణాలను బోధించడంతోపాటు, పోటీతత్త్వాన్ని అలవర్చేదిశగా ప్రశ్నావళి రూపంలో భాగవతాన్ని అందించే ప్రయత్నమే ఈ **'శ్రీభాగవతము-ప్రశ్నావళి'**. ఈ గ్రంథాన్ని శ్రీ మారెళ్ళ వెంకట శేషారెడ్డిగారు రూపొందించారు. తొంభై తొమ్మిది అధ్యాయాలతో కూడిన ఈ భాగవత ప్రశ్నావళిలో ప్రతి అధ్యాయంలోనూ మొదట సంక్షిప్త కథాంశాన్ని ఇచ్చి తదనుగుణంగా ఐదు బహుళైచ్ఛిక సమాధాన ప్రశ్నలు వాటికి జవాబులు ఇవ్వబడ్డాయి. ఈ ప్రశ్నలకు సమాధానాలు చేయడం ద్వారా భాగవతంపై పాఠకులకు ఒక సదవగాహన వచ్చే అవకాశం ఉన్నది. యువతకు ఉపయోగపడే ఇలాంటి చక్కటి గ్రంథాన్ని రూపొందించిన శ్రీ శేషారెడ్డిగారికి కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ శ్రీనివాసుని కృపాకటాక్షాలు కలగాలని కోరుకుంటున్నాను. భాగవత అంశాలపట్ల ఆసక్తులైనవారికి, ముఖ్యంగా యువతకు ఈ గ్రంథం ఓ కల్పవృక్షంగా భావిస్తున్నాను.

ఈ మంచి గ్రంథాన్ని ఎంపిక చేసి చక్కగా ముద్రాపింపజేసిన ప్రచురణల విభాగం ప్రత్యేకాధికారి డా॥ ఆకెళ్ళ విభీషణశర్మగారికి శుభాభినందనలు.

*సదా శ్రీవారి సేవలో...*

డి. శ్యామల రావు

**శ్రీకార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు,

తిరుపతి.

ఓం శ్రీరామ

# మనవి

**నిగమ కల్ప తరోర్గలితం ఫలం, శుక ముఖాద మృతద్రవ సంయుతమ్**
**పిబత భాగవతం రసమాలయం, ముహురహో రసికాభువి భావుకాః.**

రసికవతంసులారా! శ్రీ మద్భాగవతము వేదమనెడి కల్పవృక్షము నుండి వెలువడిన మధురఫలం. అది అమృతమయము. రస పరిపూర్ణం. యోగిపుంగవులకు నిలువుటద్దమైన శుకమహర్షి ముఖారవిందము నుండి జాలువారినది. మహానుభావులారా! ఆ దివ్యఫలరసాన్ని పదేపదే తనివిదీర ఆస్వాదిచండి.

శ్రీమద్భాగవత మహాపురాణం భక్తి, జ్ఞాన, వైరాగ్యాల ద్వారానూ, ధర్మార్థ కామ మోక్షాల చేతనూ భగవంతుని చేరుకొను మార్గాన్నిస్తుంది. దుర్లభమగు మానవజన్మ ద్వారా పరమాత్మను చేరుకొనుటకు భక్తియే సులభ సాధనమని మాటిమాటికి ఉపదేశిస్తుంది.

భాగవత పురాణాన్ని భక్తి శాస్త్రంగా పెద్దలు చెప్పిన మాట భా-గ-వ-త-అను అక్షరాలకు భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్త్వమనీ, పురాణమనగా మనసును జీవింపజేసేది అని మన పూర్వులు అన్వయించి చెప్పారు.

మహిమాన్వితాలైన భగవత్కథల ద్వారా నిరంతరాయంగా ఆ శ్రీహరి నామాన్ని స్మరించే భక్తకోటిని సంసారసాగరంనుండి భగవంతుడు నిస్సందేహంగా తరింపజేస్తాడు.

ఇంతటి దివ్యగ్రంథాన్ని శ్రీ భాగవతము – ప్రశ్నావళి అనే పేరున రచించడం జరిగింది. ఇందు వేదవ్యాస భగవానుడు, బమ్మెరపోతనామాత్యుడు చెప్పిన మధుర వాక్కులే తప్ప ఇతరములేవియును ఇందు పొందుపరచబడలేదు.

2018వ సంవత్సరములో మహాభారతము – ప్రశ్నావళి అను గ్రంథాన్ని రచించి, ముద్రించటం జరిగింది. ఇందుకు తిరుమల – తిరుపతి దేవస్థానములవారు ప్రచురణకు ఆర్థిక సహాయం కూడా చేసి యున్నారు.

మహాభారతము – ప్రశ్నావళి గ్రంథమును విశేష ఆదరణతో ఆదరించిన విధంగానే, ఈ శ్రీభాగవతము – ప్రశ్నావళి అను గ్రంథమును కూడా, పఠితలు, ధార్మిక సంస్థలు, పురాణాలపై మక్కువ గలిగిన విద్యార్థినీ విద్యార్థులు విశేషంగా ఆదరిస్తారని, ఇది ప్రజానురంజకం కాగలదని ఆశిస్తున్నాను.

**– రచయిత**

# శ్రీమద్భాగవత మహాపురాణము - విశేషం

ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీమన్నారాయణుని యొక్క జ్ఞానావతారమైన వేదవ్యాస భగవానునిచే విరచితములైన అష్టాదశ మహా పురాణాలలో అత్యంత శ్రేష్ఠమైనది, చతుర్విద ఫలప్రదమైనది శ్రీమద్భాగవత మహాపురాణము. ఇందు భగవంతుడు, భక్తుడు, భక్తి అనునవి ప్రధానంగా ప్రతిపాదింపబడినవి. వేదవ్యాసుడు అపారమైన వేదరాశిని నాలుగు భాగాలుగా విభజించాడు, సకల వేదసారాన్ని నిక్షిప్తం చేస్తూ, పంచమ వేదమనే మహాభారత కావ్యాన్ని, పద్దెనిమిది మహా పురాణాలను దేవభాషయైన సంస్కృతంలో రచించాడు. అప్పటి వరకు తాను విశ్వ శ్రేయస్సు కొరకు చేసిన కృషితో ఆయన హృదయం సంతుష్టం కాలేదు. అందువల్ల ఆ మహర్షి సరస్వతీ నదీతీరాన ఏకాంతంగా కూర్చుండి తన అసంతుష్టికి కారణం ఏమిటా అని ఆలోచింప సాగాడు. ఆ సమయంలో పరమ భక్తాగ్రేసరుడైన నారద మహర్షి అక్కడకు వచ్చాడు. వచ్చిన మహర్షిని వ్యాసుడు ఉచితరీతిని భక్తితో పూజించాడు. అప్పుడు నారద మహర్షి పరాశర నందనా! నీవు సనాతన బ్రహ్మ తత్త్వాన్ని గురించి చక్కగా అధ్యయనము చేశావు. అవగాహన చేసికొన్నావు. ఇట్టి మహాద్భుతకార్యాన్నిసాధించినను కృతకృత్యుడవు కానివానివలె ఏదో వెలితితో ఖిన్నుడవై యున్నట్లు తోస్తున్నది. అందుకు కారణమేమి? అని పలికిన బ్రహ్మ మానసపుత్రునితో వ్యాసుడు "మహర్షీ! నా విషయమున నీవు పలికిన దంతయూ వాస్తమే. నీవు అగాధమైన జ్ఞానం కలవాడవు. సాక్షాత్తు బ్రహ్మదేవుని కుమారుడవు. అందువలన నా అశాంతికి గల కారణాన్ని గూర్చి తెలుపగోరుతున్నాను" అని పలికిన వ్యాసునితో నారద మహర్షి – "మునివరా! నీవు పురుషార్థాలను గూర్చి తెలిపినంతగా శ్రీమహా విష్ణువు యొక్క మహిమలను గురించి వర్ణించలేదు. ఓ మహాభాగా! వ్యాసా! నీ దృష్టి అమోఘమైనది. నీవు విద్వాంసుడవు. కావున లోకోపకారానికై భగవంతుడైన శ్రీమహావిష్ణువును కీర్తించు. అది నీ ఆత్మకు శాంతిని కలిగిస్తుంది. ఈ జగత్తంతటినీ ఆనందింప జేస్తుంది" అని వ్యాస సంశయమును దీర్చి హరినామ కీర్తనం చేస్తూ దేవర్షి

వెళ్ళిపోయాడు. అటు పిమ్మట వ్యాస మహర్షి నారాయణుని లీలలు, అవతారాలు, పరమ భక్తుల కథలు, భక్తియే ప్రధానంగా గలది, గతంలోని కల్పాలలోనూ, యుగాలలోను, ప్రస్తుతము తాను జీవించి ఉన్న సమయంలోనూ జరిగిన చరిత్రలన్నింటినీ తన దివ్యదృష్టితో దర్శించి, పరమాత్మ సంకల్పంచే లోకానుగ్రహ దృష్టితో అక్షరబద్ధం చేశాడు. ఆ చారిత్రక కావ్యమే శ్రీమద్భాగవత మహాపురాణంగా వాసి గాంచింది.

ఈ పురాణాన్ని రచించినంతనే భగవత్స్వరూపుడగు వేదవ్యాస మహర్షికే పరమ శాంతి లభించినప్పుడు ఇక మానవమాత్రుల గురించి చెప్పనేల? ఇట్టి భక్తి కావ్యాన్ని ప్రాయోపవేశ దీక్షితుడై మృత్యునిరీక్షణలో ఉన్న పరీక్షిత్తుకు మోక్షప్రాప్తికై చెప్పడం జరిగింది. వ్యాస తనయుడైన శ్రీశుకుడు ఏడు రోజులలో ముక్తిని పొందే మార్గం కోరిన పరీక్షిత్తుకు భాగవత తత్త్వోపదేశం చేశాడు.

**విశేషం :** భాగవతము అనగానే అష్టమ స్కంధంలోని గజేంద్రమోక్షం ఘట్టంలోని పోతన పద్యాలు ఏవో కొన్నైనా రాని ఆంధ్రుడుండడు అంటే అతిశయోక్తి కాదు. ప్రతి తల్లిదండ్రి ఒకప్పుడు తమ పిల్లలకు గజేంద్ర మోక్షంలోని పద్యాలు కంఠతా నేర్పించేవారు. బడిలో మాష్టార్లు ప్రార్థనా పద్యంగా ఎవ్వని చే జనించు అనే పద్యాన్ని చెప్పించేవారు. ఇందుకు వ్యాస భాగవతంలో వేదవ్యాస భగవానుడు సంస్కృతంలో గజేంద్రుడు భగవంతుని ప్రార్థించిన శ్లోకం :

**శ్లో॥ ఓం నమో భగవతే తస్మైయత ఏతచ్చిదాత్మకమ్ ।**
**పురుషాయాదిబీజాయ పరేశాయాభిధీ మహి ।**
**యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం యఇదం స్వయమ్ ।**
**యో స్మాత్పరస్మాచ్చ పరస్తం ప్రపద్యే స్వయమ్భువమ్ ।**

ఇందుకు పోతన ఆంధ్రభాగవతంలో తాను ఈ విధంగా వ్రాశాడు.

**ఉ. ఎవ్వని చే జనించు జగ; మెవ్వని లోపల నుండు లీనమై;**
**ఎవ్వని యందు డిందు; పరమేశ్వరుడెవ్వడు; మూలకారణం**

**బెవ్వ; డనాది మధ్య లయుడెవ్వడు; సర్వము తానెయైన వా**
**డెవ్వడు; వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్.**

**తాత్పర్యము :** ఈ లోకము ఎవరివల్ల పుట్టుతుందో, ఎవనితో కలిసి ఉంటుందో, ఎవని లోపల లయం పొందుతుందో, ఎవడు పరమాత్ముడో, ఎవడు ఈ విశ్వానికి మూలకారణమో; ఎవడు పుట్టడము, గిట్టడము, పెరగడమూ లేకుండా ఉంటాడో, ఎవడు అన్నీ తానేయై ఉంటాడో అటువంటి ప్రభువైన భగవంతుణ్ణి నేను శరణు కోరుతాను.

**విశేషం :** ఇటువంటి పద్యాలు తెలుగు వారి నాలుకలమీద నాట్యం చేస్తుంటాయి నాటికి, నేటికీ, ఏనాటికీను. కాగా వామనమూర్తిగా స్వామి దేవతలను గాచుటకై మూడడుగుల నేల యాచించగా, బలిచక్రవర్తి సశాస్త్రీయంగా తాను వెనుదీయక ధారపోశాడు. అప్పుడు భగవంతుడు విశ్వాన్ని కొలవడానికి త్రివిక్రముడైన సన్నివేశాన్ని వ్యాసుడు శ్లోక రూపంగా ఈ విధంగా రచించాడు.

**శ్లో॥ తద్వామనం రూప మవర్ధ తాద్భుతమ్**
**హరే రనంతస్య గుణత్ర యాత్మకమ్ ।**
**భూఃఖందిశోద్యౌ వివరాః పయోథయః**
**ఆర్యజ్నృదేవా ఋషయొ యదా సత ।**

**శ్లో॥ కాయే బలిస్తస్య మహా విభూతేః**
**సహర్త్విగాచార్య సదస్య ఏతత్ ।**
**దదర్శ విశ్వంత్రిగుణం గుణాత్మ కే**
**భూతేంద్రియార్థాశయ జీవయుక్తమ్ ।**

ఇందుకు పోతన కవిత్వంలో ఒక మరుగుజ్జు వటువు త్రివిక్రముడై మూడు లోకాలు అతిక్రమించి ఎదిగిపోయాడు. ఏ కవి ఏ భాషలో వర్ణనాతీతమైన ఆ అత్యద్భుత సన్నివేశాన్ని అభివర్ణించ గలడో అతడే పోతన.

**ఇంతింతై వటుఁడింతయై మరిఁ దా నింతై, నభోవీథి పై**
**నంతై తోయదమండలాగ్రమున కల్లంతై! ప్రభారాశిపై**

**నంతై చంద్రుని కంతయై ధ్రువుని పై నంతై మహర్వాటిపై**
**నంతై, సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.**

ఈ పద్యం చదివిన సాహితీ ప్రియులు రసానంద పారవశ్యంలో లీనమౌతారు. పోతన కవితకు విశిష్టత చేకూర్చినది అతని భాగవత భాషాశైలి.

ప్రహ్లాద చరిత ఘట్టంలో వ్యాస భగవానుడు

**శ్లో॥ న కేవలం మే భవతశ్చ రాజన్**
**స వై బలం బలినాం చాప రేషాం ।**
**పరే వరే మీ స్థిరజఙ్గమా యే**
**బ్రహ్మదయో యేన వశం ప్రణీతాః ।**

**శ్లో॥ స ఈశ్వరః కాల ఉరుక్రమో సా**
**వోజ సహ సత్త్వబలేంద్రియాత్మా ।**
**స ఏవ విశ్వం పరమః స్వశక్తిభిః**
**సృజత్యవత్యత్తి గుణత్రయేశః ।**

**విశేషం :** పై శ్లోకములకు పోతన తెలుగున చెప్పిన రసగుళిక.

**క॥ప॥ బలయుతులకు దుర్బలులకు, బలిమెవ్వడు నీకు నాకు బ్రహ్మాదులకున్**
**బలమెవ్వడు ప్రాణులకును, బలమెవ్వండట్టి విభుడు బలమసురేంద్రా!**

**తాత్పర్యము :** లోకంలో బలవంతులకూ, బలహీనులకూ ఎవడు బలమో నీకూ నాకూ, బ్రహ్మాది దేవతలకు ఎవడు బలమో సమస్త ప్రాణికోటికీ ఎవడు బలమో ఆ పరాత్పరుడే నాకూ బలము. "ఓ అసురేంద్రా! కాలాను గుణంగా, వివిధ రూపాలతో, వివిధ పద్ధతులతో ఆ విరాణ్మూర్తి విరాజిల్లుతుంటాడు. ఆ చతుర్భుజుడు త్రిగుణాలచేత సృష్టి, స్థితి లయం చేస్తూంటాడు. త్రిగుణాలకు అతడే స్వామి.

**విశేషం :** ఇటువంటి భక్తి ప్రధానమైన సందర్భాలను వివరించి చెప్పే విశేషాలు గలిగినదే శ్రీమద్భాగవత మహాపురాణం.

భవదీయుడు
**మారెళ్ళ వెంకట శేషారెడ్డి**

# శ్రీభాగవతము - ప్రశ్నావళి గురించి

లోగడ నేను కవిత్రయ భారతాన్ని చదివే సమయంలో ఈ కావ్యానికి సంబంధించి ఏదో ఒకటి చెయ్యాలని ఆలోచించి ప్రతి పర్వానికి ఐదు ప్రశ్నలు వాటికి సమాధానాలు వ్రాయాలని ఒక ప్రయత్నం చేశాను. తిరుమల తిరుపతి దేవస్థానం వారి అంగీకారమే గాక ప్రచురణ నిమిత్తం యాభై వేల రూపాయల ఆర్థిక సహాయాన్ని కూడా పొందాను. అటు తరువాత అనూహ్యంగా ఆ గ్రంథానికి ప్రజామోదం లభించింది. అందుకు సంతోషించి భాగవతం కూడా ఆ విధంగానే చేయాలని సంకల్పించి ప్రధానంగా పోతన భాగవతాన్ని అనుసరిస్తూ అక్కడక్కడ మూలం, సంస్కృత భాగవతం వ్యాసప్రోక్తమైన దానిని కూడా తీసికొంటూ ముందుకు పోవటం జరిగినది. వేదవ్యాసుడు 335 అధ్యాయాలలో భాగవతాన్ని వ్రాయగా పోతన 299 అధ్యాయాలలో వ్రాశాడు. కాగా శ్రీభాగవతం – ప్రశ్నావళి గ్రంథము నందు కథా ప్రాధాన్యతను విస్తృతిని పరిగణిస్తూ 99 అధ్యాయాలలో శ్రీభాగవతమంతటిని శ్రీభాగవతము–ప్రశ్నావళి రూపంలో ఇందు నిక్షిప్తం చేయటం జరిగింది. ఈ విధంగా మహాభారతము – ప్రశ్నావళి అను గ్రంథాన్ని లోగడ వెలువరించిన విధంగానే మొదటి రెండు ప్రశ్నలకు ఒక్కొక్క ప్రశ్నకు నాలుగు రాయితీ పదాలను ఇవ్వడం అందులో ఒక సమాధానాన్ని కనుగొనటం జరగాలి. అటుపిమ్మట మూడవ ప్రశ్న రాయితీ పదం లేకుండా నేరుగా సమాధానం చెప్పాలి. అనంతరం రెండు ప్రశ్నలకు సమాధానాలు నిడివి ఎక్కువగా ఉండి అధ్యాయము యొక్క సమగ్ర సారాంశం అంతా అందులో ఉంటుంది.

ఈ గ్రంథంలోని అధ్యాయానికి సంబంధించిన ఐదు ప్రశ్నలను, వాటి జవాబులను చదువగలిగితే, ఆ అధ్యాయం యొక్క కథా సారాంశం అంతా అర్థమవుతుంది. కాగా ప్రశ్న కేవలం ప్రశ్నగానేగాక అధ్యాయములోని కథ అంతా అర్థం కావాలి గనుక ప్రశ్న యొక్క నిడివి ఒక్కొక్కచోట ఎక్కువగా ఉంటుంది. పాఠకులు దీనిని గమనించ గలరని మనవి.

భక్తియే ప్రధానాంశంగా వేదవ్యాస మహర్షి శ్రీమద్భాగవత మహా పురాణముగా రచించిన సంస్కృత భాగవతాన్ని గాని, దానిని ఆంధ్రీకరించిన పోతన భాగవతాన్ని గాని చదివి అర్థం చేసుకొన్న విజ్ఞులకు చదువరులకు పురాణాలపై మక్కువ కలిగిన విద్యార్థినీ విద్యార్థులకు ఈ గ్రంథము చాలా ఉపయుక్తముగా ఉంటుందని ఆశిస్తున్నాను. ఈ గ్రంథము శ్రీభాగవతము ప్రశ్న–జవాబుల పోటీ కార్యక్రమాలు నిర్వహించుకొనుటకు చాలా ఉపయోగంగా ఉంటుందని ఆశిస్తున్నాను.

**– మారెళ్ళ వెంకట శేషారెడ్డి**

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీభాగవతము - ప్రశ్నావళి

## మంగళ శ్లోకములు

శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥
అగజానన పద్మార్కం గజానన మహర్నిశం ।
అనేకదం తం భక్తానాం ఏకదంతముపాస్మహే ॥

యా కుందేందు తుషార హార ధవళా యా శుభ్ర వస్త్రాన్వితా
యా వీణా వరదండ మండితకరా యా శ్వేత పద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభి: దేవై స్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్ ।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥
వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మ నిధయే వాసిష్ఠాయ నమో నమః
అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహు రపరో హరిః
అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః ॥

## దైవస్తుతి

**శ్రీకైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్, లోక ర**
**క్షైకారంభకు, భక్తపాలన కళా సంరంభకున్, దానవో**
**ద్రేక స్తంభకు, గేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా**
**నాకంజాత భవాండ కుంభకు, మహానందాంగనా డింభకున్**

**తాత్పర్యం :** అక్షరమైన మోక్ష సంపదను అపేక్షించిన నేను ఆనంద స్వరూపిణి యైన ఆనంద గోపుని ఇల్లాలి ఒడిలో అల్లారు ముద్దుగా ఆడుకుంటున్న అందాల బాలుణ్ని ధ్యానిస్తున్నాను. ఆ యశోదా కిశోరుడు సామాన్యుడు కాదు. ఏమాత్రం ఏమరుపాటు లేకుండా ఎల్లలోకాలనూ చల్లగా పాలిస్తూ ఉంటాడు. నిరంకుశులైన నిశాచరుల ఔద్ధత్యాన్ని నిర్మూలిస్తూ ఉంటాడు. అంతేకాదు కన్నతల్లి ఒడిలో ఒయ్యారంగా కూర్చున్న ఆ చిన్ని కన్నయ్య ఒక్కమాటు అలా కన్నులెత్తి చూస్తేచాలు. ఎన్నెన్నో బ్రహ్మాండ బాండాలు తండోప తండాలుగా ఆచూపుల్లో రూపులు దిద్దుకుంటాయి.

**శ్రీవిలసిత ధరణీ తన యా**
**దవ సరోజ వాసరాధిప! సిత రా**
**జీవ దళనయన! నిఖిల ధ**
**రావర నుత! సుగుణధామా! రాఘవరామా!**

**తాత్పర్యము :** అందమైన సీతాదేవి ముఖమనే పద్మమునకు సూర్యుని వంటివాడా! తెల్లతామర రేకుల వంటి కన్నులు కలవాడా? సమస్త రాజుల చేత పొగడబడే సద్గుణాలకు స్థానమయిన వాడా! రఘువంశ లలామా! శ్రీరామా!

**శ్రీమద్విఖ్యాతి లతా, క్రామిత రోదోంతరాళ! కమనీయ మహా**
**జీమూతతులిత దేహ, శ్యామల రుచిజాల రామ చంద్రనృపాలా!**

**తాత్పర్యము :** శ్రీరామచంద్రా! సద్గుణసాంద్రా! నీవు విశిష్ట రాజన్యుడవు. విశ్వనాథుడవు. మహనీయమైన నీ కీర్తిలతలు విశ్వమంతా నిండి విస్తరించినాయి. అందాల నీలిమేఘాల కాంతితో మెరిసిపోయే నీశరీరం జగన్మోహన మయింది. స్వామీ! నీకు నమస్సుమాంజలి.

**శ్రీకంఠ చాప ఖండన। పాకారి ప్రముఖ వినుత భండన। విలస**
**త్కాకుత్థ్స వంశ మండన। రాకేందు యశోవిశాల రామనృపాలా।**

**తాత్పర్యం :** శ్రీరామచంద్రా! నీవు శివుని విల్లు విరిచినవాడవు. ఇంద్రుడు మొదలైనవారు మెచ్చుకొనేటట్లు యుద్ధం చేయగలవాడవు. ప్రకాశిస్తూ ఉన్న కాకుత్థ్స వంశానికి అలంకారమైన వాడవు. కార్తీకపౌర్ణిమ నాటి చంద్రుని వెన్నెలవంటి కీర్తితో విశ్వమంతటను వ్యాపించినవాడవు. ప్రజలను ఆనందపరచు రాజువు నీవు. అటువంటి నీకు నమస్కారము.

**శ్రీకర పరితోషిత ర, త్నాకర! కమనీయ గుణ గణాకర! కారు**
**ణ్యాకర! భీకర శరధా రా, కంపిత దానవేంద్ర! రామ నరేంద్రా!**

**తాత్పర్యము :** లక్ష్మీసమన్వితుడవు. మనోహరమైన గుణగణములకు నిలయుడవు. కరుణా సముద్రుడవు. భయంకరమైన బాణవర్షముచే దానవులను కంపింప జేసేవాడవు ఐన ఓ రామచంద్రా! అవధరించు

**ఉ॥ ఊహగలంగి జీవనపుటోలమునంబడి పోరుచున్ మహా**
**మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక సం**
**దేహము బొందు దేహిక్రియ దీనదశన్ గజముండే భీషణ**
**గ్రాహదురంత దంత పరిఘట్టిత పాదఖురాగ్ర శల్యమై.**

**తాత్పర్యము :** బ్రతుకు దెరువులో పడిపోయి మోహమనే పెద్దతీగతో కట్టుబడిన పాదాన్ని విడిపించుకోలేక దిక్కుతోచకుండా సందేహానికి గురైన జీవుని విధంగా గజేంద్రుడు ఘోరమై మొసలి వాడికోరలకు చిక్కి తొక్కుడుపడిన కాలిగిట్టలు కలవాడై ఆర్తితో అలమటించాడు. ఈ విధంగా జీవుడికి ఆది భౌతికము వలన అనగా పృథి వ్యాధి ప్రకృతి వలన తప్పించుకోలేని బంధం ఏర్పడినప్పుడు, దానికి గజేంద్రుడు 'నీవే తప్ప ఇతఃపరంబెరుగన్' అన్నట్లుగా ఆత్మ పరమాత్మ వైపు దృష్టిసారించి, వస్త్రాపహరణంలో ద్రౌపది శ్రీకృష్ణ పరమాత్మను ధ్యానించినట్లుగా ఏకాగ్రతతో, భక్తితో ధ్యానిస్తే తప్పక నారాయణుడు జీవునికి కలిగిన ప్రకృతి బంధాలను తొలగించి ఆధ్యాత్మికత వైపు అనగా భగవంతుని వైపు పయనింపజేస్తాడు.

**ఓం నమో నారాయణాయ వాసుదేవాయ శ్రీకృష్ణాయతే నమః**

**రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేదసే**

**రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః**

**విశేషం :** భాగవతమంతా భగవంతుని అవతారాలు, మహాభక్తుల చరిత్రలుగా మనకు పైకి కనిపించినా, నిగూఢమైన అంతరార్థం వేరేగా ఉంటుంది. ప్రకృతి, జీవుడు, పరమాత్మలకు సంబంధించి తెలిసికోగలిగితే ఎంతో పరమార్థం అందులో దాగి ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లోని నెల్లూరు జిల్లా కలిగిరి మండలం తెల్లపాడు గ్రామంలో వేంచేసియున్న వినాయకుడు, ఇతర పరివార దేవతా సమేత శ్రీ భద్రకాళీ గ్రామ దేవతకు నమస్కరించి, శ్రీహనుమత్ లక్ష్మణ సీతా సమేత శ్రీ కోదండ రామస్వామి వారిని పూజించి, కలియుగ దైవం శ్రీ వేంకటేశ్వర పరబ్రహ్మను స్మరించి ఈ శ్రీ భాగవతము – ప్రశ్నావళి అనే గ్రంథాన్ని ప్రారంభిస్తున్నాను.

రచయిత

**– మారెళ్ళ వెంకట శేషారెడ్డి**



# విషయసూచిక



## శ్రీభాగవతము - ప్రశ్నావళి

**చతుర్థ స్కంధము - (41-77)**



**పంచమ స్కంధము - (78-89)**



**షష్ఠమ స్కంధము - (90-102)**

**సప్తమ స్కంధము – (103–119)**



**అష్టమ స్కంధము – (120–137)**



**నవమ స్కంధము – (138–154)**



**దశమ స్కంధము – (155–284)**

* * *

ఓం శ్రీరామ

# శ్రీభాగవతము - ప్రశ్నావళి

## ఒకటవ అధ్యాయము - ప్రథమ స్కంధము

**1. కథా ప్రారంభము 2. శౌనకాదుల ప్రశ్న 3. సూతుడు నారాయణ కథా ప్రశంస చేయడం.**

**1) ప్రశ్న :** శ్రీమంతమూ, వేద వ్యాస విరచితమూ, అయిన ఈ భాగవత పురాణాన్ని రచించడానికి ప్రేరణగా, సరస్వతీ నదీతీరంలో ఆలోచిస్తూ కూర్చొనియున్న వ్యాస మహర్షి వద్దకు వచ్చిన పరమ భాగవతోత్తముడైన మహర్షి ఎవరు?

**జవాబు :** 1. కణ్వమహర్షి 2. విశ్వామిత్రమహర్షి
3. దుర్వాసమహర్షి 4.నారదమహర్షి

**2) ప్రశ్న :** వ్యాస మహర్షి సంస్కృత భాషలో వ్రాసిన భాగవత కావ్యాన్ని ఆంధ్రీకరించిన పోతన కవీంద్రుడు ఎవరి సమకాలికుడని జనబాహుళ్యంలో ఉంది?

**జవాబు :** 1. నన్నయ 2. శ్రీనాథుడు
3. అల్లసానిపెద్దన 4. తెనాలిరామలింగకవి

**3) ప్రశ్న :** నైమిశారణ్యంలో శౌనకాది మహర్షులు శ్రీహరి సన్నిధిని కోరినవారై వేయి సంవత్సరాల పర్యంతం కొనసాగే యాగం ప్రారంభించారు. ఆ యాగం పేరేది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** సూతుడు శౌనకాది మహర్షులకు శ్రీ మహా భాగవతాన్ని తెలుపుటకు పూనికవహించి ఏ విధంగా ప్రారంభించాడు?

**జవాబు :** నైమిశారణ్యంలో దీర్ఘసత్రయాగం నిర్వహిస్తున్న సందర్భంలో అక్కడ ఉన్న శౌనకాది మహర్షులు, యాగదీక్షలో ఉన్న సమయంలో కాకుండా, ఇతర సమయాలలో యజ్ఞపురుషుడైన శ్రీమన్నారాయణుని చరిత్రలను

వినగోరి, సమస్త పురాణాలు చక్కగా వివరించి చెప్పే నేర్పుగల 'ఉగ్రశ్రవసుడు' అనే పేరుగల సూతమహర్షిని చేరి, వైకుంఠనాథుని చరిత్రలను తెలిపే పుణ్య కథలను తెలుపుమని కోరారు. అప్పుడు ఆ మహర్షి వేదవ్యాసునిచే రచించబడిన శ్రీ భాగవతాన్ని తెలుపడానికి పూనిక వహించాడు. ముందుగా వ్యాస మహర్షినీ, ఆయన పుత్రుడు శ్రీశుకుని ఆసక్తితో ఆరాధిస్తున్నాను అని పలికి, నర నారాయణులకు నమస్కరించి, పలుకుల తల్లి సరస్వతీ దేవికి మ్రొక్కి, జనన మరణ బంధాలను పటాపంచలు చేసే పవిత్ర గ్రంథాన్ని, భాగవతాన్ని పలుకుతున్నాను అని సకల దేవతలకూ, గురువులకూ ప్రణామం చేశాడు. మునీంద్రులారా! సమస్త విశ్వానికి శ్రేయోదాయకమైన పరమార్థాన్ని తెలుపుమని నన్ను మీరు అడిగారు. దేనివలన శ్రీహరి విషయకమైన ప్రశ్నలు అడుగబడతాయో, దేనివలన అంతరాత్మకుఆనందం చేకూరుతుందో, దేనివలన హరిభక్తి ప్రాప్తిస్తుందో అదే మానవులకు పరమధర్మం అవుతుంది. కర్మ బంధాలను నిర్మూలించే కమలాక్షుని కథలను ఆకర్షించే వారికి మరేవి రుచించవు. పుణ్య శ్రవణ కీర్తనుడైన పురుషోత్తముడు తన కథలను ఆలకించే భక్తుల అంతరంగాలలో నివసించి, వారికి సకల శుభాలు సమకూర్చి అశుభాలు పోకార్చుతాడు. అశుభ పరిహారంవల్ల భాగవత సేవలభిస్తుంది. భాగవత సేవవల్ల అచంచల భక్తిప్రాప్తిస్తుంది. భక్తివలన పునరావృత్తి రహితమైన మోక్షం ప్రాప్తిస్తుంది. మోక్ష ప్రదాతయైన వాసుదేవుడే సేవింప తగినవాడు. వేదాలూ, యాగాలూ, యోగాలూ, క్రియలూ, జ్ఞానాలూ, తపస్సులూ, ధర్మాలూ అన్నీ వాసుదేవ స్వరూపాలే. అట్టి భగవంతుని కథలను తెలిపే శ్రీభాగవతమనే పురాణగాథను శ్రీ వేదవ్యాస మహర్షి రచించి తన సుతుడైన శుకమహర్షి చేత పఠింపజేశాడు. మీరు భాగవత శ్రవణమందే ఆసక్తులై ఉండండి. అందువలన తాపత్రయం నశించి తత్త్వజిజ్ఞాస కలుగుతుంది.'భాగవతమ'నే ఈ మహాఫలం 'వేద'మనే కల్పవృక్షం నుండి బాగా పండి రాలింది. శుక ముఖ సుధారసంతో నిండి ఉంది. భక్తవరేణ్యులైన మీరు ఈ ఫలరసాన్ని ఆస్వాదించి ధన్యులుకండి అని సూతమహర్షి భాగవతాన్ని తన ఎదుట వినుటకు సిద్ధపడి ఉన్న మహర్షులందరిని ఉద్దేశించి చెప్పుట కారంభించాడు.

**5. ప్రశ్న :** భాగవతాన్ని సూతమహర్షి ప్రారంభించు సమయంలో శౌనకుడు ఏవిధమైన సందేహాలు వెలిబుచ్చాడు? అందుకు సూతమహర్షి ఇచ్చిన వివరణ ఎట్టిది?

**జవాబు :** ఉగ్రశ్రవసుడు 'భాగవత' మహాకావ్యాన్ని గురించి చెబుతూ, శ్రీమద్భాగవతం పుణ్యకీర్తనుడైన లోకేశ్వరుని చరిత్రం. ఈ మహాగ్రంథాన్ని పూర్వం లోకకల్యాణం కోసం భగవంతుడైన వ్యాస భట్టారకుడు అత్యంత పవిత్రంగా, అనురాగ పూర్వకంగా రచించాడు. సమస్త వేదాలలో, ఇతిహాసాలలో సారభూతమైన ఈ భాగవతాన్ని, శ్రీశుక యోగీంద్రుడు గంగానదీ తీరాన, మునిగణ సహితుడై అత్యంత విరక్తుడై, ప్రాయోప విష్టుడై ఉన్న పరీక్షిన్మహారాజు అడుగగా వినిపించాడు. ఆనాడు మునుల ముందు మహాతేజస్వియై శ్రీహరి లీలలు కీర్తిస్తూ ఉన్న శ్రీశుకయోగి వల్ల నేను నేర్చుకొన్న విధంగా, నా మనస్సుకు స్ఫురించినంతవరకు మీకు వినిపిస్తాను అని పలికిన సూతమహర్షితో మునిశ్రేష్ఠుడైన శౌనకుడు ఇలాపలికాడు. సూత మహర్షీ! ఏ ప్రదేశంలో ఏ ఉద్దేశంతో, ఎందుకోసం వ్యాసమహర్షి ఎంతో ఆలోచించి ఈ మహా గ్రంథాన్ని రచించాడు? ఆయన కుమారుడైన శ్రీశుకుడు ఎటువంటి ఆదరంతో పరీక్షిన్మహా రాజుకి భాగవత కథ వినిపించాడు? ఈ శుకుడు గృహస్థులు గోవును పాలుపిదికినంత కాలమే నిలుస్తాడని, ఆ విధంగా గోదోహన కాలం ఏఏచోట నిలుస్తాడో, అవన్నీ పుణ్య స్థలాలౌతాయని పెద్దలంటారు. అటువంటి మహానుభావుడు అన్నిదినాలు ఒకే ప్రదేశంలో ఎలా ఉన్నాడు? భగవద్భక్తులలో శ్రేష్ఠుడైన పరీక్షిన్మహారాజు ఎలా జన్మించాడు? ఏమేమి చేశాడు? దయతో ఈ విశేషాలన్నీ తెలుప వలసిందిగా ప్రార్థిస్తున్నాను అని శౌనకుడు అడుగగా సూతుడు ద్వాదశ స్కంధాలతో భక్తియే శీఘ్రశరణాగతియై, సద్యోముక్తి ప్రదాయకమై విలసిల్లే భాగవతాన్ని అన్ని సంశయాలు తొలగే విధంగా వినిపిస్తున్నాను వినండి అని శ్రీమద్భాగవతాన్ని చెప్పనారంభించాడు.

**ఒకటవ అధ్యాయము – ప్రథమ స్కంధము**

**జవాబులు :** 1) 4. నారదమహర్షి 2) 2. శ్రీనాథుడు
3) దీర్ఘసత్రయాగం

* * *

## రెండవ అధ్యాయము - ప్రథమ స్కంధము

**1. భగవంతుని ఏకవింశత్యవతారము 2. వ్యాసుడు వ్యాకులమనస్కుడై చింతించడం 3. వ్యాసుని కడకు నారదుడు రావడం 4. నారదుని పూర్వజన్మ వృత్తాంతం**

**1) ప్రశ్న :** ద్వాపరయుగం చివరి కాలంలో పరాశరమహర్షికి 'వాసవి' అనబడే సత్యవతికి నారాయణాంశతో వ్యాసుడు జన్మించాడు. ఈ వేదవ్యాసునికి జన్మనిచ్చిన తల్లి సత్యవతి ఎవరి వీర్యం వలన జన్మించింది?

**జవాబు :** 1. ప్రభాసుడనేవసువు 2. ఉపరిచరవసువు
3. ప్రత్యూషుడనేవసువు4. ధరుడనేవసువు

**2) ప్రశ్న :** సరస్వతీ నది తీరంలో, వ్యాకుల చిత్తుడై కూర్చునియున్న వేదవ్యాసుని వద్దకు వచ్చిన నారదమహర్షి తన చేతనున్న వీణను మీటుతూ వచ్చాడు. ఆ వీణ పేరేది?

**జవాబు :** 1. కళావతి 2. కశ్చపి
3. బృహతి 4. మహతి

**3) ప్రశ్న :** మనో వ్యాకులతతో నున్న నారదమహర్షి, ఏ కావ్యం వ్రాస్తే నీ మనోవ్యాకులత పోతుందని తెలిపాడు?

**జవాబు :** జవాబుల కాలములో ఉన్నది.

**4) ప్రశ్న :** సూత మహర్షి చెప్పిన విధంగా భగవంతుని ఏక వింశత్యవతారాలు ఎన్ని? వాటిని గురించి వివరించండి.

**జవాబు :** సూతమహర్షి చెప్పసాగాడు. యోగ నిద్రాముద్రితుడై మహా సముద్రం మధ్యలో శయనించి ఉన్న పరబ్రహ్మ స్వరూపం అదే అన్ని అవతారాలకు 'మూలవిరాట్టు'యిన ఆదినారాయణుని దేదీప్య మానమైన దివ్యరూపం. ఆ భగవంతుడు సమస్త భువనాలను సృష్టించ తలచాడు. ఆ నారాయణ దేవుని

నాభి కమలం నుండి సృష్టికర్త బ్రహ్మదేవుడు ఉద్భవించాడు. ఆ శ్రీహరి అవయవస్థానాల నుండి సమస్తలోకాలు ఆవిర్భవించాయి. ఆ పురుషోత్తముడు మొత్తం ఇరువదిఒక్క అవతారాలను ధరించాడు. మొదట సనకసనందనాది రూపాలతో చరించాడు. రెండవసారి 'యజ్ఞవరాహ' దేహం ధరించి ఈ విశ్వసృష్టి నిమిత్తం రసాతలం నుంచి భూమండలాన్ని ఉద్ధరించాడు. మూడవ పర్యాయం 'నారదు'డనే దేవర్షిగా జన్మించి వైష్ణవధర్మాన్ని బోధించాడు. నాలుగో అవతారంలో 'నరనారాయణ' స్వరూపుడై ఆవిర్భవించాడు. ఐదవది 'కపి'లావతారం. ఈ అవతారంలో స్వామి 'సాంఖ్య' మనే మతాన్ని ఏర్పరచాడు. ఇందు ప్రకృతి జగత్సృష్టికి కారణమనియు పురుషుడు నిర్లిప్తుడనియు నిరూపింప బడియుంటుంది. దీనినే 'కాపిల' సూత్రమంటారు. ఇక ఆరవ అవతారం – అత్రి అనసూయలకు 'దత్తాత్రేయు'డై పుట్టి ఆత్మ విద్యను ప్రబోధించాడు. ఏడవ అవతారం 'యజ్ఞుడ'నే పేరున ఉద్భవించి స్వాయంభువ మన్వంతరాన్ని సంరక్షించాడు. ఎనిమదో అవతారం 'ఋషభుడు' ఈయన పండితులకు పరమహంస మార్గాన్ని ప్రకటించాడు. తొమ్మిదవ అవతారం 'పృథు' చక్రవర్తియై భూదేవిని గోవుగావించి ఓషధులను పిదికాడు. పదవదైన 'మత్స్యావతారం'లో జలప్రళయంలో సోమకాసురుని చంపి వేదాలను రక్షించి బ్రహ్మ దేవునికిచ్చాడు. పదకొండవది 'కూర్మావతారం' స్వీకరించి మునిగిపోతున్న మందరగిరి పర్వతాన్ని వీపుపై ధరించి కాపాడి క్షీరసాగరమథనానికి ఆటంకం లేకుండా చేశాడు. పండ్రెండవ అవతారం 'ధన్వంతరి'యై దేవదానవులు మథిస్తున్న పాలసముద్రం నుండి అమృత కలశాన్ని చేతధరించి సాక్షాత్కరించాడు. పదమూడో అవతారం 'మోహిని'యై దేవతలకు అమృతాన్ని పంచాడు. పద్నాలుగోసారి 'నరసింహ'మూర్తియై ప్రహ్లాదుని కాపాడాడు. పదిహేనో అవతారంలో 'వామను'డై బలిని పాతాళానికి పంపాడు. పదహారోమారు 'పరశురాము'డై ధాత్రియందు అనేకమంది క్షత్రియులను సంహరించాడు. పదిహేడవసారి శ్రీరాముడై రావణుని సంహరించి ధర్మసంస్థాపన చేశాడు. పద్దెనిమిదో పర్యాయం వేదవ్యాసుడై అల్పప్రజ్ఞులైన వారికోసం వేదశాఖలను విస్తరింప జేశాడు. పందొమ్మిదోసారి 'బలరాముడు'గా, ఇరువదియవ

అవతారం శ్రీకృష్ణుడుగా సంభవించి భూభారాన్ని తగ్గించాడు. ఇరవైఒక్కటోవది 'బుద్ధు'డై ప్రపంచాన సత్యం, అహింసలతో పాటు ధర్మాన్ని, శాంతిని నెలకొల్పాడు. తరువాత భవిష్యావతారం 'కల్కి' రూపం కలియుగాంతంలో పుట్టి ధర్మసంస్థాపన కావిస్తాడు అని శౌనకాది మహర్షులకు సూతుడు వివరించి చెప్పాడు.

**5) ప్రశ్న :** నారద మహర్షి వ్యాసుని కోరికపై తన పూర్వజన్మ వృత్తాంతాన్ని గురించి ఏమని విరించి చెప్పాడు?

**జవాబు :** నారద మహర్షి తన జన్మ వృత్తాంతాన్ని తెలుపుతూ, ఓ వ్యాసమహర్షీ! నేను గడచిన కల్పంలో గత జన్మంలో ఒక దాసీ పుత్రుణ్ణి. మా అమ్మ వేదవేత్తలైన వారి ఇండ్లలో పనిచేస్తూ ఉండేది. వర్షాకాలపు చాతుర్మాస్య వ్రతసమయంలో నేను మా అమ్మతో కలిసి ఆ మహాపురుషలను సేవించాను. నా సేవలకుమెచ్చి, ఆ పుణ్యాత్ముల నోటివెంటవచ్చే శ్రీహరి కీర్తనలు, లీలలు వినుటకు అవకాశం కల్పించటమే కాకుండా, వారు ఆ చాతుర్మాస్య వ్రతం అనంతరం ఎంతో సంతోషంతో, కారుణ్యంతో అతిరహస్యమూ, అమోఘమూ అయిన ఈశ్వర విజ్ఞానాన్ని ఆ మహాత్ములు నాకు ఉపదేశించారు. ఆ మహనీయుల ఉపదేశం వలన దేవాది దేవుడైన వాసుదేవుని మాయా ప్రభావం తెలిసికొన్నాను. పరమేశ్వరుణ్ని ఉద్దేశించి చేసే కార్యం విశిష్టమైన జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. అందువల్ల విష్ణు భగవానుడు విశిష్టమైన ఈశ్వర జ్ఞానాన్ని నాకు అనుగ్రహించాడు. తరువాత కొంత కాలానికి మా అమ్మ దేహత్యాగం చేసింది. ఉన్న ఒక్క బంధమూ తెగిపోయింది అని అనుకొని హరినామ స్మరణం చేసికొంటూ వెళ్ళి అడవిలో ఒక రావిచెట్టు నీడన శ్రీహరిని ధ్యానిస్తూ కూర్చున్నాను. నా హృదయంలో పదిలం చేసికొన్న పరమాత్మ స్వరూపంతో సాక్షాత్కరించాడు. వెంటనే అదృశ్యమైన రూపంకోసం ఉత్కంఠతతోచూచాను. కాని కనిపించలేదు. అప్పుడు నాశోకాన్ని ఉపశమింపజేస్తూ శ్రీహరి మధుర వచనాలతో నాయనా! ఎందుకు వృథాగా ఆయాస పడతావు. నీవు ఎంత ప్రయత్నించినా ఈ జన్మలో నన్ను దర్శించలేవు. నాయందు లగ్నమైన నీ

కోరిక వృథాపోదు. మరుజన్మలో మళ్ళీ నాభక్తుడివై నన్ను ఆరాధిస్తావు. అనంతర కల్పాంతంలో నీకు పూర్వస్మృతి ఉంటుంది. నా అనుగ్రహం వలన నీ దోషాలన్ని తొలగి సత్వగుణ సంపన్నులైన హరి భక్తులలో అగ్రగణ్యుడవై పేరెన్నికగంటావు అని వివరించిన సర్వవ్యాపికి తలవంచి మ్రొక్కాను. తరువాత కొంత కాలానికి దేహాన్ని పరిత్యజించిన చాలా కాలం పిమ్మట శ్రీహరి అనుగ్రహం మేరకు లోకాలను సృష్టించబోయే బ్రహ్మదేవుని నిశ్వాసంలో నుంచి మరీచి మొదలైన మునులు నేను జన్మించాము. ఈ జన్మలో భగవంతుని అనుగ్రహం వలన బ్రహ్మచారినై త్రిలోక సంచారినై పరబ్రహ్మ ప్రతిపాదకాలైన సప్తస్వరాలు తమంతతామె మ్రోగే 'మహతి' వీణమీద నారాయణ నామగానం చేస్తూ ఇలా విహరిస్తున్నాను అని నారదుడు తన పూర్వజన్మ వృత్తాంతాన్ని వివరించి చెప్పాడు.

**రెండవ అధ్యాయము – ప్రథమ స్కంధము**

**జవాబులు :** 1) 2. ఉపరిచర వసువు 2) 4. మహతి

3) భాగవతము

* * *

## మూడవ అధ్యాయము - ప్రథమ స్కంధము

**1. ఉపపాండవులను చంపిన అశ్వత్థామను అర్జునుడు అవమానించడం 2. ద్రౌపది అశ్వత్థామతో మాట్లాడడం 3. శ్రీకృష్ణుడు ఉత్తరాగర్భాన్ని రక్షించడం 4. కుంతీదేవి శ్రీకృష్ణుని స్తుతించడం**

**1) ప్రశ్న :** కురుక్షేత్ర సంగ్రామంలో దుర్యోధనుడు నేలకొరిగిన నాటి రాత్రి కన్న కొడుకులందరూ అశ్వత్థామ ఖడ్గానికి బలి అయినారని అమిత దుఃఖ భారంతో ఏడుస్తున్న ద్రౌపదిని ముందుగా ఓదార్చడానికి ప్రయత్నించినదిఎవరు?

**జవాబు :** 1. ధ్రుష్టధ్యుమ్నుడు 2. అర్జునుడు
3. విదురుడు 4. శ్రీకృష్ణుడు

**2) ప్రశ్న :** శిశుహంతయైన అశ్వత్థామ, తనను సంహరించటం కోసం వస్తున్న పార్థుని జూచి, దిక్కుతోచక తన ప్రాణాలు కాపాడుకోవటానికై, తనకు ప్రయోగమేకాని ఉపసంహారం తెలియని ఒక దివ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం పేరేది?

**జవాబు :** 1. బ్రహ్మశిరోనామకాస్త్రం 2. వారుణాస్త్రం
3. పాశుపతాస్త్రం 4. నారాయణాస్త్రం

**3) ప్రశ్న :** తన కన్న బిడ్డలందరిని చంపినాడని తెలిసి కూడా ద్రౌపది ఆ గురు పుత్రుడని, అశ్వత్థామను క్షమించాలని సూచించింది. అందుకు ఒప్పుకోకుండా తన అసమ్మతిని తెలియజేసింది ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ఉత్తరాగర్భస్థుండగు శిశువును శ్రీకృష్ణుడు ఏ విధంగా రక్షించాడు?

**జవాబు :** ఉద్ధవుణ్ణీ, సాత్యకినీ వెంటబెట్టుకొని ద్వారకకు పయనమవుతున్న శ్రీకృష్ణుని వద్దకు ఉత్తర తత్తరపాటుతో వచ్చి, దేవదేవా! ప్రళయాగ్ని జ్వాలాభీలమైన బాణం ఒకటి ఎక్కడి నుండో వచ్చి, నా కడుపులో ఉన్న

పసికందును కాల్చి వేయాలని చూస్తున్నది. ఈ భయంకర శరాన్నినిరోధించి నన్ను రక్షించు. నీ చరణ కమలాలను శరణు జొచ్చాను. కరుణించి ఈ శరాగ్ని నుండి నన్ను కాపాడుమని వేడుకొన్నది. ఆపన్న శరణ్యుడైన గోవిందుడు అనుగు చెల్లెలి కోడలైన ఉత్తర దీనాలాపాలు విన్నాడు. ఇది అపాండవం కావాలని అశ్వత్థామ ప్రయోగించిన దివ్యాస్త్రంగా తెలిసికొని ఆ పురుషోత్తముడు సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. సూక్ష్మాతి సూక్ష్మమైన రూపంతో ఉత్తరా గర్భాన్ని యోగమాయతో కప్పివేసి, అమోఘమైన వైష్ణవ తేజస్సుతో అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని అవలీలగా అణచివేశాడు. ఆ అస్త్రం తిరుగులేనిదైనా విష్ణు తేజస్సు ముందు వ్యర్థమైపోయింది. అప్పుడు ఎంతో సంతోషంతో కుంతీదేవి, కోడలు ద్రౌపదితోనూ, కొడుకులైన పాండవులతోనూ వచ్చి శ్రీకృష్ణుని స్తుతించింది.

**5) ప్రశ్న :** కుంతీదేవి శ్రీకృష్ణుని ఏవిధంగా స్తుతించింది?

**జవాబు :** ఉత్తర గర్భంలో ఉన్న తన వంశాంకురాన్ని రక్షించి కాపాడిన శ్రీకృష్ణుని తన వారందరితో కూడివచ్చి కుంతీదేవి కృష్ణా! నీవు పురాణ పురుషుడవు. దేవదేవుడవు. ఈ విశాల విశ్వాన్ని నడిపే పరమేశ్వరుడవైన నీకు నమస్కారములు. మునీశ్వరులు సైతం దర్శింపలేని నిన్ను సంసార నిమగ్నులమూ, జ్ఞానహీనులమూ అయిన మావంటి వారం ఎలా కనుగొనగలుగుతాం. శ్రీకృష్ణా! వాసుదేవా! దేవకీ నందనా! నందగోపకుమారా! గోవిందా! పద్మనాభా! పద్మమాలా విభూషణా! పద్మ నయనా! హృషీకేశా! భక్తి పూర్వకమైన నా ప్రణామాలు పరిగ్రహించు. నా విన్నపం మన్నించు. భగభగ మండుచున్న లక్కఇంట్లో నాబిడ్డలు, నేను కాలిపోకుండా కాపాడావు. దురహంకారంతో దుశ్శాసనుడు ద్రుపదరాజ పుత్రి కట్టుబట్టలు ఒలుస్తున్న కష్టసమయంలో నా కోడలు అవమానంపాలు కాకుండా ఆదుకొన్నావు. భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామాది యోధాన యోధులవల్ల పోరాటంలో చేటువాటిల్లకుండా నాబిడ్డలను కాపాడావు. మళ్ళీ ఇప్పుడు గురు పుత్రుని

శరాగ్ని జ్వాలలో మ్రగ్గిపోకుండా చిట్టితల్లి ఉత్తర కడుపులోని పసికందును కనికరించావు. ఇన్నివిధాలుగా నన్నూ నాబిడ్డలనూ, కటాక్షించిన పుండరీకాక్ష! నిన్ను ఏవిధంగా కొనియాడేది. నీ అనంతకోటి గుణాలు అభివర్ణించటానికి నేనెంతదాన్ని. శ్రీకృష్ణా! యదుభూషణా! విజయప్రియా! పరిపూర్ణ కరుణాపయోనిధీ! నీకు నమస్కారములు అని అనేక విధాల కుంతీదేవి మధురోక్తులతో మాధవుణ్ణి కొనియాడింది.

## మూడవ అధ్యాయము - ప్రథమస్కంధము

**జవాబులు :** 1) 2. అర్జునుడు 2) 1. బ్రహ్మశిరోనామకాస్త్రం
3) భీముడు

* * *

## నాలుగవ అధ్యాయము - ప్రథమస్కంధము

**1. ధర్మరాజు కృష్ణాదులతో గూడి భీష్ముని వద్దకువెళ్ళడం 2. భీష్ముడు శ్రీకృష్ణుని స్తుతించడం 3. శ్రీకృష్ణుడు ద్వారకా నగర ప్రయాణం 4. వాసుదేవుడు ద్వారవతీ నగర ప్రవేశం**

**1) ప్రశ్న :** తనవారందరినీ చంపుకొన్నానన్న దుఃఖంతో తల్లడిల్లిపోతున్న ధర్మరాజు శ్రీకృష్ణుని సలహామేరకు, తన తమ్ములు శ్రీకృష్ణుడు వెంటరాగా ఎవరిని దర్శించి సకల ధర్మాలు తెలిసికొన్నాడు?

**జవాబు :** 1. జనకరాజర్షిని 2. బలరామదేవుని 3. వసుదేవుని 4. భీష్ముని

**2) ప్రశ్న :** శరతల్పంపై నున్న భీష్ముడు తనను దర్శించ వచ్చిన ధర్మరాజాదు లందరిలోకి ఎవరిని స్తుతించాడు?

**జవాబు :** 1. వేదవ్యాసుని 2. ధౌమ్యుని 3. నారదుని 4. శ్రీకృష్ణుని

**3) ప్రశ్న :** సమస్త సామ్రాజ్యానికి యుధిష్ఠిరుని అధినేతగా నిలిపి శ్రీకృష్ణుడు, హస్తినలో అందరిని వీడ్కొలిపి, తాను ద్వారకకు వెళ్ళాడు. ద్వారక సరిహద్దులలో నిలబడి శంఖధ్వానం చేశాడు. ఆ శంఖం పేరేది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ధర్మరాజు భీష్మాచార్యుని వద్ద పొందిన ఉపదేశాలను సంక్షిప్తంగా తెలుపుతూ, ఆయన ఈ ధరణీ మండలాన్ని పాలించిన పాలన ఏ విధంగా సాగింది?

**జవాబు :** కురుక్షేత్రంలో అర్జునుడు కల్పించిన శరతల్పం మీద శయనించి ఉన్న పితామహుని దర్శించిన ధర్మనందనుడు ఆయన వలన మానవజాతికి అవశ్యాలైన ధర్మాలను, తనతో వచ్చిన వారందరితో పాటుగా వినమ్రుడై విన్నాడు. రాజ్యపాలనంపై విముఖంగా ఉన్న ధర్మజునికి భీష్ముడు వర్ణాశ్రమ

ధర్మాలు, స్త్రీ ధర్మాలు, భగవంతునికి ప్రియమైన భాగవత ధర్మాలు, శమదమాదులు, చతుర్విధ పురుషార్థాలైన ధర్మార్థ కామ మోక్షాలు నానా విధాలైన ఉపాఖ్యానాలు, ఇతిహాసాలు మొదలైనవన్నీ కొన్ని సంక్షిప్తంగానూ, కొన్ని వివరంగానూ తెలిపాడు. అనంతరం భీష్ముడు స్వచ్ఛంద మరణావకాశం ఉన్నవారు వాంఛించే ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చిందని తెలిసికొని, అది తాను తనువు చాలించటానికి అనుకూలమైన సమయం అని నిశ్చయించు కొన్నాడు. అప్పుడు ఆ గాంగేయుడు శ్రీకృష్ణ పరమాత్మను హృదయంలో పదిలపరచుకొని నిశ్వాసాన్ని నిరోధించి పరబ్రహ్మమైన వాసుదేవునిలో ఐక్యమైనాడు. పిమ్మట ధర్మరాజు కొంత సేపు దుఃఖించి, దహన సంస్కారాదులు జరిపించి నందనందనునితో కలిసి హస్తినాపురం చేరాడు. భీష్మాచార్యుని ఉపదేశాలవల్ల శ్రీకృష్ణుని ప్రబోధాలవల్ల తన విజ్ఞానాన్ని పెంపొందించుకొని, వాసుదేవుని అండదండలతో చతుస్సముద్ర ముద్రితమైన మహీమండలాన్ని ధర్మరాజు తన సహచరుల సహాయంతో పరిపాలించాడు. ఆ సమయంలో మేఘుడు సకాలంలో వర్షాలు కురిపించాడు. పృథివి బంగారు పంటలు పండింది. గోశాలలలోని గోవులు కుండలకొద్దీ పాలిచ్చాయి. వృక్షాలు, పండ్లూ, లతలూ సంపూర్ణంగా ఫలించాయి. ఋతు ధర్మం తప్పకుండా నిండుగా పంటలు పండాయి. దేశమంతటా ధర్మం పాదుకొన్నది. నాస్తికులకు తనరాజ్యంలో చోటు లేకుండా పోయింది. ఆ విధంగా దానఘనుడూ, మానధనుడూ, సత్య సంధుడూ, కురుకులాలంకారుడూ, కుంతీ కుమారుడూ ఐన ధర్మరాజు సమస్తధరణీమండలాన్ని వైభవోపేతంగా పరిపాలించాడు.

**5) ప్రశ్న :** శ్రీకృష్ణుడు ద్వారాకానగర ప్రవేశం ఏవిధంగా జరిగింది? సంక్షిప్తంగా తెలపండి.

**జవాబు :** ప్రియ బంధువులైన పాండవుల శోకం పోకార్చటం కోసం సోదరి సుభద్రకు సంతోషం సమకూర్చటం కోసం వాసుదేవుడు హస్తినాపురంలో కొన్ని మాసాలపాటు ఉన్న తరువాత ద్వారకా నగరానికి బయలుదేరాడు.నగర సమీపానికి రాగానే వాసుదేవుడు 'పాంచజన్యం' పూరించాడు. ఆ ధ్వని విని

ద్వారకావాసులు రకరకాలైన మంగళ వాయిద్యాలతో, మంగళద్రవ్యాలతో ఎదురువచ్చి స్వామికి స్వాగతం పలకుతున్న నగర ప్రజల భక్తి బంధురమైన మధుర మంజులాలాపాలు వీనుల విందుగా వింటూ కరుణార్ద్రాలైన కడగంటిచూపులు కురిపిస్తూ, మురిపిస్తూ, మంగళభాషణాలతో భూసురోత్తముల ఆశీర్వాదాల వేద నినాదాలతో, తనంతటి బలసంపన్నులైన యధు, వృష్ణి, భోజ, అంధక, కుకుర, దాశార్హాది వీరులచే సంరక్షింపబడుతున్న ద్వారకా పురాన్ని వాసుదేవుడు ప్రవేశించాడు. రాజమార్గంలో వస్తున్న ఆ దేవకీ నందనుణ్ని నగరంలోని పౌరకాంతలందరూ చూడటానికి ఉన్నతోన్నతమైన సౌధాలను అధిరోహించారు. తమలో తాము ఆ శ్యామసుందరుని సౌందర్య సౌకుమార్య లావణ్యమయ స్వరూపాన్ని చూచి ఆనందించారు. శ్వేతచ్ఛత్రంతో, చామరాలతో, పుష్పాలతో, పీతాంబరాలతో, మణిమయ భూషణాలంకారాలతో ప్రకాశించే పద్మపత్ర నేత్రుడైన ఆ శ్యామసుందరుడు ముందుగా తన జననీజనకులైన దేవకీ వసుదేవుల సౌధాలకు వెళ్ళి వారిని దర్శించి నమస్కరించాడు. వారు తమ ఆనంద బాష్పాలతో అభిషేకించారు. ఆవిధంగా శ్రీకృష్ణుని ద్వారకానగర ప్రవేశం జరిగింది.

### నాలుగవ అధ్యాయము – ప్రథమ స్కంధము

**జవాబులు :** 1. 4. భీష్ముని 2. 4. శ్రీకృష్ణుని
3. పాంచజన్యం

* * *

## ఐదవ అధ్యాయము - ప్రథమ స్కంధము

**1. శ్రీకృష్ణుడు అంతఃపురకాంతలను చూడబోవడం 2. పరీక్షిత్తు జననం 3. గాంధారీ ధృతరాష్ట్రులు దేహయాత్ర చాలించడం 4. ధర్మరాజు దుర్నిమిత్తాలను చూసి చింతించడం**

**1) ప్రశ్న :** ద్వారవతిలో ప్రవేశించిన శ్రీకృష్ణుని తల్లిదండ్రులను దర్శించిన పిమ్మట తన భార్యలందరి గృహాలలోకి ఒక్కసారిగా ప్రవేశించాడు. అప్పుడు వాసుదేవుని ఎవరనే భావంతో తన దేవేరులున్నారు?

**జవాబు :** 1. పురుషోత్తమునిగా 2. కాముకునిగా
3. శూరునిగా 4. దైవంగా

**2) ప్రశ్న :** భగవానుడి కరుణతో రక్షింపబడిన ఉత్తర గర్భం పదినెలలు నిండి, ఒక బాలుని ప్రసవించింది. ధర్మరాజు సంతోషించి ఆ బిడ్డకు ఏపేరు పెట్టించాడు?

**జవాబు :** 1. విష్ణురాతుడు 2. జనమేజయుడు
3. ప్రతివింధ్యుడు 4. శృతకీర్తి

**3) ప్రశ్న :** ధర్మరాజు బంధువధచే ప్రాప్తించిన పాపాన్ని పోగొట్టుకోవడానికై శ్రీకృష్ణుని యజ్ఞ పురుషునిగా భావించి ఎన్ని అశ్వమేథ యాగాలు చేశాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** గాంధారీ ధృతరాష్ట్రుల దేహత్యాగం ఏరీతిగా జరిగింది?

**జవాబు :** ధర్మరాజు రాజ్యభారాన్ని స్వీకరించి చాలాకాలం వైభవంగా సుఖంగా కాలంగడిపాడు. కాలప్రభావం ఎల్లవేళలా ఒక్కలా ఉండదు. ఆ రోజులలో ఒకనాడు తీర్థయాత్రలు ముగించుకొని వచ్చిన కాలజ్ఞుడైన విదురుడు, ధృతరాష్ట్రునిచేరి మహారాజా! అనుభవించి నన్నాళ్ళు రాజభోగాలు అనుభవించావు. ఈ దేహం నిత్యంకాదన్న సత్యం తెలిసికొని, దేహం మీద వ్యామోహం తెంచుకొని, యోగ్యమైన వైరాగ్య మార్గంలో ఉత్సాహంగా ముందడుగు వేసేవాడే మోక్షలక్ష్మిని కైవసం చేసుకోగలుగుతాడు అని ఆ కురురాజుకు విరక్తి మార్గాన్ని

ఉపదేశించాడు. ఆ ప్రబోధంతో జ్ఞాననేత్రం విప్పారిన ఆ అంధరాజు వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించుటకు గాంధారీ సహితుడై పయనమైనాడు. వారింపనలవికాని నిర్ణయంతో బయలుదేరిన మహారాజును విదురుడు అనుసరించాడు. అటుపిమ్మట కొంతకాలానికి ధర్మరాజును చూడవచ్చిన నారద మహర్షిని తన పెత్తండ్రి గురించి వివరాలను అడుగగా మహర్షి, ధర్మరాజా! విచారించకు కాలస్వరూపుడైన పరమాత్మ సృష్టి, స్థితి, లయాలను చేస్తుంటాడు. మీ పెత్తండ్రి గాంధారీ, విదురులతో కలిసి హిమవత్పర్వతాలకు దక్షిణంగాఉన్న మునుల తపోవనాలలో ఉంటూ, 'సప్తస్రోత' అనే పుణ్యతీర్థంలో స్నానంచేస్తూ జలంమాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ కొంతకాలమున్నాడు. పిమ్మట నిరంతరము అనుసరించే సకల కర్మలనూ విడనాడి, ప్రశాంత చిత్తుడై, తదేక ధ్యానంతో శ్రీహరి మీద మనసు నిలిపి, నేటికి ఐదవనాడు యోగాగ్నిలో దేహత్యాగం చేశాడు. అదిచూచి గాంధారి ఆ పావక జ్వాలలోపడి భస్మమై పోయింది. ఆ మహారాజు ఆత్మత్యాగాన్ని చూచిన విదురుడు హిమాలయాల వైపు వెళ్ళాడు అని నారదమహర్షి ధర్మరాజుకు తన పెత్తండ్రి దేహత్యాగాన్ని గురించి చెప్పాడు.

**5) ప్రశ్న :** భీమసేనునితో యుధిష్ఠిరుడు తనకు కాలగమనంలో జరిగే మార్పులను, దుశ్శకునాలను, దుర్నిమిత్తాలను ఏరీతిగా వివరించి చెప్పాడు?

**జవాబు :** గాంధారీ, ధృతరాష్ట్రుల వృత్తాంతం తెలిసికొన్న ధర్మరాజు చింతించి భీమసేనునితో తమ్ముడూ! చూశావు కదా! కాలగమనంలో ఎంత మార్పు వచ్చిందో, పంటలు సకాలానికి పండటంలేదు. క్రోధం, లోభం, క్రౌర్యం, అసత్యం మితిమీరి ప్రజలు ప్రవర్తిస్తున్నారు. శాస్త్రవిధులు కుంటుబడ్డాయి. విజ్ఞులు సైతం న్యాయమార్గాన్ని విడిచిపెట్టారు. కాలగమనం వింతగా మారి పోయింది. ద్వారకకు వెళ్ళిన అర్జునుడు ఇంతవరకూ తిరిగి రాలేదు. నా మనస్సంతా చీకాకుగా ఉంది. యాదవులంతా క్షేమంగా ఉండి ఉంటారు కదా! నారద మహర్షి చెప్పినట్లు చెడుకాలం దాపురించిందేమో! ఈ భూమి మీద భయంకరాలైన ఉపద్రవాలు కనిపిస్తున్నాయి. మన ముందుగా ఒక

కుక్క ముఖం పైకెత్తి మొరుగుతున్నది. నక్క ఉదయించే సూర్యునికి ఎదురుగా నిలబడి నోటివెంట నిప్పులు కక్కుతూ ఏడుస్తున్నది. మేలుజాతి గుర్రాలు కన్నీరు కారుస్తున్నవి. సూర్యబింబం మసకబారినట్లుగా తేజోవిహీనంగా ఉంది. భూమి కంపించుతూ ఉంది. విపరీత వాయువులు వీస్తున్నాయి. హోమకుండాల్లో అగ్నిహోత్రాలు మండటం లేదు. నా ఎడమ కన్ను, ఎడమ భుజం మాటిమాటికి అదురుతున్నాయి. ఈ లోకానికి ఇంకా ఎటువంటి ఉత్పాతాలు పుట్టుకొస్తాయో! అక్కడ ద్వారకలో మన బావ శ్రీకృష్ణుడు ఎలా ఉన్నాడో ఏమో! ఆయన క్షేమ సమాచారం ఇంతవరకు తెలియరాలేదు అని ధర్మరాజు విషణ్ణవదనంతో భీమసేనుడితో తనకు గోచరించిన అనేక దుర్నిమిత్తములను గురించి తెలిపాడు.

### ఐదవ అధ్యాయము – ప్రథమ స్కంధము

**జవాబులు :** 1. 2. కాముకునిగా 2. 1. విష్ణురాతుడు
3. మూడు

* * *

## ఆరవ అధ్యాయము - ప్రథమ స్కంధము

**1. అర్జునుడు కృష్ణ వైకుంఠగమనాన్ని తెలపడం 2. ధర్మరాజు పరీక్షిత్తుకు పట్టాభిషేకం చేసి మహా ప్రస్థానానికి వెళ్ళడం 3. భూదేవి, ధర్మదేవత సంభాషణను పరీక్షిత్తు వినడం 4. కలి పురుషుడు ధర్మ దేవతను తన్నడం 5. కలిని నియంత్రించిన పరీక్షిత్తు ధర్మపరిపాలన**

**1) ప్రశ్న :** ద్వారకా నగరం నుండి హస్తినకు వచ్చిన అర్జునుడు ధర్మరాజుతో, శ్రీకృష్ణ వైకుంఠగమనాన్ని గురించి చెప్పాడు. ఆ విధంగా అర్జునుడు తెలిపిన మాధవ వైకుంఠ గమనము యాదవ నిర్మూలనము, జరిగిన నాటినుండి ఏ యుగం ప్రారంభమైనది?

**జవాబు :** 1. కృతయుగం 2. త్రేతాయుగం 3. ద్వాపరయుగం 4. కలియుగం

**2) ప్రశ్న :** ధర్మరాజాదులు తమ మనుమడు పరీక్షిత్తుకు పట్టాభిషేకం జరిపించి, తాము మహాప్రస్థానానికి వెళ్ళారు. అటుపిమ్మట పరీక్షిత్తు రాజ్య పాలనం సాగిస్తూ, వివాహమాడిన "ఐరావతి" అను కన్య ఎవరి కుమార్తె?

**జవాబు :** 1. శిఖండికుమార్తె 2. అనిరుద్ధునికుమార్తె 3. ఉత్తరునికుమార్తె 4. వజ్రునికుమార్తె

**3) ప్రశ్న :** పరీక్షిన్మహారాజు జైత్రయాత్రకై వెళ్ళి దిగ్విజయం సాధించుకొని వచ్చుసమయంలో వృషభాకారం ధరించి ఒంటికాలితో సంచరిస్తున్న ధర్మదేవుడున్నూ, దూడను వీడిన పాడి ఆవు మాదిరిగా, కళాహీనంగా కన్నీరు కారుస్తున్న భూదేవి సంభాషించుకొంటూ, పరమాత్మ శ్రీకృష్ణుడు భూలోకాన్ని వీడి పరంధామాన్ని చేరుకొన్న తరువాత ఈ భూమిపై కలి ప్రభావాన్ని గురించిన మాటలను మహారాజు విన్నాడు. ఆ సన్నివేశం ఏనదీ తీరంలో జరిగింది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4. ప్రశ్న :** వృషభ రూపంలో ఉన్న ధర్మదేవతనూ, గోరూపంలో ఉన్న భూదేవినీ, శూద్రరూపంలో ఉన్న కలిపురుషుడు తన్నాడు. ఆ సన్నివేశం చూచిన పరీక్షిన్మహారాజు చేసిన ప్రతిక్రియ ఏమిటి?

**జవాబు :** వృషభరూపంలో ఉన్న ధర్మదేతనూ, గోరూపంలో ఉన్న భూదేవతనూ, శూద్రరూపంలో నున్న కలిపురుషుడు తన్నగా చూచిన పరీక్షిన్మహారాజు ఎవడవురా! నీవు? ఏ పాపమూ ఎరుగని ఈ గోవును అన్యాయంగా తన్నావెందుకురా? నా భుజదండం సంరక్షించే ఈమహీ మండలంలో ఎల్లవేళలా ఎవరూ ఎటువంటి నేరాలూ చేయకూడదని తెలియదా? ధూర్తుడా! నిన్ను కఠినంగా శిక్షిస్తాను. దుష్టులను శిక్షించటంకోసం శిష్టులను రక్షించుటం కోసమే భగవంతుడు రాజులను సృష్టించాడు. ఇప్పుడు ఈ ధర్మదేవతనూ, ఈ ధరణీదేవినీ కాపాడి, నిన్ను శిక్షించుటే రాజుగా నా ప్రథమ కర్తవ్యం. పాపాత్ముడవైన నిన్ను రూపుమాపుతాను అని తన ఖడ్గాన్ని చివాలున దూసి కలిని రూపుమాపాలని ఉద్యుక్తుడైన మహారాజును చూచి కలి తన దేహమంతా కంపించిపోగా మహారాజు చరణాలపై పడ్డాడు. నన్ను కరుణించమని ప్రార్థించాడు. అంత క్షమాగుణ సంపన్నుడైన పరీక్షిన్మహారాజు కలిపురుషుని చంపకుండా, నీ ధూర్త స్వభావాన్ని విడిచి నా రాజ్యాన్ని విడిచివెళ్ళిపొమ్మన్నాడు. ఆ విధంగా ఆ మహారాజు కలిపురుషుని నిగ్రహానుగ్రహవీక్షణాలతోచూశాడు.

**5) ప్రశ్న :** పరీక్షిన్మహారాజు కలిని నిగ్రహించి ఏ విధంగా ధర్మపరిపాలనను సాగించాడు?

**జవాబు :** వృషభ రూపంలో ఉన్న ధర్మదేవతను తన్నిన కలిపురుషుని, పరీక్షిన్మహారాజు చంప ప్రయత్నించగా, శరణాగతుడైన కలిని క్షమించి, పరమ పాపాత్ముడవైన నీవు నేను పాలించే ఈ భూమండలంలో ఉండవద్దు. అధర్మగుణాలు, అవలక్షణాలు గూడు కట్టుకొని ఉన్న నీవు సత్యానికీ, ధర్మానికీ ఆలవాలమైన ఈ బ్రహ్మావర్త దేశంలో నిలువరాదు. ఇచ్చట యజ్ఞవేత్తలైన పెద్దలు యజ్ఞేశ్వరుడైన శ్రీమహావిష్ణువును యజ్ఞాలతో ఆరాధిస్తారు. ఈ చరాచర ప్రపంచంలో వెలుపలా లోపలా నిండి సంచరించే వాయువులాగా

సర్వాంతర్యామి అయిన ఆ స్వామి వారికి సమస్త శుభాలూ చేకూరుస్తూ ఉంటాడు. అందువల్ల నీవు ఈ ప్రదేశంలో ఉండటానికి వీలులేదు. అని పలికిన చక్రవర్తితో కలిపురుషుడు మహారాజా! పుణ్యచరిత్రుడైన పురుషోత్తముడు అవతారం చాలించిన అనంతరం నేను నా ధర్మాన్ననుసరించి విజృంభించి లోకాన్నంతా వ్యాపించి ఉన్నాను. కాని నీవు శ్రీకృష్ణ పరమాత్మ దయా విశేషం వలనను, ఆయన స్పర్శవలనను పునీతుడవై ఉన్నందున నీ ఆజ్ఞానువర్తినై నీ పరిపాలన ఉన్నంత వరకు తలవంచి అణగి మణిగి ఉంటాను. కాని నేను ముఖ్యంగా ఎక్కడ ఉండేది నీవే నిర్ణయించి నన్ను ఆజ్ఞాపించు ఆ విధంగానే నేను మసలుకొంటాను అని ప్రార్థించిన కలిపురుషుని కనికరించి ఆ మహారాజు, వానికి జూదం, మద్యపానం, స్త్రీలు, ప్రాణివధ అనే నాలుగు స్థానాలు ఇచ్చాడు. ఇంకా అతడు అర్థించగా 'సువర్ణం' అనే ఐదో స్థానాన్ని కూడ అనుగ్రహించాడు. అవిగాక ఇంకా అసత్యం, గర్వం, కామం, హింస, వైరం అనే ఐదు స్థానాలు కూడా కలి నివసించే స్థానాలు అయినాయి. ఈ స్థానాలలో తప్ప ఇతర స్థానాలలో నివసించవద్దని కలిని ఆ రాజు కట్టడిచేశాడు. అప్పుడు ఆ మహారాజు ధర్మదేవతకు, భూదేవతకు ఆనందాన్ని కలిగించాడు. అనంతరం పరీక్షిన్మహారాజు హస్తినాపురంలో సింహాసనాసీనుడై కౌరవ సామ్రాజ్య లక్ష్మిని గౌరవపూర్వకంగా ప్రశాంతంగా పరిపాలించాడు.

**ఆరవ అధ్యాయము – ప్రథమ స్కంధము**

**జవాబులు :** 1. 4. కలియుగం 2. 3. ఉత్తరుని కుమార్తె 3. సరస్వతీ నదీతీరంలో

* * *

## ఏడవ అధ్యాయము - ప్రథమ స్కంధము

**1. పరీక్షిత్తు మృతసర్పాన్ని శమీకునిపై వేయడం 2. శృంగి పరీక్షిత్తును శపించడం 3. పరీక్షిత్తు శృంగి శాపాన్ని తెలిసికొని ప్రాయోపవేశానికి సిద్ధపడడం 4. శుకమహర్షి పరీక్షిత్తు వద్దకు రావడం**

**1) ప్రశ్న :** రాజధర్మాన్ననుసరించి పరీక్షిన్మహారాజు వేటాడుటకై అరణ్యాలకు వెళ్ళి, అనేక మృగాలను వేటాడి అలసి, ఆకలి, దప్పికలను తీర్చుకొనుటకు చల్లని జలాశయం కోసం వెదకి వేసారి ఒక తపోవనాన్ని ప్రవేశించాడు. ఆ తపోవనంలో తపస్సు చేసుకొంటున్న మహర్షి ఎవరు?

**జవాబు :** 1. శృంగి మహర్షి 2. కణ్వ మహర్షి
3. శమీక మహర్షి 4. దుర్వాస మహర్షి

**2) ప్రశ్న :** తన తండ్రి శమీక మహర్షి మెడలో, మృత సర్పాన్ని వేసి వెళ్ళిన పరీక్షిన్మహారాజును శపించిన ముని కుమారుని పేరేమి?

**జవాబు :** 1. శక్తి 2. సనకుడు
3. సనందనుడు 4. శృంగి

**3) ప్రశ్న :** శమీకమహర్షి కుమారుడు శృంగి పరీక్షిన్మహారాజును ఎన్నిరోజులలో తక్షకుని విషాగ్నికి దగ్ధమై పోతాడు అని శపించాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** పరీక్షిత్తు మునిబాలకుని శాపాన్ని ఏ విధంగా తెలిసికొన్నాడు? అనంతరమా మహారాజు ఏవిధమైన ఆలోచన చేశాడు?

**జవాబు :** దేశాన్నేలే రాజును తన కుమారుడు శృంగి శపించాడని తెలిసికొన్న శమీకమహర్షి, కొడుకు చేసినపనికి కొంతసేపు విచారించి, సంతాపం చెంది వెంటనే తనశిష్యులలో ఒకడిని ఈ వృత్తాంతమంతా, మహారాజుకు చెప్పిరమ్మని పంపించాడు. పరీక్షిన్మహారాజు ముని శిష్యునివలన శాప వృత్తాంతం విన్నాడు. తాను చేసిన పాపానికి శిక్ష అనుభవింపక తప్పదు. మునికుమారుని నిందించి

ప్రయోజనం లేదని, దైవ సంకల్పం ఎలా ఉంటే అలా జరుగుతుందని, తనకు తక్షకుని దారుణ విషాగ్ని జ్వాలల మూలాన, ఏడవనాడు మరణం తప్పదని నిర్ణయించుకొన్నాడు. భూలోక భోగాలు, స్వర్గలోక సుఖాలు మంచివికావని భావించాడు. రాజ్యాన్ని పరిత్యజించాడు. నిరాహార దీక్షను అవలంబించటానికి నిశ్చయించాడు. తులసీదళాలతో విలసిల్లే శ్రీమన్నారాయణుని చరణకమల పరాగాలతో కలిసి ప్రవహించే గంగానదీ తీరంలో ప్రాయోపవేశం చేసి ప్రాణాలు విడవటానికి సంకల్పించుకొన్నాడు. ఆ తరువాత మహారాజు తన చిత్తాన్ని గోవింద పదాయత్తంచేసి సర్వసంగ పరిత్యాగియై వైకుంఠప్రాప్తిని కోరి, ఎటువంటి మనోవైకల్యం లేకుండా మౌనంగా కూర్చున్నాడు.

**5) ప్రశ్న :** గంగా తీరంలో ప్రాయోపవేశానికి సిద్ధంగా ఉన్న పరీక్షిత్తు మహారాజును ఎవరెవరు దర్శించవచ్చారు. వారిని ఆ మహారాజు ఏ విధంగా సమాదరించాడు?

**జవాబు :** పరీక్షిన్మహారాజు గంగానది ఒడ్డున ప్రయోపవిష్టుండై ఉన్నాడని తెలిసికొని, మహోదార చరిత్రులు, సర్వ సమర్థులు అయిన బ్రహ్మర్షులు, రాజర్షులు, మహర్షులు తమతమ శిష్యులతోనూ, ప్రశిష్యులతోనూ కలిసి అచ్చటికి విచ్చేశారు. ఆ మహారాజు వచ్చిన మునీంద్రులకు ఎదురువచ్చి, అర్ఘ్యపాద్యాలిచ్చి అర్చించి సాష్టాంగ నమస్కారములు చేసి సుఖాసీనులను కావించాడు. అంతట ఆ రాజు తపోధనులారా! నేను సహనం కోల్పోయి కోపాన్ని ఆపుకోలేక చచ్చిన పామునుతెచ్చి మునీంద్రుని మూపుపై వేసిన పాపాత్ముణ్ణి. అయ్యలారా! నాపాపం పరిహారమయ్యే మార్గాన్ని సెలవీయండి. ఇప్పుడు నేను ఏమిచేస్తే నాకు వేగంగా ముక్తి ప్రాప్తిస్తుందో దయచేసి చెప్పండి అని తన కుమారుడైన జనమేజయుణ్ణి రప్పించి రాజ్యభారం అప్పగించాడు. గంగానది దక్షిణతీరంలో తూర్పుకొనలు ఉండేటట్లుగా పరచిన దర్భాసనం మీద ఉత్తరాభిముఖుడై కూర్చున్నాడు. అంత అక్కడ వారందరూ నీవు మహోన్నతుడవు. నీవు పుణ్యలోకాన్ని చేరేటంతవరకు మేమిక్కడే ఉంటాము.

అని అంటున్న మహర్షులతో రాజు ఏడు రోజులలో సంసార బంధాలు త్రెంచుకొని మోక్షం ప్రాప్తించే మార్గాన్ని ఉపదేశించమన్నాడు. అప్పుడు అక్కడ చేరిన మహర్షులంతా ఉత్తరానందనుని కోరిక నెరవేర్చుటకు సమాలోచనలు జరుపుతున్నారు. ఆ సమయంలో దైవయోగం వలన ప్రతిక్షణమూ పరబ్రహ్మ స్వరూపాన్ని సందర్శిస్తూ, పరవశించిన హృదయంతో ఉన్న అవధూతమూర్తి శ్రీ వేదవ్యాస మహర్షి ప్రియపుత్రుడు అయిన శ్రీశుకయోగీంద్రుడు అచటికిరాగా, ఆ మహానుభావుని మాహాత్మ్యం తెలిసిన మునివర్యులంతా ఎదురువచ్చి స్వాగతం పలికారు. పరీక్షిత్తు ఆ మహాయోగికి అతిథి సత్కారాలు కావించాడు. అటుపిమ్మట ఆ మహారాజు చేతులు జోడించి మహానుభావా! శుకదేవా! నాఅదృష్ట వశాన నీవు ఈ సమయానికి విజయం చేశావు. నీకు తెలియనిది ఏమీలేదు. ఏడురోజులలో ఈ దేహాన్ని త్యజించబోయే నాకు మోక్షమార్గాన్ని తెలియజెప్పు అని పరీక్షిన్నరేంద్రుడు శుక యోగీంద్రుని ప్రార్థించాడు. అప్పుడు శ్రీశుకుడు ఆ రాజేంద్రునికి శ్రీభాగవతాన్ని వినిపించడానికి నిశ్చయించుకొన్నాడు.

**ఏడవ అధ్యాయము - ప్రథమ స్కంధము**

**జవాబులు :** 1. 3. శమీకమహర్షి  2. 4. శృంగి
3. ఏడురోజులు

* * *

## ఎనిమిదవ అధ్యాయము - ద్వితీయ స్కంధము

**1. శ్రీశుకుడు పరీక్షిత్తునకు ముక్తిమార్గాన్ని తెలపడం 2. శుకుడు పరీక్షిత్తుకు భక్తిమార్గమే ముఖ్యమని తెలపడం 3. జగత్తు యొక్క సృష్టిని గురించి బ్రహ్మదేవుని నారదుడు అడగడం 4. శ్రీమన్నారాయణుని లీలావతార వర్ణనం 5. జగత్తు సృష్టని గురించి పరీక్షిత్తు శ్రీశుకుని అడగడం**

**1) ప్రశ్న :** ఏడురోజులలో ఈ దేహాన్ని పరిత్యజించే నాకు మోక్షమార్గాన్ని తెలుపుమన్న పరీక్షిన్మహారాజుతో శుకయోగి, ఓరాజా! నీకు ఏడురోజుల సమయం ఉంది. కానీ ఒక్క ముహూర్త కాలంలోనె గోవిందనామ స్మరణంతో మోక్షాన్ని పొందిన మహారాజు కథను చెబుతాను విను అని శుకమహర్షి వివరించిన ఆ మహారాజు పేరేమి?

**జవాబు :** 1. జనక మహారాజు 2. రఘు మహారాజు 3. హరిశ్చంద్ర మహారాజు 4. ఖట్వాంగ మహారాజు

**2) ప్రశ్న :** మరణభీతిని నిరాకరించి, ధర్మార్థ కామాలనే త్రివర్గాన్ని తిరస్కరించి, పరమపురుషునందే మనస్సును కేంద్రీకరించి, శ్రీమన్నారాయణుని లీలా విశేషాలను అభివర్ణించగా, ఆకర్ణించాలనే సంకల్పంతో ఉన్న పరీక్షిన్మహారాజుతో శ్రీశుకుడు మోక్షాన్ని శీఘ్రగతిని పొందాలంటే తరుణోపాయంగా ఏమార్గాన్ని నిర్ణయించి చెప్పాడు?

**జవాబు :** 1. భక్తి మార్గాన్ని 2. ప్రాయోపవేశ మార్గాన్ని 3. తపస్సుచేత 4. యజ్ఞం చేయటం ద్వారా

**3) ప్రశ్న :** ఒకానొకప్పుడు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి శబ్దార్థమయమైన ఈ విశ్వమంతా నీకు పూర్తిగా తెలిసిందే. ఈ జగత్తు యొక్క సృష్టిని ప్రారంభించే విజ్ఞానం నీకెవరైనా ఇచ్చారా? లేక నీవే అందరికీ ప్రభువువా అని ప్రశ్నించింది ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** చతుర్ముఖ బ్రహ్మ నారదమహర్షి కోరిక మేరకు శ్రీమన్నారాయణుని లీలావతారములను ఏవిధంగా అభివర్ణించాడు?

**జవాబు :** నారదమహర్షి అడిగిన ప్రశ్నలకు సమాధానం చెబుతూ బ్రహ్మదేవుడు నారదా! విను ఈ చరాచర జగత్తును సృష్టించుటకు నేను అశక్తుడను. నన్నూ ఈ లోకాలన్నింటినీ సృష్టించేవాడు, స్థితికారకుడూ, లయకారకుడూ అన్నీ శ్రీమన్నారాయణుడే. ఆ మహా పురుషోత్తముని లీలావతారాలను వినిపిస్తాను విను. ఆదినారాయణుడు ఒకసారి యజ్ఞవరాహావతారం దాల్చాడు. తరువాత సుయజ్ఞావతారం, కపిలావతారం, దత్తాత్రేయునిగాను, సనకస నందనాద్యవతారం, నరనారాయణావతారం, ధ్రువావతారం, పృథు చక్రవర్తి అవతారం, హయగ్రీవావతారం, ఆదిమూలావతారంలో గజేంద్రుని రక్షించాడు. మత్స్యావతారం, కూర్మావతారం, నృసింహావతారం, వామనావతారం, హంసావతారం, ధన్వంతరీ అవతారం, పరశురామావతారం, రామావతారం, బలరామావతారం, కృష్ణావతారం, బుద్ధావతారం ఈ విధంగా శ్రీమన్నారాయణుడు ఈ భూమిపై ధర్మాన్ని ఉద్ధరించేందుకు ఆయా సమయాలలో ఉద్భవించాడు. నారదా! పరమేశ్వరుడూ, సర్వ స్వరూపుడూ అయిన శ్రీహరి ఈ విశాల విశ్వం సృష్టికీ, స్థితికీ, లయానికీ హేతువై ప్రకాశిస్తాడు. ఆ భగవంతుని లీలావతారాలలోని అద్భుతకృత్యాలను లెక్కపెట్టడం ఎవ్వరికీ అలవికాదు. నీకు సంగ్రహంగా చెప్పాను. ఈ శ్రీహరి లీలావతార విశేషాలను విన్నవారు ధన్యులౌతారు.

**5) ప్రశ్న :** పరీక్షిత్తు మహారాజు శుకయోగీంద్రునితో బ్రహ్మదేవుడు నారదమునికి భగవత్సాక్షాత్కారం కలగడానికి చెప్పిన ఉపాయం దయతో నాకు చెప్పుమనగా ఆ శుకయోగి ఏమని తెలిపాడు?

**జవాబు :** శుకమహర్షి, ఓరాజా! నీవడిగిన బ్రహ్మ నారద సంవాదం భగవంతుని లీలలతో కూడిన భాగవతమనే మహాపురాణమున్నది. అది వేదంతో సమానం. దానిని సర్వేశ్వరుడు పూర్వం బ్రహ్మ కల్పంలో బ్రహ్మకు ఉపదేశించాడు. అది నీకు తెలియపరుస్తాను విను. ఓ రాజోత్తమా! ప్రకృతికీ, పురుషుడికీ అతీతమైన బ్రహ్మస్వరూపాన్ని ఎప్పుడు జీవుడు తీవ్రంగా ధ్యానిస్తాడో, అప్పుడు మోహం నుండి విడివడుతాడు. అహంకార మమకారమయమైన

సంసారం నుండి విముక్తుడై ముక్తిని పొందుతాడు. అంతేకాదు, జీవుడికీ, ఈశ్వరుడికీ శరీరాలతో సంబంధాలు కనిపిస్తున్నాయి. భగవంతుడు కూడా శరీరం ధరించే ఉన్నాడు. అట్టి భగవంతుడి మీద భక్తి గలిగి ఉంటే జీవుడికెలా ముక్తిసిద్ధిస్తుంది? అనగా అవిద్యకు లోనైనవాడు జీవుడు. అవిద్య ప్రభావంవల్ల అతడు కర్మననుసరించి సంప్రాప్తించిన శరీరాన్ని ధరిస్తాడు. ఆ దేహం మిథ్యారూపమైనది. భగవంతుడు యోగమాయతో గూడినవాడు. ఆయన తన యోగమాయా ప్రభావంవల్ల తన ఇష్టానుసారం జ్ఞానమయమైన లీలాశరీరం కల్పించుకొన్నాడు. అందువల్ల మోక్షానికి సాధనమైన జ్ఞానానికై తన సేవ కల్పించబడిందని భగవంతుడైన ఈశ్వరుడు బ్రహ్మతో చెప్పాడు. బ్రహ్మ నిష్కపటంగా తపస్సుచేసి పరమేశ్వరుని ఆరాధించాడు. అప్పుడు తన జ్ఞానానంద ఘనమైన స్వరూపం బ్రహ్మకు చూపించాడు. అందువల్ల జీవుడికి భగవద్భక్తి తప్పక మోక్షమిస్తుంది.

**ద్వితీయ స్కంధము – ఎనిమిదవ అధ్యాయము**

**జవాబులు :** 1.4. ఖట్వాంగ మహారాజు 2.1. భక్తిమార్గాన్ని 3. నారదమహర్షి

* * *

# తొమ్మిదవ అధ్యాయము - ద్వితీయ, తృతీయ స్కంధములు

**1. మహావిష్ణువు బ్రహ్మదేవునికి వరాల్విడం 2. విదురుని తీర్థయాత్ర 3. విదురుడు ఉద్ధవుని జూసి కృష్ణాదుల వృత్తాంతాన్ని అడగడం 4. విదుర మైత్రేయ సంవాదం 5. స్వాయంభువ మనవు ప్రజావృద్ధి చేయడం 6. యజ్ఞ వరాహావతార వర్ణన**

**1) ప్రశ్న :** విధాతకు జగత్తును సృష్టించాలనే సంకల్పం, ఆయన హృదయంలో ఉదయించింది. కాని ఎంత ఆలోచించినా, ప్రయత్నించినా, లోకాలను సృష్టించలేక పోయాడు. ఆ సమయంలో నీటి నడుమ నుండి ఒక శబ్దం వినిపించింది. రెండక్షరాలు కలిసిన ఆ శబ్దం ఏది?

**జవాబు :** 1. స్పర్శ 2. రూప 3. రసం 4. తప

**2) ప్రశ్న :** కురుపాండవుల వంశోన్నతిని కోరి, తాను తెలిపిన ధర్మాలను పెడచెవిని పెట్టిన కౌరవులను విడిచి విదురుడు తీర్థయాత్రలకు వెళ్ళాడు. అక్కడ తన ధర్మ సందేహాలను తెలిపి, ఇందులోని రహస్యాన్ని తెలుపుమని విదురుడు ఏ మహర్షిని ప్రార్థించాడు?

**జవాబు :** 1. రోమశమహర్షి 2. మార్కండేయమహర్షి 3. మైత్రేయ మహర్షి 4. అత్రిమహర్షి

**3) ప్రశ్న :** విదురుడు భూమిపై నున్న సకల పుణ్య తీర్థాలను సేవిస్తూ వెళ్ళి యమునా తీరంలో శ్రీకృష్ణుని ద్వారా విజ్ఞాన తత్త్వాన్ని అందుకొన్న ప్రజ్ఞాశాలి, జితేంద్రియుడు అయిన ఒక మహానుబావుణ్ణి దర్శించాడు. ఆయన ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ఉద్ధవుని సలహామేరకు విదురుడు మైత్రేయ మహర్షిని ఏ విధంగా దర్శించాడు? విదురునికి మైత్రేయ మహర్షి నారాయణ భక్తిని ఏ విధంగా వివరించాడు?

**జవాబు :** విదురుడు తన తీర్థయాత్రలో భాగంగా గంగానదిని చేరి అందులో స్నానంచేశాడు. అప్పుడు మైత్రేయ మహర్షిని దర్శించాడు. ఆ మహర్షికి పాదాభివందనం చేసి విదురుడు చేతులు జోడించి మునీంద్రా! నాకు విష్ణు కథామృతాన్ని వినాలని ఉన్నది. నాయందు దయయుంచి వినిపించు అనగా మైత్రేయుడు విదురా! నీవు భగవంతుని యందు భక్తికలవాడవు. కాబట్టి నీకు నారాయణుని కథల యందు ఆసక్తి ఉండటంలో ఆశ్చర్యమేముంది. ఒకానొక సమయంలో శ్రీకృష్ణుడు నన్నుచేర బిలిచి ఆ విజ్ఞానాన్నంతా నాకు బోధించాడు. దానిని నీకు చెప్పవలసిందిగా నన్ను ఆదేశించాడు. ఆయన ఆదేశం ప్రకారం నీకు చెపుతున్నాను విను. విశ్వంలోని సమస్తజీవులు భగవంతుని స్వరూపాలు. సమస్తమైన ఆత్మలూ ఆయనే. ఆయనే సర్వానికీ ప్రభువు. పరాత్పరుడు. అనేక విధాలైన బుద్ధులకు ఉపలక్షణమైన మహానుబావుడు. అటువంటి భగవంతుడు తన మాయవల్ల తనలోనే లీనమైన ప్రపంచాన్ని, తన గర్భంలో ధరించి ఒక్కడుగా వెలుగుతూ ఉంటాడు. ఆ పరమాత్మ పుట్టుక లేనివాడు. సమస్తమూ తన అంశ నుండి ఆవిర్భవించిన మాయను తన శక్తిగా ప్రతిష్ఠించి, పురుషోత్తముడైన ఈశ్వరుడు తన కడుపులోఉన్న విశ్వాన్ని ఉద్భవింపజేశాడు. సృష్టి సమస్తానికి జీవమై పరమాత్మకు స్థానమై తొలి అవతారమైన ఆ విరాట్ పురుషుని గర్భం నుండి భూతమయమైన ఈ సమస్త ప్రపంచం పుట్టింది అని ఆ విరాట్పురుషుని లీలలను ఇంకా ఎన్నో విధాలుగా మైత్రేయ మహర్షి విదురునికి చెప్పాడు.

**5) ప్రశ్న :** మైత్రేయ మహర్షి విదురునికి స్వాయంభువును గురించి, ఇంకనూ యజ్ఞవరాహావతారాన్ని గురించి ఏరీతిగా వివరించి చెప్పాడు?

**జవాబు :** విదురునితో మైత్రేయ మహర్షి విదురా! విను పరమేశ్వరునికి వ్యక్తమూ, అవ్యక్తమూ అని రెండు రూపాలు. ఈ వ్యక్తావ్యక్త రూపాలకు రెండింటికి ప్రణవమే ఆత్మ. భగవంతుడు అవ్యక్తాత్ముడు కావటంవల్ల పరిపూర్ణుడు. వ్యక్తాత్ముడు కావడంచేత ఇంద్రాది శక్తిసంయుక్తుడై కనిపిస్తాడు. ఒకప్పుడు బ్రహ్మదేవుడు తన ఆలోచనలకు తగ్గట్టుగా సృష్టి విస్తరించలేదని

ఆలోచించి భగవంతుడైన నారాయణుని ధ్యానించాడు. వెంటనే బ్రహ్మదేవుని శరీరం రెండు భాగాలయింది. అందొకటి స్వాయంభువ మనువుగాను, మరొకటి అతని భార్య శతరూపగాను రూపొందాయి. ఈ ఆదిదంపతుల వలన కలిగిన అనంత ప్రజా సంతతులవల్ల జగత్తంతా నిండి నిబిడీకృత మయింది. అప్పుడు స్వాయంభువ మనువుతో బ్రహ్మదేవుడు నీవు నిర్మలమైన ధర్మమార్గంలో సజ్జనులైన ప్రజలను పరిపాలిస్తూ ఉండు అన్నాడు. అప్పుడు మనువు తండ్రీ ఈ సృష్టిలో అఖిల జంతుజాలానికి ఆధారభూతమైన భూమి ఇప్పుడు సముద్ర గర్భంలో మునుగుతూ ఉన్నది. దానిని ఉద్ధరించి నన్ను అనుగ్రహించమన్నాడు. అప్పుడు బ్రహ్మ సర్వాంతర్యామిని ధ్యానించాడు. వెంటనే అతని ముక్కు నుండి బొటనవేలంత ప్రమాణంలో యజ్ఞ వరాహమూర్తి ఆవిర్భవించి, అక్కడ మరీచి మొదలైన మహర్షులు చూస్తుండగానే పర్వతమంత ఆకారాన్ని ధరించి, సముద్ర గర్భంలో దూకి అక్కడ హిరణ్యాక్షుడనే రాక్షసుని సంహరించి భూమిని తనకోరలపై ఉంచుకొని పైకితెచ్చి, మళ్ళీ భూమిని ఎప్పటిలాగా సుస్థిరంగా, సుఖంగా నీళ్ళమీద నిలిపాడు. అనంతరం, అనంతగుణ సంపన్నుడైన ఆ స్వామి అదృశ్యుడైనాడు. బ్రహ్మదేవుడు సంతోషించాడు. అప్పుడు బ్రహ్మజ్ఞాన సంపన్నులైన మునివరేణ్యులు భక్తి ప్రపత్తులతో యజ్ఞ వరాహస్వామిని ప్రస్తుతించారు.

### తొమ్మిదవ అధ్యాయము - ద్వితీయ, తృతీయ స్కంధములు

**జవాబులు :** 1. 4. తప  2. 3. మైత్రేయమహర్షి
3. ఉద్ధవుడు

* * *

## పదవ అధ్యాయము - తృతీయ స్కంధము

**1. ఆదివరాహమూర్తిని బ్రహ్మాదులు స్తుతించడం 2. హిరణ్యాక్ష, హిరణ్యకశ్యపుల వృత్తాంతం 3. సనకాదులు వైకుంఠానికి వెళ్ళడం 4. నారాయణుని సనకాదులు స్తుతించడం 5. జయ విజయులు హిరణ్యాక్ష, హిరణ్యకశ్యపులుగా జన్మించడం**

**1) ప్రశ్న :** సముద్రంలో మునిగిపోతున్న భూమిని బ్రహ్మాదుల కోరికపై శ్రీమహావిష్ణువు ఆదివరాహ రూపందాల్చి భూమిని ఉద్ధరించాడు. అప్పుడు బ్రహ్మాదిదేవతలు ఆ స్వామిని ఎన్నో విధాల స్థుతించారు. ఆ సమయంలో యజ్ఞవరాహమూర్తిని ఎదిరించి, ఆయన చేతిలో అశువులు బాసిన రాక్షసుడు ఎవరు?

**జవాబు :** 1. హిరణ్యకశ్యపుడు 2. హిరణ్యాక్షుడు
3. మధు, కైటభులు 4. ప్రలంబుడు

**2) ప్రశ్న :** కశ్యప ప్రజాపతి భార్య దితితో నీ స్వయం కృతాపరాధ ఫలంగా, నీకు పుట్టే ఇద్దరు కుమారులు దుర్మార్గులై భూమికి భారమౌతారు. కాని వారిలో ఒకనికి కలిగిన బిడ్డ పుణ్యాత్ముడు, హరిభక్తుడూ అవుతాడు అని తెలిపిన కశ్యపుని మనుమడి పేరేమి?

**జవాబు :** 1. ధ్రువుడు 2. అంబరీషుడు
3. ప్రహ్లాదుడు 4. బలిచక్రవర్తి

**3) ప్రశ్న :** ఒకనాడు సనకసనందాదులు వైకుంఠానికి వెళ్ళగా, అక్కడ వారిని ద్వారపాలకులు అడ్డగించారు. వారు కోపించి ద్వారపాలకులను శపించారు. ఇదంతా అక్కడ విస్తుపోయి చూస్తున్నది ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** సనకాది మహర్షులు వైకుంఠంలో శ్రీహరిని ఏరీతిగా స్తుతించారు?

**జవాబు :** నారాయణుని దర్శనార్థమై వచ్చిన సనకసనందాది మునులను, ద్వారపాలకులైన జయ విజయులు అడ్డగించారు. అందుకు మహర్షులు

కోపించి మావంటి వారిని అడ్డగించి మీరు అపరాధం చేశారు. ఈ అపరాధానికి ఫలంగా కామ క్రోధలోబాది శత్రుగణాలకు పాత్రులై భూలోకంలో పుట్టండి అని శపించారు. అప్పుడు ఆ ద్వారపాలకులు ఉలికిపడి తమ అపరాధాన్ని తెలిసికొని తల్లడిల్లి పోయారు. ఆ సమయంలో తన వాకిట జరుగుతున్న కలకలాన్ని గమనించి శ్రీ మహావిష్ణువు తానే స్వయంగా నడచి వచ్చాడు. సుస్థిరమై శోభావైభవంతో విచ్చేసిన విష్ణుమూర్తి సుందరవదనారవిందాన్నిసనకాదులు ఆనందంగా దర్శించారు. ఆ దివ్య మంగళ స్వరూపాన్ని దర్శించిన, ఆ దేవదేవుని మహర్షులు ఈ విధంగా స్తుతించారు. దేవా! నీవు అపారకృపాగుణమే అలంకారంగా కలవాడవు. భక్తుల పాపాలను పటాపంచలు చేసేవాడవు. కొనియాడతగినదై, కల్మషరహితమై, కల్యాణాలకు కాణాచియై, విశాల యశోవిరాజితమైన పవిత్ర చరిత్ర కలవాడవు. నీ పాదపద్మాల సేవకే అంకితమై అతి నిర్మలమైన అంతరంగంకల మహానుబావులు నిన్ను తప్ప మరిదేనినీ తమ మనస్సులలో చింతింపరు. అపార తపస్సులు చేసి పాపాలు పోగొట్టుకొని తిరిగే మేము ఈ దినం మీ పాదాశ్రితులపై కోపించి శాపం పెట్టాము. మహా పాపానికి ఒడిగట్టాము. మా తప్పు క్షమించి మమ్మల్ని రక్షించు అని సనకసుడు, సనందుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు భక్తితో పరవశించిన మనస్సుతో విన్నవించుకొన్నారు. సంతుష్టాంతరంగుడై ముకుందుడు మునిపుంగవులతో, ఈ ఇరువురు నా ద్వారపాలకులు జయ విజయులు మీయెడ అహంకరించి నందుకు ఫలితంగా, మీ శాపకాణంగా వీరు భూలోకంలో పుట్టి కొలది కాలానికి నా సమీపానికి వచ్చునటుల అనుమతి ఇవ్వండి అన్నాడు. అందుకు సమ్మతించిన సనకాదులతో ఆ గోవిందుడు వీరు భూలోకంలో లోభ మోహాలుకల రాక్షసులై జన్మిస్తారు. దేవతలకూ, మానవులకూ ఆపదలు కలిగిస్తూ, సర్వలోక కంటకులై జీవిస్తారు. చివరకు నాచేత సంహరింపబడి మూడు జన్మల తరువాత మరల వారి స్థానానానికి వస్తారు అని స్వామి అనుగ్రహించాడు.

**5) ప్రశ్న :** జయ విజయులు మొదటి జన్మగా ఎవరి గర్భవాసాన జన్మించారు? వారి పేర్లను తెలుపుతూ, వారి ప్రవర్తన గురించి తెలిపండి.

**జవాబు :** దైవనిర్ణయానుసారం, కశ్యప ప్రజాపతి భార్య అయిన దితి గర్భవాసాన, జయ విజయులు ప్రవేశించారు. తన కుమారులు దేవతలను బాధిస్తారని, భర్త వలన తెలిసికొన్న దితి బాధపడసాగింది. ఒకనాడు సకల భువనకంటకులైన ఇద్దరు కుమారులను కన్నది. ఆ సమయంలో భూమి కంపించింది. సముద్రాలు కలతచెందాయి. గ్రహాలు, నక్షత్రాలు వెలవెల పోయాయి. ఈ విధంగా అనేక ఉత్పాతాలు కలిగాయి. స్వచ్ఛమైన మేనికాంతులు వెదజల్లగా ఆ బిడ్డలు దినదినాభివృద్ధి చెందుతున్నారు. ఒకనాడు కశ్యప ప్రజాపతి తన కుమారులను చూడదలచిన వాడై దితి సౌధానికి వచ్చాడు. తన బిడ్డలకు పేర్లు పెట్టాలని సంకల్పించి ముందు పుట్టిన వానికి హిరణ్యకశ్యపుడని, తరువాతి బిడ్డకు హిరణ్యాక్షుడని నామకరణం చేశాడు. ఈ హిరణ్యాక్షుడు, హిరణ్యకశ్యపుడు పెరిగి పెద్దవారై బ్రహ్మదేవుని అనుగ్రహంతో వారిరువురు అమేయ వరప్రభావాలతో సాధుజనులను, మునులను, దేవతలను బాధించసాగారు. ఈ విధంగా వారిరువురు చెలరేగి ఉండసాగారు.

### పదవ అధ్యాయము – తృతీయ స్కంధము

**జవాబులు :** 1. 2. హిరణ్యాక్షుడు 2. 3. ప్రహ్లాదుడు
3. దేవతలు

* * *

## పదకొండవ అధ్యాయము - తృతీయ స్కంధము

**1. హిరణ్యాక్షుడు ఆదివరాహమూర్తిని ఎదిరించడం 2. బ్రహ్మదేవుని యజ్ఞాది, దేవతాగణ సృష్టి 3. దేవహూతి కర్ధముల వివాహం 4. దేవహూతితో గూడి కర్ధముని విహారం**

**1) ప్రశ్న :** బ్రహ్మదేవుడిచ్చిన వరగర్వంతో హిరణ్యాక్షుడు తిరుగుతుండగా, నారదమహర్షి కనపడి రాక్షసరాజుతో, నీవు వెతికే నారాయణుడు ఇప్పుడు వైకుంఠంలో లేదు. ఆయన భూమిని రక్షించే ప్రయత్నంలో యజ్ఞవరాహ రూపంలో ఉన్నాడు అని మహావిష్ణువు ఎక్కడ ఉన్నాడని నారదుడు హిరణ్యాక్షునికి తెలిపాడు?

**జవాబు :** 1. వాయువులో 2. అగ్నిలో 3. సముద్రంలో 4. ఆకాశంలో

**2) ప్రశ్న :** సమస్తప్రాణ సమూహానికి ఆశ్రయమైన ఒకానొక పద్మం పరబ్రహ్మమైన నారాయణుని శరీరం నుండి పుట్టింది. ఆ పద్మం నుండి భగవదంశతో చతుర్ముఖ బ్రహ్మ, మహావిష్ణువు శరీరంలోని ఏ భాగం నుండి ఉద్భవించాడు?

**జవాబు :** 1. పాదంనుండి 2. ముఖంనుండి 3. బొడ్డునుండి 4. హృదయంనుండి

**3) ప్రశ్న :** సృష్టిలో భాగంగా బ్రహ్మదేవుడు తన కటిప్రదేశం నుండి రాక్షసులను పుట్టించాడు. వారు తమతో భోగించమని బ్రహ్మదేవుని వెంటపడ్డారు. అప్పుడు బ్రహ్మ నారాయణుని శరణువేడాడు. ఆ పరబ్రహ్మం బ్రహ్మదేవుని శరీరాన్ని విడిచిపెట్టమని చెప్పాడు. వెంటనే బ్రహ్మ తన శరీరాన్ని విడిచిపెట్టాడు. ఆ శరీరం నుండి ఎవరు ఉద్భవించారు.

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** కర్దమప్రజాపతి భగవదనుగ్రహంతో ఎవరిని ఏ విధంగా వివాహ మాడాడు?

**జవాబు :** కృతయుగంలో ప్రజా సృష్టి విస్తృతం చేయతలచి బ్రహ్మదేవుడు కర్దముని నియమించాడు. ఆ మహర్షి సరస్వతీ నదీతీరంలో మహావిష్ణువును గురించి తపస్సు చేశాడు. ఒకనాడు ధ్యానతత్పరుడై ఏకాగ్ర చిత్తంతోఉన్న కర్దమ ప్రజాపతికి లక్ష్మీవల్లభుడూ, చక్రహస్తుడూ అయిన మహావిష్ణువు ఆకాశంలో ప్రత్యక్షమైనాడు. కర్దముడు తన కోరిక నెరవేరిందని ఆనంద తరంగాలు పొంగులెత్తగా స్వామికి సాష్టాంగ నమస్కారాలు చేశాడు. అనంతరం కర్దముడు స్వామిని కీర్తించి దేవా! నీ అనుగ్రహంతో, కర్మమయమైన నీ ఆజ్ఞా చక్రాన్ని అనుసరించి, దైవ కార్యమైన సృష్టిని వృద్ధిచేయటానికి నేను వివాహం చేసుకొంటాను. మంచి సంతానాన్ని అనుగ్రహించు అనగానే స్వామి కర్దమ మునీంద్రా! నీవు ఏమి కావాలని కోరి నన్ను భక్తిశ్రద్ధలతో ఆరాధించావో ఆ కోరిక నీకు అవశ్యం నెరవేరుతుంది. స్వాయంభువ మనువు తన కుమార్తెను నీకు ఇచ్చి పెండ్లి చేస్తాడు. నీకు ఆమెవలన తొమ్మండుగురు పుత్రికలు పుడతారు. పిమ్మట నీ తేజస్సు వలన నేను నీ భార్య గర్భంలో ప్రవేశించి నీకు కుమారుడనై జన్మించి నీకు తత్వోపదేశం చేస్తాను అని చెప్పి నారాయణుడు అదృశ్యమైనాడు. అనంతరం కర్దముడు బిందుసరోవరం ప్రక్కనే ఉన్న తన ఆశ్రమం చేరాడు. మహావిష్ణువు చెప్పిన విధంగానే స్వాయంభువ మనువు తన కుమార్తెకు తగిన వరుని వెతుకుకొంటూ కర్దమాశ్రమానికి వచ్చాడు. వచ్చిన మనువుకు ప్రజాపతి అర్ఘ్యపాద్యాలిచ్చి పూజించాడు. అనంతరం కర్దముడు జనార్ధనుని ఆదేశాన్ని గుర్తుకు తెచ్చుకొని నీ రాకకు కారణమేమిటని స్వాయంభువ మనువును అడిగాడు. అప్పుడు మనువు ఓ మునివరేణ్యా! ఈ భూమి మీద వేదాలను వెలయించటానికి, మిమ్ములను బ్రహ్మ తన ముఖం నుండి సృష్టించాడు. ఈ సమస్త భూమిని పాలించటానికి నన్ను తన భుజాల నుండి సృష్టించాడు. దైవ నిర్ణయానుసారం ఓ మునివరా! ఇదిగో ఈమె నాకూతురు. పేరు దేవహూతి. ఈమె నారద మునీంద్రుని వలన నీ రూపగుణాలు తెలిసికొని నిన్నే వివాహం చేసుకొనాలని నిర్ణయించుకొన్నది. అందుకని ఈ శుభకార్యానికి నీవు అంగీకరించి ఈమెను స్వీకరించు అనగా కర్దముడు గుణం, రూపం, నడవడి ఇవి ఈ కన్యకామణికీ నాకూ సమానంగా

ఉన్నాయి. కాబట్టి ఇది పుణ్యకార్యంగా భావించి ఈమెను నేను వరించి భార్యగా స్వీకరిస్తాను అని చెప్పి దేవహూతి అంగీకారంతో యథావిధిగా కర్దమ ప్రజాపతి వివాహం చేసుకొన్నాడు.

**5) ప్రశ్న :** కర్దమ ప్రజాపతి తన భార్యయైన దేవహూతితో ప్రీతికరమైన భోగాలను ఏ విధంగా అనుభవించాడు?

**జవాబు :** స్వాయంభువ మనువు తన కూతురైన దేవహూతిని కర్దమునికిచ్చి వివాహం జరిపించి వెళ్ళిపోయాడు. దేవహూతి ద్విగుణీకృతమైన భక్తిశ్రద్ధలతో భర్తను సేవిస్తూన్నది. ఒకనాడు దేవహూతి తన భర్తనుచేరి ఓ పుణ్యపురుషా! నీవు అత్యంత సమర్థుడవు. నీయందు సాటిలేని దివ్యభోగాలు తప్పకుండా ఉన్నాయని నాకు తెలుసు. నీ సాంగత్యం వలన అవన్నీ నాకు సంక్రమిస్తాయనీ తెలుసు. సత్సంతాన కాంక్షతో ఉన్న నన్ను అనుగ్రహించు మనగా, కర్దముడు తన భార్య మాటలు విని ఆమె మనోరథాన్ని తీర్చటానికి నిశ్చయించుకొని యోగ మాయాబలంతో ఆ క్షణంలోనే ఒక దివ్య విమానాన్ని సృష్టించాడు. అద్భుతమైన ఆ దివ్య విమానంలోని శోభా విశేషాలను తన భార్యకు చూపించాడు. ప్రజాపతి నిత్యమంగళ స్వరూపుడైన కర్దముడు తన భార్య దేవహూతితో కూడి విమానారూఢుడై అందమైన నందనవనాలను సందర్శించాడు. నేల నాలుగు చెరగుల, సమస్త భూమండలాన్ని దేవహూతికి చూపించి తిరిగి తన ఆశ్రమానికి చేరాడు. అనంతరం ఆ దంపతులు అనేక విధాలైన అభీష్ట సుఖభోగాలను అనుభవిస్తూన్నారు. కర్దముని వల్ల దేవహూతి తొమ్మిది మంది పుత్రికలను కన్నది. ఈ విధంగా దేవహూతి కర్దమ మహర్షితో కలిసి ఆనందమయ జీవితాన్ని అనుభవించింది.

## పదకొండవ అధ్యాయము - తృతీయ స్కంధము

**జవాబులు :** 1.3. సముద్రంలో 2.3. బొడ్డునుండి
3. సంధ్యా సుందరి

* * *

# పంద్రెండవ అధ్యాయము - తృతీయ స్కంధము

**1. మహావిష్ణువు కపిలావతారం 2. తల్లియైన దేవహూతికి కపిలుని తత్త్వజ్ఞాన బోధ 3. కపిలుడు తల్లికి భక్తియోగాన్ని తెలపడం**

**1) ప్రశ్న :** దేవహూతికి తత్త్వజ్ఞానాన్ని బోధించటానికై ఆమె గర్భంలో పుట్టిన పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీ మహావిష్ణువును దర్శించటం కోసం మరీచి మొదలైన మునీశ్వరులతో కూడి ఏ దేవుడు అక్కడకు విచ్చేశాడు?

| **జవాబు :** | 1. నారాయణుడు | 2. శంకరుడు |
|---|---|---|
| | 3. బ్రహ్మ | 4. ఇంద్రుడు |

**2) ప్రశ్న :** కర్దమ దేవహూతులు నిజమైన భక్తితో, నిష్కపటమైన మనస్సుతో విష్ణుదేవుని సేవించారు. వారి పూజకు తగిన ఫలంగా నారాయణుడు దేవహూతి గర్భవాసాన పుట్టాడు. అగణ్యమైన ఆ పుణ్య పురుషునికి ఏమిపేరు పెట్టారు?

| **జవాబు :** | 1. కపిలుడు | 2. వ్యాసుడు |
|---|---|---|
| | 3. మరీచి | 4. దుర్వాసుడు |

**3) ప్రశ్న :** దేవహూతి, కర్దములకు జన్మించిన 'కపిలుడు' ప్రసిద్ధులైన సిద్దపురుషులకు, విద్వాంసులకు, మహర్షులకు పరబ్రహ్మతత్త్వాన్ని గురించిన వివరణను వినిపించాడు. ఆ వినిపించిన దానిని ఏ యోగం అని పిలుస్తారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉన్నది.

**4) ప్రశ్న :** కపిలుడు తన తల్లియైన దేవహూతికి భక్తియోగాన్ని వివరించిన విధమెట్టిది?

**జవాబు :** కర్దముడు వనానికి వెళ్ళిన తరువాత దేవహూతి బిందు సరోవరం దగ్గర ఉన్న కపిలుని దర్శించింది. మాతృవత్సలుడూ, భక్తితత్త్వమార్గాన్ని ప్రదర్శించేవాడూ అయిన తన కుమారుని నారాయణుని అవతారంగా ఎంచి, ఓ మహాతపస్సంపన్నా! నిన్ను శరణు వేడుతున్నాను. నన్ను కాపాడుమని

దేవహూతి కపిలుణ్ణి ప్రార్థించింది. కపిలుడు మేటి కారుణ్యంతో తల్లికి మోక్షాన్ని ప్రసాదించే భక్తితత్త్వాన్ని ఈ విధంగా ప్రబోధించాడు. అమ్మా! విను. గాఢమైన సంసార బంధానికి, మోక్షానికీ జీవుని చిత్తమే కారణం. అది సత్త్వరజస్తమో గుణాలతో సమ్మేళనం పొందినప్పుడు సంసారబంధానికి హేతువవుతుంది. ఈ చిత్తమే శ్రీమన్నారాయణుని మీద సంయుక్తమైనప్పుడు మోక్షానికి హేతువవుతుంది అని కపిలుడు తల్లికి వినిపించి మళ్ళీ ఇలా అన్నాడు. అమ్మా! పరమాత్మ ప్రకృతికంటే అతీతుడు, అభేద్యుడు, స్వయంప్రకాశకుడు, సూక్ష్మస్వరూపుడు, అపరిచ్ఛిన్నుడూ, ఉదాసీనుడు. అటువంటి పరమాత్మనూ, ఆ పరమాత్మ తేజస్సువల్ల నిస్తేజమైన ప్రపంచాన్నీ, యోగివరేణ్యులు భక్తి జ్ఞానవైరాగ్యయుక్తమైన చిత్తంతో దర్శించిన వారై, మోక్షప్రాప్తికి సర్వాంతర్యామియైన శ్రీమన్నారాయణునియందు, సమర్పింపబడిన భక్తిమార్గమే ఉత్తమోత్తమమైనదని నిర్ణయించారు. తక్కిన మార్గాలు దానికి సాటిరావు అని కపిలుడు తల్లియైన దేవహూతికి భక్తి మార్గాన్ని ఇంకా ఎన్నో ఉపమానాలతో వివరించి చెప్పాడు.

**5) ప్రశ్న :** కపిలునితో దేవహూతి ప్రకృతికీ ఆత్మకూ గల అవినాభావ సంబంధాన్ని గురించి అడుగగా కపిలుడు తన తల్లికి ఏ విధంగా సందేహ నివృత్తి చేశాడు?

**జవాబు :** దేవహూతి అడిగిన సందేహాలకు భగవంతుడైన కపిలుడు అమ్మా! సాధకుడైన పురుషుడు ఎటువంటి ఫలాన్ని కోరకుండా తన ధర్మాలను తాను నిర్వర్తిస్తూ ఉండాలి. తన మనస్సును ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంచుకోవాలి. నాయందు అచంచలమైన భక్తి కలిగి ఉండాలి. మంచి మంచి పుణ్య కథలను ఆసక్తితో ఆకర్ణించాలి. ప్రకృతి పురుషుల యథార్థ జ్ఞానాన్ని అవగతం చేసుకోవాలి. అఖండమైన ఏకాగ్రతను అవలంబించాలి. ఈ సాధనవల్ల పురుషుని అంటుకొని ఉన్న ప్రకృతి దందహ్యమానమై అదృశ్యమైపోతుంది. జ్ఞానంవల్లనూ, తత్త్వ దర్శనంవల్లనూ, పటిష్టమూ, బలిష్టమూ, దోషభూయిష్టమూ అయిన ప్రకృతిని అనుభవిస్తున్న జీవుడు సగంలో మొగంమొత్తి పరిత్యాగం

చేస్తాడు. ప్రకృతి ఎంత బలం కలదైనా తన ప్రభావంవలన తనకు అధీశ్వరుడై తనతో ప్రవర్తించే పురుషునకు అమంగళాన్నీ అనర్థాన్నీ ఆచరించలేదు. ఇంకనూ ఓ పుణ్యాత్మురాలా! ఆత్మజ్ఞాన సంపన్నుడైనవాడు బ్రహ్మపదం ప్రాప్తించే పర్యంతం ఎంతకాలమైనా ఎన్నిజన్మలైనా ఎత్తుతూనే ఉంటాడు. వాని వైరాగ్యం చెక్కుచెదరదు. నా భక్తుడు ఉపదేశించిన విజ్ఞాన సంపదవల్ల ప్రబోధం పొందినవాడై ఎన్నోమారులు నా అనుగ్రహానికి పాత్రుడవుతూ ఉంటాడు. తాను పొందిన ఆత్మజ్ఞానంతో తన సందేహాలన్నింటిని విముక్తి చేసుకొంటాడు. లింగదేహాన్ని విడిచిపెట్టి యోగపుంగవుల అంతరంగాలకు సంభావ్యమైన నా దివ్యధామాన్ని తేజస్వియై చేరుకొంటాడు అని తన తల్లి దేవహూతి అడిగిన ప్రశ్నలకు కపిలుడు సమాధానాలు చెప్పాడు.

## పంద్రెండవ అధ్యాయము – తృతీయ స్కంధము

**జవాబులు :** 1. 3. బ్రహ్మ  2. 1. కపిలుడు
3. సాంఖ్యయోగం

* * *

# పదమూడవ అధ్యాయము - తృతీయ స్కంధము

## 1. కపిలుడు తల్లికి పిండోత్పత్తి క్రమాన్ని తెలపడం 2. గర్భస్తుండగు జీవుడు భగవంతుని స్తుతించడం

**1) ప్రశ్న :** తన భర్తయైన కర్దముడు వనాలకు వెళ్ళిన పిమ్మట దేవహూతి కపిలుని అన్వేషిస్తూ వెళ్ళి ఆయనను ఎక్కడ దర్శించింది?

**జవాబు :** 1. బదరికాశ్రమంలో 2. నైమిశారణ్యంలో 3. బిందు సరోవరంప్రక్కన 4. వ్యాసాశ్రమంలో

**2) ప్రశ్న :** కర్దముడూ, దేవహూతి, కపిలుడూ వీరికి సంబంధించిన కథను విదురునికి ఎవరు చెప్పారు?

**జవాబు :** 1. మైత్రేయుడు 2. సూతుడు 3. నారదుడు 4. వేదవ్యాసుడు

**3) ప్రశ్న :** కపిలాచార్యుని వలన పొందిన ఉపదేశం కారణంగా తల్లియైన దేవహూతి వైరాగ్యం పొందింది. అటు పిమ్మట ఆమె మోక్షాన్ని పొందిన పవిత్ర క్షేత్రాన్ని ఏపేరుతో పిలుస్తారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** పిండోత్పత్తి క్రమాన్ని గురించి కపిలమహర్షి తనతల్లి దేవహూతికి ఏవిధంగా వివరించి చెప్పాడు?

**జవాబు :** పూర్వజన్మలో చేసిన పాపపుణ్యాలను అనుభవించిన తరువాత జీవుడు మళ్ళీ దేహాన్ని పొందగోరుతాడు. మొదటగా జీవుడు పురుషువీర్యబిందు సంబంధంతో స్త్రీ గర్భంలో ప్రవేశిస్తాడు. ఒక్కరోజంతా శుక్రశోణితాద్రవమై, తరువాత ఐదురాత్రులకు బుద్బుదమై, ఆపైన పదిరోజుల అనంతరం మాంసపిండమై గుడ్డు ఆకారం పొందుతుంది. ఒక్క నెలకు శిరస్సు ఏర్పడుతుంది. రెండునెలలకు కాళ్ళు చేతులు వస్తాయి అని కపిలుడు తన తల్లితో అమ్మా ఇంకా విను. మూడు నెలలకు గోళ్ళు, వెంట్రుకలు, ఎముకలు, చర్మం,

నవరంధ్రాలు ఏర్పడుతాయి. నాల్గవ నెలకు సప్తధాతువులు శుక్లం, శోణితం, మాంసం, చీము, మెదడు, ఎముకలు, చర్మం కలుగుతాయి. ఐదు, ఆరు నెలలలో మావిచేత కప్పబడి తల్లి కడుపులో ఆమెతిన్న ఆహారంతోనూ, త్రాగిన నీటితోనూ తృప్తిపొందుతూ ఉంటాడు. ధాతువులు అభివృద్ధి చెందుతూ ఉంటాయి. తల్లి తిన్న కారం, చేదు, ఉప్పు, పులుపు మొదలైన తీవ్రరసాలు అవయవాలను తపింప చేస్తాయి. దైవదత్తమైన తెలివితో వెనుకటి జన్మలలోని పాపాలను తలచుకొని నిట్టూర్పులు విడుస్తాడు. ఏడవ నెలలో జ్ఞానం కలుగుతుంది. ఆ విధంగా సంప్రాప్తించిన జ్ఞానంతో తనకు ఈ గర్భవాసం కలిగించిన సర్వేశ్వరుని సంస్తుతిస్తాడు. ఎనిమిదవ నెలలో ఈ గర్భనరకం నుండి తనను విముక్తుని చేయగలవాడు ఆ పుండరీకాక్షుడే అని తలంచుతాడు. తాను పూర్వజన్మలో చేసిన పాపాలను ఈ జన్మలో చేయకూడదని, తాను విజ్ఞాన దీపాంకురాన్ని వెలిగించుకొని ఆ వెలుగులో నిరంతరం పురాణపురుషుడైన నారాయణుని దర్శించాలని అనుకొంటూ ఉంటాడు. ఈ విధంగా నిశ్చయించుకొని అతిశయించిన నిర్మల జ్ఞానం కలవాడై గర్భం నుండి వెడలిరాకుండా తొమ్మిది నెలలు అట్లాగే గడుపుతాడు. అనంతరం పదో మాసం వస్తుంది. అప్పుడు జీవుడు తలక్రిందులుగా తిరుగుతాడు. ఈ నెలలో ఏదో ఒకరోజున భూమిమీదకు వస్తాడు. ఆ విధంగా జీవుడు శైశవంలో ఆయా అవస్థలు అనుభవిస్తూ బాల్య, యవ్వనాలు దాటి వృద్ధాప్యంలో అడుగుపెడతాడు. అమ్మా ఈ విధంగా జీవుడు పాప పుణ్యాలను చేస్తూంటాడు అని తల్లికి కపిల మహర్షి వినిపించాడు.

**5) ప్రశ్న :** దేహదారియైన జీవుడు తాను చేసిన పాపపుణ్యాలకు తగిన విధంగా దేహ పరిత్యాగియైన తరువాత జీవి ఏవిధంగా స్వర్గనరకాలను అనుభవిస్తాడు? అని అడిగిన తల్లికి కపిలమహర్షి తెలిపిన విధమెట్టిది?

**జవాబు :** కపిలమహర్షి తల్లియైన దేవహూతికి తెలుపుతూ అమ్మా! విను. నిరంతర ప్రక్రియగా సాగే నిత్యనైమిత్తక క్రియలతో జీవుడు, నేనూ, నాది, ఇల్లూ, పొలం, పశువులూ, ధనం, సంతానం, భార్య, బంధువులు మొదలైన

వస్తువులే శాశ్వతమని నమ్ముతాడు. అటువంటి మూర్ఖుడు అనేక ప్రాణుల శరీరాలను పొందుతూ వివిధ యోనుల్లో జన్మిస్తాడు. అయినా వాటిపట్ల విరక్తి చెందడు. కష్టం వచ్చినప్పుడూ, నరకబాధలు పడుతున్నప్పుడూ, ఆ బాధకు తాళలేక అప్పటికప్పుడు భగవంతుని తలచి తనను ఈ బాధనుండి తప్పించమని వేడుకొంటాడే తప్ప, పునరావృత్తి రహితమైన నారాయణ సన్నిధిని చేరటానికి తనకు అవకాశం వచ్చిన కాలాన్ని వృథాపుచ్చి, మహావిష్ణువునందు భక్తిని కలిగి ఉండటాన్ని లెక్కచేయడు. ఫలితంగా నరకప్రాప్తి సంభవిస్తుంది. తాను ధరించిన శరీరాన్ని విడిచిపెట్టిన జీవుడు యాతనా శరీరంలో ప్రవేశించి, యమభటులు బలవంతంగా ఈడ్చుకొని వెళుతుంటే, శిక్షలు అనుభవించటానికి సంసిద్ధుడై, పూర్వజన్మలో చేసిన పాపాలన్నీ జ్ఞప్తికి తెచ్చుకొని పరితపిస్తాడు. ఎడతెగని ఆకలిదప్పులతో లోలోపల వ్యాకులపడుతూ, సుడిగాలుల మధ్య సోలిపోతుంటాడు. భగభగమండే సూర్యకిరణాలకువేడెక్కి మాడిపోతున్న ఇసుక ఎడారుల్లో కాళ్ళు కాలుతూ నడవలేక నడుస్తూంటాడు. కొరడా దెబ్బలకు బొబ్బలెక్కిన వీపుతో శిథిలమైన అవయవాలతో మార్గమధ్యంలో అనేక విధాల పరితపిస్తూ, గడచిన జన్మలో భగవంతుని స్తుతించమనీ, భజించమనీ, ఆయన కథలు చదవమనీ, వినమనీ పుణ్యాత్ములు చెప్పిన దేనినీ నేను ఆచరించక పోతిని, నమ్మకపోతిని గదా! అవకాశం వచ్చినప్పుడల్లా ఆ దేవాదిదేవుని స్మరించి ఉన్నట్లైతే ఈ యమబాధల నుండి తప్పించుకొనేవాడిని కదా! అని జీవి బాధపడతాడు. అప్పుడు బాధపడి ప్రయోజనం ఏముంది? చేసిన పాపాలకు తగిన నరక బాధలు అనుభవించిన తరువాత మరలా ఆ జీవి పాపపుణ్యాలను బట్టి మరుజన్మ సిద్ధిస్తుంది. ఇది నిరంతరం సాగే ప్రక్రియ తల్లీ అని కపిల మహర్షి తన తల్లికి వినిపించాడు.

### పదమూడవ అధ్యాయము - తృతీయ స్కంధము

**జవాబులు :** 1.3. బిందు సరోవరం ప్రక్కన 2.1. మైత్రేయుడు
3. సిద్ధిపదం

* * *

## పద్నాలుగవ అధ్యాయము - చతుర్థ స్కంధము

**1. స్వాయంభువమనువు పుత్రికల వంశ విస్తారం 2. కర్దమ ప్రజాపతి సంతతి**

**1) ప్రశ్న :** స్వాయంభువ మనువు తన పెద్ద కుమార్తె అయిన ఆకూతిని ఎవరికిచ్చి పెండ్లి చేశాడు?

**జవాబు :** 1. కశ్యపప్రజాపతి 2. రుచిప్రజాపతి
3. దక్షప్రజాపతి 4. కర్ధమప్రజాపతి

**2) ప్రశ్న :** రుచి ప్రజాపతికి తన భార్యయైన ఆకూతి యందు శ్రీమహావిష్ణువు అంశతో పుత్రుడు జన్మించాడు ఆతని పేరేమి?

**జవాబు :** 1. కపిలుడు 2. ఉత్తముడు
3. మరుత్తు 4. యజ్ఞుడు

**3) ప్రశ్న :** స్వాయంభువ మన్వంతరంలో మరీచి మొదలైన మునులు సప్తఋషులైనారు. కాగా ఈ మన్వంతరంలో ఇంద్ర పదవిని ఎవరు అధిష్ఠించారు.

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** స్వాయంభువమనువు వంశ విస్తారం ఏ విధంగా జరిగింది?

**జవాబు :** విదురునితో మైత్రేయ మహర్షి చెపుతున్నాడు. స్వాయంభువ మనువుకు శతరూప అనే భార్య వలన ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు కుమార్తెలు, ప్రియవ్రతుడూ, ఉత్తానపాదుడూ అనే ఇద్దరు కుమారులు జన్మించారు. వారిలో పెద్దదైన ఆకూతిని మనువు రుచిప్రజాపతికి ఇచ్చి పెండ్లి చేశాడు. రెండవ కుమార్తె దేవహూతిని కర్ధమప్రజాపతికి ఇచ్చి పెండ్లిచేశాడు. మూడవ కుమార్తె ప్రసూతిని దక్షప్రజాపతికి ఇచ్చి పెండ్లిచేశాడు. కాగా కుమారులలో పెద్దవాడు ప్రియవ్రతుడు కర్దమప్రజాపతి కుమార్తె సుకన్యను పెండ్లియాడి తన సంతతిని వృద్ధి చేశాడు. పిమ్మట ఉత్తాన పాదుడు సునీతి, సురిచి అను ఇరువురి భార్యలతో తన సంతానాన్ని వృద్ధిచేశాడు. ఈ విధంగా స్వాయంభువ మనువు యొక్క సంతానం, వారి సంతానం మనుమలతోనూ, ముని మనుమలతోనూ ప్రజావృద్ధి జరిగి మూడులోకాలు నిండిపోయినాయి.

**5) ప్రశ్న :** కర్దమప్రజాపతి సంతతి ఏవిధంగా వృద్ధి జరిగింది?

**జవాబు :** కర్దముని కుమార్తె 'కళ'ను మరీచి మహర్షికిచ్చి పెండ్లిచేశాడు. వారికి కశ్యపుడు అను కొడుకూ, పూర్ణిమ అను కూతురూ పుట్టారు. ఆ కశ్యపుని సంతానం, పూర్ణిమ సంతానంతో లోకాలన్నీ నిండిపోయాయి. కర్దమునికీ దేవహూతికి కపిలుడు అనే కొడుకు నారాయణాంశతో జన్మించాడు. కర్దముని పుత్రికలు సప్తర్షులకు భార్యలైనారు. అందు అనసూయ అత్రిమహర్షికి భార్య అయింది. ఈ పుణ్య దంపతులకు త్రిమూర్తుల అంశలతో ముగ్గురు కుమారులు కలిగారు. వారు బ్రహ్మదేవుని అంశతో చంద్రుడు, విష్ణుదేవుని అంశతో దత్తుడు, శంకరుని అంశతో దుర్వాసుడుగా లోకంలో ప్రఖ్యాతివహించారు. కాగా అంగీరసుడు అను మునీంద్రునికి అర్ధాంగియైన శ్రద్ధయందు సుగుణవంతులూ, సుందరాంగులూ అయిన నలుగురు కుమార్తెలు జన్మించారు. ఇరువురు కుమారులు కూడా కలిగారు. వారు ఉచథ్యుడు, బృహస్పతి అను పేర్లతో లోకంలో ప్రఖ్యాతులైనారు. పులస్త్యునికి హవిర్భుక్కు అనే భార్యవలన అగస్త్యుడు, విశ్రవశుడు అనే ఇద్దరు పుత్రులు జన్మించారు. విశ్రవశువుకు ఇలబిల అనే భార్యవలన కుబేరుడు జన్మించాడు. రెండవ భార్య కైకసి వలన రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు అనే ముగ్గురు కుమారులు కలిగారు. పులస్త్యునికి 'గతి' అనే భార్యవల్ల కర్మశ్రేష్టుడు, వరీయాంసుడు, సహిష్ణుడు అనే ముగ్గురు కొడుకులూ ఉద్భవించారు. క్రతువుకు 'క్రియ' వలన బ్రహ్మతేజో నిధులైన వాలఖిల్యులు అనే మహర్షులు కలిగారు. వారు అరవై వేలమంది. వశిష్ఠునికి దక్షప్రజాపతి కూతురు 'ఊర్జ' అనే భార్య వలన చిత్రకేతుడు, సురోచి, విరజుడు, మిత్రుడూ, ఉల్బణుడూ, వసుబృద్యానుడు, ద్యుమంతుడు అనే ఏడుగురు ఋషులు జన్మించారు. వీరు స్వాయంభువ మన్వంతరమున సప్తర్షులుగా ఉన్నారు. మరియొక భార్య అరుంధతి వలన శక్త్యాది నూర్గురు సంతానం కలిగారు. ఈ విధంగా కర్దముని తొమ్మండుగురు కూతుళ్ళ వలన కలిగిన సంతానపరంపరలతో లోకాలన్నీ నిండిపోయాయి.

**పద్నాలుగవ అధ్యాయము - చతుర్థస్కంధము**

**జవాబులు :** 1. 2. రుచిప్రజాపతికి 2. 4. యజ్ఞుడు
3. యజ్ఞుడు

* * *

## పదునైదవ అధ్యాయము - చతుర్థ స్కంధము

**1. దక్షప్రజాపతి సంతతి. 2. ఈశ్వరునికి దక్షప్రజాపతికి విరోధం సంభవించడం**

**1) ప్రశ్న :** దక్షప్రజాపతికి స్వాయంభువ మనువు కూతురయిన ప్రసూతి వల్ల ఎంత మంది కుమార్తెలు కలిగారు?

**జవాబు :** 1. నలుగురు 2. ఎనిమిది మంది
3. పంద్రెండు మంది 4. పదహారు మంది

**2) ప్రశ్న :** దక్షునికుమార్తె మూర్తి అను నామెకు ధర్ముని వలన నారాయణాంశతో జన్మించినది ఎవరు?

**జవాబు :** 1. నరనారాయణులు 2. పృథువు
3. ఋషభుడు 4. యజ్ఞుడు

**3) ప్రశ్న :** ధర్ముని ఇంట శ్రీహరి అంశతో జన్మించిన నరనారాయణులు, ధర్మ ప్రమోద పరాయణులై ఏ పర్వత ప్రాంతానికి వెళ్ళారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ఈశ్వరునకు దక్షప్రజాపతికి ఏవిధంగా విరోధం సంభవించింది?

**జవాబు :** సతీదేవి దక్షప్రజాపతి కుమార్తె. ఈమె పరమ శివుని భార్య. ఆ సతీదేవి పరమ భక్తితో ప్రతినిత్యమూ తన భర్తయైన ఈశ్వరుని సేవించింది. ఒకనాడు బ్రహ్మవేత్తలందరూ లోక కల్యాణార్థం యజ్ఞం ప్రారంభించారు. ఆ మహాయజ్ఞానికి శివుడు, బ్రహ్మ, దేవతలూ, మునీంద్రులూ, ప్రజాపతులూ మొదలైన వారంతా వచ్చారు. అప్పుడు అక్కడికి సూర్యసమాన తేజస్సుతో దక్షప్రజాపతి వచ్చాడు. ఆ ప్రజాపతిని చూడగానె సభలోని వారంతా గౌరవ పురస్సరంగా లేచి నిలబడ్డారు. బ్రహ్మ, శివుడు మాత్రం లేవలేదు. అప్పుడు దక్షుడు బ్రహ్మదేవునికి నమస్కరించాడు. సభ్యులు భక్తితో తనకు చేసిన పూజలను అందుకొన్నాడు. తనకు తగిన పీఠంపై కూర్చున్నాడు. తనను చూచి సభ్యులందరూ లేచి గౌరవించారు. కాని తన అల్లుడైన శివుడు మాత్రం తన

పెద్దరికం గుర్తించి గద్దెదిగి గౌరవించలేదు. దక్షుడికి తలకొట్టినట్లైంది. అప్పుడాయన అందరూ నా మాటలు వినండి ఈ శివుడు దిక్పాలకుల కీర్తిని నేలపాలు చేశాడు. ఇతడు క్రియాశూన్యుడు. సత్పురుషులు నడిచే మార్గం ఇతని వల్ల చెడిపోయింది. ఇతనికి సిగ్గులేదు. సావిత్రీదేవి వంటి సాధ్వీశిరోమణి అయిన నా కుమార్తెను పెద్దల సమక్షంలో పెండ్లి చేసుకొన్నాడు. అందువలన గొప్పవాడు అయ్యాడు. అది గ్రహించి మర్యాదగా నాకు ఎదురువచ్చి నమస్కరించకపోతే పోనీండి. నన్ను చూచి పలకరించనుకూడా లేదు. ఇతనికి మానాభిమానాలు లేవు. మట్టు మర్యాదలు తెలియవు. ఈతనికి నా కుమార్తెను ఇచ్చి తప్పుచేశాను అని అనేక విధాలుగా శివదూషణం చేశాడు. ఆవిధంగా దక్షునికీ శంకరునకు వైరిభావం కలిగింది.

**5) ప్రశ్న :** శివనిందా వాక్యాలు పలికిన దక్షుడు, పరమేశ్వర వాహనమైన నందీశ్వరుడు, భృగుమహర్షి పరస్పరం శాప, ప్రతిశాపాలను విధించుకొన్నారు. ఈ ప్రక్రియ ఏరకంగా జరిగింది?

**జవాబు :** తనను గౌరవించ లేదని శివుని నానా దుర్భాషలాడిన దక్షుడు, ఇంకా ఆగ్రహించి శివుని శపించటం కోసం శాప జలాలను చేతిలోకి తీసికొని రోషావేశంతో, ఈ శివుడు ఇంద్రుడు, విష్ణువు మొదలగు దేవతలతోపాటు యజ్ఞంలో హవిర్భాగం పొందకుండు గాక! అన్నాడు. దక్షుని నిందా వాక్యాలు విని అక్కడి వారందరూ నీవు చేసినది చెడ్డపని అని అడ్డుకున్నారు. దానితో దక్షుడు ఆగ్రహోదగ్రుడై చెలరేగి ఇంటికి వెళ్ళాడు. అటుపిమ్మట శివ నిందా వాక్యాలను విని సహించలేక నందీశ్వరుడు కోపంతో కన్నులెర్రజేసి ఈ దక్షుడు పరమేశ్వరుణ్ణి నిందించటం, శపించటం చాలా తప్పు. ఈ పాప ఫలంగా దక్షుడు సత్యమైన ఆత్మతత్త్వాన్ని విస్మరించి పశువుతో సమానమౌతాడు. ఈతడు స్త్రీలోలుడై చెడిపోతాడు. అంతేగాక ఈ దక్షుడు తొందరలోనే గొర్రెతల గలవాడౌతాడు గాక! అని శపించాడు. అంతేకాదు శివుని ద్వేషించే ఇందలి బ్రాహ్మణులు, అర్థవాదాలతో మనోమాలిన్యం అంటుకొని అసత్కర్మలపై ఆసక్తి పెంచుకొంటారు. తినతగినివి, తినతగనివి అనే ఆలోచన నశించి అన్నింటినీ

ఆరగిస్తారు. విద్యనూ, తపస్సునూ, వ్రతాలనూ పొట్టకోసమే అవలింభిస్తారు. ధనంమీదా, దేహంమీదా, ఇంద్రియాలమీదా ఆదరాభిమానాలు కలవారై యాచకులై సంచరించుతారు అని నందీశ్వరుడు అచ్చటి బ్రాహ్మణులను శపించాడు. నందీశ్వరుని శాపవాక్కులు విని భృగుమహర్షి తిరిగి ఇలా శపించాడు. ఈ లోకంలో ఎవరు శివదీక్షా పరాయణులో, ఎవరు వారిని అనుసరించే వారో వారంతా శాస్త్రాలకు విరోధులై పాషండులు అగుదురు గాక! శివవ్రతులు భస్మమునూ, జడలనూ, ఎముకలనూ ధరింతురు గాక! మూర్ఖులై శుచిత్వము లేని వారై పాషండులై నశింతురు గాక! ఈ విధంగా నందీశ్వరుడూ, భృగు మహర్షీ ఒకరినొకరు శపించుకొన్నారు. అయినా దైవానుగ్రహం వల్ల వారు నశింపలేదు. అప్పుడు వ్యాకులచిత్తుడై శివుడు అనుచరులతో అక్కడ నుండి వెళ్లిపోయాడు. గంగా, యమునా నదులు సంగమించు ప్రయాగ క్షేత్రంలో ఈ శాపాలకు గురియైన బ్రాహ్మణులంతా దీక్షాస్నానాలుచేసి, యజ్ఞాలు చేసి తమ పాపాలు పోగొట్టుకొని తమ తమ ఆశ్రమాలకు వెళ్ళారు. ఈ విధంగా శాప ప్రతిశాపాల పర్వం సాగింది.

### పదునైదవ అధ్యాయము – చతుర్థ స్కంధము

**జవాబులు :** 1. 4. పదహారు మంది  2. 1. నరనారాయణులు
3. గంధమాధనం

* * *

## పదహారవ అధ్యాయము - చతుర్థ స్కంధము

**1. దక్షుని యజ్ఞవాటికకు దాక్షాయణి వెళ్ళడం 2. శివుడు వీరభద్రునిచే దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేయడం**

**1) ప్రశ్న :** మామయైన దక్షునికీ, అల్లుడైన శివునికీ పరస్పరవైరం నానాటికీ పెరుగుతూ వుంది. ఆ క్రమంలో దక్షుడు నిరీశ్వరయాగం చేశాడు. ఆ యజ్ఞం పేరేమి?

**జవాబు :** 1. సత్రయాగం 2. వాజపేయము
3. అశ్వమేథయాగం 4. సుదర్శనయాగం

**2) ప్రశ్న :** దక్షుని కుమార్తె సతీదేవి శంకరుని మెప్పించి వివాహమాడింది. శంకరుడు సతీదేవిని సంతోషపెట్టేందుకు ఏ పేరుతో పిలిచేవాడు?

**జవాబు :** 1. పార్వతి 2. సతీదేవి
3. దాక్షాయణి 4. దుర్గా

**3) ప్రశ్న :** పుట్టింట జరిగే శుభకార్యానికి తనకు పిలుపు లేకపోయినా, శంకరుడు వద్దని వారిస్తున్నా, సతీదేవి పుట్టినింటికి వెళ్ళింది. ఆమె ఏ వాహనంపై వెళ్ళింది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** సతీదేవి తన తండ్రి చేస్తున్న యజ్ఞాన్ని ఏవిధంగా సందర్శించింది? అక్కడ ఆమెకు ఏరకంగా అవమానం జరిగింది? అందుకు సతీదేవి ప్రతిక్రియగా ఏమి చేసింది?

**జవాబు :** పుట్టినింట జరిగే శుభకార్యానికి పిలుపులతో పనిలేదని తన వారందరినీ చూడాలన్న కుతూహలంతో తనస్వామి వారిస్తున్నా వినకుండా వెళ్ళి, అక్కడ తమ ముందు జరుగుతున్న యజ్ఞాలను చూసింది. అక్కడ వేదఘోషలు మిన్నుముట్టుతున్నాయి. ఒకచోట యజ్ఞపశువును బంధించారు. మునులూ, దేవతలూ తమతమ స్థానాలలో కూర్చుని ఉన్నారు. హోమాలు చేస్తున్నారు. యజ్ఞం వైభవోపేతంగా జంగుతున్నది. సతీదేవి, ప్రమథగణాలు

యజ్ఞశాలలో అడుగుపెట్టారు. అమ్మవారిని చూడగానే ఆమె తల్లి, తోబుట్టువులూ అనురాగంతో ఆదరించారు. సభలో ఉన్న తక్కినవారు దక్షునికి భయపడి ఆమెను గౌరవించకుండా ఊరకున్నారు. తండ్రి తనవైపు తలెత్తి చూడకుండా అవమానించడంవల్ల తల్లి, తోబుట్టువులు చేసిన గౌరవాన్ని సతీదేవి అందుకోలేదు. వారి మాటలకు బదులు చెప్పలేదు. తండ్రి తన భర్తను యజ్ఞానికి ఆహ్వానించకుండా అవమానించాడనీ, శివునికి భాగం కల్పించకుండా యజ్ఞం జరిపిస్తున్నాడని సతీదేవి గ్రహించింది. తన కోపాగ్ని జ్వాలలతో లోకాలన్ని భస్మం చేయాలన్నంత ఉద్రేకాన్ని పొందింది. అప్పుడు ప్రమథగణాలు దక్షుని సంహరిస్తామని ముందుకు వచ్చాయి. సతీదేవి వారిని వారించింది. తండ్రివైపు చూచి ఇలా అన్నది. పరమేశ్వరుడు లోకంలోని ప్రాణులందరికి ఇష్టమైనవాడు. సకల విశ్వానికి కారణం ఈశ్వరుడే. అలాంటి దేవదేవుని నీవు తప్ప లోకంలో ఇంకెవ్వరూ ద్వేషించరు. సర్వమంగళ స్వరూపుడు పరమేశ్వరుడు లేకుండా నిరీశ్వర యాగం చేస్తున్నావు. దీని ఫలితం ఊరకేపోదు. ధర్మరక్షణ దీక్షాపరుడైన హరుని అవమానించే పాపాత్ముని నాలుక పరపర కోసివేయాలి. అలా చేయటానికి శక్తి చాలనప్పుడు శివనిందను చూడటంకంటే, వినటంకంటే చావటమే మేలు. అందువల్ల దుష్టబుద్ధితో ఈశ్వరుని నిందించిన, అవమానించిన నీ కుమార్తెను అనిపించుకొనటం కంటె నాకు మరణమే మేలు. నీ వల్ల ప్రాప్తించిన ఈ శరీరాన్ని పరిత్యజించి పవిత్రురాలను అవుతాను అని ఏకాగ్రతతో పరమశివుని ధ్యానించి, యోగాగ్నిలో తన దేహాన్ని భస్మం చేసికొన్నది. అది చూచి అక్కడి మునులూ, దేవతలూ హాహాకారాలు చేశారు. ఈ విధంగా సతీదేవి దేహత్యాగాన్ని గురించిన విషయాన్ని ఈశ్వరుడు నారదుని వల్ల విన్నాడు.

**5) ప్రశ్న :** సతీదేవి దేహత్యాగం చేయటాన్ని నారదుని ద్వారా విన్న పరమేశ్వరుడు ఎవరిని ప్రయోగించి, ఏవిధంగా దక్షయజ్ఞం ధ్వసం చేయించాడు?

**జవాబు :** పరమేశ్వరుని సతియైన ఈ సతీదేవి దేహత్యాగం చేయటం చూచిన అక్కడి దేవతలు, ఋషులు దక్షుని శాపనార్థాలు పెట్టారు. అప్పుడు సతీదేవి వెంట వచ్చిన ప్రమథ గణాలు యజ్ఞ విధ్వంసనానికి పూనుకోగా, యజ్ఞ

అధ్వర్యుడు భృగుమహర్షి ఆగ్రహోదగ్రుడై ప్రమథగణాలను అడ్డుకోవటానికి అభిచార హోమంచేసి వెంటనే యజ్ఞ రక్షణకోసం 'ఋభువులు' అనే దేవతలను సృజించాడు. వారు ప్రమథగణాలను పారదోలారు. దక్షుని యజ్ఞవాటికలో జరిగినదంతా నారదమహర్షివల్ల విన్న శంకరుడు ఆగ్రహోదగ్రుడై, గర్జించి భయంకరంగా నవ్వి, మహాకోపంతో తన జటాజూటం నుండి ఒక జటను పెరికి భూమిమీద విసరికొట్టాడు. ఆ జటనుండి సకల లోకాలకు భయం కలిగిస్తూ, రెండవ రుద్రుని వలె వీరభద్రుడు ఉదయించాడు. భయంకరాకారుడైన ఆ వీరభద్రుడు ఈశ్వరుని ముంగిట చేతులు జోడించి స్వామీ ఏమి ఆనతి అన్నాడు. అప్పుడు ఈశ్వరుడు వీరభద్రా! నిరీశ్వర యాగంచేసి, సతీదేవి దేహత్యాగానికి కారణభూతుడైన దక్షుని సంహరించు అని ఆజ్ఞాపించాడు. వీరభద్రుడు చిత్తం అలాగే చేస్తాను అని పరమశివుని వద్ద సెలవు తీసికొని అతివేగంగా ప్రయాణించి దక్షుని యజ్ఞవేదికను చేరాడు. అక్కడ ఉన్న ప్రమథగణాలు వీరభద్రుని చూచి ఉత్సాహంతో యజ్ఞ విధ్వంసనానికి పూనుకొన్నారు. పిమ్మట మణిమంతుడు భృగువునూ, వీరభద్రుడు దక్షుణ్ణీ, చండీశ్వరుడు పూషుణ్ణీ, నందీశ్వరుడు భగుణ్ణీ పట్టుకొన్నారు. నందీశ్వరుడు భగుడి కళ్ళుపీకాడు. చండీశ్వరుడు పూషుడి పండ్లురాలగొట్టాడు. భృగుని గడ్డమూ మీసమూ పెరికివేశారు. వీరభద్రుడు దక్షుని ఎన్నిసార్లు కత్తితో పొడిచినా చావలేదు. చివరకు అతడి శిరస్సును మెలిత్రిప్పి తునిమి మహాకోపంతో భగభగ మండే దక్షిణాగ్ని కుండంలో పడవేసి భస్మంచేశాడు. ఆ వీర విజృంభణానికి వీరభద్రుని అనుచరులు ఆనందించారు. ఈ విధంగా దక్షుని సంహరించి వీరభద్రుడు తన నివాసమైన కైలాసం చేరాడు.

### పదహారవ అధ్యాయము - చతుర్థ స్కంధము

**జవాబులు :** 1. 2. వాజపేయము 2. 3. దాక్షాయణి
3. వృషభవాహనం

* * *

## పదిహేడవ అధ్యాయము - చతుర్థ స్కంధము

### 1. దేవతలు బ్రహ్మను శరణువేడడం 2. బ్రహ్మాదులు దక్షిణామూర్తి రూపుడగు ఈశ్వరుని స్తుతించడం

**1) ప్రశ్న :** వీరభద్రాదులచే పరాభూతులైన దేవతలు భయంతో బ్రహ్మదేవుని ఆశ్రయించారు. ఆయన ఆ దేవతలు చెప్పిందంతా విని, వారిని మందలించి, దేవతలను వెంటబెట్టుకొని పరమశివుని దర్శనానికై కైలాసానికి వెళ్ళాడు. ఆ కైలాసంలో ప్రవహిస్తున్న నది పేరేమి?

**జవాబు :** 1. గోదావరి 2. వైతరణి
3. గంగానది 4. సరస్వతీనది

**2) ప్రశ్న :** బ్రహ్మేంద్రాది దేవతలు కైలాస పర్వతం చేరారు. అక్కడ కుబేర నివాసమైన అలకాపురి సమీపంలో ప్రవహిస్తున్న నదులను దాటి ముందుకు వెళ్ళి, సౌగంధికావన సమీపంలో దేవతలు ఒక మర్రిచెట్టు నీడన బ్రహ్మేంద్రులు ఎవరిని దర్శించారు?

**జవాబు :** 1. కుబేరుని 2. పరమశివుని
3. మహావిష్ణువును 4. భృగుమహర్షిని

**3) ప్రశ్న :** కైలాసపర్వత ప్రాంతంలో సౌగంధికావనంలో శివుని బ్రహ్మేంద్రాది దేవతలు దర్శించి స్తుతించారు. ఓ దేవా! దక్షుని క్షమించి అతనిని బ్రతికించుమని దేవతలు ప్రార్థించగా ఈశ్వరుడు ప్రసన్నుడై దక్షునికి ఏ శిరస్సును అనుగ్రహించాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** బ్రహ్మ, ఇంద్రాది దేవతలు దక్షిణామూర్తి రూపంలో ఉన్న పరమేశ్వరుని దర్శించ వచ్చారు. అప్పుడు ఈశ్వరుడు ఏవిధంగా ఉన్నాడు? వచ్చిన దేవతలను ఏరీతిగా పరామర్శించాడు?

**జవాబు :** సౌగంధికావనంలో సనందాది సిద్ధులు సేవిస్తున్న శివుని బ్రహ్మేంద్రాది దేవతలు దర్శించారు. ఆ సమయంలో ఆయన మహనీయమైన ధ్యానముద్ర ధరించి బ్రహ్మానందంతో నిండిన మనస్సు కలవాడై సమాధి నిష్ఠలో ఉన్నాడు. కరుణాసముద్రుడైన రుద్రుని దేవతలు దర్శించారు. పరమ భక్తితో లోకపాలకులూ, దిక్పాలకులూ, బ్రహ్మ, ఇంద్రుడూ, మహర్షులూ ఆ పరమేశ్వరుని పాదాలకు నమస్కరించారు. అప్పుడు శివుడు అవతార పురుషుడైన వామనుడు కశ్యప ప్రజాపతికి నమస్కరించినట్లు మిక్కిలి ప్రీతితో ధాతకు ప్రణామం చేశాడు. అప్పుడు రుద్రుని అనుచరులైన సిద్ధగణాలూ, మహర్షులూ బ్రహ్మకు మ్రొక్కారు. అనంతరం శివుని చూచి విరించి చిరునవ్వుతో ఓ మహేశ్వరా! లోకాలన్నింటికీ ఉత్పత్తి స్థానంనీవే. జగత్తులకన్నిటికీ భీజమైన శివుడవు నీవే. నీవు నిర్వికార పరబ్రహ్మవు అని బ్రహ్మేంద్రాది దేవతలు పరమశివుని ఎన్నో విధాలుగా స్తుతించారు. అప్పుడు పరమేశ్వరుడు చిరునవ్వు మొగంతో కనికరంతో చూచి, వారిని తగిన విధంగా పరామర్శించి ఆదరించాడు.

**5) ప్రశ్న :** కైలాసంలోని సౌగంధికా వనంలో పరమశివుడు ప్రమథగణాలతో పరివేష్టించి ఉండగా దర్శించవచ్చిన బ్రహ్మేంద్రాది దేవతలు ఏ విధంగా స్తుతించారు?

**జవాబు :** బ్రహ్మ, ఇంద్రాది దేవతలు కైలాసగిరులలో పరమేశ్వరుని దర్శించి, పరమ భక్తితో శివుని పాదాలకు నమస్కరించారు. అప్పుడు శివుడు వారందరిని సమాదరించి గౌరవించాడు. అంత బ్రహ్మ చిరునవ్వుతో మహేశ్వరా! లోకాల కన్నింటికీ ఉత్పత్తిస్థానం అయిన శక్తివి నీవే. నీవు నిర్వికార పరబ్రహ్మవు. ఓ పన్నగరాజభూషణా! లోకాలలో వర్ణాశ్రమ ధర్మాలను వేదాలు నిర్ణయిస్తాయి. గొప్పవారు వేదాలను గౌరవిస్తారు. అట్టి వేదాలు నిన్ను కీర్తిస్తాయి. నీవు నీ మహిమచేత శుభకర్మలు చేసేవారికి ముక్తినీ, అశుభకర్మలు చేసే వారికి నరకాన్నీ కలిగిస్తావు. నీపాద పద్మాలపై మనసునిల్పి సమస్త ప్రాణులలోనూ నిన్ను చూస్తూ ఇతర ప్రాణులను తనకంటే వేరుగా ఉండకుండా మహాత్ములు

ప్రవర్తిస్తారు. సర్వకాలాలలోను హరిమహిమ అనుల్లంఘనీయమైనది. విష్ణుమాయకు చిక్కినవారు భేదదృష్టితో ప్రవర్తిస్తారు. నీవు విష్ణు మాయకు అతీతుడవు. అందుచేత నీవు సర్వజ్ఞుడవు. విష్ణుమాయకు వశులై కర్మలు ఆచరించేవారు అపరాధం చేసినట్లైతే నీవు వారిని క్షమించి కాపాడాలి. నిరీశ్వరయాగ ఫలితంగా సతీదేవి యోగాగ్నిలో భస్మమైపోయింది. నీవు దక్షుని యజ్ఞాన్ని ధ్వంసంచేశావు. అది అసంపూర్ణంగా మధ్యలో ఆగిపోయింది. అటువంటి దక్షయజ్ఞాన్ని నీవు పునరుద్ధరించు, దక్షుని బ్రతికించు. అవయవాలు తుత్తినియలైన దేవతలకూ, ఋత్విక్కులకూ ఆరోగ్యం అనుగ్రహించు. మిగిలిన యజ్ఞకార్యం సమస్తమూ పూర్తిగావించి ఈ యాగాన్ని నీ భాగంగా స్వీకరించుమని, మమ్ములను కరుణించమని బ్రహ్మ, ఇంద్రాది దేవతలూ, మహర్షులూ అందరూ ఆ పరమశివుని కీర్తించి వేడుకొన్నారు.

### పదిహేడవ అధ్యాయము - చతుర్థ స్కంధము

**జవాబులు :** 1. 3. గంగానది 2. 2. పరమశివుని
3. గొర్రెతల

* * *

## పద్దెనిమిదవ అధ్యాయము – చతుర్థ స్కంధము

**1. ఈశ్వరుడు దక్షాదులను అనుగ్రహించడం 2. దక్షాదులు విష్ణువును స్తుతించడం**

**1) ప్రశ్న :** బ్రహ్మాదుల విన్నపం మేరకు శివుడు యజ్ఞం జరిగిన ప్రదేశానికి వచ్చాడు. దక్షుడు శంకరానుగ్రహం మేరకు గొర్రెతలవాడై, ఆగిపోయిన యజ్ఞాన్ని ప్రారంభించాడు. అప్పుడు ఏ దేవుడు దక్షుని అనుగ్రహించడానికై సాక్షాత్కరించాడు?

**జవాబు :** 1. పరమశివుడు 2. వరుణుడు
3. బ్రహ్మదేవుడు 4. మహావిష్ణువు

**2) ప్రశ్న :** దక్షపుత్రికయైన సతీదేవి యోగాగ్నిలో భస్మంకావడంచేత పునరుజ్జీవితనుగా చేయలేకపోయారు. అటు పిమ్మట సతీదేవి మేనకా, హిమవంతులకు పుత్రికగా జన్మించింది. ఈ జన్మలో ఆ సతీదేవి ఏ పేరుతో లోక విఖ్యాతమైంది?

**జవాబు :** 1. దుర్గ 2. భద్రకాళి
3. పార్వతి 4. ఛండిక

**3) ప్రశ్న :** బ్రహ్మాది దేవతలు స్తుతించటం చేత పరమశివుడు శాంతించి, వారు కోల్పోయిన అవయవాలను అనుగ్రహించే క్రమంలో భృగువుకు గడ్డాలూ, మీసాలు ఏవిధంగా అని ఆనతిచ్చాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** పునరుజ్జీవితుడైన దక్షుడు ఏ విధంగా ఈశ్వరుని ప్రస్తుతించి, యజ్ఞాన్ని పునః ప్రారంభించి నిర్విఘ్నంగా కొనసాగించాడు?

**జవాబు :** గొర్రెతలతో బ్రతికించబడిన దక్షుడు ఎదుట ఉన్న పాలాక్షుని చూసి అతికష్టం మీద దుఃఖాన్ని దిగమ్రింగుకొని ప్రేమాతిరేకంతో ఒడలుమరచి భగవంతుడైన పరమశివునితో దేవా! మహాదేవా! రుద్రా! హరా! పురహరా! నేను నీపట్ల అపరాధం చేశాను. కాబట్టి నన్ను శిక్షించావు. దీనిని నేను

శిక్షించటంగా భావించటం లేదు. నన్ను రక్షించటమే అని భావిస్తాను. నేను తత్త్వజ్ఞానం తెలియని మూర్ఖుడను. మహాసభలో నేను పలికిన చెడ్డపలుకులు నిన్ను గాయపరిచాయి. అయినా నేను చేసిన నేరాన్ని నీవు మనస్సులో పెట్టుకోకుండా నన్ను రక్షించావు. నీకు తిరిగి ఉపకారం చేయటానికి నేనెంతవాణ్ణి? ఓ సచ్చరిత్రా! త్రినేత్రా! ఇతరులను అనుగ్రహించే కార్యాలమూలంగా కలిగే ఆనందాన్ని నీవు పొందుదువు గాక! అని దక్షుడు పరమేశ్వరుని క్షమించమని వేడుకొన్నాడు. అటుపిమ్మట బ్రహ్మదేవుడు ఆజ్ఞాపించగా యజ్ఞాన్ని పునఃప్రారంభించి, నిర్విఘ్నంగా పూర్తి కావటానికి అధ్వర్యుకార్యాన్ని భృగువు నిర్వహించి, నిర్మలమైన మనస్సుతో దక్షుడు ప్రార్థించగా నారాయణుడు సాక్షాత్కరించాడు. ఆ దేవదేవుని అక్కడి వారందరూ స్తుతించారు. అనంతరం దక్షుడు అంగప్రధానకాలైన యాగాలనుచేశాడు. దేవతలనూ, మహాదేవుణ్ణి శ్రద్ధాభక్తులతో పూజించాడు. వారి వారి భాగాలను వారికి సమర్పించాడు. తరువాత తాను ఋత్విక్కులతో, సోమపానం చేసిన వారితో కలిసి అవభృథ స్నానంచేశాడు. యజ్ఞఫలాన్ని సమగ్రంగా పొందాడు. ఆ ప్రదేశంలో ఉన్న దేవతాగణమంతా దక్షుని, ధర్మ బుద్ధికలిగి సుఖంగా జీవింతువుగాక యని దీవించారు.

**5) ప్రశ్న :** శ్రీమన్నారాయణుని దక్షాదులు ఏవిధంగా కీర్తించారు? మహావిష్ణువు దక్షుని ఏరీతిగా అనుగ్రహించాడు?

**జవాబు :** ఈశ్వరానుమతితో ప్రారంభమైన యజ్ఞ సమయంలో నిర్మలమైన మనస్సుతో దక్షుడు ప్రార్థించగా శ్రీమన్నారాయణుడు గరుడ వాహనారూఢుడై వేంచేశాడు. నీలమేఘ కాంతితో సాక్షాత్కరించిన విష్ణుమూర్తిని వీక్షించి శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలు నమో నారాయణాయ అని కీర్తించారు. వారందరినీ ఆ కమలాక్షుడు కరుణారస దృష్టితో చూశాడు. భక్తుల పూజలు పరిగ్రహించేవాడూ, బ్రహ్మాదులకు జనకుడూ, నంద, సునందాది భక్తులచేత సేవింపబడే వాడూ, యజ్ఞేశ్వరుడూ అయిన భగవంతుణ్ణి రక్షకుడిగా భావించి దక్షుడు ఇలా స్తుతించాడు. దేవా! నీవు మాయాతీతుడవై లీలామానుష

రూపాలను ధరించి అనేక అవతారాలతో దర్శనమిస్తావు. ఈ లోకానికి నీవే ప్రభుడవనీ, తక్కిన బ్రహ్మ, రుద్రాదులు నీ మాయా వైభవమూర్తులనీఅందువల్ల వారు లోకాలకు ప్రభువులు కారని భేదదృష్టితో ఉన్న నన్నుమన్నించు. ఈ విశ్వానికి హేతువులైన శివుడూ, బ్రహ్మదేవుడూ, దిక్పాలకులూ, సకల చరాచర జీవకోటీ అన్నీనీవే. నీకంటే వేరయినది ఈ విశ్వంలో లేదు అని మనస్ఫూర్తిగా మహావిష్ణువును దక్షుడు కీర్తించాడు. అటువిమ్మట అక్కడ ఉన్న బ్రహ్మ, రుద్ర, ఇంద్రాది దేవతలు, ఋషులు, ఇతర ప్రముఖులందరూ స్వామిని ఎవరికి తగిన రీతిలో వారు కీర్తించారు. అప్పుడు విష్ణుమూర్తి ప్రసన్నుడై శివుడు ధ్వంసంచేసిన దక్షయజ్ఞాన్ని ఏ కొరతా లేకుండా చక్కగా పూర్తి చేయించాడు. సర్వాంతర్యామియైన పరమాత్మ ఆ యజ్ఞ హవిస్సును తాను స్వీకరించి 'త్రికపాల పురోడాశం' అనే మంత్రంతో తృప్తిచెంది, దక్షునితో ఓ పుణ్యాత్ముడా! నేనూ, బ్రహ్మ, శివుడూ ముప్వురం ఈ లోకాలకు హేతు భూతులం. నేను త్రిగుణాత్మకమైన నా మాయను వర్తింపజేసి సృష్టి, స్థితి, లయకార్యాలను నిర్వహిస్తూ ఆయా పనులకు తగిన బ్రహ్మరుద్రాది నామాలను పొందుతుంటాను. నాకంటే వేరగు పరబ్రహ్మ స్వరూపం లేదు. హరి, హర, బ్రహ్మలమైన మా ముగ్గురనూ వేరుగా చూడనివాడు ధన్యుడు అని చెప్పి దక్షుణ్ణి చూసి ధర్మబుద్ధికలిగి సుఖంగా జీవింతువు గాక! అని శివ, కేశవ, బ్రహ్మలేకాక ఇతర దేవతలూ, ఋషులూ దీవించి ఎవరిలోకాలకు వారు వెళ్ళారు.

### పద్దెనిమిదవ అధ్యాయము - చతుర్థ స్కంధము

**జవాబులు :** 1. 4. మహావిష్ణువు 2. 3. పార్వతి

3. చింబోతు గడ్డాలు - మీసాలు

* * *

# పందొమ్మిదవ అధ్యాయము - చతుర్థ స్కంధము

## 1. ధృవోపాఖ్యానము 2. ధృవుడు నారద ఉపదేశంతో తపస్సు చేయడం

**1) ప్రశ్న :** బ్రహ్మదేవుని మానస పుత్రుడుగా స్వాయంభువ మనువు ఎవరి అంశ వలన జన్మించాడు?

**జవాబు :** 1. ఈశ్వరాంశ 2. నారాయణాంశ 3. యమాంశ 4. దేవేంద్రాంశ

**2) ప్రశ్న :** తన పినతల్లి కుమారుడు ఎక్కిన తండ్రి తొడపై తాను కూడా ఎక్కాలని ఉబలాట పడ్డ ధ్రువుని, ఆయన పినతల్లి సురుచి, నీవు నీ తండ్రి తొడపై ఎక్కాలంటే నా కడుపున పుట్టాలి. అందుకు ఏ దేవుని వేడుకోమని చెప్పింది?

**జవాబు :** 1. మహావిష్ణువు 2. ఈశ్వరుడు 3. బ్రహ్మదేవుడు 4. దేవేంద్రుడు

**3) ప్రశ్న :** ధ్రువుడు కృతనిశ్చయుడై నారాయణుని సేవించాలని వెళుతూండగా, ఆయనకు 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అనే వాసుదేవ మంత్రాన్ని ఉపదేశించిన మహర్షి ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ధ్రువుడు ఎవరి ఉపదేశంతో ఏ రీతిగా భగవంతుని గురించి తపస్సుకు పూనిక వహించాడు?

**జవాబు :** పసివాడైన ధ్రువుడు పినతల్లి ఆడిన మాటలను తండ్రి నిర్లక్ష్యాన్ని తలచుకొని ఏడుస్తున్న కొడుకును ఊరడించి తల్లి నాయనా! ఏడవకు, పూర్వజన్మ పుణ్య పాప ఫలంగా సంక్రమించిన ఈ దురవస్థనుబాపే నారాయణుని శరణువేడు అని చెప్పింది. ధ్రువుడు దృఢ సంకల్పంతో ఇల్లు వెడలి నడిచాడు. ధ్రువుడు పసివాడైనా సామాన్యుడు కాడు. స్వాయంభువ మనువు యొక్క మనుమడు. విషయం తెలిసికొన్న బ్రహ్మర్షి నారదుడు ధ్రువుడు

వెళుతున్న తోవకు అడ్డువచ్చి, నాయనా! ధ్రువకుమారా! ఈ పసి వయసులో సకలసంపదలు కలిగిన గృహాన్ని విడిచి ఎక్కడికి వెళుతున్నావు? అని పలికిన బ్రహ్మర్షితో ధ్రువుడు మహాత్మా! సవతి తల్లి పలికిన ములుకుల వంటి పలుకులవల్ల నామనస్సు గాయపడింది. ఆ గాయాన్ని మాన్పసమర్థుడు నారాయణుడేనని తల్లిచెప్పింది. ఆయనను ధ్యానించి, ఆశ్రయించాలని వెళ్తున్నాను అని పలికిన ధ్రువునితో నారదమహర్షి కలుషమెరుగని చిట్టి తండ్రీ! యోగీంద్రులు పెక్కు జన్మలలో నిస్సంగులై తీవ్రమైన సమాధియోగాన్ని అభ్యసించినా, ఆ దేవదేవుని స్వరూపాన్ని తెలుసుకోలేకుండా ఉన్నారు. హరిని ఆరాధించటం చాలాకష్టం. కాబట్టి వ్యర్థమైన ఈ ప్రయత్నాన్ని మాని ఇంటికివెళ్ళి దైవవశాన నీకు సంక్రమించిన సుఖ, దుఃఖాలను అనుభవించి వార్ధక్యంలో వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించి భగవధ్యానంతో శేషజీవితాన్ని గడపడటం ఉత్తమమైనపని అని పలికిన నారదమహర్షితో ధ్రువుడు స్వామీ! మూడు లోకాలలోనూ శ్రేష్ఠమైనది, ఇతరులెవ్వరూ పొందనిదీ అయిన స్థానాన్ని నేనుపొందాలని ఆశపడుతున్నాను. నాయందు దయయుంచి నాకు చక్కని ఉపాయాన్ని ఉపదేశించు అని దృఢసంకల్పంతోనూ, వారింప శక్యంగాని నిర్ణయంతోనూ పలికిన ధ్రువునిజూసి మహర్షి ఆశ్చర్యపడి, సరే కుమారా! నీవు నిర్మల హృదయుడవు. నిన్ను ఈ విధంగా ప్రేరేపించినవాడు ఆ శ్రీమన్నారాయణుడే. సందేహం లేదు. కాబట్టి నీవు యమునా నది ఒడ్డున ఉన్న మధువనానికి వెళ్ళు. ఆ ప్రదేశం శ్రీహరి నివాసస్థానం. అక్కడ ఆ నదీజలాలలో స్నానంచేసి వచ్చి ఒక నిర్మలప్రదేశంలో స్థిరచిత్తంతో ఆ పరాత్పరుని అచంచలమైన మనస్సుతో ధ్యానించు. ఆ దివ్య మంగళరూపం మనస్సులో సాక్షాత్కరిస్తుంది. ఆ రూపాన్నే వదలక 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అనే వాసుదేవ మంత్రాన్ని జపించమని ధ్రువునకు ఉపదేశించగా, ధ్రువుడు మహర్షికి ప్రదక్షిణ పూర్వక నమస్కారంచేసి మధువనానికి బయలుదేరాడు.

**5) ప్రశ్న :** నారదమహర్షి ఉపదేశానుసారం ధ్రువుడు ఏరీతిగా తప మాచరించాడు?

**జవాబు :** నారదమహర్షి ద్వారా వాసుదేవ మంత్రాన్ని ఉపదేశం పొందిన ధ్రువుడు మధువనానికి వెళ్ళాడు. ఆ మధువనం మునులు, దేవతలు, యోగులకు నిలయమైనది. అక్కడ యమునా నదిలో స్నానం చేసిన ధ్రువుడు ఏకాగ్రచిత్తంతో భగవంతుని వాసుదేవమంత్రంతో ధ్యానింపసాగాడు. శరీరస్థితిని బట్టి వెలగపండ్లనూ, రేగుపండ్లనూ ఆహారంగా తీసికొంటూ, యమునానదిలో నీటిని త్రాగుతూ, జీర్ణతృణ పర్ణాలను తింటూ రెండు నెలలు గడిపాడు. తరువాత తొమ్మిది రోజుల కొకసారి నీటిని త్రాగుతూ, ప్రాణాయామాన్ని ఆచరిస్తూ గాలిని నియంత్రించి, ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నిరోధించి తరువాతి రెండు నెలలు గడిపాడు. నాలుగు నెలలకాలం గడిచి ఐదవనెల ఒంటికాలిపై నిలిచి పరమాత్ముని భజిస్తూ ప్రాణంలేని మోడువలె గడిపాడు. శ్రీహరి రూపాన్ని తప్ప మరి దేనినీ మనస్సులో స్మరించకుండా ఏకాగ్రచిత్తంతో ధ్రువుడు తీవ్రమైన తపస్సు సాగించాడు. ఒంటికాలిపై నిలిచి చేస్తున్న తపోతీవ్రతకు అఖిలలోకాలు ప్రకంపించాయి. ధ్రువుడు ప్రాణవాయువును నిరోధించి పరమేశ్వరునితో అనుసంధానం చేశాడు. లోకాలకు సంభవించిన ఆ మహావిపద్దశను ఆలోకించి ఆ పుండరీకాక్షుడు ధ్రువుని అనుగ్రహింప నెంచేవిధంగా తపోతీవ్రత కొనసాగింది.

**పందొమ్మిదవ అధ్యాయము – చతుర్థ స్కంధము**

**జవాబులు :** 1. 2. నారాయణాంశ   2. 1. మహావిష్ణువు
3. నారదుడు

* * *

## ఇరవైయవ అధ్యాయము - చతుర్థ స్కంధము

**1. ధృవునికి భగవంతుడు ప్రసన్నుడు కావడం 2. ధృవుడు మరలా తన నగరానికి రావడం**

**1) ప్రశ్న :** ధ్రువుని తపోతీవ్రతకు మెచ్చి భగవానుడు, ఆ బాలుని అనుగ్రహింప నెంచి మధువనానికి ఏ వాహనంపై వేంచాశాడు?

**జవాబు :** 1. శేషవాహనం 2. ఐరావతవాహనం 3. గరుడవాహనం 4. అశ్వవాహనం

**2) ప్రశ్న :** ధ్రువుడు తనముందు సాక్షాత్కరించిన పరమాత్మను తిలకించి, స్తుతి విధానం తెలియక తడబడ్డాడు. అప్పుడు నారాయణుడు గ్రహించి, ఆ బాలుని చెక్కిలిని ఏ రీతిగా స్పృశించాడు?

**జవాబు :** 1. పాదంతో 2. చేతితో 3. చేతనున్న సుదర్శనంతో 4. చేతనున్న పాంచజన్య శంఖంతో

**3) ప్రశ్న :** దయామయుడైన దేవదేవుని వలన కోరిన వరాలు పొంది తన రాజ్యానికి వస్తున్నాడని విని ధ్రువుని తండ్రి ఉత్తానపాదుడు పరమానంద భరితుడై, బంగారు రథమెక్కి బంధు మిత్రులతో కూడి, మంగళ వాయిద్యాలతో ధ్రువునికి ఎదురు వెళ్ళాడు. కాగా ధ్రువుడు రాజ్యానికి వస్తున్నాడని ఉత్తానపాదుడు ఎవరి వలన విన్నాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ధ్రువుని తపస్సుపండి శ్రీహరి ప్రసన్నుడు కావటాన్ని తెలుపుతూ మరియు ఆ మహావిష్ణువు ధ్రువుని ఏవిధంగా అనుగ్రహించాడు? తెలపండి.

**జవాబు :** ధ్రువుని తపోతీవ్రతకు, దేవతల విన్నపం మేరకు విశ్వేశ్వరుడైన శ్రీ మహావిష్ణువు తన భక్తుని అనుగ్రహింపనెంచి వైకుంఠం నుండి గరుడ వాహనారూఢుడై మధువనానికి వేంచేశాడు. తన ముందు సాక్షాత్కరించిన కరుణామూర్తిని దర్శించి ధ్రువుడు పులకించి పోయాడు. దోసిలి ఒగ్గి స్వామిని

స్తుతించటానికి పూనుకొన్నాడు. కాని ఆ స్తుతివిధానం అతనికి తెలియక తడబడ్డాడు. భగవంతుడు అది గ్రహించి తన చేతనున్న పాంచజన్య శంఖంతో ధ్రువుని స్పృశించాడు. ఆ ప్రభావం వల్ల ధ్రువుడు వేదవాక్కులతో ఆ పరబ్రహ్మాన్ని స్తుతించాడు. తన భక్తులపై అత్యంత ప్రేమగల భగవంతుడు ధ్రువుని మనసులో తన పినతల్లి, పరుషవాక్కులకు సంబంధించినది, మరియు మూడులోకాలలోనూ శ్రేష్ఠమైనదీ, ఇతరులెవ్వరూ, పొందలేనిది అగు శాశ్వతస్థానాన్ని పొందాలనే కోరికను కనుగొన్నాడు. అప్పుడా నారాయణుడు ఓ రాకుమారా! నీ వ్రతదీక్ష అచంచలమైనది. నీకోరిక దుర్లభమైనది. అయినప్పటికీ తీరుస్తాను. గ్రహాలూ, నక్షత్రాలూ, జ్యోతిశ్చక్రమూ, సప్తర్షి మండలమూ, తారకలతో కూడి దేనికి ప్రదక్షిణం చేస్తూ ఉంటాయో ఆ 'క్షితి' అనే మహోన్నత స్థానాన్ని ఈ జన్మాంతరంలో నీవు పొందుతావు. అప్పటి నుండి ఆ క్షితి 'ధ్రువక్షితి'గా శాశ్వత స్థానమై నీవు వర్ధిల్లగలవు. అది ఎవ్వరికీ అందరానిది. ఇదివరకెన్నడూ ఎవ్వరూ పొందనిది. అన్నిలోకాలు నశించినా అది నశింపక శాశ్వతంగా ప్రకాశిస్తూంటుంది. అటువంటి స్థానాన్ని నీవు అలంకరిస్తావు. ఇప్పుడు నీవు నీ రాజ్యానికి వెళ్ళి నీ వారందరినీ సంతోషింపజేయి. అనంతరం నీ తండ్రి రాజ్యాన్ని నీవు సర్వ జనరంజకంగా ధర్మమార్గాన పరిపాలిస్తావు. ఇంద్రియాలను జయిస్తావు. నీ తండ్రి వానప్రస్థాశ్రమాన్ని స్వీకరిస్తాడు. నీ తమ్ముడైన ఉత్తముడు వేటకై వెళ్ళి మరణిస్తాడు. నీ పినతల్లి, కొడుకును వెదుకుటకై వెళ్ళి అడవిలో కార్చిచ్చులోపడి చిక్కుకొని మరణిస్తుంది. నీ జీవిత కాలమంతా యజ్ఞయాగాలతో నన్నే ఆరాధిస్తూ, మరణకాలంలో నన్ను మనస్సులో స్మరిస్తూ, సకలలోకాలకూ వందనీయమై, పునరావృత్తి రహితమై సప్తర్షి మండలానికి పైన ఉండే నా స్థానాన్ని పొందుతావు అని ధ్రువుని మనస్సులో ఉన్న కోరికలను ప్రసాదించి, అతడు చూస్తూండగానే గరుత్మంతుణ్ణి అధిరోహించి ఆనందంగా వైకుంఠానికి వేంచేశాడు.

**5) ప్రశ్న :** భగవంతుని చేత కోరిన వరాలను పొందిన ధ్రువుడు తపస్సు చాలించి తిరిగి తన నగరానికి వచ్చి, ఏవిధంగా తన వారందరినీ సంతోషింపజేసి, తాను ఏఏ భోగాలను పొందాడు?

**జవాబు :** వైకుంఠవాసి, జగత్స్వరూపుడూ, దయామయుడూ, పుండరీకాక్షుడూ అయిన శ్రీహరి సాక్షాత్కరింపగా నేను సంసారాన్ని అర్థించాను. మోక్షప్రధాతను ఏమి కోరాలో తెలియని మందబుద్ధిని నేను అని ధ్రువుడు విచారించాడు. హరి అనుగ్రహం పొంది తిరిగివస్తున్నాడని చారుల ద్వారా తెలిసికొని ఉత్తానపాదుడు సంతోషించి, తనవారందరితో కలిసి తన నగరానికి వెలుపలికి వచ్చి తన కుమారుడు ధ్రువునికి ఎదురు వెళ్ళాడు. పల్లానికి నీళ్ళు ప్రవహించిన విధంగా భగవంతుని దయకు పాత్రుడైనవాని వద్దకు తమంత తాము అందరూ అనుకూల భావంతో చేరుకొన్నారు. పినతల్లి గతాన్నంతా మరచి మహనీయుడైన ధ్రువుణ్ణి ఆనందాతిశయంతో వణుకుతున్న కంఠ స్వరంతో 'చిరంజీవ' అని దీవించింది. తమ్ముడు ఉత్తముడూ, ధ్రువుడూ ప్రేమతో ఒడలుమరచి ఒకరినొకరు కౌగలించుకొన్నారు. సునీతి ప్రాణాలకంటె అధికుడైన కొడుకును ఆనంద భాష్పాలు కన్నులనిండగా, గట్టిగా కౌగలించుకొని అతని తనూస్పర్శవల్ల కలిగిన సంతోషంతో తన దుఃఖాన్ని మరచి పోయింది. అందరూ ఆనందంతో రాజధాని నగరం చేరుకొన్నారు. ధ్రువుని తల్లి సునీతిని పురప్రజలు అంతులేని సంతోషంతో పొగిడారు. కొంతకాలం తరువాత ఉత్తానపాదుడు ధ్రువునకు ప్రజలపైగల అనురాగాన్నీ ప్రజలకు ధ్రువునిపై గల అభిమానాన్ని గమనించి నవయవ్వనుడైన ధ్రువుణ్ణి రాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. తాను విరక్తుడై తపోవనానికి వెళ్ళాడు. పిమ్మట ధ్రువుడు శింశుమార ప్రజాపతి కూతురైన భ్రమిని వివాహమాడి ఆమెవల్ల కల్పుడు, వత్సరుడు అను ఇద్దరు కొడుకులను పొందాడు. వాయుపుత్రికయైన ఇలను పెండ్లాడి ఆమెవల్ల ఉత్కలుడు అను కొడుకునూ ఒక కుమార్తెనూ పొందాడు. ఈరీతిగా ధ్రువుడు ఆనందంగా ప్రజానురంజకంగా తన రాజ్యాన్ని పాలించాడు.

### ఇరవైయవ అధ్యాయము – చతుర్థ స్కంధము

**జవాబులు :** 1.3. గరుడవాహనం 2.4. చేతనున్న పాంచజన్యమనే శంఖంతో
3. చారులవలన

* * *

## ఇరవై ఒకటవ అధ్యాయము - చతుర్థ స్కంధము

### 1. ధృవునకు కుబేరానుచరులతో యుద్ధం 2. అంగ పుత్రుడగు వేనుని చరిత్ర

**1) ప్రశ్న :** ధ్రువుని తమ్ముడు ఉత్తముడు పెండ్లి కాకమునుపే వేటాడటానికి అడవికివెళ్ళి అక్కడ ఎవరిచేత సంహరింపబడ్డాడు?

**జవాబు :** 1. గంధర్వుడిచేత 2. గరుడజాతివారిచేత
3. కిన్నరునిచేత 4. యక్షునిచేత

**2) ప్రశ్న :** తమ్ముని చావుకు పరితపించి ధ్రువుడు ఉత్తరదిశగా వెళ్ళి, ఆ మంచు కొండలలో యక్ష, రాక్షసులతో యుద్ధంచేసి వారిని పీడించసాగాడు. అప్పుడు నీకిది తగిన పనికాదని ఆయనను యుద్ధం నుండి విరమింప జేసింది ఎవరు?

**జవాబు :** 1. స్వాయంభువమనువు 2. దేవేంద్రుడు
3. కుబేరుడు 4. నారదుడు

**3) ప్రశ్న :** ధ్రువుడు పరంధామాన్ని చేరిన విషయాన్ని మైత్రేయ మహర్షి ఎవరికి తెలిపాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** రాజర్షియైన అంగభూపతికి వేనుడు ఏవిధంగా జన్మించాడు? ఆతని ప్రవర్తన ఏరీతిగా ఉండేది?

**జవాబు :** ఒకప్పుడు అంగభూపతి చేసిన యజ్ఞానికి సంబంధించిన హవిస్సును పొందటానికి, ఆయన సంతాన హీనుడైనందున దేవతలు రాలేదు. అంగరాజు విచారించి పెద్దల సలహామేరకు పుత్రకామేష్ఠి చేసి, 'శిపివిష్ట దేవతాకం' అయిన పురోడాశంతో హోమం చేశాడు. ఆ హోమకుండం నుండి యజ్ఞపురుషుడు ఉద్భవించి పాయసపాత్రను ఇచ్చాడు. రాజు ఆ పాయసపాత్రను తనభార్య సునీతికి ఇచ్చాడు. ఆమె ఆనందంతో ఆ పాయసాన్ని ఆరగించింది. పతి సంయోగం వల్ల ఆమె గర్భవతియై కుమారుణ్ణి కన్నది.

ఆ బిడ్డకు వేనుడు అని పేరుపెట్టి అల్లారుముద్దుగా పెంచారు. ఆ వేనుడు చిన్నతనంలో ఆటలాడే వయసు నుండి అధర్మవర్తనుడై తన ఈడుపిల్లలను ఈడ్చుకొనివచ్చి జాలిలేకుండా చంపేవాడు. పరమ దుర్మార్గుడైన కొడుకు వలన అపకీర్తి, అందరితో విరోధం, మనోవ్యథ కలిగి అంగరాజు ఒకనాడు గొప్ప ఐశ్వర్యంతో కూడిన గృహాన్ని భార్యా, బిడ్డలను వదలి వెళ్ళిపోయాడు. సింహాసనం రాజసూన్యంగా ఉండకూడదని పెద్దలు, వేనుని తల్లి అనుమతితో వేనునికి రాజుగా పట్టాభిషేకం చేశారు. అపార ఐశ్వర్యబలంతో వేనుడు ఇంకా చెలరేగి గర్వాతిశయంతో ప్రజలను హింసించసాగాడు. కొందరు మునులు వచ్చి వేదప్రతిపాదితాలైన ధర్మాలను అనుసరించమని, భగవంతుని యందు నమ్మక ముంచమని వేడుకొన్నారు. అప్పుడు వేనుడు సకల దేవతా స్వరూపుడు రాజే, కాబట్టి నేనే దైవాన్ని, మీరు చేసే సకల దేవతారాధనలు నాకే సమర్పించండి అని విపరీత బుద్ధితో మునుల మాటలను నిరాకరించి పలికాడు. అప్పుడా మునులు వీడు బ్రతికి ఉన్నట్లైతే ధర్మం నశిస్తుంది. వీడిని హతమార్చాలి అని పెల్లుబికిన కోపంతో హుంకరించారు. ఆ మహర్షుల హుంకారానికి భగవన్నిందకుడైన వేనుడి ప్రాణాలు ఎగిరిపోయాయి. ఈ విధంగా వేనుడి శకం ముగిసింది.

**5) ప్రశ్న :** పృథు చక్రవర్తి పుట్టుకను తెలుపుతూ, ఆయన చక్రవర్తియై ఏరకంగా పాలించాడు?

**జవాబు :** వేనుమహారాజు మరణానంతరం సునీతి తనకొడుకు శరీరాన్ని కొన్నిరకాల ఓషధుల వలన, యోగశక్తిచేత చెడిపోకుండా కాపాడింది. సింహాసనం రాజసూన్యమైన కారణంగా రాజ్యంలో చోరభీతితో పాటు, దుర్మార్గం పెచ్చుమీరింది. ఇది గమనించిన మహర్షులు అంగవంశాన్ని అంతరింప జేయకూడదు. వీరు మహావీరులూ, హరిభక్తులూ అయినందు వలన వీరి వంశాన్ని నిలబెట్టాలని, వేనుని శరీరాన్ని సమీపించారు. ఆతని తొడను మథించారు. ఆ వేనుని తొడ నుండి నల్లని శరీరఛాయతో పొట్టివాడు పుట్టాడు. ఆతని వంశస్థులు నిషాదులై అడవులలో సంచరిస్తూ జీవనం

సాగించారు. తరువాత మునులు వేనుని హస్తాలను మధించారు. ఆ బాహువుల నుండి నారాయణాంశతో పృథు చక్రవర్తి పుట్టాడు. ఈయన యుక్తవయస్సులో అర్చిమహాదేవిని పెండ్లాడాడు. వారిరువురు లక్ష్మీనారాయణులు. అనంతరం ఆ మునీంద్రులు పృథుచక్రవర్తికి రాజ్య పట్టాభిషేకం చేశారు అని మైత్రేయుడు విదురునికి తెలుపుతూ, ఓ విదురా! అనంతకల్యాణ గుణాలకు ఆలవాలమై పృథు చక్రవర్తి ప్రజలను సంతోష పెట్టాడు. ఈ చక్రవర్తి సర్వప్రాణులనూ సమానంగా చూశాడు. ప్రజల నేరాలను శాంతంతో సహించాడు. ఆర్తుల యందు దయచూపాడు. శత్రువులైనా శిక్షింపతగని వారిని శిక్షించేవాడు కాదు. ఈ చక్రవర్తి పవిత్రమైన సరస్వతీ నదీతీరంలో నూరు అశ్వమేధయాగాలు చేశాడు. శౌర్యాతిశయంతో సర్వదిక్కులనూ జయించి శాశ్వతమైన యశస్సు గడించాడు. ఈ మహారాజు తనను సేవించిన సమస్త పరివారాన్ని వారి వారికి తగినట్లుగా ఆదరించాడు. ఈ విధంగా చక్రవర్తియై సమస్త భూమండలాన్ని పృథుమహారాజు పరిపాలించాడు.

**ఇరవై ఒకటవ అధ్యాయము – చతుర్థ స్కంధము**

**జవాబులు :** 1. 4. యక్షునిచేత 2. 1. స్వాయంభువ మనువు
3. విదురునికి

* * *

## ఇరవై రెండవ అధ్యాయము - చతుర్థ స్కంధము

### 1. పృథువు భూదేవి వలన ఓషధీ బీజాలను పొందడం 2. పృథు చక్రవర్తి యాగాశ్వాన్ని ఇంద్రుడపహరించడం

**1) ప్రశ్న :** పృథు చక్రవర్తి భూమి సారహీనమైనదని ప్రజల ద్వారా తెలిసికొని, వింట బాణాన్ని సంధించి భూమిపై ప్రయోగించబోగా, అప్పుడు భూమి ఏరూపం ధరించి నలుదిక్కులకూ పరిగెత్తింది?

**జవాబు :** 1. గోవురూపం 2. లేడిరూపం 3. వృషభరూపం 4. ఐరావతరూపం

**2) ప్రశ్న :** గోరూపధారిణియైన భూదేవి తనను రక్షించమని వేడుకొంటూ, ఆయనను ఏదేవుని అవతారంగా భావించి వేడుకొన్నది?

**జవాబు :** 1. ఈశ్వరుడు 2. బ్రహ్మదేవుడు 3. దేవేంద్రుడు 4. మహావిష్ణువు

**3) ప్రశ్న :** పృథుమహారాజుతో భూదేవి తనలో ఉన్న ధాన్యపు బీజాలను పొందాలంటే, తాను గోవుగా ఉంటాను. నాకు తగిన దూడను, పాత్రనూ, దోగ్ధనూ సమకూర్చుకొని నీకు కావలసిన బీజాలను పొందవచ్చు అని చెప్పింది. కాగా భూదేవి తాను ప్రసాదిస్తాను అని చెప్పిన వాటన్నిటిని కలిపి ఏమని పిలుస్తారు? తెలపండి.

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** భూదేవి తనకు ఇస్తానన్న సంపదను పృథుమహారాజు ఏవిధమైన ఉపాయంతో పొందాడు? భూమిని చదునుచేసి ఏవిధంగా జనావాసాలు ఏర్పరచాడు?

**జవాబు :** పృథు చక్రవర్తికి భూదేవి తాను గోరూపధారిణినై ఉన్నాను. నాకు తగిన దూడనూ, తగిన పాత్రనూ, తగిన దోగ్ధనూ సమకూర్చుకో మనగా, ఆ మహారాజు మనువును దూడగా చేసికొని, తన చేతిని పాత్రగా చేసికొని,

తాను దోగ్ధగా, భూమి నుండి సకలములైన ఓషధులను పిదికాడు. ఈ విధంగా పృథుచక్రవర్తి పిండుకొన్న తరువాత ఋషులు, దేవతలూ, దైత్యులూ, పితృ దేవతలూ, గంధర్వులూ, యక్షులూ ఇంకనూ అనేకులు గోరూప ధారిణియైన భూమి నుండి తమ అభిమతాలకు తగినట్లుగా, తమలో శ్రేష్ఠులు దూడలుగా, తమకు తగినపాత్రలలో, తమకు తగిన క్షీరాలను పిండుకొన్నారు. అప్పుడు పృథు చక్రవర్తి సంతోషించి భూమిని చదునుగా సమతలంగా చేసి శాశ్వతమైన యశస్సు గడించాడు. ఆయా ప్రదేశాలలో పూర్వంలేని జనపదాలు, పట్టణాలు, దుర్గాలు, కొండపల్లెలు, బోయపల్లెలు, శబరాలయాలు, ప్రజావాటికలు, ఘోషవాటికలు మొదలగు పెక్కు విధాలైన ప్రజానివాస స్థానాలను కల్పించాడు. అటువంటి పృథు చక్రవర్తిని కీర్తించటం ఎవరికీ శక్యంకాదు.

**5) ప్రశ్న :** పృథు చక్రవర్తి చేసిన అశ్వమేథ యజ్ఞాలు ఏవిధంగా సాగాయి? నూరవ అశ్వమేథం జరిగేటప్పుడు జరిగిన అవరోధాలు ఏరీతిగా జరిగాయి?

**జవాబు :** పృథు చక్రవర్తి మహానిష్ఠతో బ్రహ్మావర్తదేశంలోని మనుక్షేత్రంలో సరస్వతీనదీ తీరంలో మహా వైభవంగా యజ్ఞాలు చేయటంవల్ల విశేషఫలం కలుగుతుంది అని భావించాడు. పరమ పుణ్యక్షేత్రంలో ఆ మహారాజు చేస్తున్న అశ్వమేథయాగానికి యజ్ఞస్వరూపుడూ, యజ్ఞేశ్వరుడూ అయిన శ్రీమహావిష్ణువు, శంకరుడూ, బ్రహ్మ, ఇంద్రాదిగాగల సకల దేవతలూ, అష్టదిక్పాలకులతో కూడి వైభవంగా వేంచేశారు. నారాయణాంశ కలిగిన పృథు చక్రవర్తి మహావైభవంతో తొంబది తొమ్మిది అశ్వమేథయాగాలను తన బుద్ధి కౌశలంతో పూర్తిచేశాడు. వేదోక్తంగా హవిస్సులను దేవతలకు అర్పించాడు. నూరవ అశ్వమేథయాగం ప్రారంభించి చేస్తుండగా ఇంద్రుడు పాషండవేషం ధరించి యాగాశ్వాన్ని అపహరించాడు. ఆ విషయాన్ని అత్రి మహాముని పృథువు కుమారునితో చెప్పగా, అతడు వెళ్ళి యజ్ఞాశ్వాన్ని పట్టగా అక్కడ ఇంద్రుడు అదృశ్యమైనాడు. అశ్వాన్ని తెచ్చిన పృథువు కుమారునికి 'విజితాశ్వుడు' అనే సార్థకమైన పేరు పెట్టారు. అప్పుడు బ్రహ్మదేవుడు వచ్చి పృథుచక్రవర్తితో నీవు తొంబది తొమ్మిది అశ్వమేథ యాగాలుచేశావు. ఇక చాలు శత యజ్ఞఫలం

నీవు కోరరానిది. నీవూ, ఇంద్రుడూ నారాయణాంశ సంభవులే. దైవోపహతమైన యాగాన్ని చేయటం వలన అది నెరవేరదు అని చెప్పగా పృథువు బ్రహ్మదేవుని ఆజ్ఞానువర్తియై శాస్త్రబద్దంగా అవబృథ స్నానంచేసి యాగాన్ని మానివేశాడు. అందరూ సంతోషించారు.

## ఇరవై రెండవ అధ్యాయము – చతుర్థస్కంధము

**జవాబులు :** 1. 1. గోరూపం 2. 4. మహావిష్ణువు
3. ఓషధులు

* * *

## ఇరవై మూడవ అధ్యాయము - చతుర్థ స్కంధము

**1. పృథు చక్రవర్తికి నారాయణానుగ్రహం 2. సభాసదులకు పృథువు ధర్మాల నుపదేశించడం**

**1) ప్రశ్న :** పృథు చక్రవర్తి నూరవ అశ్వమేథ యాగాన్ని బ్రహ్మోపదేశం ప్రకారం మానుకోవలసి వచ్చింది. అప్పుడు శ్రీమహావిష్ణువు, ఇంద్రునితో కలసి వచ్చి, పృథువుతో ఇంద్రుడు ఇక్కడకు ఎందుకు వచ్చాడని చెప్పాడు?

**జవాబు :** 1. నిన్నుచూడాలని　　2. నీకు క్షమాపణచెప్పాలని
3. యాగాన్ని భంగంచేసిన అహంతో　4. తన ఆధిక్యాన్ని చూపాలని

**2) ప్రశ్న :** శ్రీమన్నారాయణుని పాదసేవనంలో పృథు చక్రవర్తి తాను ఎవరితో పోటీ పడవలసి వస్తుందని ఆలోచించాడు?

**జవాబు :** 1. ప్రహ్లాదునితో　　2. ధ్రువునితో
3. అంబరీషునితో　　4. లక్ష్మీదేవితో

**3) ప్రశ్న :** పృథు చక్రవర్తి నూరవ అశ్వమేథ యాగాన్ని బ్రహ్మదేవుని ఆనతి మేరకు ఉపసంహరించు కొన్నాడు. అటుపిమ్మట కొంతకాలం జరిగిన అనంతరం ఒక యాగాన్ని చేయ సంకల్పించి దీక్ష వహించాడు. ఆ యాగం పేరేది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** పృథు మహారాజు తాను నిర్వహిస్తున్న దీర్ఘ సత్రయాగ సందర్భంగా పౌరజానపదుల నుద్దేశించి ఏమని పలికాడు? అందుకు వారి సందేహాలను ఏ విధంగా నివృత్తి చేశాడు?

**జవాబు :** పృథు మహారాజు దీర్ఘసత్రయాగం సందర్భంగా యజ్ఞదీక్షితుడై ఉన్న సమయంలో అక్కడకు చేరిన తన రాజ్య పౌరజానపదులనుద్ధేశించి సభ్యులారా! ప్రజలను ధర్మమార్గాన పరిపాలింపక అర్థకాంక్షతో ప్రజల నుండి

పన్నులు గుంజుకొన్న రాజునకు ప్రజల పాపం సంక్రమిస్తుంది. అందుచేత ఆ రాజు తేజోహీనుడై నశిస్తాడు. కాబట్టి ప్రజలు రాజు మేలుకొరకూ తమ మేలుకొరకూ అసూయా రహితులై వాసుదేవార్పణ బుద్ధితో ధర్మాన్ని ఎల్లప్పుడూ ఆచరించాలి. మీరు ఇలాచేయడమే నన్ను అనుగ్రహించడమని భావిస్తాను అని పలికిన రాజుతో ప్రజలు మహారాజా! వాసుదేవార్పణ బుద్ధితో ప్రజలు ధర్మకార్యాలను ఆచరించాలని నీవుచెప్పావు. అసలు వాసుదేవుడనేవాడున్నాడా? అని ప్రశ్నించారు. అప్పుడు తన ప్రజలు ప్రశ్నించిన దానికి రాజు ఓప్రజలారా! వినండి. యజ్ఞాధిపతియైన సర్వేశ్వరుడు ఉన్నాడు. మీరు అందుకు అంగీకరించకపోతే ఈ చిత్ర విచిత్రమైన జగత్తు ఎలా ఏర్పడింది? కర్త అయిన ఈశ్వరుడు లేకున్నను కర్మవశాన ఈ జగత్తు ఏర్పడిందని మీరు అనవచ్చు, కాని మనకంటే మన పూర్వులు మనువు, ధ్రువుడు, ప్రహ్లాదుడు, బలి లాంటి మహోదాత్తులు ఆ నారాయణుని దర్శించిన వారేకదా! ఇటువంటి పెద్దల మాటలను, అనుభవాలను బట్టిచూస్తే భగవంతుడు లేడనటం పొసగని మాట. కాబట్టి మీరు మీ శక్తికి తగినట్లుగా నిశ్చితమైన ఫలసిద్ధీ, త్రికరణ శుద్ధీ, నిష్కపటమైన బుద్ధీ కలవారలై స్తుతి నమస్కార సేవలద్వారా భక్తాభీష్ట ప్రదాలైన ఆ దేవదేవుని పాదపద్మాలను సేవించండి అని పలికిన పృథు మహారాజుతో సదస్యులందరూ ఓ చక్రవర్తీ! నీవు చిరకాలం జీవింతువు గాక! నీవు చెప్పిన మాటల వలన మేము సర్వేశ్వరుడైన శ్రీహరిని తెలిసికొన్నాము. నీవు మాకు అధీశ్వరుడవు కావటంచేత మేము కూడా హరి భక్తులమైనాము. దైవ సంజ్ఞితాలైన కర్మలచేత జ్ఞానం నశించిన మమ్ములను ఒడ్డుకు చేర్చావు. మా సందేహాలన్నీ తొలగించావు. ఇకపై నీవు కోరిన ఆస్తిక ప్రధానాలైన ప్రజలనుగా మమ్ములను చూస్తావు అని ఆ సభాసదులు పృథుమహారాజుకు నమస్కరించి వెళ్ళారు.

**5) ప్రశ్న :** పృథుమహారాజు మాటలతో ప్రజలు నాస్తిక వాదంనుండి మరలి ఆస్తికవాదాన్ని ఆమోదించి ఏ విధంగా మహారాజును అనుసరించి ఆయనను ఆశీర్వదించారు?

**జవాబు :** ప్రజలు పృథుమహారాజుతో రాజా! నీ తండ్రి నిన్ను కుమారునిగా పొంది నరకలోకం నుండి స్వర్గలోకానికి తరలించబడి ఉంటాడు. 'పుత్రుని వల్ల తండ్రి సర్వలోకాలనూ జయిస్తాడు' అనే వేదవాక్యం యథార్థమయింది. పురుషోత్తమా! హిరణ్యకశ్యపుడు శ్రీహరిని నిందించి నరకాన్ని పొందటానికి అర్హుడయ్యాడు. కాని సుగుణయుక్తుడూ, విష్ణుభక్తుడూ అయిన తన కొడుకు ప్రహ్లాదుని ప్రభావం చేత పాపాలన్నీ తొలగి నరకానికి పోకుండా మిక్కిలి స్వచ్ఛమైన యశస్సుతో విరాజిల్లాడు అని పలికి సదస్యులందరూ పృథుచక్రవర్తీ! నీవు సత్త్వగుణ సంపన్నుడవూ, సత్య స్వరూపుడవూ, మహాపురుషుడవూ అయిన నిన్ను ఈశ్వరునిగా భావించి నమస్కరిస్తున్నాము అని మహారాజు వద్ద సెలవు తీసికొని వారివారి నివాసాలకు వెళ్ళారు.

### ఇరవై మూడవ అధ్యాయము - చతుర్థ స్కంధము

**జవాబులు :** 1. 2. నీకు క్షమాపణ చెప్పాలని 2. 4. లక్ష్మీదేవితో
3. దీర్ఘసత్రయాగం

* * *

# ఇరవై నాలుగవ అధ్యాయము - చతుర్థ స్కంధము

## 1. సనకాది మహర్షులు పృథుచక్రవర్తి వద్దకు రావడం 2. జ్ఞాన వైరాగ్యాలచేత పృథువు ముక్తిని పొందడం

**1) ప్రశ్న :** ఒకనాడు పృథుచక్రవర్తి సభదీరి ఉండగా, అచటికి సనకసనందనాదులు వచ్చారు. వారు ఏ దిక్కు నుండి వచ్చారు?

**జవాబు :** 1. ఆకాశం నుండి 2. ఉత్తరదిక్కు నుండి 3. పశ్చిమదిక్కు నుండి 4. తూర్పుదిక్కు నుండి

**2) ప్రశ్న :** పృథు మహారాజు సభలో ప్రవేశించిన సనకాదులు ఎవరి పుత్రులు?

**జవాబు :** 1. శంకర సంకల్పులు 2. మహేంద్రుని పుత్రులు 3. బ్రహ్మ మానస పుత్రులు 4. బలిగురు పుత్రులు

**3) ప్రశ్న :** పృథు మహారాజుతో సౌనకాది మౌనీంద్రులు తాను ఆచరిస్తున్న భాగవత ధర్మాలవల్ల పృథువుకు ఏ యోగం సిద్ధిస్తుందని చెప్పారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** సనకసనందనాదులు పృథు మహారాజు కోరిక మేరకు మోక్ష సాధకాలైన ఉపదేశాలను ఏఏ పదసంపద ద్వారా తెలియజేసి వెళ్ళారు?

**జవాబు :** సనకసనందనాదులతో మహారాజు అడిగిన ప్రశ్నకు సనత్కుమారుడు చెపుతూ, ఓ జనవరేణ్యా! సాధు సంగమం ఉభయ సమ్మతమై సకలార్థ సాధనం అవుతుంది. నీవడిగిన మోక్ష సాధన భక్తియోగం చేతనే సాధ్యమౌతుంది. అది జ్ఞాన వైరాగ్యాలను సాక్షాత్కరిస్తుంది. ధర్మార్థ కామమోక్షాలలో ధర్మార్థ కామాలు మూడున్నూ అనిత్యాలైనందువల్ల యమభయంతో కూడి ఉంటుంది. మోక్షం ఒక్కటే పరమ పురుషార్థం. రాజేంద్రా! దేహం, ఇంద్రియాలు, ప్రాణం, బుద్ధి, అహంకారం అనే వానిచేత అమృతాలయిన స్థావర జంగమాల హృదయాలలో సర్వవ్యాపీ, సాక్షీభూతుడూ అయిన భగవంతుడు అంతర్యామియై ప్రకాశిస్తూంటాడు. అటువంటి

నారాయణుని స్వరూపాన్ని చక్కగా తెలిసికో! ఇంకనూ నీవు కేవలం అచంచలమైన భక్తియుక్తితో గోవింద పదారవింద వందనం అనే అందమైన నావను ఆశ్రయించు. దాని సాయంతో దుస్తరమూ, ధురంతరమూ, దుఃఖమయము, కఠోరమూ, గంభీరమూ అయిన ఈ సంసార సముద్రాన్ని పరమ సంతోషంతో తరించు అని పరమ యోగీంద్రుడైన సనత్కుమారుడు పృథు చక్రవర్తికి బ్రహ్మతత్వాన్ని బోధించాడు. అప్పుడు ఆ చక్రవర్తి వారితో మీరు వేదాంత వేత్తలు, ఆధ్యాత్మ తత్వవిధులు నాకు భగవద్భక్తిని ఉపదేశించారు. మీ వంటి పుణ్యాత్ములకు గురు దక్షిణగా నేనేమివ్వ గలవాడను. మీకు ప్రత్యుపకారంగా ఇవ్వబూనటం నా అవివేకం అవుతుంది. దయామయులైన మీరు మీ ఉపకారానికి బదులుగా నా నమస్కారాన్ని అందుకొని ఆనందం పొందుదురు గాక! అని వారిని సన్నుతించాడు. దివ్యజ్ఞాన మహనీయులైన సనకాది మునీంద్రులు ఆయన పూజలందుకొని, రాజును ప్రశంసించి, ప్రజలందరూ చూస్తుండగా ఆకాశ గమనంతో వెళ్ళిపోయారు.

**5) ప్రశ్న :** పృథు చక్రవర్తి జ్ఞానవైరాగ్యవంతుడై ఏవిధంగా ముక్తిని పొందాడు? పృథువు తరువాత ప్రచేతసులు వరకుగల వారి వంశస్తులను సంక్షిప్తంగా తెలపండి.

**జవాబు :** పృథుచక్రవర్తి తన భార్య అర్చిమహాదేవి వలన విజితాశ్వుడు, ధూమ్రకేశుడు, హర్యశ్వుడు, ద్రవిణుడు, వృకుడు అనే ఐదుగురు పుత్రులను పొందాడు. ఆ రాజు దేశకాల విత్తములకు తగినట్లు బ్రహ్మార్పణ బుద్ధితో సత్కర్మలనూ, ధర్మాన్నీ ఆచరించాడు. పట్టణాలనూ, పల్లెలనూ వృద్ధిపొందించాడు. అందరికీ వృత్తులను ఏర్పాటు చేశాడు. బహుకాలం రాజ్యపాలన చేసిన అనంతరం వార్ధక్యం వచ్చినదని గ్రహించి తన రాజ్యాన్ని కొడుకులకు అప్పగించాడు. తాను ఆధ్యాత్మ శిక్షణచేత ఏకాగ్రతను సాధించాడు. ఆ ఏకాగ్రత వలన ఆత్మనిష్ఠుడయ్యాడు. ప్రజలు విచారంతో వీక్షిస్తుండగా భార్యా సహితుడై తపోవనానికి వెళ్ళాడు. అక్కడ కొంతకాలం తపోదీక్షలో ఉన్న తరువాత హృదయ గ్రంథి విచ్ఛేదకమై జ్ఞానయోగం ప్రాప్తించిన పిమ్మట

జ్ఞాన వైరాగ్యాల ప్రభావంతో మాయోపాధిని విడిచిపెట్టి బ్రహ్మనిష్ఠుడై ముక్తుడైనాడు. భార్య అర్చిమహాదేవి కూడా భర్తను అనుసరించి పుణ్యలోకాలకు వెళ్ళింది. పృథు మహారాజు అనంతరం తన కుమారుడు విజితాశ్వుడు తండ్రి పేరు ప్రతిష్ఠలకు భంగం కలుగకుండా ప్రజానురంజకంగా పాలిస్తూ, తన నలుగురు తమ్ములకూ రాజ్యాన్ని పంచి ఇచ్చాడు. తరువాత విజితాశ్వునికి మొదటి భార్య 'శిఖండిని'కి ముగ్గురు కుమారులు. రెండవ భార్య 'నభస్వతి' వల్ల హవిర్ధానుడు అనే కుమారుడు కలిగారు. విజితాశ్వుని అనంతరం హవిర్ధానుడు చక్కగా రాజ్యపాలనం చేస్తూ, 'హవిర్ధాని' అనే భార్యవలన బర్హిష్మదుడు ఆదిగాగల ఆరుగురు కొడుకులను కన్నాడు. హవిర్ధానుడి పిమ్మట బర్హిష్మదుడు రాజ్యానికి వచ్చి అనేక యజ్ఞాలుచేసి ప్రాచీన బర్హి అనే పేరును పొందాడు. ఈయనకు సముద్రుని కూతురైన శతధృతి వలన పదకొండు మంది కుమారులు కలిగారు. వీరే ప్రచేతసులుగా లోకంలో ప్రఖ్యాతి గాంచారు. వారు పరమ శివుని అనుగ్రహం వలన జపధ్యాన పూజా నియమాలతో నారాయణుని చాలాకాలం ఆరాధించారు. ఈ విధంగా పృథు చక్రవర్తి వంశం ప్రవృద్ధమానం అయింది.

### ఇరవై నాలుగవ అధ్యాయము - చతుర్థస్కంధము

**జవాబులు :** 1. 1. ఆకాశం నుండి  2. 3. బ్రహ్మ మానస పుత్రులు
3. భక్తియోగం

* * *

## ఇరవై అయిదవ అధ్యాయము - చతుర్థస్కంధము

**1. రుద్రుడు ప్రచేతసులకు నారాయణ స్తోత్రాన్ని తెలపడం 2. నారదుడు ప్రాచీన బర్హికి జ్ఞాన మార్గాన్ని తెలపడం**

**1) ప్రశ్న :** ప్రాచీన బర్హికి శతధృతి వలన కలిగిన ప్రచేతసులు ఎవరిమాటలు విని తపస్సు చేయడానికై పశ్చిమదిశగా వెళ్లారు?

**జవాబు :** 1. నారదుని మాట 2. తండ్రి మాట
3. తల్లిమాట 4. హవిర్ధానుని మాట

**2) ప్రశ్న :** తపస్సు చేయటానికై బయలుదేరిన ప్రచేతసులు, ఒక ప్రశాంత ప్రదేశంలోని సరస్సులో ఒక దివ్యపురుషుణ్ణి చూశారు. వారు చూసిన దివ్యపురుషుడు ఎవరు?

**జవాబు :** 1. రుద్రుడు 2. మహావిష్ణువు
3. బ్రహ్మదేవుడు 4. మహేంద్రుడు

**3) ప్రశ్న :** దివ్య కొలనులో దర్శనమిచ్చిన రుద్రుడు ప్రచేతసులను అనుగ్రహించి వారికి చెప్పిన స్తోత్రం ఏది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ప్రచేతసులకు రుద్రుడు తాను చెప్పిన స్తోత్రాన్ని వల్లిస్తూ, వారిని నిరంతర జపం ద్వారా ఏవిధమైన ఫలితాన్ని పొందుతారు అని చెప్పాడు?

**జవాబు :** రుద్రుడు తాను చెప్పిన స్తోత్రాన్ని గురించి చెపుతూ, ప్రచేతసులారా! నేను మీకు చెప్పిన స్తవమునకు 'యోగాదేశమ'ని పేరు. దీనిని పలుమార్లు వల్లించి మనసులో నిలిపి విశ్వాసంతో జపిస్తూ హరిని పూజించండి. ఈ స్తోత్రాన్ని ప్రజా సృష్టి చేయగోరి భృగ్వాదులకు బ్రహ్మ ఉపదేశించాడు. అందువలన వారి తమోగుణం నశించింది. వివిధ ప్రజలను సృష్టించారు. కాబట్టి ఏకాగ్రతతోటి శ్రీహరిపై మనసు నిల్పి ఈ స్తోత్రాన్ని జపించేవాడు కొద్ది కాలంలోనె శ్రేయస్సును పొందుతాడు. అజ్ఞానం అనే నావచేత

దుఃఖమయమైన సంసార సముద్రాన్ని తేలికగా దాటగలడు. నేను మీకు ఉపదేశించిన శ్రీహరి స్తవాన్ని పఠిస్తూ శ్రీహరిని పూజించేవాడు శ్రేయస్సులకు ఏకాశ్రయమైన నారాయణుని వల్ల కోరినకోర్కెలను పొందుతాడు అని ఉపదేశించి ప్రచేతసులు చేసిన పూజలను గ్రహించి శివుడు అంతర్ధానమయ్యాడు.

**5) ప్రశ్న :** నారదుడు ప్రాచీన బర్హికి ఏ తెరగున జ్ఞాన మార్గాన్ని తెలిపాడు?

**జవాబు :** ఒకనాడు కర్మాసక్తుడయిన ప్రాచీన బర్హి వద్దకు ఆధ్యాత్మ తత్త్వవేత్త అయిన నారదమహర్షి దయతో విచ్చేసి ఈ విధంగా జ్ఞాన బోధచేశాడు. రాజా! దుఃఖాన్ని తొలగించి, కోర్కెలను ప్రసాదించు శ్రేయస్సును నీవు కోరుతున్నావు. కాని అట్టి శ్రేయస్సు నీకు ఈ కర్మలవల్ల లభించదు అనగా విని ప్రాచీన బర్హి నారదునితో ఇలా అన్నాడు. మహానుభావా! కర్మాసక్తి వలన నాకు జ్ఞానం నశించింది. అందుచేత నేను శ్రేయస్సును (మోక్షాన్ని) తెలిసికొన లేకుండా ఉన్నాను. కాబట్టి నాకు ఇప్పుడు కర్మ బంధాలను నిర్మూలించే నిర్మలమైన జ్ఞానాన్ని ఉపదేశించు. దయామూర్తీ కపట ధర్మాలకు ఆలవాలాలైన గృహాలలో భార్యా పుత్రులూ ధనధాన్యాలే గొప్ప. పురుషార్థాలుగా భావించి సంసార బంధాలలో బద్ధుడైన బుద్ధిహీనుడు మోక్షాన్ని పొందలేడు. ఆ మాటలు విని నారదమహర్షి ప్రాచీన బర్హితో ఇలా అన్నాడు. నీవు యజ్ఞాలలో దయమాలి వేలకొలది పశువులను చంపావు. అవి నీ హింసా కార్యాన్ని స్మరిస్తూ నీవు పరలోకం చేరినప్పుడు లోహ యంత్ర మయాలైన కొమ్ములతో నిన్ను పొడిచి హింసించాలని నిశ్చయించి నీ చావుకోసం ఎదురు చూస్తున్నాయి. ఇటువంటి గొప్ప ప్రమాదాన్ని పొందబోతున్న నీకు నిస్తారకమైన ఒక ఇతిహాసాన్ని వినిపిస్తాను అని పురంజనో పాఖ్యానాన్ని వినిపించి, జీవేశ్వర తత్త్వాన్ని గురించి తెలిపాడు.

**ఇరవై అయిదవ అధ్యాయము – చతుర్థ స్కంధము**

**జవాబులు :** 1. 2. తండ్రిమాట 2. 1. రుద్రుడు

3. నారాయణ స్తోత్రం

* * *

## ఇరవై ఆరవ అధ్యాయము - చతుర్థ స్కంధము

### 1. పురంజనోపాఖ్యానం 2. ప్రచేతసులకు భగవంతుని సాక్షాత్కారం

**1) ప్రశ్న :** ప్రాచీన బర్హికి నారద మహర్షి పురంజనోపాఖ్యానము అనే కథను తెలిపాడు. ఈ కథ దేనికి సంబంధించినది?

**జవాబు :** 1. ఆత్మజ్ఞాన తత్త్వానికి 2. కర్మయోగానికి
3. రాజయోగానికి 4. రాజవిద్యాయోగానికి

**2) ప్రశ్న :** నారద మహర్షి ప్రాచీన బర్హికి పురంజనోపాఖ్యానాన్ని తెలుపుతూ, పురుషుడు అహంకార మమకారాలతో గూడి ఎన్ని సంవత్సరాలు కర్మలను ఆచరిస్తాడు అని చెప్పాడు?

**జవాబు :** 1. 25 సంవత్సరాలు 2. 50 సంవత్సరాలు
3. 75 సంవత్సరాలు 4. 100 సంవత్సరాలు

**3) ప్రశ్న :** ప్రాచీన బర్హికి నారద మహర్షి పురంజనుడనే రాజు కథ తెలుపుతూ, జీవుడు దైవికంగా ప్రాప్తించిన ప్రియాప్రియాలను ఎన్ని లోకాలలో అనుభవిస్తాడు అని చెప్పాడు?

**జవాబు :** జవాబులకాలంలో ఉంది.

**4) ప్రశ్న :** రాజర్షియైన ప్రాచీన బర్హి చివరి దశలో అవ్యయానందమయమైన పదాన్ని ఏ విధంగా పొందాడు?

**జవాబు :** నారద మహర్షి ప్రాచీన బర్హికి జీవేశ్వరుల తత్త్వాన్ని తెలుపుతూ ఓ రాజా! శుద్ధ సత్త్వగుణం కలిగి వాసుదేవుని ఉత్తమగుణాలను ధ్యానించటంలో నిమగ్నమైన మనసుకు, ప్రపంచం సర్వస్వమూ వాసు దేవాత్మకంగానే కనిపిస్తుంది. మనస్సే జీవులందరికీ జన్మకారణం. కర్మవశాన అవిద్య కలుగుతుంది. అవిద్యచేత దేహానికి కర్మబంధం కలుగుతుంది. కర్మబంధం వల్ల బహుజన్మలను పొందటం తప్పదు. కాబట్టి ఓరాజా! సృష్టిస్థితిలయలకు వాసుదేవుడే కారణమనీ, ఈ జగమంతా వాసుదేవాత్మకమనీ తలపోసి

ఈశ్వరుడైన వాసుదేవుని సేవించు. నీ అవిద్య నశిస్తుంది అని చెప్పిన నారద మహర్షి మాటలు మనసుకు పట్టినవాడై ప్రాచీన బర్హి ప్రజారక్షణకు కొడుకులను నియోగించి, తపస్సు చేయటానికి కపిలాశ్రమానికి వెళ్ళాడు. ఆ కపిలాశ్రమంలో ముక్తసంగుడై, ఏకాగ్రమైన చిత్తంతో, సద్భక్తి యోగంతో, గోవిందుని పాదపద్మాలను ఆరాధించాడు. బ్రహ్మరుద్రాదులకు పొంద శక్యంకాని అవ్యయానందమయమైన పదాన్ని పొందాడు అని మైత్రేయముని విదురునితో చెప్పాడు.

**5) ప్రశ్న :** ప్రాచీన బర్హి కుమారులు పదకొండు మంది ప్రచేతసులు రుద్రుని చేత అనుగ్రహింప బడి, శ్రీహరిని ఏవిధంగా మెప్పించారు? ఏఏ వరాలను పొందారు?

**జవాబు :** ప్రచేతసులు అప్రయత్నంగా వారి పూర్వజన్మ సుకృతంచేత శ్రీహరికి ఇష్టుడైన శివుని దర్శించి ఆయన అనుగ్రహంవలన, తండ్రి ఆనతిని తలదాల్చి సముద్ర మధ్యంలో రుద్రగీతను జపిస్తూ మహావిష్ణువును గురించి తపస్సు చేయసాగారు. చాలాకాలం తరువాత వారి తపస్సు పండి శ్రీహరి గరుడవాహనంపై వేంచేసి ప్రచేతసులకు దర్శనభాగ్యాన్ని కలిగించి ఓ తాపస శ్రేష్ఠులారా! మీరందరు కలిసి ఒకే ధర్మాన్ని ఆచరిస్తున్నారు. నేను చాలా తృప్తిచెందాను. రుద్రునిచే గానం చేయబడిన నా స్తోత్రాన్ని నిత్యమూ జపించి నన్ను సంతృప్తి పరిచారు. ఇకమీదట మీరు కందు మహాముని కుమార్తె 'మారిష'ను వివాహమాడి, ఆమె వలన మూడు లోకాలలోనూ మీ కీర్తిని వ్యాపింపచేసే కుమారుని పొందుతారు. పిమ్మట నిరంతరము నన్నే ధ్యానిస్తూ నన్ను చేరుతారు. ఇంకా ఏమైనా వరం కావాలంటే ప్రసాదిస్తాను అడగండి అనగా ప్రచేతసులు దేవా! నీవు ముక్తినాథుడవు. భక్తుల హృదయాలలోని కోర్కెలను నెరవేరుస్తావు. భగవంతుడవైన నీవు మాకు ప్రసన్నుడవు కావటమే మాకు ఇష్టమైన వరం. నీ పాదాలను ఆశ్రయించుకొన్న మేము, నీ మాయకు చిక్కి మేము కర్మమార్గంలో ఎంతకాలం నిత్యమూ తిరుగుతూ ఉంటామో అంతవరకూ మాకు నీ భక్తులతో సహవాసాన్ని కలిగించు, సర్వేశ్వరా!

కమలనయనా! నీ మిత్రుడైన శివుని ఒక్క క్షణకాలం దర్శించటం, ఎవ్వరికి సాధ్యం? తరువాత నీ దర్శనాన్ని పొందటం వలన మేము కృతార్థులమైనాము అని ప్రచేతసులు మహావిష్ణువును ఇంకా ఎన్నో విధాల స్తుతించారు. అప్పుడు నారాయణుడు వారుకోరిన వరాలను ప్రసాదించి వారు చూస్తుండగానే వైకుంఠానికి వెళ్ళాడు. అనంతరం ప్రచేతసులు పదకొండు మంది మారిషను వివాహమాడి ఇహలోకసౌఖ్యాలు వాసుదేవ అనుగ్రహంగా భావించి అనుభవించి ఒక కుమారుని పొందారు. అటు పిమ్మట వారు నారాయణుని అనుగ్రహం మేరకు ఆయనను భక్తితో సేవించి హరి పదాన్ని పొందారు.

### ఇరవై ఆరవ అధ్యాయము – చతుర్థ స్కంధము

**జవాబులు :** 1. 1. ఆత్మజ్ఞాన తత్త్వానికి 2. 4. వంద సంవత్సరాలు
3. మూడులోకాలు

* * *

# ఇరవై ఏడవ అధ్యాయము - పంచమ స్కంధము

**1. ప్రియవ్రతుని చరిత్ర 2. నారాయణుని ఋషభావతార కథ**

**1) ప్రశ్న :** స్వాయంభువు మనువు కుమారుడైన ప్రియవ్రతుడు రాజ్యపాలనం పట్ల విరక్తుడై యున్నందున, అది తెలిసికొన్న మహావిష్ణువు ఆజ్ఞ ప్రకారంగా వచ్చి ప్రియవ్రతునికి రాజ్యపాలనపట్ల ఆసక్తి కలిగించింది ఎవరు?

**జవాబు :** 1. నారదుడు 2. మహేంద్రుడు 3. వాయుదేవుడు 4. బ్రహ్మదేవుడు

**2) ప్రశ్న :** నారాయణుని ఆజ్ఞానువర్తియై ప్రియవ్రతుడు పట్టాభిషిక్తుడై 'బర్హిష్మతి' అను నామెను వివాహమాడాడు. ఈమె ఎవరి కుమార్తె ?

**జవాబు :** 1. దక్షప్రజాపతి 2. కశ్యపప్రజాపతి 3. విశ్వకర్మ 4. మయునికుమార్తె

**3) ప్రశ్న :** ప్రియవతుని అనంతరం, ఆయన కుమారుడు అగ్నీధ్రుడు రాజైనాడు. అందు బ్రహ్మదేవుడు సంతోషించి, అగ్నీధ్రునికి ధర్మపత్నిగా ఒక అప్సరసను పంపించాడు. ఆమె పేరేమి?

**జవాబు :** జవాబులకాలంలో ఉంది.

**4) ప్రశ్న :** అగ్నీధ్రుని అనంతరం తన కుమారుడైన నాభి, మేరు పుత్రికయైన మేరుదేవిని వివాహమాడి, సంతానార్థియై ఏమి చేశాడు? ఫలితమేమి?

**జవాబు :** నరవరేణ్యుడైన 'నాభి' తన భార్య 'మేరుదేవి'తో కలిసి చాలాకాలం సంతానార్థియై ఉన్నా కూడా ఫలితంలేదు. ఒకనాడు నాభి తనభార్యతో కలిసి 'ప్రవర్గ్య' మనే ధర్మక్రతువును శ్రద్ధతో, పరిశుద్ధమైన ద్రవ్యాలతో, ఒక ఉచిత ప్రదేశంలో దేశ కాలానుగుణంగా, విధివిహితంగా మంత్ర వేత్తలయిన ఋత్విక్కులతో భూరిదక్షిణలతో ఆరంభించి అవిశ్రాంతంగా నిర్వహించాడు. ఆ క్రతు ఫలితంగా నారాయణుడు ప్రసన్నుడై యజ్ఞవేదిక వద్ద ఋత్విక్కులు చూస్తుండగా ప్రత్యక్షమైనాడు. అప్పుడు నాభి సతీసమేతుడై స్వామిని కీర్తించి,

దేవా! నీవు పరిపూర్ణుడవు. వైకుంఠ వాసా! నీ మహిమలు మాకు పెద్దలు చెప్పిన విధంగా ప్రస్తుతి చేస్తున్నాము. పరమానంద స్వరూపుడవైన నీకు యజ్ఞ యాగాదుల వల్ల తృప్తి లేకున్నా, మా కోరికలను తీర్చుకోవటంకోసం మేము యజ్ఞాలు చేస్తున్నాము. కోరిన కోరికలను తీర్చే సర్వేశ్వరుడవు. నీతో సమానమైన సంతానాన్ని నాకు అనుగ్రహించమనగా, భగవంతుడు స్వర్గాదిలోకాలలో నాకు సాటిరాదగిన కుమారుడు ఎక్కడా కనిపించదు. నాకు సాటి నేనే, కావున నేనే నీకు కొడుకునై పుట్టుతాను అని వరమిచ్చి ఆ రాజ దంపతులు చూస్తుండగా ఆ స్వామి అంతర్ధానమయ్యాడు. అటుపిమ్మట నైష్ఠికులకు యోగధర్మాలు బోధించటం కోసం, నాభిమీది దయతో నారాయణుడు మేరుదేవి గర్భంలో ప్రవేశించాడు. సమస్త శుభలక్షణాలు కలవాడూ, శమదమాది గుణసంపన్నుడూ, మేరునగ ధీరుడైన శ్రీహరి మేరుదేవికి కుమారుడుగా అవతరించాడు. సమస్త జనులూ సంతోషించారు. తన కుమారునికి నాభి 'ఋషభుడు' అని పేరుపెట్టాడు. సంతానార్థియై నాభి ప్రవర్గ్యమనే యజ్ఞం ద్వారా మంచి ఫలితాన్ని అనుభవించాడు.

**5) ప్రశ్న :** నాభి మహారాజు కుమారుడైన ఋషభుడు మహారాజై ఏవిధంగా పాలించాడు? ఆయన జీవితంలో చెప్పుకోదగిన సన్నివేశాలేవి?

**జవాబు :** నాభి మహారాజు అనంతరం ఋషభుడు రాజై దేవేంద్రుడు ఇచ్చిన 'జయంతి' అను నామెను వివాహం చేసుకొన్నాడు. ఋషభుడు నారాయణాంశతో పుట్టినవాడైనప్పటికి జనులందరికి కర్మతంత్రం తాను అనుభవించి తెలియజేయాలనుకొన్నాడు. అందుచేత తానే స్వయంగా గురువులవద్ద వేదాధ్యయనం చేశాడు. వివాహం చేసుకొన్నాడు. భరతుడు మొదలైన నూర్గురు కొడుకులను కన్నాడు. పట్టణాలతో, ఆశ్రమాలతో, కొండలతో, చెట్టుచేమలతో నిండిన భూమండలం భరతుని పేరు మీదుగా 'భరతవర్ష' మనే ప్రశస్తి గడించింది. ఒకసారి ఋషభుడు తన కుమారు లందరిని దగ్గరకు పిలిచి బిడ్డలారా! ఈ గడ్డమీద పుట్టిన మనుష్యులు కామానికి లొంగక, కోరికలకు దూరంగా ఉండాలి. తపస్సు వలన మానవులకు తరగని

సుఖం కలుగుతుంది. బ్రహ్మానందం తప్పక సిద్ధిస్తుంది. వృద్ధులనూ, ధీనులనూ దయతో కాపాడండి. చెడు మార్గాలలో నడిచే కాముకుల సహవాసం పూర్తిగా వదలిపెట్టండి. మీకు శుభం కలుగుతుంది. నాయనలారా! మీ అందరిలోకి పెద్దవాడు భరతుని రాజుగా అందరూ అంగీకరించండి. ఆయనను నాలాగే భావించి సేవించండి అని భగవంతుడైన ఋషభుడు కర్మపరిత్యాగం కావించి, శాంత స్వభావులైన మునులకు భక్తిజ్ఞాన వైరాగ్యాలతో కూడిన పరమహంస ధర్మాలను ఉపదేశించాడు. అటుపిమ్మట బ్రహ్మావర్త దేశాన్ని వదలి ఋషభుడు జడునిలాగా, సర్వసంగ పరిత్యాగియై, అవధూతగా, పిచ్చివానిగా ప్రవర్తిస్తూ చాలాకాలం ఉన్నాడు. తరువాత ఒక అడవిలో ఋషభుడు తన శరీరాన్ని విడవడానికి నిశ్చయించుకొన్నాడు. అప్పుడు వీచిన గాలికి అడవిలో నిప్పంటుకుంది. దానికి గాలితోడు కావటంతో, అది కార్చిచ్చులాగా అడవినంతా అలముకుంది. ఆ కార్చిచ్చు మంటలలో ఋషభుడు శరీరత్యాగం చేశాడు. మహావిష్ణువు అంశ పరమపదాన్ని చేరింది.

**ఇరవై ఏడవ అధ్యాయము - పంచమ స్కంధము**

**జవాబులు :** 1. 4. బ్రహ్మదేవుడు 2. 3. విశ్వకర్మ
3. పూర్వచిత్తి

* * *

# ఇరవై ఎనిమిదవ అధ్యాయము - పంచమ స్కంధము

**1. భరతోపాఖ్యానం 2. రాజభటులు భరతుని కాళి బలికి తీసికొని వెళ్ళడం**

**1) ప్రశ్న :** ఋషభుని అనంతరం ఆయన పెద్ద కుమారుడు భరతుడు రాజైనాడు. ఆయన విశ్వరూపుని కుమార్తెను వివాహం చేసుకొన్నాడు. ఆమె పేరేమి?

**జవాబు :** 1. స్వయంప్రభ 2. పంచజని
3. శతధృతి 4. అర్చిమహాదేవి

**2) ప్రశ్న :** భరతునికి తన పట్టపురాణి పంచజని వల్ల ఎంత మంది కుమారులు జన్మించారు?

**జవాబు :** 1. పది మంది 2. ఏడుగురు
3. ఐదుగురు 4. నలుగురు

**3) ప్రశ్న :** చివరి దశలో పులహాశ్రమం చేరిన భరతుడు మంత్ర పూర్వకంగా మూడు వేళలా ఏ నదిలో స్నానం చేసేవాడు?

**జవాబు :** జవాబులకాలంలో ఉంది.

**4) ప్రశ్న :** భరతుడు తాను పెంచుకొన్న జింక పిల్ల కారణంగా తన తపోదీక్షకు, భగవద్భక్తికి, నిత్యనైమిత్తిక క్రియా కలాపాలకు ఏ రీతిగా అంతరాయం కలిగింది?

**జవాబు :** గండకీనదిలో స్నానంచేస్తున్న భరతుడు తాను చూస్తుండగా తల్లి చనిపోయిన లేడిపిల్లను దయార్ద్రహృదయుడై తన ఆశ్రమానికి తెచ్చి పెంచసాగాడు. ఆ బాలకురంగాన్ని ఎంతో గారాబంతో, లాలించడం, పాలించడంలోనూ, ముద్దుగా పెంచి పెద్దచేయటం లోనూ, ఆసక్తుడై భరతుడు తన నిత్య కృత్యాలైన అష్టాంగ యోగాలనూ, భగవంతుని పూజా కైంకర్యాలనూ మరచిపోయాడు. క్రమ క్రమంగా నిత్యనైమిత్తిక క్రియాకలాపాలు ఒకటొకటే మూలబడ్డాయి. తాను తపస్సుకు దూరం కావటాన్ని అతడు గుర్తించలేదు. తాను ఏపని చేస్తున్నా ఎప్పుడూ జింకపిల్లపైనే ద్యాసను ఉంచేవాడు. నానాటికి

ముద్దు మురిపాలతో పెంచుకొంటూ, దానిమీద మోహం పెంచుకున్నాడు భరతుడు. ఈ విధంగా ఆ హరిణాంగనపై మోహం కారణంగా భరతుడు యోగభ్రష్టుడైనాడు. భగవంతుని ఆరాధించటం మానుకొన్నాడు. కొంతకాలానికి భరతునికి చివరి క్షణంరానే వచ్చింది. ఆ అంత్యకాలంలో కన్నకొడుకు వైపు చూస్తున్నట్లు, ఆ జింకవైపు ఆసక్తితో చూస్తూ మనసులో ఆ జింకనే భావించుకుంటూ, భరతుడు ప్రాణాలు విడిచాడు. తరువాతి జన్మలో ఒక జింక గర్భానపుట్టి జింకగా జీవనం సాగిస్తూన్నాకూడా, అతనికి పూర్వజన్మలో చేసిన పుణ్యం, తపస్సు కారణంగా, పూర్వజన్మ జ్ఞానం మాత్రం పోలేదు. ఈ విధంగా భరతుడు పూర్వాశ్రమంలో ఇల్లు, ఇల్లాలు, బిడ్డలు అనే జంజాటాన్ని వదలి వానప్రస్థాశ్రమం చేరి కూడా, చివరకు ఒక జింకపిల్ల మమకారంలో పడి తన చివరి జీవితం భ్రష్టతను పొందింది.

**5) ప్రశ్న :** లేడి జన్మ అనంతరం భరతుడు నరుడుగా ఎక్కడ జన్మించాడు? ఈ జన్మలో భరతుని రాజభృత్యులు కొందరు కాళికి బలిఇవ్వాలని ఏ కారణంగా తీసుకొని వెళ్ళారు? అటుపిమ్మట ఏమి జరిగింది?

**జవాబు :** పరీక్షిన్మహారాజుతో శుకయోగీంద్రుడు మహారాజా! భరతుడు లేడి దేహాన్ని వదలిపెట్టి అనంతర జన్మలో అంగీరస గోత్రీకుడైన ఒక బ్రాహ్మణుని ఇంటపుట్టాడు. ఆ విప్రునికి ఇద్దరు భార్యలు. పెద్ద భార్యకు తొమ్మిది మంది పుత్రులు, చిన్న భార్యకు ఒక కుమార్తె, ఒక కుమారుడు కలిగారు. భరతుడుగా చిన్న కుమారుని తండ్రి గారాబంగా పెంచుతూ, సదాచారాలను నేర్పాడు. తనకు కర్మలంటే ఏ మాత్రం ఆసక్తి లేకపోయినా, బోధించేవాడు తండ్రి కావటం వలన తప్పని సరిగా నేర్చుకొనవలసి వచ్చింది. భరతునికి శ్రీహరి అనుగ్రహం వలన పూర్వజన్మ స్మృతి కలిగింది. అందువల్ల అతడు బంధ విముక్తి కోసం ఉన్మత్తుడుగా, జఢుడుగా, అంధుడుగా, చెవిటివానిలాగా లోకులకు కనిపిస్తూ జీవితం గడుపుతున్నాడు. కొంతకాలానికి తండ్రి చనిపోగానే తల్లి సహగమనం చేసింది. సవతి తల్లి కొడుకులు భరతుని గొప్పతనాన్ని తెలుసుకోలేక, ఆతని చేత ఇంటిపని, పొలంపని చేపిస్తూ,

నీచంగా మాట్లాడుతూ ఉండేవారు. భరతుడు మాత్రం తాను ఎప్పుడూ ఆత్మానుభూతిని పొంది, సుఖ దుఃఖాలతో సంబంధం లేకుండా చలి, వేడి, గాలి, వానలకు భయపడకుండా ఎప్పుడూ ఆనందంగా బ్రహ్మ వర్చస్సుతో ఉండేవాడు. ఒకసారి పొలందగ్గర కాపలాకాస్తున్న భరతుని ఆ ప్రాంతానికి దగ్గరలో ఉన్న భిల్లరాజు సేవకులు చూశారు. వారు తమ రాజుగారికి సంతానంలేని కారణంగా కాళికాదేవికి నరబలి ఇవ్వాలని తీసుకొని వెళుతున్న బలిపశువు పారిపోయాడు. అందుకు బదులుగా భరతుని పట్టుకొనిపోయారు. వారి సంప్రదాయాలన్నీ ముగించుకొని భరతుని కాళికకు బలి ఇవ్వబోయారు. భరతుడేమాత్రం తొణకలేదు. అప్పుడు కాళిక ఒకనిలో ఆవేశించి బ్రాహ్మణ బలినాకొద్దు అని తిరస్కరించి విజృంభించింది. అప్పుడు ఆ బిల్లరాజు భటులు భరతుని విడిపించారు. తనను చంపడానికి వస్తున్న వారన్నా, తనను చంపటానికి పైకెత్తిన కత్తిని చూచినా, ఆవేశంగా కాళికను చూచినప్పుడూ అన్నిట్లోనూ అందరిలోనూ అచ్యుత భావమే భరతునికి కలిగింది. అటు పిమ్మట భరతుడు కాళికాలయాన్ని వదలిపెట్టి తాను కాపలా ఉన్న పొలందగ్గరకు వెళ్ళాడు.

**ఇరవై ఎనిమిదవ అధ్యాయము – పంచమ స్కంధము**

**జవాబులు :** 1. 2. పంచజని 2. 3. ఐదుగురు 3. గండకీనది

* * *

## ఇరవై తొమ్మిదవ అధ్యాయము - పంచమ స్కంధము

**1. భరతుడు రహూగణుడనే రాజు మాటలకు సమాధానమివ్వడం**
**2. భూగోళ విశేషాలు**

**1) ప్రశ్న :** సింధుదేశాన్ని పాలించే 'రహూగణు'డనే రాజు ఆధ్యాత్మవిద్యను తెలిసికోవాలన్న ఆలోచనతో ఎవరి వద్దకు వెళ్తున్నాడు.?

**జవాబు :** 1. భృగుమహర్షి 2. వశిష్టమహర్షి
3. కణ్యమహర్షి 4. కపిలమహర్షి

**2) ప్రశ్న :** భరతుడు తన పల్లకీ మోస్తున్న బోయీలతో మీరు మోస్తున్న మోత నాకు అసౌకర్యంగా ఉన్నదని పలుకగా, అందుకు బోయీలు ఏమని బదులిచ్చారు?

**జవాబు :** 1. మేము నడుస్తున్న భూమి ఎగుడు దిగుడుగా ఉన్నది
2. ముందువైపు ఉన్న బోయీలు సరిగా మోయటంలేదు
3. క్రొత్తగా వచ్చిన బోయీవాడు సరిగా నడవనందున
4. వెనుకవైపు ఉన్న బోయీలు సరిగా మోయటంలేదు

**3) ప్రశ్న :** పల్లకీమోత అసౌకర్యంగా ఉన్నదని పలికిన రహూగణ మహారాజుతో భరతుడు తత్త్వ వివేచనతో మాట్లాడగా పల్లకీని ఆపిన రహూగణుడు ఏమి చేశాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** భరతునికి, రహూగణునికి సంభాషణ ఏ విధంగా జరిగింది?

**జవాబు :** భరతుడు మాట్లాడిన తత్త్వ చింతనతో కూడిన మాటలు రహూగణుని హృదయానికి సూటిగా తగిలాయి. అతనిలోని అహంతొలగింది. ఆ రాజు వినయ వినమ్రుడై చేతులు జోడించి ఇలా అన్నాడు. నీవు సామాన్యుడవు కావు. అవధూతవు. నేను మహావిష్ణువు అవతారమైన కపిలమహాముని వల్ల, బ్రహ్మోపదేశం పొందాలని వెళుతున్నాను. నీవు నన్ను అనుగ్రహించుటకు

వచ్చిన కపిలమహర్షివని అనిపిస్తున్నది. కారణజన్ముడవైన నీవు జన్మాంతర సమాగతమైన ఈ ఆత్మజ్ఞానం సాటిలేని ఈ శాంత గుణం కలిగిన నీ మాటలనే అమృతంచేత, నా సందేహాలన్నిటినీ నివారించుకోవాలని కుతూహల పడుతున్నాను. దయచేసి నాకు ఆధ్యాత్మతత్వాన్ని అనుగ్రహించుమని వేడుకొన్న రాజుతో, భరతుడు రాజా! పూర్వ జన్మలలో చేసిన కర్మలనుబట్టే ఫలితాలు కలుగుతాయి. ఆ ఫలితాలనే మానవుడు ఈ జన్మలోని శక్తియుక్తుల వలన కలిగాయని భావిస్తాడు. ఈ సమస్త జీవరాసులకు భూమి నివాసస్థానము. అందువల్ల ప్రపంచ సృష్టికి కారణమైన తత్త్వం చెపుతాను విను. ఈ భూమి పరమాణువుల సమూహంతో ఏర్పడింది. కాగా జ్ఞానరూపమైనపర బ్రహ్మమొక్కటే సత్యం, జగత్తు అసత్యం అని విశదీకరించిన భరతుడు భగవద్భక్తుల చరణసేవయే పరబ్రహ్మ ప్రాప్తికి సులభమార్గం. నరుడైనవాడు పెద్దలను సేవించి, శ్రీహరిని సదా ధ్యానించటం వలన, మహావిష్ణువు కథలు విన్నందువలన జ్ఞానవంతుడౌతాడు అని రహూగణుడనే సింధురాజుకు భరతుడు సంసార సుఖాలను అధిగమించి, పరబ్రహ్మను చేరుకోవటానికి, మోక్షాన్ని పొందటానికి సరియైన ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించాడు. ఈ విధంగా భరతునికి రహూగణునికి సంభాషణ జరిగినది.

**5) ప్రశ్న :** పరీక్షిన్మహారాజుకు శుకయోగి భూగోళ విశేషాలను ఏవిధంగా తెలిపాడు? సంక్షిప్తంగా తెలపండి.

**జవాబు :** శుకయోగి పరీక్షిన్మహారాజుతో ఓ రాజా! నీవడిగిన భూగోళ విశేషాలు అన్నీ గుణమయమైన శ్రీహరి స్థూలస్వరూపమే. వాసుదేవాత్మకమైన ఈ విషయాలు సంక్షిప్తంగా చెపుతాను విను. భూమి పద్మాకారంలో ఉంటుంది. అందులో జంబూద్వీపం తామర రేకులాగున గుండ్రంగా కనిపిస్తుంది. దానిలో గుండ్రటి ఆకారాలతో తొమ్మిది వేల యోజనాల విస్తీర్ణంకల తొమ్మిది వర్షాలు ఉన్నాయి. ఆ తొమ్మిది వర్షాలకు నడుమ 'ఇలావృత' మనే వర్షం ఉంది. దాని నడుమ బంగారు రంగుతో కూడిన పర్వతం ఉంది. అదే సువర్ణమయమైన సుమేరువు. ఇలా వృతవర్షానికి

దక్షిణంగా మూడు పర్వతాలున్నాయి. అవే నిషధపర్వతం, హేమకూట పర్వతం, హిమవత్పర్వతం. ఈ మూడుకొండల నడుమ మూడు భూప్రదేశాలున్నాయిఅవే హరివర్షం, కింపురణం, భారతవర్షం అనేవి. భారతవర్షానికి తూర్పు దక్షిణ పడమరలలో ఉప్పునీటి సముద్రం ఉంది. హేమకూట, విషధ, హిమవత్పర్వత సానువులలో సీత, చక్షువు, భద్ర, అలకనందలాంటి ఎన్నోనదులు పుట్టి అనేక పుణ్య ప్రదేశాలను పవిత్రం చేస్తూ చివరకు ఉప్పునీటి సముద్రంలో కలుస్తాయి. ఈ నదులలో స్నానం చేసిన వారికి అవి అమృతత్త్వం ప్రసాదిస్తాయి. భారతవర్షంలో అనేక పర్వతాలు, నదులున్నాయి. ఈ భారతవర్షంలో పుట్టిన జీవుల అదృష్టమే అదృష్టం. ఈ భూభాగంలోనే శ్రీమన్నారాయణుడు ఎన్నో అవతారాలను ఎత్తాడు. ఇందలి మానవులకు తత్త్వం ఉపదేశించాడు. వారితో స్నేహం చేశాడు. వారిని ప్రపంచ ప్రజలందరికి ఆదర్శంగా తీర్చాడు. ఈ భారత భూభాగంలో పుట్టిన జనులకు సాధ్యం కానిదంటూ లేనేలేదు అని మహర్షి తెలుపగా మహారాజు విన్నాడు.

### ఇరవై తొమ్మిదవ అధ్యాయము - పంచమ స్కంధము

**జవాబులు :** 1.4. కపిల మహర్షి

2.3. క్రొత్తగా వచ్చిన బోయివాడు సరిగా నడవనందున

3. భరతునికి సాష్టాంగ దండప్రణామం చేశాడు

* * *

## ముప్పైయవ అధ్యాయము – పంచమ స్కంధము

**1. భగణ విషయం 2. నరకలోక వర్ణనం**

**1) ప్రశ్న :** బ్రహ్మాండం మధ్యలో ప్రకాశించే సూర్యుడు తన వెలుగుతో, వేడిమితో ముల్లోకాలనూ ప్రకాశింపజేస్తూంటాడు. అట్టి సూర్యుని ముందుండి వేద సూక్తులతో పఠిస్తూ నడిచేవారెవరు?

**జవాబు :** 1. వాలఖిల్యులు 2. సనకసనందాదులు 3. సప్తర్షులు 4. దేవతలు

**2) ప్రశ్న :** కాలచక్రం వెంట తిరిగే సూర్యాదిగ్రహాలు, నక్షత్రాలలోనూ, రాసులలోనూ సంచరించే కాల ప్రమాణమెంత అని పరిగణిస్తారు?

**జవాబు :** 1. మూడునెలలు 2. ఆరునెలలు 3. తొమ్మిది నెలలు 4. ఒక సంవత్సం

**3) ప్రశ్న :** ధృవక్షితి చుట్టూ గ్రహాలు, నక్షత్రాలు అసంఖ్యాకంగా, కాల విభాగంలో నిమేష మాత్రం కూడా ఏమరుపాటు లేక, ప్రదక్షిణంగా తిరుగుతుంటాయి. ఆ విధంగా తిరిగే చక్ర భ్రమణాన్ని ఏమని పిలుస్తారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ఏ విధంగా సర్వదేవతా మయమైన నారాయణ స్వరూపాన్ని శింశుమార చక్రంగా చెబుతారు?

**జవాబు :** బ్రహ్మాండంలోని గ్రహాలు, నక్షత్రాలు నారాయణుని ఆదేశం మేరకు దేవతల, మహర్షుల, మహాభక్తుల యొక్క పేర్లమీదుగా వ్యవహరించబడినాయి. అనగా, పరమ భక్తాగ్రగణ్యుడై ధ్రువుని పేరును శాశ్వతం చేయడానికి ధ్రువక్షితి అని, మహావిష్ణువు ఏ విధంగా నిర్ణయించి చెప్పాడో ఆ విధంగానే, ఇంద్రుడు, వరుణుడు, కశ్యపుడు, యముడు, ప్రజాపతి, అగ్ని, ధాత, విధాత, అశ్వనీ మొదలుగా గల ఇరువది ఏడు నక్షత్రాలు, అగస్త్యుడు, అంగారకుడు, శని,

బృహస్పతి, సూర్యుడు, శుక్రుడు, చంద్రుడు, అశ్వినీ దేవతలు, బుధుడు, రాహువు, కేతువు, సప్తర్షులు మొదలగుగా గల ఎందరో మహానుభావుల పేర్ల మీద ఏర్పడినవే కాక ఈ బ్రహ్మాండంలోని ఇతర నక్షత్ర మండల మంతా శ్రీమన్నారాయణుని దివ్య శరీరంగా పిలువబడుతుంది. నారాయణుని శరీర భాగాలలో ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క నక్షత్రంగాని, గ్రహంగాని ఉండి, ఎవరిపేరు మీదనైతె ఆ గ్రహ, నక్షత్రం ఉంటుందో వారు ఆ నారాయణుని దివ్య శరీరంలోని అధిష్టాన దేవతగా పిలవబడతారు. ఈ దివ్య శరీరాన్ని ప్రతిరోజు సంధ్యా కాలాలలో మనసులో నిలుపుకొని దీక్షతో, ఎవరు భక్తితో స్మరిస్తారో వారికి ఇహ, పర లాభాలు కలుగుతాయి.

**5) ప్రశ్న :** శుకయోగి పరీక్షిన్మహారాజుకు మనిషియొక్క పాపపుణ్యాలను తెలుపుతూ, ఎన్నిరకాల నరకాలు ఉన్నాయని తెలిపాడు?

**జవాబు :** శుకయోగి తెలుపుతూ రాజా! విను. ముల్లోకాలకు ఆవల, దక్షిణ దిక్కులో, భూమ్యాకాశాల నడుమ మహాభయంకరమైన నరకాలు ఏర్పడి ఉన్నాయి. ఆ దక్షిణ దిక్కుననే అగ్నిష్వాత్తులు మొదలైన పితృదేవతలు కూడా ఉండి తమ తమ గోత్రీకులకు శుభం కలగడం కోసం సత్యమైన దీవెనలు ఇస్తూంటారు. అక్కడ పితృపతియైన యముడు కూడా తనలోకం చేరుకొనే జీవులకు జీవితకాలంలో వారువారు చేసిన కర్మలకు తగినట్లు ఫలం ప్రసాదిస్తూ శిక్షిస్తూంటాడు. ఆ యమలోకంలో తామిస్రం, అంధతామిస్రం, గౌరవం, మహా గౌరవం, కుంభీపాకం, కాలసూత్రం, అసిపత్రవనం, సూకర ముఖం, అంధకూపం, క్రిమిభోజనం, సందంశం, తప్తోర్మి, వజ్రకంటక శాల్మలి, వైతరణి పుయోధం, ప్రాణరోధం, విశసనం, లాలాభక్షణం, సారమేయోధనం, అవీచిరయం, రేతఃపానం అనే ఇరవైయొక్క నరకాలతోపాటు ఇంకా ఆ యమలోకంలో వేలసంఖ్యలో నరకాలు ఉన్నాయి. వీటన్నింటిలో యమదూతలు అధర్మపరులను ఎల్లప్పుడూ బాధిస్తుంటారు. ధర్మపరులైన మానవులందరూ స్వర్గంలో సుఖభోగాలు అనుభవిస్తారు. వారు వారు చేసుకొన్న పుణ్యపాపాలను బట్టి స్వర్గ నరకాలు ప్రాప్తిస్తాయి. స్వర్గ సుఖభోగాలు, నరక యాతనానుభవాల

వలన వారివారి పుణ్యపాపాలు పూర్తికాగేనే, మరలా పూర్వజన్మ వాసనాఫలం వలన, జీవికి మరుజన్మ ప్రాప్తిస్తుంది. ఈ విధంగా భూమిపై నున్న సకల జీవరాశికి ఇందుకు మినహాయింపు లేదు. ఈ విధంగా మహారాజుకు మహాయోగి తెలిపాడు.

### ముప్పైయవ అధ్యాయము - పంచమ స్కంధము

**జవాబులు :** 1. 1. వాలఖిల్యులు 2. 4. ఒక సంవత్సరం
3. శింశుమార చక్రం

* * *

## ముప్పై ఒకటవ అధ్యాయము - షష్ఠమ స్కంధము

**1. అజామీళోపాఖ్యానం 2. విష్ణుదూత, యమదూతల సంవాదం 3. దక్షుడు నారాయణుని 'హంసగుహ్య'మనే స్తోత్రంతో స్తుతించడం**

**1) ప్రశ్న :** అజామీళుడు అనే విప్రుడు మహా పాపాత్ముడు, పరమ దరిద్రుడు, అజ్ఞాని, దురాచారపరుడు. అటువంటి అజామీళుడు నివసించే నగరం పేరేది?

**జవాబు :** 1. కాశినగరం 2. మధురానగరం 3. కన్యాకుబ్జం 4. హస్తినాపురం

**2) ప్రశ్న :** అజామీళునికి అంత్యకాలం సమీపించగా, అతని ప్రాణాలు తీసుకొని వెళ్ళడానికి యమకింకరులు వచ్చారు. అప్పుడు అజామీళుడు ఎవరిని తలచుకొని పిలిచాడు?

**జవాబు :** 1. తల్లిని అమ్మా అని 2. భార్యను 3. చిన్నకుమారుని నారాయణా అని 4. భగవంతుని

**3) ప్రశ్న :** మరణించిన అజామీళుని ప్రాణాలను బలవంతంగా అపహరించుటకై, భయంకర కాలపాశాలు చేతపట్టి, ప్రాణుల ప్రాణాలను తీసే యమకింకరులు వారి పని వారు చేస్తుండగా వారిని అడ్డగించింది ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** అజామీళుని ప్రాణాపహరణంలో యమదూతలకు, విష్ణు దూతలకు జరిగిన సంవాద మెట్టిది?

**జవాబు :** అజామీళుని శరీరం నుండి పాశాలతో, ప్రాణాలను బయటికి గుంజుతున్న యమభటులను భగవంతుని దూతలు, వారి ప్రయత్నాన్ని భగ్నంచేశారు. అప్పుడు యమభటులు అయ్యా మీరెవ్వరు? మీ శుభకరమైన రూపాలు మాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి. సర్వధర్మాలను పాలించు వారైన మీరు యమధర్మరాజు దూతలమైన మమ్ములను అడ్డగించటానికి గల

కారణమేమి? అని ప్రశ్నించిన యమదూతలను చూసి చిరునవ్వుతో గోవిందుని దూతలు మీరు పరేత నాయకుడైన యముని కింకరులన్న మాట. మంచిది. అలా అయితే పుణ్య పాపాలను వివరించండి. ఎవరు దండింప తగినవారో ఎవరు కారో తెల్పండి అని అడిగిన విష్ణుదూతలతో యమదూతలు వేదాలలో ఏది కర్తవ్యమని చెప్పబడిందో, అదే అందరికీ ఆమోదయోగ్యమైన ధర్మం. అంతకంటె వేరైనది అధర్మం. వేదం సాక్షాత్తు నారాయణ స్వరూపం. దేహదారులైన జీవుల సర్వకర్మల యందు ధర్మాధర్మాల నిర్ణయం జరిగి, అధర్మపరులు దండింప బడుటకు నరకానికి పోతారు. ఇప్పుడు మీరు ఈ క్రమపద్ధతికి అడ్డుతగిలారు. కర్మబద్ధులైన జీవులందరూ దండింపదగినవారే అవుతారు. ఈ అజామీళుని జీవితమంతా పాపభూయిష్టమైనది. కావున ఈతనిని మేము తీసికొని పోవుటయే ధర్మం. పిమ్మట ఇతడు తగిన దండనం వల్ల ధన్యుడౌతాడు అని పలికిన యమ దూతలతో భగవంతుని దూతలు మీరు చెప్పినట్లు ఈతడు పాపాత్ముడైనప్పటికి, మరణసమయంలో అమృతం వంటి నారాయణుని పుణ్యనామ సంకీర్తనం చేసిన మహాభాగ్యానికి నోచుకొని తన పాపాలను పారద్రోలాడు. వాసుదేవ నామం కంటే వాంఛనీయం మరేమున్నది? ఈతడు 'నారాయణా' అని తన కుమారుని మీద, ఆసక్తమై పిలిచినప్పటికీ అది భగవంతుని నామస్మరణం కావటం, అందునా అవసానకాలంలో ఉచ్చరించటం వలన ఆ పుణ్యం ఆతనికి దక్కింది. ఈవిధంగా విష్ణుదూతల, యమధూతల సంవాదం అజామీళుడు సమగ్రంగా విన్నాడు.

**5) ప్రశ్న :** దక్షుడు తాను జీవులను అపారంగా సృష్టించి కూడా ఎందుకు సంతుష్టి చెందలేదు? అటుపిమ్మట ఏమిచేశాడు?

**జవాబు :** ప్రజాసృష్టి కోసం బ్రహ్మదేవుడు ప్రచేతసులను సృష్టించాడు. భూమి అంతా వృక్షములతో నిండి ఉండటం చూచి ప్రచేతసులు తమ క్రోధాగ్నితో వృక్షాలను కాల్చివేయబూనారు. అప్పుడు చంద్రుడు ప్రచేతసులను సమాధాన పరచి ప్రచేతసులారా! మీరు వృక్షనాశనాన్ని ఆపి ప్రజా సృష్టిచేయమని అప్సరస

కుమార్తె అయిన 'మారిష'ను వారికి అర్ధాంగిగా చేసాడు. చంద్ర ప్రబోధితులై ప్రచేతసులు మారిష వలన దక్షుని పుత్రునిగా పొందారు. ఈ దక్షుడు భూమిపై సకల జీవరాసిని ఉత్పత్తి చేశాడు. తాను చేసిన సృష్టిని చూచి దక్షుడు సంతుష్టి చెందలేదు. అప్పుడాయన వింధ్యపర్వత లోయలోకి ప్రవేశించి అక్కడ 'అఘమర్షణం' అనే తీర్థం దగ్గర 'హంసగుహ్యం' అనే స్తోత్రంతో శ్రీమన్నారాయణుని స్తుతించాడు. కొంతకాలానికి తపోతీవ్రతను గుర్తించి మహావిష్ణువు దక్షునికి దర్శనమిచ్చాడు. అపుడా పరబ్రహ్మము ప్రజాపతీ! విను. నీవు సక్రమమైన సృష్టిచేయాలనే నన్ను గూర్చి తపస్సు చేశావు. మొదట నేను సృష్టిచేయాలని సంకల్పించి చతుర్ముఖ బ్రహ్మను సృష్టించాను. ఆయన మిమ్ములను సృష్టించాడు. ఇప్పటి వరకు నీవు చేసిన సృష్టితో నీవు సంతుష్టి చెందలేదు. ఓ ప్రజాపతీ! ఇదిగో 'అసిక్ని' అనే పేరుగల పంచజన ప్రజాపతి కుమార్తెను నీకు ఇస్తున్నాను. ఈమెను అర్ధాంగిగా స్వీకరించు. ఈమె యందు దాంపత్య ధర్మంతో ప్రవర్తించి విస్తారంగా ప్రజా సృష్టిచేయి అని స్వామి అంతర్ధానమయ్యాడు. ఆ విధంగా నారాయణుని ఆనతి మేరకు దక్షుడు 'అసిక్ని'ని వివాహమాడి 'హర్యశ్వులు' అను పేరు గల పదివేల మందిని కన్నాడు. ఈవిధంగా దక్షుడు తనకు ఇష్టమైన విధంగా ప్రజాసృష్టి చేశాడు.

**ముప్పై ఒకటవ అధ్యాయము – షష్ఠమ స్కంధము**

**జవాబులు :** 1. 3. కన్యాకుబ్జము 2. 3. చిన్నకుమారుని నారాయణాఅని
3. విష్ణుదూతలు

* * *

## ముప్పై రెండవ అధ్యాయము - షష్ఠమ స్కంధము

**1. నారదుడు శబళాశ్వులకు నివృత్తి మార్గాన్ని తెలపడం 2. దక్షుడు నారదుని శపించడం 3. దేవాసుర యుద్ధం**

**1) ప్రశ్న :** దక్షునికి అసిక్నికి పుట్టిన హర్యశ్వులు పదివేల మంది వివాహాలు చేసుకొని గృహస్థాశ్రమ ధర్మం నిర్వహించి ప్రజాసృష్టిని విస్తృత పరచకుండా ఎవరి ప్రబోధంతో తపస్సుకు వెళ్ళి నారాయణుని ధ్యానించి మోక్షాన్ని సాధించారు?

**జవాబు :** 1. బ్రహ్మదేవుని 2. దక్షుని
3. నారదుని 4. దేవేంద్రుని

**2) ప్రశ్న :** దక్షుడు తన బిడ్డలైన హర్యశ్వులు ప్రజాసృష్టి చేయటానికి విముఖులై, తపస్సుకు వెళ్ళారని మనో వ్యాకులతతో ఉండగా, బ్రహ్మదేవుడు వచ్చి అతనిని ఓదార్చి, మరలా వేలకొలది సంతానాన్ని పొందమన్నాడు. బ్రహ్మదేవుని ఆశీర్వాదంతో దక్షుడు పొందిన సంతానాన్ని ఏమని పిలుస్తారు?

**జవాబు :** 1. హర్యశ్వులు 2. ప్రచేతసులు
3. ప్రజలు 4. శబలాశ్వులు

**3) ప్రశ్న :** దక్షుడు తాను చేసిన ప్రజాసృష్టిలో భాగంగా పుట్టించిన హర్యశ్వులనూ, శబలాశ్వులనూ ప్రజాసృష్టి చేయటానికి విముఖులనుగా చేసి, వారిని ముక్తికాముకులనుగా తన ఉపదేశంతో చేసింది నారదుడు అని తెలిసి దక్షుడు ఏమిచేశాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** తమ బిడ్డలందరూ మోక్షమార్గావలంబులుగా పయనించారని తెలిసిన తరువాత దక్షప్రజాపతి ఏమి చేశాడు?

**జవాబు :** దక్షప్రజాపతి ప్రజాసృష్టి చేయటంలో భాగంగా తాను ఉద్భవింపజేసిన హర్యశ్వులనూ, శబళాశ్వులనూ నారద మహర్షి తన

ఉపదేశంతో ప్రజా సృష్టికి వ్యతిరేకంగా మోక్ష మార్గావలంబులుగా చేసినాడని తెలిసి దక్షుడు నారదునిపై ఆగ్రహించి నీవు లోకానుగ్రహ బుద్ధిగల తక్కిన భాగవతోత్తముల వలెగాక లోకసంచారివై ఒకచోట నిలకడ లేకుండా ఉందువు గాక అని శపించాడు. అప్పుడు నారద మహర్షి దక్షుని క్రోధ వచనాలకు కోపం తెచ్చుకోకుండా శాపాన్ని పరిగ్రహించి మౌనంగా వెళ్ళిపోయాడు. అటుపిమ్మట దక్షుడు తన మనోరథం సిద్ధించనందుకు చాలా విచారించాడు. ఆ సమయంలో బ్రహ్మదేవుడు వచ్చి దక్షుని అనుగ్రహించి మరలా ప్రజాసృష్టికి తగిన శక్తిని అతనికి అనుగ్రహించి వెళ్ళాడు. అనంతరం దక్షప్రజాపతి తన అర్ధాంగియైన అసిక్ని యందు అరువది మంది పుత్రికలను పుట్టించాడు. వారందరూ తమ తండ్రిమీద అమితమైన అభిమానం కలవారు. దక్షుడు తన కుమార్తెలలో ధర్మునికి పదిమందినీ, కశ్యప ప్రజాపతికి పదముగ్గురినీ, చంద్రునికి ఇరువది ఏడుగురునీ, భూతునికి ఇద్దరినీ, అంగీరసునికి ఇద్దరినీ, కృశాశ్వునికి ఇద్దరినీ, తారక్ష్యకశ్యపునికి నలుగురునీ ఇచ్చి పెండ్లిచేశాడు. వీరందరూ తమతమ భర్తలతో కలిసి అనేక స్థావర జంగమాది, సకల చరాచర జీవకోటిని సృష్టించారు. ముఖ్యంగా కశ్యపప్రజాపతి వలన అతిది, దితి ఆదిగాగల పదముగ్గురు దక్షపుత్రికల సంతానంతో ముల్లోకాలు నిండిపోయాయి. ఈ దక్షపుత్రికలు వారివారి భర్తలవలన అంతులేని సంతానం సౌభాగ్యాలను పొందారు. ఈ విధంగా జరిగిన సృష్టిని చూచి దక్షుడు సంతుష్టాంతరంగుడైనాడు.

**5) ప్రశ్న :** ఇంద్రుడు విశ్వరూపుని తనగురువుగా నియమించుకోవడాన్ని గురించి పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు శుకయోగి ఏవిధంగా సమాధానం చెప్పాడు?

**జవాబు :** ఒకనాడు దేవేంద్రుడు సాటిలేని రాజసంతో వైభవ సాంద్రుడై నిండుకొలువులో ఉన్నాడు. ఆ సమయంలో సమస్త దేవతలకూ గురువుగారైన బృహస్పతి ఇంద్రుని కొలువు కూటంలోనికి ప్రవేశించాడు. ఆ విధంగా సభలోకి వచ్చిన బృహస్పతిని చూసి దేవేంద్రుడు తన సింహాసనం దిగలేదు. ఆదరంగా ఎదురు పోలేదు. గౌరవ పురస్సరంగా ఆహ్వానించలేదు. దేవ గురువుకు

తగిన మర్యాద చేయలేదు. అప్పుడు దేవేంద్రుని కన్నుల గప్పిన రాజ్యాధికార దురహంకారాన్ని గమనించి దేవగురువు మిక్కిలి ఖిన్నుడై అప్రసన్నుడై తిరిగి తన గృహానికి వెళ్ళాడు. ఇంద్రుడు జరిగిన తప్పిదాన్ని గమనించి భయపడి, పశ్చాత్తాపం పొంది, తన గురువుగారిని ప్రసన్నం చేసుకోవటానికి ఆయన గృహానికి వెళ్ళాడు. తన ఇంటికి దేవేంద్రుడు వస్తున్నాడని తెలిసి బృహస్పతి తన అధ్యాత్మ మాయచే అదృశ్యుడైనాడు. దేవేంద్రుడు తన గురువును కనుగొనలేక తిరిగి వెళ్ళిపోయాడు. ఈ విషయమంతా వేగుల ద్వారా తెలిసికొన్న రాక్షసులు తమగురువైన శుక్రాచార్యుని ఆశ్రయించారు. ఆయన దయాదృష్టి వలన రాక్షసులు శక్తియుక్తులు పెంచుకొని దేవతల మీదికి దండయాత్ర చేశారు. రాక్షసవీరులు శుక్రాచార్యుల మంత్రశక్తితో మహాబలసంపన్నులైనందున వారిని ఎదిరించను దేవతలకు కష్టసాధ్యమైంది. అప్పుడు వారందరూ బ్రహ్మదేవుని దర్శించి జరిగినదంతా వివరించారు. అంతా విని విరించి వారిని చీవాట్లుపెట్టి, ప్రస్తుత పరస్థితిని చక్కదిద్దేందుకు బృహస్పతిని ప్రసన్నం చేసుకొనేంత వరకు మీరు 'త్వష్ట' అనే మనువు కుమారుడైన విశ్వరూపుణ్ణి ఆశ్రయించండి. ఆయన మహాతపస్వి, సత్త్వగుణ సంపన్నుడు. ఆతని వలన మీ కోర్కెలు సిద్ధిస్తాయి అని చెప్పిన అజుని వద్ద సెలవుతీసుకొని దేవతలు విశ్వరూపుని సన్నిధికి వెళ్ళారు. విశ్వరూపుడు దేవతల మాటలు విని మీరు కోరిన విధంగా మీకు పౌరోహిత్యాన్ని నేను స్వీకరిస్తే నా బ్రహ్మతేజస్సు నశిస్తుంది. మీ ప్రార్థన ధర్మవిరుద్ధం. కానీ మీకు కలిగిన ఆపదను దృష్టిలో ఉంచుకొని మీకు పౌరోహిత్యం చేయుటానికి అంగీకరిస్తున్నాను అని విశ్వరూపుడు తన అంగీకారాన్ని తెలిపాడు. ఆ విధంగా దేవతలు సంతుష్టులై వెళ్ళారు.

**ముప్పై రెండవ అధ్యాయము – షష్ఠమ స్కంధము**

**జవాబులు :** 1.3. నారదుని 2.4. శబలాశ్వులు

3. నారదుని శపించాడు

* * *

## ముప్పై మూడవ అధ్యాయము - షష్ఠమ స్కంధము

**1. శ్రీమన్నారాయణ కవచ ప్రారంభం 2. వృత్రాసుర చరిత్ర 3. చిత్రకేతూపాఖ్యానం**

**1) ప్రశ్న :** శుక్రాచార్యుని మంత్రప్రభావం వల్ల రాక్షసులు దేవతలను ఓడించి సకల సంపద్విభవంతో వర్ధిల్లారు. అటువంటి రాక్షసులను ఓడించి సురక్షితంగా తన రాజ్యం సంపాదించేందుకు దేవేంద్రునికి విశ్వరూపుడు ఏవిధమైన విద్యను ఉపదేశించాడు?

**జవాబు :** 1. నారాయణకవచం 2. బ్రహ్మాస్త్రం
3. పాశుపతాస్త్రం 4. మహాశక్త్యాస్త్రం

**2) ప్రశ్న :** విశ్వరూపుని చంపిన దేవేంద్రునికి బ్రహ్మ హత్యాపాతకం వెంటబడింది. తప్పించుకొనే వీలులేక ఇంద్రుడు దోసిలియొగ్గి ఆ మహాపాపాన్ని స్వీకరించాడు. ఆ పాపాన్ని దేవేంద్రుడు ఎంతకాలం భరించాడు?

**జవాబు :** 1. మూడు నెలలు 2. తొమ్మిది నెలలు
3. ఒక సంవత్సరం 4. ఆరు నెలలు

**3) ప్రశ్న :** త్వష్ట ప్రజాపతి తన కుమారుడైన విశ్వరూపుని మహేంద్రుడు సంహరించాడని తెలిసి, ఇంద్రుణ్ణి సంహరించటం కోసం యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞం నుండి ఉదయించిన మహాభూతం పేరేది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** త్వష్ట ప్రజాపతి చేత సృష్టింపబడిన వృత్రాసురుడు ఏరకంగా ప్రవర్తించాడు? వృత్రాసుర చరిత్రను సంక్షిప్తంగా తెలపండి.

**జవాబు :** త్వష్ట ప్రజాపతి చేసిన యజ్ఞకుండం నుండి ఉద్భవించిన వృత్రాసురుడు ప్రజాపతి యొక్క తపశ్శక్తి వల్ల పుష్టిపొందిన వాడై, భయంకర రూపంతో ఎవరినీ లెక్క చేయకుండా దేవతలపైకి యుద్ధానికి వెళ్ళాడు. దేవతలు

ఆ మహాకాయుని నిగ్రహించాలని అనేక విధాల ప్రయత్నించారు. వృత్రాసురుని ముందు వారి ప్రయత్నాలు ఫలించలేదు. అప్పుడు వారంతా ఈ మహావిపత్తు నుండి మనలను రక్షించుటకు నారాయణుడు తప్ప వేరే మార్గం లేదని అందరూ, మహావిష్ణువును దర్శించి తమకు కలిగిన ఆపదను గూర్చి తెలిపారు. అప్పుడు స్వామి ప్రసన్నుడై దేవతలారా! నారాయణ కవచాన్ని ధరించిన దధీచి మహర్షి వెన్నెముకను వజ్రాయుధంగా చేసుకొని మీరు వృత్రాసురుని జయించవచ్చు. నా తేజో విశేషంచేత ఆ వజ్రాయుధం వృత్రాసురుని శిరస్సును ఖండిస్తుంది. కావున మీరు మహాదాత అయిన దధీచి మహర్షిని దర్శించండి అని చెప్పగా దేవతలు ఆ దేవదేవుని ఆనతి తలదాల్చి దధీచి మహర్షిని దర్శించి మహర్షీ! దేవతలమైన మాకు వచ్చిన ఆపద నుండి బయటపడటానికి, నీ దేహం మాకు కావలసి వచ్చింది. లోకంలో ఎవ్వరూ కోరనిదీ, ఎవ్వరూ ఇవ్వనిదీ అయిన కోరికను మేము కోరుచున్నాము అని పలికిన దేవతలను చూచి దధీచి మీ అంతటి వారికి నా శరీరం ఉపయోగ పడటం కంటె భాగ్యమేముంది. ఈ శరీరం ఎప్పుడైనా విడవ వలసిందేకదా! అని ఆ దధీచి సమస్త బంధాలు త్రెంచుకొని యోగమార్గం ద్వారా శరీరాన్ని పరిత్యజించాడు. అనంతరం దధీచిమహర్షి ఎముకలతో నూరంచులు గల వజ్రాయుధాన్ని విశ్వకర్మ తయారుచేశాడు. దేవేంద్రుడు సంతోషంతో వజ్రాయుధాన్ని ధరించి వృత్రాసురుని పైకి యుద్ధానికి వెళ్ళాడు. దేవదానవులు ఘోరమైన యుద్ధం చేశారు. ఒకరి కంటే ఒకరు విజృభించి ఆయుధాలు ప్రయోగించుకొన్నారు. ఇంద్రుడు వజ్రాయుధం దరించి వృత్రాసురుని పైకివెళ్ళాడు. అప్పుడు వృత్రుడు దేవేంద్రా! శ్రీహరి దయా విశేషంవల్లనూ, దధీచి మహర్షి తపశ్శక్తితోనూ, శక్తివంతమైన వజ్రాయుధంతో నన్ను గెలిచినా గెలవవచ్చు గాక! అని విజృంభించాడు. దేవేంద్రుడు వృత్రాసురుని మాటలకు ఆశ్చర్యపడ్డాడు. కాని ఇంద్రుడు తన వజ్రాయుధంతో వృత్రాసురుని శిరస్సు ఖండించాడు. ఆ విధంగా దేవతలు గెలిచారు.

**5) ప్రశ్న :** రణరంగంలో వృత్రాసురుడు అనుసరించిన తీరును విని ఇది రాక్షస ప్రవృత్తిగల వానికి ఎలా సాధ్యపడింది? అని ప్రశ్నించిన పరీక్షిత్తుకు శ్రీశుకుడు ఏరీతిగా సందేహ నివృత్తి చేశాడు?

**జవాబు :** శుకయోగి ఓ రాజా! పూర్వం చిత్రకేతుడనే రాజుకు సంతానం లేక పుత్రులు లేని వారికి ఉత్తమగతులు లేవని బాధపడేవాడు. ఆ సమయంలో అంగీరసుడనే మహర్షి రాజును దర్శించి క్షేమ సమాచారం తెలిసికొనే సందర్భంలో రాజువలన తాను సంతానహీనుడని తెలిసికొన్నాడు. అప్పుడు ఆ మహర్షి రాజుతో నీవు పుత్రకామేష్టి చేసి, నీకు చాలా మంది భార్యలున్నా పట్టపుదేవియైన కృతద్యుతి యందు కుమారుని పొందగలవు అని సలహా చెప్పాడు. మహర్షి సలహామేరకు చిత్రకేతుడు అంగీరసుని ఆధ్వర్యంలోనే పుత్రకామేష్టి చేసి, తన పట్టపురాణియైన కృతద్యుతియందు కుమారుని కన్నాడు. ఆ కుమారుడు దినదిన ప్రవర్ధమానమై అందరినీ ఆనందింపజేస్తున్నాడు. ఈ కారణంగా రాజుకు పెద్దభార్య యందు అనురాగ మెక్కువైనది. అది ఓర్వలేని యితర రాణులు, ఈ కుమారుని వల్లనేకదా మహారాజు మనలను నిర్దయగా చూడటం, కావున ఈ బిడ్డను చంపినట్లైన మరలా మనలను యధావిధిగా పూర్వం వలె ఆదరిస్తాడు అని దురాలోచన చేసి విషప్రయోగంతో ఆ రాకుమారుని చంపారు. లేక లేక కలిగిన రాకుమారుని మరణవార్త విని రాజు, రాణి తన వారందరితోపాటు అమితమైన దుఃఖాన్ని అనుభవించారు. అది తెలిసి అంగీరసుడు వచ్చి రాజును ఊరడించి తత్త్వోపదేశంచేసి, మనసు వాసుదేవుని యందుంచి పరమగతిని గురించి ధ్యానించమన్నాడు. చిత్రకేతువు అంగీరసుని బోధనలతో తత్త్వ జ్ఞాన సంపన్నుడై జ్ఞానపూర్ణుడై అన్ని లోకాలు తిరిగే శక్తిని సంపాదించాడు. ఒకసారి కైలాసానికి వెళ్ళి పార్వతీదేవి పరమేశ్వరుని తొడపై కూర్చోవటం చూచి పరిహసించాడు. అప్పుడు పార్వతీదేవి ఆగ్రహించి ఓరి దురాత్ముడా ఆది దంపతులమైన మమ్మే పరిహసిస్తావా? ఈ పాప ఫలంగానీవు రాక్షసుడవై జన్మించు అని శపించింది. నిరంతర నారాయణ సేవా పరాయణుడై యుండీ, ఆ భవానీ శాపానికి గురియైన

చిత్రకేతుడు త్వష్టప్రజాపతికి యజ్ఞంలో దానవుడుగా వృత్రాసురుడనే పేరున ప్రసిద్ధి గాంచాడు. అసురుడై పుట్టికూడా పరిణతమైన భగవత్తత్త్వంతో ప్రకాశించాడు అని వృత్రాసుర పూర్వజన్మ వృత్తాంతాన్ని రాజుతో యోగి తెలిపాడు.

**ముప్పై మూడవ అధ్యాయము - షష్ఠమ స్కంధము**

**జవాబులు :** 1. 1. నారాయణ కవచం 2. 3. ఒక సంవత్సర కాలం
3. వృత్రాసురుడు

* * *

## ముప్పై నాలుగవ అధ్యాయము - షష్ఠమ స్కంధము

**1. చిత్రకేతుడు తపస్సుచేసి భగవంతుని కరుణనుపొందడం 2. చిత్రకేతునికి గౌరీదేవి శాపం 3. సవితృ వంశీయుల కథ**

**1) ప్రశ్న :** చిత్రకేతు మహారాజు కుమారుడు మరణించినాడని తెలిసి, వచ్చిన అంగీరసముని, నారదమహర్షి ఆ బిడ్డను బ్రతికించారు. కాని ఆ బిడ్డ పలికిన మాటలకు చిత్రకేతు మహారాజు ఏ విధమైన ఆలోచన చేశాడు?

**జవాబు :** 1. దుఃఖించాడు 2. వ్యామోహంతో బాధపడ్డాడు 3. నిర్లిప్తుడైనాడు 4. వ్యామోహాన్ని విడిచాడు

**2) ప్రశ్న :** చిత్రకేతు మహారాజు పుత్ర వియోగానంతరం మోహాన్ని వీడి, నారదుడు ఉపదేశించిన మంత్రంతో, ఏడు రోజులు అహోరాత్రాలు అత్యంత దీక్షతో భగవంతుని ఆరాధించాడు. కాగా నారదుడు ఉపదేశించిన మంత్రమేది?

**జవాబు :** 1. నారాయణ మంత్రం 2. నమశ్శివాయ మంత్రం 3. దుర్గాష్టకం 4. గాయత్రి మంత్రం

**3) ప్రశ్న :** చిత్రకేతుడు తనకు ప్రాప్తించిన దివ్య విమానంతో లోకాలన్నీ తిరుగుతూ, పార్వతీపరమేశ్వరులను ఎక్కడ దర్శించాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** చిత్రకేతుడు గౌరీదేవి వలన ఎందుకు శపింపబడవలసి వచ్చినది?

**జవాబు :** చిత్రకేతుడు శ్రీమన్నారాయణుని అనుగ్రహం చేత లభించిన దివ్య విమానంలో ముల్లోకాలు సంచరిస్తూ ఒకనాడు కైలాసపర్వత ప్రాంతంలో వెండికొండపైన బ్రహ్మాది దేవతలు సేవిస్తుండగా పార్వతీ సమేతుడై కొలువుదీరి ఉన్న పరమేశ్వరుణ్ణి చిత్రకేతుడు దర్శించాడు. పరమేశ్వరుని కొలువుకూటంలో, తొడమీద కూర్చున్న పార్వతీదేవిపై ఆదరంతో చేయివేసి ఉన్న పరమేశ్వరుణ్ణి పరికించి చూచి, చిత్రకేతుడు పకపకా నవ్వి పరిహసించాడు. అట్టి చిత్రకేతుని చూచి శివుడు చిరునవ్వు నవ్వాడు. సభలోని వారంతా మౌనంగా ఉన్నారు.

కాని జగజ్జనకుడైన పరమ శివుని పరిహసించిన చిత్రకేతుని చూచి పార్వతి ఓరి దురాత్ముడా! ఈ నిండు సభలో పరమేష్టిని పరిహసించిన పాపఫలంగా నీవు రాక్షస జాతిలో జన్మించు అని శపించింది. అప్పుడు చిత్రకేతుడు పార్వతీదేవికి సాష్టంగ నమస్కారం చేసి చేతులు జోడించి ఓ జగజ్జననీ! నా తప్పును క్షమించు, నీశాపాన్ని శిరసావహిస్తాను అని శాంత చిత్తంతో ఆ దేవి శాపాన్ని అంగీకరించాడు. ఉత్తమ లక్షణాలుకల నారాయణ సేవా పరాయణుడైన చిత్రకేతు మహారాజు శాపోపహతుడై త్వష్ట అనే ప్రజాపతి చేస్తున్న యజ్ఞంలో దక్షిణాగ్ని మధ్యం నుండి దానవుడుగా జన్మించాడు. వృత్రాసురుడనే పేరుతో ప్రసిద్ధిగాంచాడు. పరిణతమైన భగవత్తత్త్వంతో ప్రకాశించాడు.

**5) ప్రశ్న :** శ్రీశుకుడు పరీక్షిన్మహారాజుకు మరుత్తుల జన్మ వృత్తాంతానికి సంబంధించిన కథను ఏ విధంగా వినిపించాడు?

**జవాబు :** శుకయోగి పరీక్షిత్తుతో ఓరాజా! కశ్యప ప్రజాపతి భార్య దితి రాక్షసులను కన్నతల్లి. కాని ఈమెకు పుట్టిన బిడ్డలే నలభైతొమ్మిది మంది మరుత్తులు. వీరు దేవేంద్రుని ఆశ్రయించి దేవత్వాన్ని పొందారు. ఎందువలనంటే వివరంగా చెపుతాను విను. తన కుమారులందరిని హతమారుస్తున్న దేవేంద్రుని హతమార్చాలని ఆలోచించిన దితి మహాదేవి తన భర్తయైన కశ్యప ప్రజాపతిని చేరి ఆయనను ప్రార్థించి ఇంద్రుని సంహరించే కొడుకును ప్రసాదించమని అర్థించింది. అప్పుడు కశ్యపుడు ఇంద్రుడు వధార్హుడు కాడు అని తెలిసికూడా, భార్యను కాదనలేక దితీదేవితో కశ్యపుడు దేవీ! నేను చెప్పినట్లు ఒక సంవత్సర కాలం నియమపూర్వకమైన వ్రతాన్ని ఆచరించు, ఏ మాత్రం నియమ భంగమైనట్లైతే నీ కోరిక ఫలించదు. నియమాన్ని అనుసరించి, ఆచరించి నీవు కోరిన పుత్రుని పొందగలవు అని 'పుంసవనం' అనే వ్రతం, దానికి సంబంధించిన నియమాలను చెప్పాడు. తన భర్త తెలిపిన వ్రతాన్ని అనుసరించ బూనుకొన్నది దితీదేవి. మార్గశిర శుద్ధపాడ్యమి మొదలుకొని ప్రారంభించి దితి గర్భవతియై, ప్రతి దినము

నియమభంగం కాకుండా జాగ్రత్తగా ఉండసాగింది. తన పిన తల్లియైన దితి ఏ ప్రయోజనాన్ని ఆశించి ఈ వ్రతాన్ని అనుసరిస్తుందో, గ్రహించిన ఇంద్రుడు ఆమెను సేవిస్తూ, ఎప్పుడు ఆమె నియమ భంగానికి పాల్పడుతుందో అని కాచుకొని ఉన్నాడు. ఒకనాడు దితి తన నియమ పూర్వక వ్రతాన్ని ఆచరించి, పని బడలికతో భోజనం తరువాత పాదప్రక్షాళనం చేసుకొనకుండా నిద్రించింది. అదే అదనుగా భావించి ఇంద్రుడు యోగమాయా ప్రభావంతో దితి గర్భంలో ప్రవేశించి ద్వివ్యతేజోమయమైన బాలుణ్ణి తన వజ్రాయుధంతో ఏడు ఖండాలుగా ఖండించాడు. ఆ ఏడు ఖండాలను ఒకొక్కదానిని మరలా ఏడు ఖండాలుగా ఖండించాడు. మొత్తం నలభై తొమ్మిది ముక్కలైన ఆ తేజోమయ పిండాలు నలభైతొమ్మిది మంది బాలకులై ఇంద్రుని ప్రార్థించారు. వారందరూ తల్లి గర్భంనుండి వెలుపలికి వచ్చి, తల్లికి మరుద్గణాలుగా మారి దేవత్వాన్ని పొంది ఇంద్రునితోపాటు నమస్కరించారు. దితికి మెలకువ వచ్చి చూడగా ఎదురుగా ఉన్న నలభైతొమ్మిది మందితో ఉన్న దేవేంద్రుని చూచి ఆగ్రహించింది. అప్పుడు ఇంద్రుడు జరిగినదంతా చెప్పి తల్లిని క్షమించమని ప్రార్థించాడు. దితి చేసేదిలేక శాంతించింది. అప్పుడు ఇంద్రుడు మరుద్గణాలకు సోమపానానికీ, హవిర్భాగాలకు అర్హత కల్పించి దేవతలుగా గుర్తించి వారితో స్వర్గంలో సుఖంగా ఉన్నాడు.

**ముప్పై నాలుగవ అధ్యాయము – షష్ఠమ స్కంధము**

**జవాబులు :** 1. 4. వ్యామోహాన్ని విడిచాడు 2. 1. నారాయణ మంత్రం 3. కైలాస పర్వత ప్రాంతంలో

* * *

## ముప్పై ఐదవ అధ్యాయము - సప్తమ స్కంధము

**1. నారాయణుని వైషమ్యా భావం 2. వైకుంఠ ద్వారపాలకులను సనకాదులు శపించడం 3. సుయజ్ఞోపాఖ్యానం**

**1) ప్రశ్న :** శ్రీమహావిష్ణువుకి దేవతలపై పక్షపాతం, రాక్షసులపై విరోధం అనే ప్రవృత్తి ఎలా కలిగింది? తెలుపుమని ఎవరు ఎవరిని అడిగారు?

**జవాబు :** 1. శ్రీశుకుని పరీక్షిత్తు 2. సూతుని శౌనకాదులు 3. నారదుని ధర్మరాజు 4. మైత్రేయుని విదురుడు

**2) ప్రశ్న :** శ్రీమహావిష్ణువు కాలస్వరూపుడని, ఈ సృష్టి అంతా ఆయన లీలా విశేషమేనని పరీక్షిత్తుకు తెలుపుతూ శ్రీశుకుడు ఎవరిని ప్రార్థించి చెప్పాడు?

**జవాబు :** 1. నారదుని 2. నారాయణుని 3. వేదవ్యాస మహర్షిని 4. రుద్రుని

**3) ప్రశ్న :** హిరణ్యాక్షుని ఆదివరాహ రూపంలో శ్రీహరి మట్టుబెట్టగా దుఃఖిస్తున్న తల్లిని ఓదారుస్తూ హిరణ్యకశ్యపుడు సుయజ్ఞ మహారాజు కథను చెప్పి, సుయజ్ఞుడు మరణించగా భార్యాబిడ్డలను ఓదార్చడానికై బాలరూపంలో ఎవరు వచ్చారని చెప్పాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ధర్మరాజు రాజసూయయాగ సందర్భంలో శిశుపాలుని గురించి అడిగిన దానికి నారద మహర్షి ధర్మజునికి ఏమని సమాధానం చెప్పాడు?

**జవాబు :** తాను చేస్తున్న రాజసూయయాగ సందర్భంలో ధర్మరాజు నారద మహర్షిని చేరి మహర్షీ! మహానుభావుడైన వాసుదేవునిలో ప్రవేశించటం ఎటువంటి పుణ్యాత్ములకైనా వీలుకాదే. ఎటువంటి తేజస్సుకైనా వానిలో ప్రవేశించే శక్తి ఉండదే. అటువంటిది. శత్రువైన శివుపాలుడు ఆ మహా సౌభాగ్యాన్ని ఎలా పొందగలిగాడు. స్వామీ! వీనికి విష్ణువును నిందించటమే నిత్యకృత్యం కదా! ఈ పుణ్య పదం వీనికెలా కలిగింది? అని అడిగిన

యుధిష్ఠిరునితో నారదమహర్షి ఓరాజా! ఈ శిశుపాల, దంతవక్త్రులు ఇరువురూ వైకుంఠంలోని ద్వారపాలకులు జయ విజయులు. వీరు సనకసనందుల శాపకారణంగా విష్ణు విరోధులై జన్మించారు. మరలా ఆ విష్ణువే వారిని కడతేర్చి తనలో కలుపుకుంటాడు. కాగా ధర్మరాజా! సమస్త ప్రాణికోటి యందు ఉండేటటువంటి నారాయణుడికి ద్వేషంకానీ, విరోధంకాని ఏ ఒక్కటీ, ఎవరిమీదా, ఎప్పుడూ ఉండదు. కోపంతోకానీ, కోరికతోకానీ, స్నేహంతోకానీ, మోహంతోకానీ, శత్రుత్వంతోకానీ, ప్రీతితోకానీ, భీతితోకానీ, ఏవిధంగా నైనాసరే హరిని ఏమరకుండా స్మరిస్తున్నట్లైతే సర్వభూతాత్మకుడైన విష్ణుదేవుని సాన్నిధ్యం లభిస్తుంది. ఆ స్వామి ఎవరినీ, ఎప్పుడూ పరునిగా చూడడు. దీనికి ఉదాహరణగా చెపుతాను విను. అధికమైన కామంతో గోపికలూ, భయంతో కంసుడూ, వెనుదీయని వైరంతో శిశుపాలుడూ, దంతవక్త్రుడూ మొదలైన రాజులూ, అనుబంధం పెంచుకొన్న సంబంధంతో యాదవులూ, ప్రేమతో ఉత్తమ ప్రభువులైన మీరు, భక్తితో మహర్షులమైన మేమూ శ్రీహరినామ స్మరణంచేసి ఆ స్వామి అనురాగానికి పాత్రులమయ్యాం. కాబట్టి ఏ విధంగానైనా సరే నిరంతరమైన స్మరణంవల్ల జనుడు జనార్ధనుడౌతాడు నరుడు నారాయణుడౌతాడు అని చెప్పి నారద మహర్షి ధర్మరాజు సందేహాన్ని తీర్చాడు.

**5) ప్రశ్న :** సనకసనందాదులు ఎవరు? వారు వైకుంఠ ద్వారపాలకులను ఎందుకు శపించారు? ఆ శాప ఫలితమెట్టిది?

**జవాబు :** సనకుడు, సనందుడు, సనత్సుజాతుడు, సనత్కుమారుడు ఈ నలుగురు బ్రహ్మ మానస పుత్రులు. వీళ్ళు నిరంతర నారాయణ ధ్యాన పరాయణులు. విష్ణుదేవునికి ప్రియమైన వాళ్ళు. వీళ్ళు ఒకప్పుడు దైవవశాన ముల్లోకాలు చూచి వస్తూ వైకుంఠం వెళ్ళారు. ఈ నలుగురు బాలరూపాలతో శ్రీధామం అంతఃపురంలోకి ప్రవేశింపబోయారు. వీరి మహత్తు తెలియక అక్కడ ఉన్న స్వామి ద్వారపాలకులు ఇద్దరూ వారిని, స్వామి సన్నిధానానికి వెళ్ళనీయక అడ్డగించారు. మునీంద్రులు ఎంతచెప్పినా వినక ద్వారపాలకులు వారిని దర్శనానికి వెళ్ళనీయలేదు. సనకాదులు ఎంతో నిగ్రహం కలవాళ్ళు.

అయినప్పటికీ వాళ్ళు నిగ్రహాన్ని కోల్పోయి వెంటనే కోపగించి ఆ ద్వారపాలకులను 'మీరు రాక్షసులై పుట్టండి' అని శపించారు. అప్పుడు ఆ ద్వారపాలకులు మునీంద్రులను శరణువేడగా, ఆ మహాత్ముల మనసు కరిగి, వారిని ప్రసన్న దృష్టితోచూచి, మీరు మూడు జన్మలలో హరి విరోధులై పుట్టి చివరకు నారాయణుని చేతనే సంహరింపబడి, వైరభక్తితో మరల శ్రీహరిని చేరగలరు అని చెప్పి ఆ సనకాదులు వెళ్ళారు. ఆ కారణంగా జయ విజయులు తొలి జన్మలో హిరణ్యాక్ష, హిరణ్య కశ్యపులుగాను జన్మించి నారాయణుని వరాహ, నారసింహ అవతారాల వలన వారు పరమపధాన్ని చేరారు. రెండవ జన్మగా రావణ, కుంభకర్ణులుగా జన్మించి మహావిష్ణువు రామావతారంతో వారు వైకుంఠాన్ని చేరారు. తరువాత మూడవ జన్మలో శిశుపాల, దంతవక్త్రులుగా జన్మించి శ్రీహరి కృష్ణావతారం వలన వారు సంహరింపబడి శ్రీమన్నారాయణ స్థానమైన పరమ పదాన్ని చేరారు. ఈ విధంగా వైరభక్తితో జయ విజయులు మూడు జన్మలలోనూ విష్ణువిరోధులై జన్మించి మరలా ఆ పురాణపురుషుని ద్వారానే వారు వారి శాశ్వత స్థానాన్ని పొందారు.

**ముప్పై ఐదవ అధ్యాయము - సప్తమ స్కంధము**

**జవాబులు :** 1. 1. శ్రీశుకుని పరీక్షిత్తు 2. 3. వేదవ్యాస మహర్షిని
3. యమధర్మరాజు

* * *

## ముప్పై ఆరవ అధ్యాయము - సప్తమ స్కంధము

### 1. బ్రహ్మదేవుడు హిరణ్యకశ్యపుని అనుగ్రహించడం 2. ప్రహ్లాద చరిత్ర

**1) ప్రశ్న :** హిరణ్యాక్షుడు భూమిని ఎత్తుకొని సముద్రంలోకి వెళుతుండగా మహావిష్ణువు ఏ అవతారంతో వానిని వధించి భూమిని కాపాడాడు?

**జవాబు :** 1. మత్స్యావతారం 2. కూర్మావతారం 3. వరాహావతారం 4. నారసింహావతారం

**2) ప్రశ్న :** హిరణ్యకశ్యపుడు తనకు మరణం లేని వరం కోరుకోదలచి బ్రహ్మదేవుని గురించి ఏ ప్రదేశంలో తపస్సు చేశాడు?

**జవాబు :** 1. మందర పర్వత ప్రాంతం 2. హిమాలయ ప్రాంతం 3. గంగానదీ ప్రాంతం 4. వింధ్య పర్వత ప్రాంతం

**3) ప్రశ్న :** హిరణ్యకశ్యపుని తపో తీవ్రతను భరించలేక, ఆతని తపస్సును త్వరగా విరమించేట్లుగా బ్రహ్మదేవుని ఎవరు ప్రార్థించారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** హిరణ్యకశ్యపుని తపస్సుకు మెచ్చి విరించి ప్రత్యక్షమై ఏ విధంగా అనుగ్రహించాడు?

**జవాబు :** దేవతల ప్రార్థనకు కరుణతో కరిగిపోయిన చతుర్ముఖుడు సమస్యకు పరిష్కారము ఆలోచించి, మందరపర్వతంపై తపమాచరించుచున్న హిరణ్యకశ్యపుని అనుగ్రహించాలని తలచాడు. భృగు, దక్షాదులను వెంటబెట్టుకొని ఆ దానవేంద్రుని ఎదుట ప్రత్యక్షమై చిరునవ్వుతో ఇలా పలికాడు. ఓ రాక్షసేంద్రా! నీ ఉగ్రతపస్సుతో మమ్ములను నీ వశులనుగా చేసికొన్నావు. నీవు కోరిన కోరికలను తీర్చటానికి నీవద్దకు వచ్చాను. ఏమి కావలయునో కోరుకొమ్ము అని పలికిన సృష్టికర్తను హిరణ్యకశ్యపుడు చూచి పరమానందభరితుడై, చేతులు మోడ్చి గద్గద స్వరంతో ఈ విధంగా స్తుతించాడు. భక్తవరదా! కరుణాసముద్రా! కోరిన కోరికలు నైపుణ్యంతో ఇచ్చి

కాపాడటంలో నీసాటి ఎవరూలేరు. దేవా! నా కోరికలు తప్పకుండా అనుగ్రహిస్తానంటే నేను కోరుకొంటాను. విధాతా! అభయ ప్రదాతా! గాలిలోకానీ, ధూళిలోకానీ, నిప్పులోకాని, నీళ్ళలోకానీ, నింగిపైకానీ, నేలపైకాని, ఏదిక్కునుంచి కానీ, ఏ మూలనుంచికానీ, రాత్రికాని, పగలుకానీ, చీకటిలోకానీ వెలుగులోకానీ, నన్ను మృత్యువు చేరరాదు. రాక్షసులచేతగానీ, దేవతలచేతగానీ, మృగముచేతగానీ, నరులచేతగానీ, నాగేంద్రాలచేతగానీ, నాకు మరణం సంభవింపకూడదు. ఎటువంటి యుద్ధంలోనైనా ఏ అస్త్రం, శస్త్రంచేత కూడా నేను చంపబడకూడదు. అటువంటి మరణంలేని జీవితం నాకు ప్రసాదించు ప్రభూ! దేవా! నాకు యుద్ధాలలో ఎదురులేని పరాక్రమం కావాలి. దిక్పాలకులను తలదన్నే ఘనత కావాలి. నేను మూడులోకాలపై దిగ్విజయం సాధించాలి. అట్టి వరాలు అనుగ్రహించు అని హిరణ్య కశ్యపుడు కోరగానే బ్రహ్మదేవుడు ఆతని తపస్సుకు మెచ్చి, కరుణించి దుర్లభాలైన ఆ వరాలన్నీ ఇచ్చి ఇలా హెచ్చరించాడు. ఓకశ్యప కుమారా! ఇలాంటి వరాలు ఎవరికీ పొందటానికి సాధ్యమైనవి కావు. నీకు నేను సంతోషంతో ఇచ్చాను. సుగుణవంతుడవై జాగ్రత్తగా క్షేమంగా జీవించు అని చెప్పి విధాత సత్యలోకానికి వెళ్ళాడు. హిరణ్య కశ్యపుడు ఆనందంతో తన రాజధానికి చేరుకున్నాడు.

**5) ప్రశ్న :** బ్రహ్మదేవుడు ప్రసాదించిన వరాలతో హిరణ్యకశ్యపుడు ఏ విధంగా ప్రవర్తించాడు? ఆతని కుమారులలో ప్రహ్లాదుడు ఎటువంటి వాడు?

**జవాబు :** విరించి ప్రసాదించిన వరాలతో దానవేంద్రుడు అహంకరించి, తన తమ్ముని చంపిన విష్ణువుపై పగబూని దేవతలను, భక్తులను బాధించసాగాడు. ఆ బాధలు భరించలేక దేవతలు నారాయణుని శరణుజొచ్చారు. ఆ స్వామి నాకు సర్వమూ తెలుసు తగిన సమయంలో ఆతనిని నేను సంహరిస్తాను. మీరు సందేహించక వెళ్ళండి అని శ్రీహరి వారికి అభయమిచ్చి పంపాడు. హిరణ్య కశ్యపునికి నలుగురు కొడుకులలో ప్రహ్లాదుడు హరి భక్తుడు. సమస్త ప్రాణులను తనలాగా భావించే సమదర్శి. అనుక్షణం విష్ణువును విడిచిపెట్టని ఆ ప్రహ్లాదుణ్ణి లోకంలో ఉన్న మంచి

గుణాలన్నీ తండోప తండాలుగా వచ్చి ఆశ్రయించాయి. ఒకరోజు తండ్రియైన హిరణ్యకశ్యపుడు కుమారుని దగ్గరగా పిలిచి, వాని స్వభావం పరిశీలనగా చూచి ఇలా అనుకొన్నాడు. వీడు రాకుమారుడులాగా, రాజసంగా, పౌరుషంగా ఉండటం లేదు. ఒకవేళ చదువు చెప్పిస్తే మనస్సు వికసించి బాగుపడతాడేమో, చురుకుతనం వస్తుందేమో అని ఆశపడ్డాడు. తన కులగురువు శుక్రాచార్యుని కుమారులు చండుడు, అమర్కుడు అనువారిని పిలిపించి ప్రహ్లాదుని వారికి అప్పగించి, నా బిడ్డకు మంచి చదువు చెప్పి, వీడిని ప్రయోజకునిగా చెయ్యమని చెప్పి పంపించాడు. కొంతకాలం తరువాత తనకుమారుని విద్యను పరీక్షింపనెంచి ఆ దానవేంద్రుడు గురువులను, తన కుమారుని పిలిపించాడు. తన బిడ్డ నేర్చుకున్న విద్యను పరీక్షింపనెంచిన ఆ దానవరాజుకు, అడుగడుగునా మాధవుణ్ణి ధ్యానిస్తూ, ఆ ధ్యానామృత మాధుర్యంలో తన్నుతానే మరచి, తన్మయత్వాన్ని పొందుతున్న ప్రహ్లాదుడు కనిపించాడు. హిరణ్యకశ్యపుడు గురువులవైపు చూడగా, వారు దానవేంద్రా! మావల్ల ఏ తప్పు లేదు. మేము ఇలాంటి స్తోత్రాలు బోధించలేదు అని చెప్పారు. అప్పుడు ఆయన వారిపై ఆగ్రహం మాని కొడుకును చూచి, నీకు ఈ విషయాలు ఉపాధ్యాయులు చెప్పలేదు. కాగా నీకు ఎవరు నేర్పారు? అని అడిగిన తండ్రితో కుమారుడు తండ్రీ! శ్రీహరిపై భక్తి ఒకరు చెపితే వచ్చేది కాదు. నేనే అనేక శాస్త్రాలు చదివి తెలిసికొన్నాను అని అనేక విధాల తన విరోధియైన మహావిష్ణువును గురించి శ్లాఘించి, చెపుతున్న కొడుకుపై ఆ దానవ సార్వభౌమునికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఈ విధంగా ప్రహ్లాదుని నైజాన్ని హిరణ్యకశ్యపుడు తెలిసికొన్నాడు.

### ముప్పై ఆరవ అధ్యాయము - సప్తమ స్కంధము

**జవాబులు :** 1. 3. వరాహావతారము 2. 1. మందర పర్వత ప్రాంతము
3. దేవతలు

* * *

## ముప్పై ఏడవ అధ్యాయము - సప్తమ స్కంధము

**1. హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదుని హింసించడం 2. నారసింహ దేవుని ఆవిర్భావం**

**1) ప్రశ్న :** హిరణ్యకశ్యపుడు తన కుమారుడైన ప్రహ్లాదుడు తన శత్రువును భజిస్తున్నాడని, అతనిని చంపమని సేవకులకు ఆజ్ఞ ఇచ్చాడు. హిరణ్యకశ్యపుని శత్రువు ఎవరు?

| **జవాబు :** | 1. శంకరుడు | 2. మహావిష్ణువు |
|---|---|---|
| | 3. బ్రహ్మదేవుడు | 4. దుర్గాదేవి |

**2) ప్రశ్న :** ప్రహ్లాదుణ్ణి కొన్నాళ్ళపాటు చదివిస్తే బుద్ధిమంతుడౌతాడు అని హిరణ్య కశ్యపునికి సలహా చెప్పింది ఎవరు?

| **జవాబు :** | 1. చండామార్కులు | 2. నారదుడు |
|---|---|---|
| | 3. యముడు | 4. లీలావతి |

**3) ప్రశ్న :** గురువుల వద్ద విద్య నేర్చుకొంటున్న ప్రహ్లాదుడు, తన తోటివారు అడిగిన ప్రశ్నకు సమాధానంగా తాను ఎవరి ఉపదేశం కారణంగా ఈ ఆత్మజ్ఞానాన్ని పొందినట్లుగా చెప్పాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదుని హరిభక్తిని చూచి ఆగ్రహించి ఏవిధంగా ప్రహ్లాదుని హింసించాడు? కాగా ఆ తండ్రీ కొడుకుల మధ్య జరిగిన సంవాదము ఏ రీతిగా జరిగింది?

**జవాబు :** శాంతుడూ, గుణవంతుడూ, జ్ఞాని అయిన ప్రహ్లాదుడు నిరంతరం కరములు మోడ్చి మనస్సులో పరంధాముని పాదపద్మాలనే ధ్యానించేవాడు. అటువంటి కుమారుణ్ణి చూచి, కోపించి ఆ రాక్షసరాజు నీవు రాక్షస సంప్రదాయాలు బుగ్గిపాలు చేశావు. నీవు కులద్రోహివి. నీవంటి వాణ్ణి చంపి, రాక్షస వంశానికి మచ్చరాకుండా చేస్తాను. ఓరీ! దిక్కులన్నీ నేనే గెలిచాను. నీవంటున్న ఆ నారాయణుడే వుండి వుంటే నేను దేవతలను

గెలిచేటప్పుడు, తన భక్తులను నేను హింసించేటప్పుడు బయటకు రాడా? సైన్యం లేకుండా నేను ఒక్కడినే గొప్పగొప్ప బలవంతులను జయించాను. నన్నే ఎదిరిస్తున్నావు. ఎవడి బలం చూచుకొని నీకు ఇంత ధైర్యం అని కోపంతో పలికిన తండ్రిని చూచి వినయంగా తండ్రీ! లోకంలో బలవంతులకూ, బలహీనులకూ ఎవడు బలమో నీకూ, నాకూ, బ్రహ్మాదిదేవతలకూ ఎవడు బలమో, సమస్త ప్రాణికోటికీ ఎవడు బలమో, ఆ పరాత్పరుడే నాకు బలము. దిక్కులకూ, కాలానికీ అతీతుడైన వాడెవడో, దిక్కులకు దిక్కైన వాడు ఎవడో, ఆధారం ఉన్న వాళ్ళకీ, ఆధారం లేని వాళ్ళకీ ఆధారం ఎవడో ఆ అచ్యుతుడే నాకు ఆధారం. దానవేశ్వరా! లోకాలన్నీ జయించావు. కానీ నిన్ను నీవు జయించలేక పోయావు. తండ్రీ! సంసార మోహాన్ని తొలగించుకొని నిరంతరం మనసంతా మాధవునిపై లగ్నంచెయ్యి అని పలికిన కొడుకును హిరణ్యకశ్యపుడు ఓరి కుమతీ చావుకు తెగించి పలుకుతున్నావు. చంపుతారని కానీ, చచ్చిపోతానని కానీ భయం లేకుండా పోయింది నీకు. దుర్మార్గుడా! కర్ణకఠోరమైన మాటలను ఈటెలుగా నామీద విసరుతున్నావు. చావును కూడా లెక్క చేయక మితిమీరి మాట్లాడుతున్నావు అని ఆ తండ్రీ కొడుకుల మధ్య వాగ్వివాదం జరిగింది.

**5) ప్రశ్న :** నారాయణుడు నరసింహ రూపంలో స్థంభము నందు ఏ సందర్భంలో ఏ రీతిగా ఆవిర్భవించాడు?

**జవాబు :** ప్రహ్లాదుడు తన తండ్రి అనిగానీ, దానవసార్వభౌముడనిగానీ ఇంచుకైననూ గ్రహింపక, హిరణ్యకశ్యపుడు అడుగుచున్న ప్రతిదానికీ సర్వమయుడూ, విశ్వాత్మకుడు ఆ విష్ణువే మూలమని చెప్పుతున్నాడు. అప్పుడా రాక్షసరాజు ఓరి దుర్మతీ! నీవు ఉన్నాడు అనే విష్ణువు ఎక్కడ ఉన్నాడు? ఏ విధంగా ఉంటాడో నాకు చెప్పు అని గద్దించి అడిగిన ఆ అసురాధిపతి మాటలకు ప్రహ్లాదుడు అమితమైనఆనందంతో నిలువెల్లా పులకించి పోయాడు. తండ్రీ భగవంతుడైన విష్ణువు లేనిచోటు విశ్వములో లేదు. అంతటా నిండి ఉన్నాడు. ఆ భగవంతుడు ఒకచోట ఉన్నాడనీ, మరొకచోట లేడనీ సందేహించవద్దు. అచ్యుతుడు అన్ని ప్రదేశాలలోనూ ఉంటాడు. ఎక్కడెక్కడ

వెతికితే అక్కడక్కడ కనిపిస్తాడు. నా మాట నమ్ము అని పలికిన కొడుకుపై ఆగ్రహించి ఓరీ! నీవు  ఉన్నాడూ, ఉన్నాడని నమ్మిన విష్ణువును ఈ స్థంభం నందు చూపగలవా? అని పలికిన తండ్రితో కొడుకు బ్రహ్మ మొదలుకొని గడ్డిపరక దాకా నిండి ఉన్న పరమాత్మ ఇంతపెద్ద స్థంభంలో ఉండడా? నిస్సందేహంగా ఉన్నాడు అని పలికిన ప్రహ్లాదుని చూచి తండ్రి ఒక్కసారిగా వికటాట్టహాసం చేసి, చివాలున లేచి సింహాసనము దిగి ఆ అసురచక్రవర్తి హిరణ్యకశ్యపుడు అరచేతితో భయంకరమైన కాంతులు వెదజల్లుతూ, జీవకోటికి చూడ శక్యంకాకుండా, శ్రీ నరసింహస్వామి ఆవిర్భావానికి సంరంభపడుతున్న ఆ స్తంభాన్ని బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు దశదిశలా విస్ఫులింగాలు వెదజల్లుతూ ఆ మహాస్తంభం పెళపెళమని భయంకర ధ్వనులు చేసింది. అందులో నుంచి దేదీప్య మానమైన దివ్య తేజస్సుతో నరసింహ దేవుడు ఆవిర్భవించాడు.

**ముప్పై ఏడవ అధ్యాయము – సప్తమ స్కంధము**

**జవాబులు :** 1. 2. మహావిష్ణువు 2. 1. చండామార్కులు
3. నారదుడు

* * *

## ముప్పై ఎనిమిదవ అధ్యాయము - సప్తమ స్కంధము

**1. నరసింహస్వామి హిరణ్య కశ్యపుని వధించడం 2బ్రహ్మాది దేవతలు స్వామిని కీర్తించడం**

**1) ప్రశ్న :** శ్రీ నరసింహస్వామి స్తంభం మధ్య నుండి ఆవిర్భవించగా, ఆ దృశ్యం చూచి, ఆ స్వామిపై విజయం సాధిస్తానని ముందుకు వచ్చిన హిరణ్య కశ్యపుని చేతిలో ఏ ఆయుధం ఉంది?

**జవాబు :** 1. శూలాయుధం 2. ముసలం
3. గదాయుధం 4. ధనస్సు

**2) ప్రశ్న :** తన చేతనున్న ఆయుధాన్ని నరసింహస్వామి పైకి విసిరిన హిరణ్యకశ్యపుని ఆ స్వామి ఏ ఆయుధంతో సంహరించాడు?

**జవాబు :** 1. చక్రాయుధము 2. గదాయుధము
3. నందకమనే కరవాలము 4. తనచేతి గోళ్ళతోనే

**3) ప్రశ్న :** హిరణ్యకశ్యప సంహారం జరిగిన అనంతరం నరసింహదేవుని పైకి ఆయుధాలు చేతబట్టి ఎవరు దండెత్తి వచ్చారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** హిరణ్యకశ్యపుని సంహరించిన అనంతరం నరసింహస్వామి ఏ విధంగా ఉన్నాడు?

**జవాబు :** దానవేంద్రుని సంహరించిన నరహరిరూపుడైన శ్రీహరి ఉగ్ర స్వరూపంతో దావానల జ్వాలలాగా దర్శనమిస్తున్నాడు. మెడజూలు నెత్తురుతో తడిసి ఎర్రబడింది. ఆ స్వామి రాక్షసుని ప్రేవులు కంఠమాలికలుగా ధరించి ఉన్నాడు. ఆ సమయంలో వేలకొలది రక్కసులు తనపైకి దండెత్తగా ఒక్కరినీ మిగలకుండా వధించాడు. ఆ విధంగా రాక్షస సంహారంచేసి రణం చాలించాడు. కానీ ఆ ఉగ్ర నారసింహస్వామికి ఆగ్రహం తగ్గలేదు. ఆ చూపులు ఇంకా భయం కలిగిస్తున్నాయి. కరాళ వదనంతో ఊగిపోతున్నాడు. ఇతరులు తనను

చూడటానికిగానీ, పలుకరించటానికి గానీ భయభ్రాంతులై తత్తర పడుతుండగా ఆ నృసింహదేవుడు అక్కడి సభాభవనంలోని సింహాసనంపై ఆసీనుడైనాడు.

**5) ప్రశ్న :** బ్రహ్మాది దేవతలు ఆ నరసింహదేవుని ఎవరెవరు ఏఏ రీతుల కీర్తించారు?

**జవాబు :** నరసింహస్వామి విజయోత్కర్షం జూచి హర్షంతో దేవకాంతలు కుసుమ వర్షం కురిపించారు. ఆనందంతో ఉత్సవం చేసుకొన్నారు. ఆ సమయంలో దేవతలందరూ ఎవరికి వారు స్వామిని వివిధరీతుల స్తుతించారు. ముందుగా బ్రహ్మదేవుడు కీర్తిస్తూ, ఈ అఖిల ప్రపంచాన్ని సృష్టించటం, పోషించటం, హరించటం అనే మహాకార్యాలన్నీ నీ లీలావిలాసంగా నిర్వహించే శక్తి సంపన్నా! అనంతజ్యోతి స్వరూపా! విచిత్ర పరాక్రమ శాలీ! నిత్య పవిత్ర కార్య నిర్వాహకా! అవ్యయాత్మా! నేను అత్యాసక్తితో నీ అనుగ్రహాన్ని అర్థిస్తూ అభివందనం ఆచరిస్తున్నాను. దేవా! స్వీకరించు అని ప్రార్థించాడు. ఆ విధంగానే రుద్రుడు, మహేంద్రుడు, మునీంద్రులు, పితృదేవతలు, సిద్ధులు, విద్యాధరులు, పన్నగులు, మనువులు, ప్రజాపతులు, గంధర్వులు, చారణులు, యక్షులు, కింపురుషులు, కిన్నరులు, వైతాళికులు, విష్ణు సేవకులు అందరూ ఆ నరసింహదేవుని ఎవరికి తోచిన విధంగా వారు కీర్తించారు.

**ముప్పై ఎనిమిదవ అధ్యాయము – సప్తమ స్కంధము**

**జవాబులు :** 1. 3. గదాయుధం 2. 4. తనచేతి గోళ్ళతోనె
3. అసుర వీరులు

* * *

## ముప్పై తొమ్మిదవ అధ్యాయము - సప్తమ స్కంధము

**1. నరసింహ దేవుని ప్రహ్లాదుడు స్తుతించడం 2. త్రిపురాసుర సంహారం**

**1) ప్రశ్న :** మహావిష్ణువు తన ఉగ్రనారసింహరూపం ఎంతకూ శాంతించక పోయేసరికి దేవతలంతా ఆయనను సమీపించి ప్రసన్నంచేసుకోవడానికి ఎవరిని ముందుగా ఆహ్వానించారు?

**జవాబు :** 1. ఇంద్రుడు 2. లక్ష్మీదేవి
3. నారదుడు 4. శంకరుడు

**2) ప్రశ్న :** ఉగ్రనారసింహుని శాంతింప జేయడానికై దేవతల విన్నపం మేరకు లక్ష్మీదేవి ప్రయత్నించి సంశయించి వెనుకకు తగ్గింది. అప్పుడు బ్రహ్మదేవుడు ఆ స్వామిని శాంతింపజేయడానికి ఎవరిని సమర్థునిగా ఎంచి ముందుకు పంపించాడు?

**జవాబు :** 1 ప్రహ్లాదుడు 2. సనకాదులు
3. దేవేంద్రుడు 4. నారదుడు

**3) ప్రశ్న :** బ్రహ్మదేవుని అనుజ్ఞతో ప్రహ్లాదుడు ముందుకు వచ్చి చేతులు జోడించి, ఆ నరసింహస్వామిని కీర్తించాడు. అప్పుడాస్వామి నిత్యమంగళకరమైన తన దివ్య హస్తాన్ని ప్రహ్లాదుని శరీరభాగాలపై ఎక్కడ ఉంచి ఆప్యాయంగా స్పృశించాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ప్రహ్లాదుడు నరసింహదేవుని ఏ విధంగా కీర్తించాడు? స్వామి ప్రహ్లాదుని కరుణించి ఏఏ వరాలను అనుగ్రహించాడు?

**జవాబు :** నరహరి హస్తస్పర్శతో ప్రహ్లాదునికి భయం పోయింది. దేహం పులకించింది. బ్రహ్మజ్ఞానం కలిగింది. ఆ జ్ఞానంతో ప్రహ్లాదుడు దేవా! అమరులూ, సిద్ధులూ, మునీంద్రులూ, బ్రహ్మాదులూ ప్రగాఢ కాంక్షతో నిన్ను నిత్యమూ అనేక విధాల ఆరాధిస్తారు. నీ గుణాలు గానం చేస్తారు. కానీ

సంపూర్ణంగా నిన్ను తెలుసుకొని, సమగ్రంగా నీ గుణాలను అభివర్ణించ లేరట! ఇక నేను ఎంత? అందులో అసురుని ఆత్మజుణ్ణి, గర్విష్టిని, బాలుణ్ణి, మూర్ఖుణ్ణి. నిన్ను కీర్తించటం నాకు అసాధ్యంకదా ప్రభూ! ఈశ్వరా! నిన్ను సంతోషపరచి సాయుజ్యం పొందటానికి ప్రతాపం, పౌరుషాలు పనికిరావు. సౌందర్యాలు, సత్కార్యాలు సరిపోవు. పుణ్యాలు, నైపుణ్యాలు పనిచేయవు. జప, తపాలు, వేదాధ్యయనాలూ వృధా. కులతత్వాలు కుదరవు. ప్రజ్ఞాబలాలూ, నిష్ఠానియమాలు నిరర్థకం. అన్నింటికీ మించి నీపై భక్తి ఒక్కటే నిన్ను సంతుష్టి పరచే సాధనం అని భక్తిపూర్వకంగా అనేక రీతుల స్తుతిస్తున్న భక్తుని భగవంతుడు ప్రహ్లాదా! నిన్ను చూస్తే నాకు చాలా ఆనందం కలుగుతుంది. నీకు ఏదైనా వరం ప్రసాదిస్తాను అడుగ మనగా ప్రహ్లాదుడు దేవా! నన్ను పరీక్షిస్తున్నావా! నాకు ఏ కోరికాలేదు. మోక్షకామినై నియమవంతుడనై నీచెంతకు వచ్చేటట్లు నన్ను అనుగ్రహించమని పలికిన జితేంద్రియుడైన ప్రహ్లాదుని శుభదృష్టితో చూచిన స్వామి ప్రహ్లాదా! నీవు కోరకపోయినా నీవు దానవనాథుడవై మన్వంతరకాలం సకల భోగాలు అనుభవించు. శుభప్రదమైన బుద్ధితో నా గాథలు విను. నన్నే సేవిస్తూ నీ జీవనాన్ని సాగించు. నీ తండ్రికి ఉత్తరక్రియలు చెయ్యి. అతడు నా శరీర స్పర్శతో నిర్మల దేహం పొంది పుణ్యలోకాలు చేరుకొంటాడు అని నారసింహ దేవుడు ప్రహ్లాదుని అనుగ్రహించి అంతర్ధానమయ్యాడు.

**5) ప్రశ్న :** త్రిపురాసుర సంహారకథను నారదుడు ధర్మరాజుకు తెలుపుతూ, ఏవిధంగా ఆయనకు నారదుడు సందేహ నివృత్తి చేశాడు?

**జవాబు :** ఒకప్పుడు దానవులు శ్రీహరి అండచే బలవంతులైన దేవేంద్రాదుల ఉద్ధతికి తట్టుకోలేక భయపడి పోయారు. అప్పుడు మయుడు అనే దానవుడు వారికి కనిపించి, ఆతడు సాధించిన అమోఘ శక్తి సంపదల చేత అసురులకు రహస్య మార్గాలు, రక్షణ గృహాలు, కలిగినట్టి ఇనుమూ, వెండి, బంగారాలతో నిర్మించ బడిన మూడు పురాలను రాక్షసులకు ఇచ్చి ఈ మూడు నగరాలలో మీ ఇచ్ఛవచ్చినట్లు  ఉండండి అని అన్నాడు. కలుషాత్ములైన రాక్షసులు

కామరూపులై వెనుకటి శతృత్వం గుర్తుంచుకొని రాజ్యాలను కొల్లగొడుతూ లోకాలను శోకాలపాలు చేయసాగారు. లోకపాలకులూ, దిక్పాలకులూ శోకమూర్తులయ్యారు. అప్పుడు వారంతా కైలాసం వెళ్ళి శంకరుని శరణు వేడారు. సకల లోకేశ్వరుడైన శంకరుడు దేవతలకు అభయమిచ్చి పినాకమనే ధనువును చేతబట్టి త్రిపురాలపైకి దండెత్తగా, తన దివ్యమైన బాణప్రయోగం వల్ల త్రిపురాలలోని దానవులందరూ మరణించారు. అప్పుడు మయుడు తన యోగబలంతో, సిద్ధరసంతో కూడిన ఒక సరస్సును తయారుచేసి, అసువులు బాసిన రాక్షస వీరులను తెచ్చి అందులో వేయసాగాడు. ఆ సిద్ధ రసంవల్ల రాక్షసులంతా పునరుజ్జీవితులై అమోఘ శక్తి సంపన్నులై మరలా దేవతలపైకి యుద్ధానికి వచ్చారు. అప్పుడు మహావిష్ణువు గోరూపంలో వెళ్ళి మయుని మాయా నిర్మితమైన సరస్సులోని సిద్ధరసమంతా త్రాగివేశాడు. ఆ కూప రక్షకభటులు ఆ గోవుయొక్క అందాన్ని చూస్తూ అచేతనులైనారు. విషయం తెలుసుకొన్న మయుడు రాక్షసులను ఓదార్చాడు. అటుపిమ్మట విష్ణుమూర్తి తన సర్వశక్తులను శంకరునికిచ్చి, ఆయనను త్రిపురాలపైకి వెళ్ళమన్నాడు. అప్పుడు పినాకపాణి సర్వశక్తిమంతుడై వదలిన బాణప్రయోగంతో అగ్నికణాలు వర్షించి ఆ పురాలు, అందులో నివశిస్తున్న రాక్షసులూ సర్వనాశనమైనారు. ఈ విధంగా త్రిపురాసుర సంహారం జరిగింది.

### ముప్పై తొమ్మిదవ అధ్యాయము – సప్తమ స్కంధము

**జవాబులు :** 1.2. లక్ష్మీదేవి    2.1. ప్రహ్లాదుని
3. శిరస్సు (మస్తిష్కం)

* * *

## నలభైయవ అధ్యాయము - సప్తమ స్కంధము

**1. నారదుడు ధర్మరాజుకు తెలిపిన వర్ణాశ్రమ ధర్మాలు 2. ప్రహ్లాద అజగర సంవాదం 3. నారదుని పూర్వజన్మ వృత్తాంతం**

**1) ప్రశ్న :** నారద మహర్షితో ధర్మరాజు లోకంలో ఉత్తమమైన ధర్మమేది? అని ప్రశ్నించగా, నారదుడు తనకు బదిరికావనంలో నారాయణుడు ఉ పదేశించిన ధర్మాన్ని చెబుతున్నాను అని ఏ ధర్మాన్ని గురించి చెప్పాడు?

**జవాబు :** 1. ఆశ్రమధర్మం 2. రాజధర్మాలు
3. సన్యాసధర్మం 4. సనాతనధర్మం

**2) ప్రశ్న :** ధర్మరాజుకు నారదమహర్షి సనాతన ధర్మాన్ని గురించి చెబుతూ, సకల జనులూ ఆచరించదగిన ధర్మాలు ఎన్నిగా మహర్షి యుధిష్ఠిరునకు తెలిపాడు?

**జవాబు :** 1. ముప్పది 2. ఇరువై ఏడు
3. ఇరవై ఐదు 4. ముప్పై ఐదు

**3) ప్రశ్న :** నారదమహర్షి ధర్మరాజుకు అనేక ధర్మాలను తెలుపుతూ, ఓరాజా! గృహస్థాశ్రమ ధర్మాలు చక్కగా నిర్వహించిన తరువాత వనానికి వెళ్ళి పరమాత్మ అయిన నిర్వికార పరబ్రహ్మాన్ని గురించి ధ్యానిస్తూ అందులోనే లీనం కావాలి అని మహర్షి తెలిపిన ధర్మాన్ని ఏమని పిలుస్తారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** నారదమహర్షి ధర్మరాజుకు ప్రహ్లాదాజగర సంవాదాన్ని ఏ రీతిగా తెలిపాడో సంక్షిప్తంగా తెలపండి?

**జవాబు :** ధర్మరాజుతో నారద మునీంద్రుడు ఓ రాజా! పూర్వం ప్రహ్లాదునికీ అజగరుడనే మునీంద్రునికీ సంవాదం జరిగింది. దానిలో పరమహంస ధర్మాలు చక్కగా వివరించబడ్డాయి. తెలియజేస్తాను విను. ఒకసారి మహాభక్తుడైన

ప్రహ్లాద చక్రవర్తి లౌకిక తత్వం తెలిసికొనాలని కొందరు మంత్రులను వెంట బెట్టుకొని లోకసంచారం చేయసాగాడు. అలా ప్రయాణిస్తూ కావేరీ నదీతీరం చేరుకొన్నాడు. అక్కడ సంచరిస్తున్న ప్రదేశంలో దుమ్ము కొట్టుకొని పోయిన దేహంతో అజగరుడనే ముని శయనించి ఉన్నాడు. శరీరం ధూళితో నిండి ఉన్నా ఆయన అద్భుతమైన తేజస్సు నిగూఢంగా వెలుగుతున్నది. ప్రహ్లాదుడు ఆ మునిని చూచి మునినాథా! నీవు సామాన్యుడవు కావు. ఎందుకు ఇలా అజగరంలాగా దుమ్ము ధూళిలో పడి ఉన్నావు అని అడుగగా ఓ దానవోత్తమా! అంతర్దృష్టితో నీవు సమస్తమూ తెలిసికొనగలవు. నీవు పరమసాత్త్వికుడవు. నీవుగా నన్ను ధర్మ జిజ్ఞాసతో అడుగుతున్నావు కనుక చెపుతాను విను. విషయ సుఖాలచేత తృప్తి పొందక పరుగులు పెట్టే దురాశ వెంటబడి నేను కర్మబంధాలలో చిక్కుకొని సంసార చక్రంలో పరిభ్రమించాను. నానా జన్మలు ఎత్తాను. మరణించాను. ఈ పరిభ్రమణంలో చివరకు మనుష్య దేహం ధరించాను. ఆ జన్మలలో ధర్మాలూ, పుణ్యాలూ చేసి స్వర్గ ద్వారాలు చేరుకొన్నాను. అధర్మాలూ, పాపాలు చేసి శునక, సూకరాది జంతువులు యోనులలో పుట్టి నానా బాధలూ పడ్డాను. మరలా మానవజన్మ ఎత్తాను. సమస్త క్రియల నుంచీ నివృత్తి పొందిన జీవుడు స్వతంత్రుడై ప్రకాశిస్తాడని నిర్ణయించు కొన్నాను. భోగాలు కోరికలవల్ల జనించేవే కాని శాశ్వతాలు కావు అని నిర్ణయించు కొన్నాను. కర్మబంధాల నుండి నివృత్తిపొంది ఏ ప్రయత్నమూ, ఏ కోరికా లేకుండా ఇలా నిద్రిస్తూ, ప్రారబ్ధభోగాలు అనుభవిస్తూ పడి ఉన్నాను అని ఇంకా అనేక విధాల పరమహంస ధర్మాలనూ, వాటి మాహాత్మ్యాన్ని ప్రహ్లాదునికి అజగరముని తెలిపాడు.

**5) ప్రశ్న :** ధర్మరాజుకు నారదమహర్షి తన పూర్వజన్మ వృత్తాంతాన్ని గురించి ఏ తెరగున వివరించాడు?

**జవాబు :** నారదమహర్షి తన పూర్వజన్మ వృత్తాంతాన్ని తెలుపుతూ ధర్మనందనా! గతించిన మహాకల్పంలో గంధర్వ వంశంలో ఉపబర్హణుడు అనేపేరుతో జన్మించాను. అపుడు నేను చాలా అందంగా ఉండేవాడిని. మధురంగా

మాట్లాడేవాణ్ణి. ఆ కారణంగా సుందరీమణులు సమ్మోహితులై నన్ను చేరవచ్చేవారు. నేనునూ వారితో కలిసి ఆనందించేవాణ్ణి. ఒకసారి విశ్వ సృష్టికర్తలైన ప్రజాపతులు దేవసత్రం అనే యజ్ఞం చేశారు. ఆ సమయంలో యజ్ఞ పురుషుడైన శ్రీమహావిష్ణువు గాథలను గానం చేయటానికి గంధర్వులను, అప్సరసలను ఆహ్వానించారు. ఆ యజ్ఞాలకు నేనూ గంధర్వ సమూహాలతో వెళ్ళాను. విష్ణుకథలు వీనుల విందుగా గానం చేశాను. మధ్యలో సుందరాంగులపై మనసుపోయి, కర్తవ్యం మరచి, హరికీర్తన మాని హరిణాక్షుల పొందుకోసం వెళ్ళాను. ఆ కారణంగా ప్రజాపతులకు నాపై కోపం వచ్చింది. అనివార్యమైన క్రోధంతో వాళ్ళు నన్ను శపించారు. ఓరి మదాంధుడా! నిన్ను హరి కథాగానం చేయమంటే చేయటం మాని మదిరాక్షులతో పారిపోయావు. ఈ పాపఫలంగా నీవు తేజస్సును కోల్పోయి ఎటువంటి దివ్యశక్తులూ లేక భూలోకంలో ఒక శూద్ర స్త్రీకి సుతుడవై జన్మించమన్నారు. ఆ మహాపురుషుల శాపకారణంగా దాసినిగా జీవనంసాగించే స్త్రీకి నేను పుత్రుడుగా పుట్టాను. అక్కడ చాతుర్మాస్య వ్రతదీక్షితులైన బ్రహ్మవేత్తలకు చాలాకాలం శుశ్రూష చేశాను. ఆ పుణ్యఫలంగానూ, నిరంతర నారాయణ నామస్మరణతోనూ, నిష్కాముడనై జీవనం సాగించిన ఫలితంగా బ్రహ్మమానస పుత్రుడనై జన్మించాను. ధర్మరాజా! నా పూర్వజన్మ వృత్తాంతమిది అని నారదమహర్షి చెప్పి ముగించాడు.

**నలభైయవ అధ్యాయము – సప్తమ స్కంధము**

**జవాబులు :** 1. 4. సనాతనధర్మం 2. 1. ముప్పై
3. వానప్రస్థాశ్రమ ధర్మం

* * *

## నలభై ఒకటవ అధ్యాయము - అష్టమ స్కంధము

**1. గజేంద్ర మోక్షం 2. క్షీరసాగర మథనం**

**1) ప్రశ్న :** శుకయోగి పరీక్షిన్మహారాజుకు భాగవతం చెప్పే క్రమంలో శ్రీహరి దయాసముద్రుడై మొసలికి చిక్కిన ఏనుగును రక్షించాడు అని చెప్పిన సన్నివేశం ఎవరు మనువుగా ఉన్నప్పుడు జరిగింది?

**జవాబు :** 1. స్వాయంభువుడు 2. స్వారోచిషుడు
3. ఉత్తముడు 4. తామసుడు

**2) ప్రశ్న :** త్రికూటమనే పర్వత ప్రాంతంలో ఆడ ఏనుగులతో కలిసి విహరిస్తున్న గజరాజు దప్పిగొని తిరిగి తిరిగి ఒక జలరాసిని చూశాడు. అందు విహరించాడు. కాగా ఆ గజరాజు విహరించిన జలరాసి ఎటు వంటిది?

**జవాబు :** 1. సముద్రం 2. నది
3. సరస్సు 4. తటాకము

**3) ప్రశ్న :** గజరాజు విహరిస్తున్న సరస్సులో నున్న ఒక మొసలి గజరాజు ముందరి కాలును పట్టింది. ఆ విధంగా ఏనుగు మొసలి చాలాకాలం పోరాడాయి. కానీ బలమైన శరీరం గలిగిన ఏనుగును పట్టి నిలువరించే బలం మొసలికి ఎలా వచ్చింది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** గజరాజు చాలాకాలం మకర రాజుతో పోరాడి చివరకు తన సత్తువను, శత్రువు బలాన్ని పోల్చి చూచుకొని దీనితో పోరాడటానికి నాకు సాధ్యంకాదు అని నిశ్చయించుకొని ఏమి చేశాడు? చివరకు ఏమి జరిగింది?

**జవాబు :** చాలాకాలం పాటు మకరంతో పోరాడిన ఏనుగు చివరకు మొసలిని ఓడించటానికి తనకు శక్తి చాలదని గ్రహించి దుఃఖించాడు. పూర్వజన్మ పుణ్యంవల్ల కలిగిన జ్ఞానంవల్ల తనలో దిక్కులేని నా మొరాలకించే వారు లేకపోతారా? వారిని వేడుకొంటాను అని భగవంతుని వేడుకొంటున్నాడు. ఏ

భగవంతుడు ఈ సమస్త సృష్టి, స్థితి, లయాలను కలిగి ఉంటాడో, ఈ విశ్వం మొత్తానికి మూలకారణమెవడో ఆ దేవుని నేను శరణు వేడుతున్నాను. ముక్తికి నాయకుడై, లోకాన్ని నడిపిస్తున్న, విశ్వమయుడైన పరమాత్మను నేను శరణు వేడుకొంటున్నాను. ఓ ఈశ్వరా! నాలో కొంచెం కూడా శక్తిలేదు. శరీరం స్రుక్కిపోయింది. ఆర్తితో వేడుకొంటున్నాను దేవా! నన్ను కరుణించి రక్షించుమని నింగివైపు నిక్కి చూస్తూ నిట్టూర్పులు విడిచాడు. ఆకాశానికి చెవులప్పగించి ఆక్రోశించాడు. ఆ సమయంలో బ్రహ్మాది దేవతలంతా గజేంద్రుని మొరాలకించి కూడా విశ్వమయత లేమి కారణంగా సాయపడలేక ఊరకే ఉండిపోయారు. అప్పుడు గజేంద్రుని దీనాలాపాలు విని శ్రీమహావిష్ణువు తనను శరణు వేడిన భక్తుని కాపాడనెంచి వైకుంఠంలోని వారెవరికీ చెప్పకుండా ఉన్నవాడు ఉన్నట్లుగానే బయలుదేరి వచ్చి తన చక్రాయుధంతో మకరిని సంహరించి గజరాజును కాపాడాడు. శ్రీహరి వైకుంఠం నుండి ఎవరికీ చెప్పకుండా రావటం చూచి, లక్ష్మీదేవితో సహా వైకుంఠంలోని ఆబాలగోపాలము నారాయణుని అనుసరించి వచ్చింది. అటుపిమ్మట మకరం దేవలముని శాపం కారణంగా హూహూ అనే గంధర్వుడు తన శాపం పోకార్చుకొని భగవంతునికి నమస్కరించి తన గంధర్వులలో చేరాడు. కాగా ద్రవిడ దేశాన్ని పాలిస్తున్న ఇంద్రద్యుమ్నుడనే రాజు అగస్త్యముని శాపకారణంగా గజరాజుగా పుట్టి, శ్రీహరి దర్శన భాగ్యంతో తన శాపం తీర్చుకొని నారాయణునికి పరమభక్తుడై పరమపదాన్ని చేరుకొన్నాడు.

**5) ప్రశ్న :** దేవదానవులు పాలసముద్రాన్ని ఎందుకు మథించారు? ఎలా మథించారు?

**జవాబు :** దుర్వాస మహర్షి శాపకారణంగా దేవేంద్రుని సకల సంపదలు సముద్రం పాలయ్యాయి. సంపదలను కోల్పోయిన ఇంద్రాది దేవతలు తేజస్సును కోల్పోయారు. రాక్షసరాజైన బలిచక్రవర్తి నాయకత్వంలో రాక్షసులు బలవంతులై దేవతలను ఇక్కట్లపాలు చేశారు. శత్రువులను గెలిచే ఉపాయం కానక దేవతలు బ్రహ్మదేవుని ముందుంచుకొని నారాయణుని శరణువేడారు. ఆయన కరుణించి దేవతలారా! మీరు నిర్మలమైన మనస్సుతో అమృతాన్ని ఉత్పత్తి చేయడానికి ప్రయత్నించటం మేలు. అమృతాన్ని త్రాగిన వారికి మరణంలేని మనుగడ

కలుగుతుంది. ఇందుకు దేవదానవులు కలసి పనిచేయాలి. మీరందరూ పాల సముద్రంలో తృణాలనూ, తీగలనూ, మొక్కలనూ, ఓషధులను విరివిగా తెచ్చి సముద్రంలో వేయండి. మందరపర్వతాన్ని కవ్వంగానూ, సర్పరాజైన వాసుకిని కవ్వపు త్రాడుగానూ చేసుకొని నా సహాయంతో పాలకడలిని చిలకండి. అందువల్ల మీకు ప్రయోజనం కలుగుతుంది. దేవతల సంపదలు తిరిగి వస్తాయి. రాక్షసులు కష్టాలపాలవుతారు. ఇంకనూ దానిలో పుట్టే వస్తువుల పట్ల ఇష్టానిష్టాలు పెంచుకొనరాదు అని చెప్పి పంపించిన శ్రీహరి మాటలు అనుసరిస్తూ దేవతలు రాక్షసులపట్ల స్నేహ భావాన్ని ప్రకటిస్తూ, బలిచక్రవర్తికి లోబడి మంచి మనసుతో సేవించారు. ఒకనాడు బలిచక్రవర్తితో దేవేంద్రుడు పాలసముద్రాన్ని మథించే విషయం తెలిపాడు. బలిచక్రవర్తి అంగీకరించగా, ఇంద్రుడు దేవతలకు నాయకుడుగా, బలి రాక్షసులకు నాయకుడుగా బయలుదేరి వెళ్ళి మందర పర్వతాన్ని తెచ్చి పాల సముద్రంలోవేసి, అందరు కలసివెళ్ళి వాసుకితో మాట్లాడి, అమృతంలో అతనికి భాగం ఇచ్చేందుకు ఒప్పుకొని, వాసుకిని తెచ్చి పర్వతానికి కవ్వపు త్రాడుగా చేసికొని తలవైపు రాక్షసులు, తోకవైపు దేవతలు పట్టి చిలికారు. కొండకు క్రింద కుదురు లేనందున ఆ పర్వతం సముద్రంలో మునిగి పోసాగింది. దేవదానవులు ఏమీ చెయ్యలేక పోయారు. సముద్రంలో మునుగుతున్న మందర పర్వతాన్ని చూచి అంతులేని దుఃఖసాగరంలో మునుగుతున్న దేవతలను విష్ణుదేవుడు అవలోకించాడు. వారు చూస్తుండగానే ఆయన సముద్రంలోకి దిగాడు. తరువాత కూర్మావతారకథ ప్రారంభమవుతుంది.

### నలభై ఒకటవ అధ్యాయము - అష్టమస్కంధము

**జవాబులు :** 1. 4. తామసుడు    2. 3. సరస్సు

3. స్థానబలంతో

* * *

# నలభై రెండవ అధ్యాయము - అష్టమ స్కంధము

**1. కూర్మావతార కథ 2. పరమశివుడు హాలాహలాన్ని పానం చేయడం 3. పాలకడలి యందు ఐరావతాదులు జనించడం**

**1) ప్రశ్న :** సముద్రంలో మునిగి పోతున్న మందరగిరి పర్వతాన్ని చూచి దేవతలు దుఃఖసాగరంలో మునిగిపోయారు. కాగా మహావిష్ణువు ఆ పర్వతాన్ని లేపి చిలకడానికి అనువుగా ఉండే విధంగా ఉంచగలిగిన అవతారం ఏది?

**జవాబు :** 1. మత్స్యావతారము 2. కూర్మావతారము
3. వరాహావతారము 4. నరసింహావతారము

**2) ప్రశ్న :** నారాయణుని అనుగ్రహంతో పాలసముద్రంలో మందరగిరి పర్వతం గిరగిరా తిరిగింది. అందుండి మొదటగా హాలాహలం పుట్టింది. ఆ మహావిషాన్ని ఉపశమింపజేసేందుకు దేవతలు ఎవరిని శరణు వేడారు?

**జవాబు :** 1. శంకరుని 2. మహావిష్ణువును
3. అగ్నిదేవుని 4. యమధర్మరాజును

**3) ప్రశ్న :** బ్రహ్మాదిదేవతల మొరవిని శంకరుడు, వేగంగా విస్తరించి పోతున్న మహావిషాగ్నిని ఆహ్వానించి, స్వీకరించి, దానిని తన శరీర భాగాల్లో ఎక్కడ ఉంచాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** దేవతల ప్రార్థన విని ఈశ్వరుడు హాలాహలాన్ని స్వీకరించిన వృత్తాంతాన్ని శ్రీశుకుడు పరీక్షిత్తుకు ఏ విధంగా వివరించాడు?

**జవాబు :** శంకరుడు ప్రాణభయంతో ఆశ్రయించిన ప్రాణులను, కాపాడడం ప్రభువుల కర్తవ్యం అని ఆలోచించి, తన దేవేరితో హరిణాక్షీ! లోకాల దుఃఖాన్ని ఆలోకించావా? పరోపకారమే పరమోత్తమ ధర్మం. కావున హాలాహలాన్ని పండ్లరసంవలె ఆరగిస్తాను. ఈ లోకాలను కాపాడుతాను అని పలికిన మహేశ్వరునితో 'స్వామీ! మీ మనస్సుకు తగినట్లు నిశ్చయించుకొనండి' అని

భవానీదేవి పలికింది అని చెపుతున్న శుకయోగితో పరీక్షిత్తు మునీంద్రా! లోకాలకు మేలు కలుగుతుందని శివుడు సరేనన్నాడనుకో! భయంతో కూడిన దేవతలు స్వామిని హాలాహలాన్ని మ్రింగమన్నారనుకో! పార్వతీదేవి కన్నులారా ఆ హాలాహలాన్ని చూస్తూ భయంకరమైన ఆ అగ్నిజ్వాలలను మ్రింగమని ఎట్లా చెప్పింది? అని అడిగిన రాజుతో మహర్షి మ్రింగేవాడు తన భర్త అని తెలిసీ, మ్రింగేది విషమనీ తెలిసీ, దానివలన లోకాలకు మేలు కలుగుతుందనే ఉద్దేశంతో సర్వమంగళయైన ఆ పార్వతీదేవి మ్రింగమని చెప్పింది. ఆమె తన మనస్సులో తన మంగళ సూత్రాన్ని ఎంతగా నమ్మిందో? మరి ఓ రాజా! పిమ్మట దేవతలు శివుని చుట్టూ చేరి జయజయ ధ్వానాలు చేశారు. శివుడు ఆ విషాన్ని తన చేయిచాచి పట్టుకొని నేరేడు పండువలె విలాసంగా భుజించాడు. ఈవిధంగా శంకరుడు దేవతల రాక్షసుల కష్టాన్ని బాపాడు.

**5) ప్రశ్న :** క్షీరసాగరమథనం జరిగేటప్పుడు పుట్టిన హాలాహలం సమసిపోయిన అనంతరం ఆ సాగరంలో నుండి ఏమేమి వస్తువులు పుట్టాయి? వాటిని ఎవరెవరు స్వీరించారు?

**జవాబు :** క్షీరసాగరమథనం జరిగే సందర్భంలో మొదటగా కామధేనువు పుట్టింది. కోరిన కోరికలను తీర్చే ఆ వేల్పుటావును దేవమునులు హోమకార్యాలకు తగినదని వారు స్వీకరించారు. పిమ్మట ఆ సముద్రంలో 'ఉచ్చైశ్రవ' మనే గుఱ్ఱం పుట్టింది. దానిని బలిచక్రవర్తి తీసుకున్నాడు. భగవంతుని ప్రేరణవల్ల ఇంద్రుడు అందుకు కాదనలేదు. అటు పిమ్మట కౌస్తుభమనే దివ్యమణి ఉద్భవించింది. దానిని మహావిష్ణువు స్వీకరించాడు. తదుపరి నాలుగు దంతాలు కలిగిన ఐరావతమనే ఏనుగు పుట్టింది. అనంతరం కోరికలను తీర్చే కల్పవృక్షం పుట్టింది. పిమ్మట అప్సరసలు పుట్టారు. ఐరావతము, కల్పవృక్షము, అప్సరసలతో సహా ఇవి అన్ని స్వర్గలోక సంపదలు కావున ఇంద్రుడు స్వీకరించాడు. పిమ్మట చంద్రుడు పుట్టి బ్రహ్మదేవుని అనుమతితో తన మొదటి స్థానాన్ని పొందాడు. అటుపిమ్మట ఆ జలనిధి నుండి అందాలకు, ఐశ్వర్యానికి అదిదేవతగా లక్ష్మీదేవి ఉద్భవించింది. ఆమెను శ్రీమహావిష్ణువు పెండ్లాడాడు.

తదుపరి ఆ సాగరంలో నుండి వారుణి అనే అందాల రాశి ఆవిర్భవించింది. ఆ కన్యను విష్ణువు అనుమతితో రాక్షసులు స్వీకరించారు. అటు తరువాత చిలకగా చిలకగా అమృత భాండం చేతపట్టుకొని ఒక దివ్యపురుషుడు జన్మించాడు. ఈ విధంగా సాగర గర్భంనుండి ఉద్భవించిన వస్తువులను దేవదానవులు పంచుకొన్నారు.

**నలభై రెండవ అధ్యాయము – అష్టమస్కంధము**

జవాబులు : 1. 2. కూర్మావతారము 2. 1. శంకరుని
3. కంఠంలో

* * *

## నలభై మూడవ అధ్యాయము - అష్టమ స్కంధము

**1. శ్రీహరి మోహినీ రూపం 2. దేవాసుర యుద్ధం 3. పరమశివుడు మోహినీరూపాన్ని దర్శించడం**

**1) ప్రశ్న :** క్షీరసాగరమథన ఫలితంగా చివరగా, ఒక దివ్య పురుషుడు అమృత భాండాన్ని చేత పట్టుకొని ప్రత్యక్షమయ్యాడు. ఆ దివ్య పురుషుని పేరేమి?

**జవాబు :** 1. చరకుడు 2. చ్యవనుడు 3. ధన్వంతరి 4. చంద్రుడు

**2) ప్రశ్న :** దేవదానవుల శ్రమకు ఫలితంగా ఉద్భవించిన అమృతభాండాన్ని రాక్షసులు బలవంతముగా లాక్కొని ఒకరిని ఒకరు త్రోసికొంటుండగా, మహావిష్ణువు ఏ అవతారాన్ని ధరించి అమృత కలశాన్ని స్వాధీనం చేసికొన్నాడు?

**జవాబు :** 1. హయగ్రీవావతారం 2. కూర్మావతారం 3. కపిలావతారం 4. మోహినీ అవతారం

**3) ప్రశ్న :** రాక్షసుల చేతుల నుండి అమృతభాండాన్ని గ్రహించిన మోహినీ రూపంలో నున్న నారాయణుడు అమృతాన్ని దేవతలకు పంచే క్రమంలో వారి వరుసలో కూర్చుని అమృతసేవనం చేసిన రాక్షసుడు ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** అమృత సేవనానంతరం దేవాసుర సంగ్రామం ఏవిధంగా జరిగింది? ఆ యుద్ధంలో ఎవరు పరాజయం పాలైనారు?

**జవాబు :** క్షీరసాగర మథన సమయంలో తాము చేసిన కృషికి ఫలితం దక్కకపోగా, తమ శత్రువులైన దేవతలకు తమ సమక్షంలోనే శ్రీహరి అమృతాన్ని పంచటం, సహించలేక రాక్షసులు దేవతలపైకి యుద్ధం ప్రకటించారు.

అమృతపానం చేసిన దేవతలు మిక్కిలి శక్తివంతులై అస్త్రశస్త్రాలను ధరించి యుద్ధసన్నద్ధులయ్యారు. అప్పుడు పరస్పరం శత్రుత్వం కలిగిన రెండుపక్షాలవారు, వివిధాయుధాలతో ఘోర యుద్ధము చేశారు. ఆ క్షీరసాగర తీరాన సురాసురుల మధ్య జరిగిన భయంకర యుద్ధము 'దైవాసుర సంగ్రామము' అనే పేరుతో ప్రసిద్ధి గాంచింది. లోగడ దేవతలపై విజయాన్ని సాధించిన రాక్షసులు విజయగర్వంతోనూ, అమృత సేవనంతో నూతనోత్తేజాన్ని పొందిన దేవతలతోనూ యుద్ధం అతి భయంకరంగా సాగింది. ఆ యుద్ధంలో బలిచక్రవర్తి మయునిచే నిర్మితమైన 'వైహాయస' మనే విమానంతో సహా, ఇంద్రుడు ప్రయోగించిన వజ్రాయుధంతో కూలిపోయాడు. అవ్యాజమైన శ్రీహరి అనుగ్రహంతో దేవతలు రాక్షసులపై విజయం సాధించగలిగారు. అప్రతిహతమైన పరాక్రమశీలురైన ఎందరో రాక్షసులు, విధికి వశులై పరాజయం పాలు కావలసి వచ్చినది. అటుపిమ్మట దేవతలు స్వర్గలోకాన్ని చేరి ఎవరి స్థానాలను వారు పొందారు. రణరంగాన మిగిలిన దైత్యులు వజ్రాయుధ దెబ్బకు గురియైన బలిచక్రవర్తిని తీసికొని అస్తాద్రికి వెళ్ళారు. అచట శుక్రాచార్యుని స్పర్శచే బలిచక్రవర్తి యొక్క ఇంద్రియాల యందు చైతన్యమును, మనస్సు నందు స్మరణయును కలిగింది. లోకంలో జయాపజయాలు సహజమని బలి భావించాడు. రణరంగమున కంఠములు, ఇతర అవయవములు ఖండింపబడని వారిని శుక్రాచార్యుడు తన మృతసంజీవని విద్యచే బ్రతికించాడు. ఈ విధంగా దేవాసుర సంగ్రామం జరిగింది.

**5) ప్రశ్న :** మహావిష్ణువు మోహినీ రూపందాల్చి, అమృతాన్ని దేవతలకు పంచినాడని తెలిసికొన్న పరమశివుడు ఏమి చేశాడు? శ్రీశుకుడు పరీక్షిత్తుకు మనువులు ఎవరెవరుగా తెలిపాడు?

**జవాబు :** శ్రీహరి స్త్రీరూపం దాల్చి, అసురులను మోహింపజేసెనని, దేవతలకు అమృతము పంచెనని పరమశివుడు తెలిసికొని, పార్వతీదేవి మరియు తన

ఇతర ప్రమద గణములను వెంటబెట్టు కొని వైకుంఠానికి చేరాడు. శ్రీహరి గౌరీ శంకరులకు సాదర స్వాగతం పలికాడు. అప్పుడు పరమశివుడు నారాయణునితో దేవా! నీవు సమస్త విశ్వమందు వ్యాపించిన జగదీశ్వరుడవు. లోగడ ఈ విశ్వశ్రేయస్సు కోరి నీవు ప్రదర్శించిన అవతారాలన్నింటిని నేను దర్శించాను. ఇప్పుడు దేవకార్యము కొరకు నీవు మోహినీ రూపాన్ని ధరించావు. ఆ రూపాన్ని కూడా నేను దర్శింపవలెనని మా మనస్సులు ఉబలాటపడుచున్నవి అని పలికిన శంకరునితో మహావిష్ణువు మహాదేవా! అమృత కలశాన్ని దైత్యులు వారికే స్వంతమన్నట్లు తీసికొని పోవుచుండిరి. అప్పుడు దేవ కార్యమును సాధించుటకై, దైత్యులలో కుతూహలాన్ని కలిగించుటకు స్త్రీ రూపాన్ని ధరించవలసి వచ్చింది. కానీ ఆ రూపాన్ని నీ అంతటి వాడివి నీవు కోరగా మీకు చూపిస్తాను. కానీ ఆ రూపము కాముకులకే! ఆదరణీయము అని పలుకుతూ విశ్వాత్మకుడు అంతఃర్థితుడయ్యాడు. పరమశివుడు నాలుగు వైపుల యందు తమ చూపులను ప్రసరింప జేస్తుండగా, అంతలో ఉమాశంకరులు తమ ఎదుట ఒక ఉపవనాన్ని చూశారు. అందు చిత్ర విచిత్రాలైన పూలతో అలరారే పూపొదరిళ్ళ మధ్య ఒక సుందరి బంతి ఆట ఆడుచూ కనబడింది. ఇంచుక సిగ్గుతో దరహాసం చేయుచు తన క్రీగంటి చూపుతో శంకరుని వైపు చూసింది. అంతట ఈశ్వరుని మనస్సు వశము తప్పింది.ఆయన రెప్పవాల్చక మోహినిని చూస్తూ విహ్వలుడై తనను తాను మరచిపోయాడు. ఆ అపురూప సౌందర్యరాశిని చూచిన పరమశివుడు ఆకర్షితుడై ఆమెపై మరులుగొన్నాడు. ఆమెయును ఆయనపై ఆసక్తురాలైనట్లు కనబడింది. ఆ మోహిని శివుని వివేకాన్ని హరించి వేసింది. వారిరువురును మునుల నివాస స్థానాలందును, నదీ, పర్వత, వనాలందునూ కొంత తడవు విహరించారు. కొంత సమయం తరువాత శంకరునకు ఇది అంతయు శ్రీహరి మహిమయని తెలియవచ్చింది. అప్పుడు మహావిష్ణువు పురుషరూపాన్ని పొంది పరమశివునితో దేవశిరోమణీ! నా మోహినీ రూపమాయలో మోహితుడవయ్యును నీవు నిష్ఠయందే

నిలిచియుంటివి. నీవు తప్ప నా మాయను ఎవ్వరును అతిక్రమింపలేరు. త్రిగుణాత్మకమైన నా మాయ మహాత్ములను గూడా మోహితులను గావిస్తుంది అని తెలిపిన పురుషోత్తముని శంకరుడు అభినందించి తన గణాలతో గూడి కైలాసానికి చేరాడు.

**నలభై మూడవ అధ్యాయము – అష్టమ స్కంధము**

**జవాబు :** 1. 3. ధన్వంతరి 2. 4. మోహినీ అవతారము
3. రాహువు

* * *

## నలభై నాలుగవ అధ్యాయము – అష్టమ స్కంధము

**1. వామన చరిత్ర 2. వామన మూర్తి ఆవిర్భావం 3. వామనుడు బలిచక్రవర్తి యాగాన్ని దర్శించడం**

**1) ప్రశ్న :** బలిచక్రవర్తి ఇంద్రుని చేతిలో ఓడిపోయి, శుక్రాచార్యుని దయవల్ల తేరుకొన్నాడు. అప్పుడు శుక్రాచార్యుడు బలిచక్రవర్తి చేత చేయించిన యాగం పేరేమి?

**జవాబు :** 1. అశ్వమేథయాగం  2. రాజసూయయాగం
3. ధనుర్యాగం  4. విశ్వజిద్యాగం

**2) ప్రశ్న :** శుక్రాచార్యుని అనుగ్రహంతో బలిచక్రవర్తి అమేయమైన ఆయుధ సంపత్తిని సంపాదించుకొని దేవతల రాజధాని నగరం పైకి దండెత్తి వచ్చాడు. అట్టి దేవతల రాజధాని నగరం పేరేమి?

**జవాబు :** 1. అమరావతి  2. అలకాపురి
3. వైకుంఠము  4. కైలాసము

**3) ప్రశ్న :** బలిచక్రవర్తి బలసంపదను చూసి, శత్రువుతో పోరాడి గెలుపూ, సమానత్వమూ, మరణమూ కలగని పక్షంలో సమరం నుండి తొలగిపోవడమే మేలని ఇంద్రునికి సలహా చెప్పినది ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** కశ్యప ప్రజాపతి తన భార్య మనోవేదనను గుర్తించి ఆమెను ఏవిధంగా అనునయించి మాట్లాడాడు? మహావిష్ణువు అదితి గర్భాన వామనమూర్తిగా ఆవిర్భవించుటకు గల కారణమేమి?

**జవాబు :** కశ్యప ప్రజాపతి తాను చేస్తున్న తపస్సు చాలించి ఒకనాడు ఇంటికి వచ్చాడు. తనకు పరిచర్యలు చేస్తున్న తన భార్య అదితి బాధపడు తుండటం చూచి విషయం అడిగాడు. అదితి కశ్యప ప్రజాపతితో నాథా! దితిబిడ్డలూ,

వారి బిడ్డలూ బలవంతులై పగబూని నా బిడ్డలను ఓడించి సాహసంతో అమరావతిని ఆక్రమించుకొని పాలిస్తున్నారు. ఈ విషాద వార్త నీకు ఏమని విన్నవించగలను? ఇంద్రుడు, శచీదేవి ఈనాడు పలుకష్టాలకు గురియైనారు. దేవతలకు నెలవైన అమరావతి రాక్షసులకు ఆలవాలమైంది అని తన భార్య అదితి చెప్పిన మాటలు విని కొంచెంసేపు చింతించి కశ్యప ప్రజాపతి ఆమెను ఓదార్చి, అందరూ నా సంతానమే కాని తండ్రి ఎవడు? కొడుకెవడు? అంతా శ్రీహరిమాయలో పడి అజ్ఞానంలో బంధింపబడి ఉన్నాము. సరే ఇప్పటికి తగిన కార్యాన్ని చెపుతాను విను అని మహావిష్ణువుకు సంబంధించిన 'పయోభక్షణం' అనే వ్రతాన్ని, దానిని అనుసరించుటకు కావలసిన విధి విధానాలను అదితికి కశ్యప ప్రజాపతి వివరంగా చెప్పాడు. తన పతి చెప్పిన విధంగానే అదితి ఫాల్గుణ శుక్ల పాడ్యమి రోజున వ్రతం మొదలుపెట్టి చక్కగా నియమ నిష్టలతో పూర్తి చేసింది. అప్పుడు నారాయణుడు ఆమెకు ప్రత్యక్షమైనాడు. ఆమె భక్తితో ఆ స్వామిని స్తుతించింది. తండ్రీ! బలవంతులైన రాక్షసుల బారి నుండి నా బిడ్డలను కాపాడుమని కోరిన అదితితో పరమాత్మ అమ్మా! తేజస్సుతో కూడిన రూపంతో నీ కడుపున జన్మిస్తాను. సహనంతో కూడిన ఉపాయంతో తప్ప బలం చూపెట్టి రాక్షసులను మట్టుపెట్టడానికి ప్రస్తుతం వీలులేదు. భక్తితో నీ భర్తను సేవించుమని చెప్పి భగవంతుడు తన తేజస్సును కశ్యపునిలో ప్రవేశపెట్టాడు. ఒకనాడు కశ్యపుని వీర్యంవల్ల అదితి గర్భాన్ని ధరించింది. నెలలు నిండిన అదితికి వామనుడుగా మహావిష్ణువు ఆయన వైభవానికి తగినట్లుగా ఆవిర్భవించాడు.

**5) ప్రశ్న :** మహావిష్ణువు వామన మూర్తిగా బలిచక్రవర్తి వద్దకు ఏ విధంగా వెళ్ళాడు? అచ్చట ఆయన ఏ రీతిగా ప్రవర్తించాడు?

**జవాబు :** కశ్యపప్రజాపతి తన కుమారునికి ఉపనయన సంస్కారం నిర్వహించు సమయాన మహర్షులు అందుకు తగిన కార్యకలాపాలను నిర్వహించారు. ఉపనయనం పూర్తి అయిన తరువాత ఆ మాయాబ్రహ్మచారి, బలిచక్రవర్తి

యాగశాలను సందర్శించాలని ప్రయాణం సాగించి, నర్మదా నదిని దాటి దానికి ఉత్తరతీరంలో ఉన్న బలిచక్రవర్తి యాగశాలను దర్శించాడు. పుట్టుకేలేని విష్ణువు వామనుడిగా పుట్టి ఈ ధరాతలాన్ని తన పాదస్పర్శచేత పునీతం చేశాడు. యాగశాలా ప్రవేశం చేసిన వామనుడు సామవేదం పఠించే ఉద్గాతల గానాలు విన్నాడు. మంత్ర తంత్రాలను వివరిస్తూ హోమం చేసే హోతలను కలుసుకొన్నాడు. హోమకుండంలో మూడగ్నులను వెలిగించే ఋత్విజులను చూశాడు. ఆ వామనుడు కొందరితో కలిసి వేదాన్ని చదివాడు. కొందరితో నవ్వుతూ ముచ్చటించాడు. ఆవిధంగా పొట్టి బ్రహ్మచారి బలిచక్రవర్తిని చూసి ముల్లోకాలను శాసించే అధికారంగల ఓ దానవేంద్రా! నీకు స్వస్తి! రాక్షసలోక సార్వభౌమా! నీకు శుభమగు గాక! అని ఆ వామనుడు మానవాకారం ధరించిన వేదరాశివలె బలిచక్రవర్తి ఎదుట నిలబడ్డాడు. అటుపిమ్మట ఆ చక్రవర్తి వామనునితో ఓ బ్రహ్మచారీ! నీ పేరేమి? నీవు ఎవరి వాడవు? నీవు నివసించే చోటేది? నీవు రావటం వలన నా జన్మ సాఫల్యమైంది. ఈ యజ్ఞం పవిత్రమైంది. ఇది చాలా శుభసమయం, ఓ ఒడుగా! నీకేమి కావాలో కోరుకో ఇస్తాను అన్నాడు. అప్పుడు వామనుడు సంతోషించి ఓ రాజా! నేనెవ్వరని చెప్పేది నా అంతవాడిని నేను. అసురేంద్రా! నీ వంశానికి మంచి కీర్తి కలిగించుటకు మీవద్దకు వచ్చి 'దేహీ' అనే అర్థులకు దానంతో తృప్తి కలిగిస్తావు. ఓ రాజా! నీవు నాకు ఏవేవో ఇవ్వాలని కుతూహల పడుతున్నావు. నేను ఒంటరి వాడిని. నాకు మూడడుగుల నేల మాత్రమివ్వు దానితో తృప్తి పడతాను అని పలికిన వామనునితో బలి ఇంతటి రాక్షస చక్రవర్తి, ఇంతటి అల్పమైన దానిని ఎట్లా ఇస్తాడు? అని అనగానే వామనుడు అయ్యా! నా కోరికకు తగినట్లుగా మూడు అడుగుల చోటిస్తే అదే నా పాలిటికి బ్రహ్మాండం. అటుపిమ్మట చక్రవర్తి వామనునికి దానమీయనెంచి జలకలశం చేతికి తీసుకోగా, తన గురువు శుక్రాచార్యుడు అడ్డగించి ఈ దానం వల్ల నీ సకల సంపదలు పోతాయి. ఈ పొట్టివాడు మహావిష్ణువు. కాబట్టి ఈ దానమీయ నీకు తగదు అని చెప్పాడు. అప్పుడు బలి గురువర్యా! నీవు చెప్పింది నిజమే,

అయితే అంతటి మహావిష్ణువు పొట్టివాడై చేయిచాచి అర్థిస్తే ఇవ్వటం కన్నా భాగ్యమేముంది అని ఆ బ్రహ్మచారి పాదాలు కడిగి, వేదాల నియమాలు తెలిసినవాడవు అయిన నీకు నీ వడిగిన మూడడుగుల నేల దానం చేస్తున్నాను అని పలికి బలిచక్రవర్తి తన భార్య వింధ్యావళితో కలిసి నీటి ధారను పోయగా వామనుడు ఆ దానధారను స్వీకరించాడు. ఈ మూడడుగుల నేల దానంతో మూడు లోకాలు నాకిచ్చినట్లుగా సంతోషిస్తాను అని వామనుడు పలికాడు.

**నలభై నాలుగవ అధ్యాయము – అష్టమ స్కంధము**

**జవాబులు :** 1. 4 విశ్వజిద్యాగము 2. 1. అమరావతి

3. బృహస్పతి

* * *

## నలభై ఐదవ అధ్యాయము - అష్టమ స్కంధము

**1. వామనదేవుని విశ్వరూపం 2. మత్స్యావతార కథ**

**1) ప్రశ్న :** బలిచక్రవర్తి దానము ఇచ్చిన మూడడుగుల నేలను కొలవడానికి వామనుడు కొద్దిగా కొద్దిగా ఎదిగి బ్రహ్మాండమంతా ఆవరించాడు. అప్పుడాయనకు సూర్యబింబం చివరకు ఏవిధంగా దీపించింది?

**జవాబు :** 1. కంఠాభరణంగా 2. భుజకీర్తిగా 3. పాదపీఠంగా 4. కంకణంగా

**2) ప్రశ్న :** విశ్వరూపాన్ని ధరించిన ఆ త్రివిక్రమదేవుడు ఒక పాదంతో భూమండలాన్ని కొలిచాడు. రెండవ పాదంతో బ్రహ్మాండాన్ని కొలవటానికై వెళుతుండగా, ఆ పాదాన్ని తన కమండలంలోని జలంతో అభిషేకించిన మహానుభావుడు ఎవరు?

**జవాబు :** 1. బ్రహ్మదేవుడు 2. దేవేంద్రుడు 3. పరమశివుడు 4.యమధర్మరాజు

**3) ప్రశ్న :** బలిచక్రవర్తి ఇవ్వవలసిన దానక్రియ అయిపోయిన తరువాత, యజ్ఞ పరిసమాప్తి చివరి దినాన, విష్ణువు అభిప్రాయాన్ని తెలిసికొని గరుడుడు బలిని ఏ పాశాలతో బంధించాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** రెండడుగులతో భూమిని పై లోకాలను కొలిచిన త్రివిక్రమదేవుడు బలిచక్రవర్తి మూడవ అడుగును చూపించమని ఏ విధంగా సంభాషించాడు? తరువాత వామనావతార కథ ఏవిధంగా ముగిసింది?

**జవాబు :** బలిచక్రవర్తి వరుణ పాశబద్ధుడై యుండి ఇది విష్ణుదేవుని దయ. దీనికి ఏమీ చేయలేను అనుకొన్నాడు. ఐశ్వర్యం నశించినా బలిలో దీనత్వమూ, కంపమూ కలుగలేదు. అప్పుడు వామనుడు బలి చక్రవర్తిని చూచి దనుజేంద్రా!

మూడడుగుల నేల ఇస్తానంటివి. భూలోకమూ, చంద్రసూర్యలదాకా ఉండే స్థలమూ నాకు ఒక అడుగైంది. స్వర్గలోకం ఒక అడుగైంది. నీ సంపద అంతా నాకు రెండు అడుగులైనవి. ఇక మూడవ అడుగుకు చోటు ఎక్కడుంది? ఇస్తానన్న అర్థాన్ని ఇవ్వకుంటే నీకు అసత్య దోషం అంటుతుంది అని పలికిన వామనుని మాటలు విని 'సత్యం భంగం అవుతుందేమో' అని బలిచక్రవర్తికి సందేహం కలిగింది. అప్పుడు ఓ పురాణపురుషా! నా నాలుక సత్యాన్నే పలుకుతుంది. దానికి తిరుగు లేదు. నీ మూడవ పాదాన్ని నా శిరస్సుపై పెట్టు అని ఓ దేవా! పూర్వం మా వంశీకులు కొందరు నీకు శత్రువుగా మారితే తప్ప నిన్ను దర్శింపలేక పోయారు. నీవు బిచ్చగాడిగా వచ్చి నన్ను 'దేహి' అని యాచించటం నా పూర్వ పుణ్యఫలం కాక మరేమిటి? అని పలుకుతున్న సమయంలో ప్రహ్లాదుడు అక్కడకు వచ్చి దేవా! నీవు వీనికి ఇంద్రపదవి ఇచ్చావు. దానిని ఈనాడు తొలగించావు. నీ భక్తులను నీవు ఎప్పుడు ఎలా అనుగ్రహిస్తావో అది నీకే తెలుసు అన్నాడు. ఆ సమయాన బలిచక్రవర్తి భార్య వింధ్యావళి వచ్చి, వామన మూర్తికి నమస్కరించి, స్వామీ నాకు పతిభిక్ష పెట్టమన్నది. అంతలో బ్రహ్మదేవుడు దేవా! ఇతడు నీకు తన సంపదనంతా ఇచ్చాడు. ఇతడు శిక్షింప తగినవాడు కాడు. ఇతని భయాన్ని పోగొట్టి బంధ విముక్తుణ్ని చెయ్యి అని బ్రహ్మ పలికిన మాటలు విని భగవంతుడు ఎవనిపై నేను దయచూపాలనుకొంటానో అటువంటివాని సంపదనంతా నేను అపహరిస్తాను. ఈ బలిచక్రవర్తి జ్ఞానియై గెలువ సాధ్యం కాని మాయను గెలిచాడు. ఇతడు మహనీయుడు. సావర్ణిమనువు కాలంలో ఇతడు దేవతలకు ప్రభువై దేవేంద్రుడవుతాడు. అప్పటివరకు ఈ బలి సుతలంలో తన వారందరితో కలిసి సకల భోగాలతో జీవిస్తాడు. ఈతనిని వరుణ పాశాల నుండి విముక్తుణ్ణి చేస్తున్నాను అని పలికిన భగవంతుని మాటలకు బలి సంతోషించి, తన గురువైన శుక్రాచార్యుని చేత యాగం పూర్తి చేయించాడు. అటుపిమ్మట ప్రహ్లాదుడు బలిచక్రవర్తినీ తనవారందరితో కలిసి నారాయణుని ఆజ్ఞ ప్రకారం ఒక పెద్దగుహ ద్వారం గుండా సుతల లోకానికి వెళ్ళాడు. వామనమూర్తి

ఇంద్రునికి స్వర్గాన్ని ఇచ్చాడు. అటు పిమ్మట బ్రహ్మదేవుడూ దిక్పాలకులూ, దేవేంద్రునితో కలిసి వామనుణ్ణి విమానంపై కూర్చోబెట్టుకొని అమరావతికి తీసికొని వెళ్ళారు.

**5) ప్రశ్న :** శౌనకాది మహర్షులు సూతమహర్షితో, నారాయణుడు మత్స్యావతారాన్ని ధరించిన వృంత్తాంతాన్ని వినిపించమని కోరగా, ఆ మహర్షి అచ్చట చేరిన వారందరికి ఏ రీతిగా మత్స్యావతారాన్ని గురించి వినిపించాడు?

**జవాబు :** సూతమహర్షి శౌనకాదులకు భాగవతాన్ని వినిపించే క్రమంలో వారికోరిక మేరకు జనార్ధనుని మొదటి అవతారమైన మత్స్యావతార వృత్తాంతాన్ని వినిపిస్తూ, మునులారా! మీరు కోరిన విధంగానే శుకమహర్షిని పరీక్షిన్మహారాజు కూడా అడుగగా ఆ మహర్షి మహారాజుకు ఈ విధంగా వినిపించాడు. గడచిన కల్పం చివర ద్రవిడ దేశానికి రాజైన సత్యవ్రతుడు కేవలం నీళ్ళే ఆహారంగా తీసికొంటూ కృతమాలికా నది గట్టున కేశవుని గూర్చి తపమాచరించ సాగాడు. ఒకనాడు ఆ నదిలో నారాయణ ప్రీతిగా నీటితో తర్పణం విడుస్తుండగా, తన దోసిలిలోకి ఒకచేప పిల్ల కనిపించింది. రాజు ఉలికిపడి ఆ చేపపిల్లను నదిలో వదిలాడు. అప్పుడు ఆ చేపపిల్ల ఓ దయామయా నేను ఈ నదిలో ఉంటే ప్రమాదాన్ని ఎదుర్కొంటాను దయతో నన్ను నీతో తీసుకొని వెళ్ళు అని పలికిన చేపపిల్లపై జాలిగొని రాజు తన కమండలంలో ఉంచి తీసుకొని వెళ్ళాడు. ఒక్క రాత్రిలోనే ఆ చేపపిల్ల కమండలమంతా వ్యాపించింది. సత్యవ్రతుడు వరుసగా కడవలోనూ, మడుగులోనూ, పెద్దచెరువులోనూ వదిలాడు. వదిలిన వెంటనే అది అక్కడి ప్రదేశాన్నంతనూ ఆక్రమించేంత పెద్దది కాసాగింది. రాజు విషయం గ్రహించి నీవు మామూలు చేపవు కాదు. దీనులను కాపాడుటకు ఈ రూపంగా వచ్చిన నారాయణుడవు. ఓ అచ్యుతా! ఎందుకు ఈ రూపం ధరించావు తండ్రీ! చెప్పుమనగా జనార్ధనుడు ఓ రాజా! ఈ రాత్రి గడచిన ఏడవ దినముతో బ్రహ్మకు పగలు పూర్తి అవుతుంది. భూలోకం మొదలుకొని మూడులోకాలు ప్రళయసముద్రంలో మునుగుతాయి. అప్పుడు నా ఆజ్ఞానుసారం నీవద్దకు ఒక పెద్ద నావ వస్తుంది.

అప్పుడు నీవు సమస్తములైన ఓషధీ సమూహాలు, విత్తనాల రాసులు ఆ నౌకపై ఉంచుకొని, సప్త ఋషులతో కలిసి ప్రళయ సముద్రంలో విహరిస్తూండు. ఆ నావను నేను రక్షిస్తూంటాను. నా ఆజ్ఞానుసారం ఒక పెద్ద పాము అక్కడకు వస్తుంది. దానితో నా కొమ్ము కొనకు ఆ నావను బంధించు. ప్రళయరాత్రి గడిచే వరకు నేను మిమ్ములను కాపాడుతాను. ప్రళయ కాలంలో నిద్రిస్తున్న చతుర్ముఖుని ముఖాల నుండి వెలువడిన వేదాలను హయగ్రీవుడనే రాక్షసుడు దొంగిలించి సముద్రంలో దాగాడు. ఆ విధంగా సముద్ర జలాలలో ఉన్న హయగ్రీవుని జయించి వేదాలను రక్షించటమూ, విత్తనాలతో కూడిన నావను రక్షించడమూ నారాయణునికి మత్స్యావతార సందర్భంగా నిర్వహించిన కార్యాలైనాయి.

**నలభై ఐదవ అధ్యాయము – అష్టమ స్కంధము**

**జవాబులు :** 1. 3. పాదపీఠంగా 2. 1. బ్రహ్మదేవుడు
3. వరుణపాశాలతో

* * *

# నలభై ఆరవ అధ్యాయము - నవమ స్కంధము

**1. వైవస్వతమను వంశ కథనం 2. అంబరీషో పాఖ్యానం 3. ఇక్ష్వాకు వంశ క్రమం**

**1) ప్రశ్న :** మత్స్యావతార సమయంలో శ్రీహరి అనుగ్రహాన్ని పొందిన సత్యవ్రతుడు గత జన్మలో శ్రాద్ధదేవుడు. ఈ శ్రాద్ధ దేవుడికి మనువుగా మరొక పేరుంది. అది ఏ పేరు?

**జవాబు :** 1. వైవస్వతుడు 2. బ్రహ్మసావర్ణి 3. ధర్మసావర్ణి 4. భద్రసావర్ణి

**2) ప్రశ్న :** వైవస్వతమనువు సంతానార్థియై యాగం చేశాడు. ఆ యాగ ఫలితంగా ఆయనకు కూతురు పుట్టింది. మనువు వశిష్ఠుని ఆశ్రయించగా వశిష్ఠుడు నారాయణుని గురించి స్తోత్రం చేసి, ఆయన అనుగ్రహంతో మనువు కూతురు ఇలా కన్యకు స్త్రీతత్త్వం పోయి పురుషుడుగా మారాడు. ఆయన పేరేమి?

**జవాబు :** 1. నృగుడు 2. శర్యాతి 3. ఇక్ష్వాకుడు 4. సుద్యుమ్నుడు

**3) ప్రశ్న :**సుద్యుమ్నుడు తన పరివారంతో గూడి కుమారవనంలో ప్రవేశించాడు. పరమేశ్వరుని మాటప్రకారం కుమారవనంలో ప్రవేశించిన పురుషులు స్త్రీలుగా మారుతారు. ఆ విధంగా వారంతా స్త్రీలుగా మారారు. సుధ్యుమ్నుడు ఇలా కన్యగా మారి, అక్కడ విహరిస్తూ, బుదునిపై వలపుగొని ఆయన వలన ఒక మగబిడ్డను కన్నది. ఆ బిడ్డ పేరేమి?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** నాభాగుని కుమారుడు అంబరీషుడు శ్రీహరి ప్రీతిగా అనుసరించ తలపెట్టిన ద్వాదశీ వ్రతాన్ని అంబరీషుని భక్తితత్త్వాన్ని పరీక్షింపనెంచి దుర్వాస మహర్షి చేసిన ప్రయత్నం ఏ తెరగున పరిణమించింది?

**జవాబు :** మహావిష్ణు భక్తితత్పరుడైన అంబరీష మహారాజు తన పట్టపు రాణితో కలిసి, ఒక సంవత్సరం పాటు శ్రీహరిని గూర్చి ద్వాదశీ వ్రతాన్ని చేశాడు. వ్రతం పూర్తి అయ్యాక కార్తీక మాసంలో మూడురాత్రులు ఉపవాసమున్నాడు. యమునానదిలో స్నానంచేసి మధువనంలో మహాభిషేక విధిప్రకారం శ్రీహరిని అభిషేకించాడు. మనోహరమైన సుగంధాలను సమర్పించి సువాసనలతో కూడిన పూలతో పూజించాడు. అక్కడ చేరిన వారందరికీ భోజనంపెట్టి ఉపవాసానంతరం తాను భోజనం చేయటానికి పూనుకొన్నాడు. ఆ సమయంలో మహా తప్సంపన్నుడైన దుర్వాసమహర్షి అతనింటికి అతిథిగా వచ్చాడు. వచ్చిన మహర్షిని అంబరీషుడు పూజించి తన ఇంట భోజనం చేయమన్నాడు. మహర్షి సరయూనదికి వెళ్ళి స్నానం చేసి వస్తాను అన్నాడు. వెళ్ళిన మహర్షి ఎంతకూ రాలేదు. ద్వాదశీ ఘడియలు దాటిపోకుండా అక్కడ ఉన్న బ్రాహ్మణుల సలహాతో శ్రీహరిని స్మరించి రాజు నీళ్ళు మాత్రమే స్వీకరించి తపస్వి రాకకోసం ఎదురు చూస్తున్నాడు. అప్పుడు వచ్చిన మహర్షి మనోదృష్టితో జరిగింది తెలిసికొని అంబరీషునిపై మండిపడి అతిథికి పెట్టకుండా ఆరగించిన పాపాన్ని అనుభవించమని, తన జటనుండి కొంత భాగాన్ని పెరికి నేలకేసి కొట్టి దానిచే ఆయుధహస్తమైన 'కృత్య' అనే శక్తిని సృష్టించి అంబరీషుని పైకి ప్రయోగించాడు. అది అంబరీషుని పైకి వస్తుండగా నారాయణుని కరుణ వల్ల సుదర్శనచక్రం ఆ కృత్యను కాల్చివేసింది. ఆపై ఆ చక్రం దుర్వాసుని వెంటపడింది. మహర్షి ఎక్కడకు వెళ్ళినా అది వెంబడిస్తూనే ఉంది. ఆయన బ్రహ్మలోకానికి వెళ్ళాడు. బ్రహ్మదేవుడు సుదర్శన చక్రానికి అడ్డుపడగలిగిన శక్తి తనకు లేదన్నాడు. కైలాసం వెళ్ళాడు. శివుడు కూడా బ్రహ్మదేవుడు చెప్పినట్లుగానే చెప్పాడు. వైకుంఠానికి వెళ్ళాడు. అక్కడ జనార్థనుడు నేను భక్తికి వశుడను. ఈ సమయంలో నీవు అంబరీషునే శరణు వేడుకోమన్నాడు. అప్పుడు దుర్వాసుడు తిరిగి మరలా మిత భాషియైన అంబరీషుని చేరి శరణు వేడాడు. అంబరీషుడు మహర్షిని కరుణా దృష్టితో చూసి సుదర్శన చక్రాన్ని స్తుతించి, ఈ తాపసిని మన్నించమని వేడుకొన్నాడు. ఆ మహాభక్తుని స్తోత్రానికి సుదర్శనుడు శాంతించి మునిని తపింప జేయకుండా

తరలివెళ్ళాడు. దుర్వాసుడు అంబరీషుని దీవించి, అతని భక్తిని లోకానికి చాటాడు.

**5) ప్రశ్న :** ఇక్ష్వాకు వంశం ఏవిధంగా విస్తరించింది?

**జవాబు :** వైవస్వత మనువుకు ఇక్ష్వాకుడు ఆదిగాగల పదిమంది కొడుకులు కలిగారు. తరువాత ఇక్ష్వాకునికి వికుక్షి, నిమి, దండకుడు మొదలగు వందమంది కొడుకులు కాగా, వికుక్షికి కకుత్థ్సువు కుమారుడు ఈయనకు అనేనసుడు, అతడికి పృథువు, అతడి పుత్రుడు విశ్వగంధుడు. ఇతనికి చంద్రుడు కుమారుడు కాగా, ఈ చంద్రునికి యవనాశ్వుడు, అతనికి శవస్తుడు కుమారుడు. అతడు శావస్తి అన్న పేరుగల నగరాన్ని నిర్మించాడు. అతడి పుత్రుడు బృహదశ్వుడు. అతడి కొడుకు కువలయాశ్వుడు. ఈ కువలయాశ్వునితరువాత అనేకమంది వారి వంశస్తులు ఈ భూమిని పాలించారు. ఆపై యవనాశ్వునికి మాంధాత జన్మించాడు. ఈ మాంధాతకు శతబిందుని కుమార్తె బిందుమతి వల్ల పురుకుత్సుడు, అంబరీషుడు, ముచుకుందుడు అనే ముగ్గురు కుమారులు జన్మించారు. ఈ ముగ్గురిలో అంబరీషుడిని ఆయన తాత యవనాశ్వుడు అతడిని కొడుకుగా స్వీకరించాడు. తరువాత మాంధాత రెండవ కుమారుడు పురుకుత్సుడు చక్రవర్తియై ప్రజానురంజకంగా పాలించి షట్చక్రవర్తులలో ఒకనిగా ప్రసిద్ధిగాంచాడు. ఈ పురుకుత్సుని వంశంలోని వాడు సత్యవ్రతుడు. ఈ సత్యవ్రతుడినే త్రిశంకుడు అంటారు. ఈయన కుమారుడు హరిశ్చంద్రుడు. హరిశ్చంద్రునికి రోహితుడు, ఈయనకు హరితుడు పుట్టాడు. ఇంకా ఈయన వంశంలోని వృకునికి బాహుకుడు జన్మించాడు. ఈ రీతిగా ఇక్ష్వాకువంశం పరంపరగా కొనసాగి ఈ భూమిని పాలిస్తూవచ్చారు.

### నలభై ఆరవ అధ్యాయము - నవమ స్కంధము

**జవాబులు :** 1. 1. వైవస్వతుడు 2. 4. సుద్యుమ్నుడు
3. పురూరవుడు

* * *

# నలభై ఏడవ అధ్యాయము - నవమ స్కంధము

**1. సగర చక్రవర్తి కథ 2. శంభుని శిరస్సు నుండి ప్రవహించిన గంగ 3. శ్రీరామ చరిత్ర**

**1) ప్రశ్న :** ఇక్ష్వాకు వంశజుడైన సగరుడు శ్రీహరిని గూర్చి అనేక అశ్వమేధ యాగాలు చేశాడు. ఒకానొక యాగ సందర్భంగా అతడు వదలిన అశ్వాన్ని పట్టిన ఇంద్రుడు, దానిని నాగలోకంలో ఎవరి ఆశ్రమంలో కట్టివేశాడు?

**జవాబు :** 1. వ్యాసమహర్షి ఆశ్రమంలో 2. కణ్యమహర్షి ఆశ్రమంలో
3. కపిలమహర్షి ఆశ్రమంలో 4. అత్రిమహర్షి ఆశ్రమంలో

**2) ప్రశ్న :** నాగలోకంలోని కపిల మహాముని ఆశ్రమంలో ఉన్న అశ్వాన్ని తీసికొని వచ్చి, సగరుని యజ్ఞాన్ని నిర్విఘ్నంగా జరిపించిన రాకుమారుడెవరు?

**జవాబు :** 1. అసమంజసుడు 2. దిలీపుడు
3. భగీరథుడు 4. అంశుమంతుడు

**3) ప్రశ్న :** కపిల మహర్షిని దర్శించి ఆయనను ప్రసన్నం చేసుకొన్న అంశు మంతునితో మహర్షి మీ పితరుల భస్మరాసులను పావన గంగలో తడిపినట్లైతే, ఉత్తమగతులు ప్రాప్తిస్తాయి అని చెప్పగా ఆదిశగా ప్రయత్నించి దివినుండి గంగను తీసుకొని వచ్చి తమ పితరుల భస్మరాసులను తడిపించినదిఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** సగరు పుత్రుల భస్మరాసులను పావన గంగచే తడిపించడానికి ఎవరెవరు ఏఏ విధాలుగా ప్రయత్నించారు? చివరకు ఎవరు ఏ విధంగా సఫలీకృతులైనారు?

**జవాబు :** కపిల మహర్షి చెప్పిన విధంగా అంశుమంతుడు తన తాత సగరుని చేత యాగం పూర్తి చేయించి, తన పితరుల ఉన్నతికొరకు గంగను తెప్పిస్తానని అడవికి వెళ్ళి తపస్సు సాగించలేక దిగులుతో దేహాన్ని చాలించాడు. అటుపిమ్మట అతని కొడుకు దిలీపుడు కూడా అదే ఆలోచనతో ప్రయత్నించి విఫలుడైనాడు.

అనంతరం దిలీపుని కుమారుడు భగీరథుడు ఘోర తపస్సు చేసి గంగను ప్రసన్నం చేసికొని తన పితరుల భస్మరాసులు తడపమన్నాడు. అప్పుడు పావనగంగ కరుణించి భగీథునితో ఆకాశం నుండి నేను భువికి దూకేటప్పుడు నా వేగాన్ని భరించు వారెవ్వరు? అనగా ఆ రాకుమారుడు నీ ప్రవాహ వేగాన్ని పరమశివుడు ఆపగలడు. నేను ఆయనను ప్రసన్నం చేసుకొంటాను అని భగీరథుడు శివుని గురించి తపస్సు చేశాడు. భక్తవత్సలుడైన శివుడు ప్రత్యక్షమై భగీరథుడి కోరిక మేరకు ఆకాశం నుండి భూమి మీదికి ఉరికే గంగను తన శిరస్సుపై ధరించాడు. ఆ మహానది శివుని జటాజూటం నుండి క్రిందికి దూకి అడ్డు లేకుండా నేలపై ప్రవహించి క్రమ క్రమంగా పరిమితిని దాటి మాటకూ మనసుకూ అందకుండా ఆ గంగానది భగీరథుని వెంట ప్రవహించింది. తల్లిలాగా అన్నింటినీ కడుపులో దాచుకొంటూ, దేవతలాగా భక్తుల కోర్కెలు తీర్చుతూ, ఎంతోవేగంతో అనేక దేశాలనుదాటి సగర చక్రవర్తి కుమారుల బూడిదరాసులను ముంచి ప్రవహించింది. వాళ్ళు అపార శుభాలతో స్వర్గాన్ని పొందారు. శివుణ్ణి మెప్పించి గొప్ప తపోనిష్ఠ కలవాడై ఆకాశగంగను, అవని మీదకు తెచ్చి అఖండమైన తనకీర్తిని లోకంలో వ్యాపింపజేసికొని, కలకాలం విలసిల్లేటట్లు చేసికొని పితృకార్యాన్ని తీర్చినవాడూ అయిన భగీరథుడు రాజై ఈ ధరామండలాన్ని ఎంతో సుభిక్షంగా పాలించాడు.

**5) ప్రశ్న :** ఇక్ష్వాకురాజుల చరిత్రను తెలుపుతూ శ్రీ శుకుడు పరీక్షిత్తుతో ఆ వంశస్తుడైన శ్రీరాముని చరిత్రను ఏవిధంగా తెలిపాడు?

**జవాబు :** సూర్యవంశపు రాజులు అయోధ్యను రాజధానిగా కోసల రాజ్యాన్ని పాలిస్తూన్న చాలాకాలం తరువాత ఖట్వాంగుడనే రాజు దేవతలకు యుద్ధంలో సహాయం చేశాడు. ఆయన కుమారుడు దీర్ఘబాహువు. ఈయనకు రఘువు జన్మించాడు. ధర్మాత్ముడైన రఘువు కారణంగా ఇక్ష్వాకు వంశం రఘు వంశంగా ప్రఖ్యాతి గాంచింది. ఈ వంశంలో దశరథమహారాజుకు పుత్రకామేష్టి వలన నారాయణుని అంశలతో రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నుడు అనే పేర్లతో నలుగురు కుమారులు కలిగారు. రామలక్ష్మణులను తండ్రి పంపగా విశ్వామిత్రుని వెంట వెళ్ళి భయంకర రాక్షసి తాటకను సంహరించి, మారీచ,

సుబాహులను తరిమి మహర్షి చేసే యాగాన్ని రక్షించారు. విదేహరాజు జనకుని గారాలపట్టి సీతను స్వయంవరంలో శివధనుస్సును ఎక్కుపెట్టి ఆమెను వివాహమాడాడు. దశరథుడు కైకకు ఇచ్చిన వరాలకు కట్టుబడి సీతా రామ లక్ష్మణులను అడవికి పంపించాడు. పుణ్యాత్ముడైన రాముడు భరతుణ్ణి రాజ్యంలో నిలిపాడు. తమ్ముడు, భార్య వెంటరాగా రాముడు చిత్రకూట పర్వత సమీపాన కాలుమోపాడు. ఆ విధంగా వెళ్ళి రాముడు ఋషులకు రక్షణ కల్పించాడు. అనంతరం దండకారణ్యంలో ప్రవేశించి ఉండగా, రావణుని చెల్లెలు శూర్పణఖ రాముణ్ణి కామించి వచ్చింది. అప్పుడు లక్ష్మణుడు దాని ముక్కు, చెవులు కోశాడు. అది విని దండెత్తి వచ్చిన ఖర, దూషణాదులను పద్నాలుగువేల మందిని రాముడు తన శరపరంపరతో కూల్చాడు. పిమ్మట శూర్పణఖ వెళ్ళి రావణునికి చెప్పగా ఆతడు సీత చక్కదనాన్ని విని, మారీచుని సహకారంతో రామ లక్ష్మణులను పర్ణశాలకు దూరంచేసి, ఒంటరిగా ఉన్న సీతను అపహరించుకొని వెళ్ళాడు. ఆవిధంగా రావణుడు సీతను ఆకాశ మార్గంలో కొనిపోయి తన రాజధాని లంకలో ఉంచాడు. పిమ్మట రాముడు లక్ష్మణునితో కలిసి సీతను వెతుకుతూ వెళ్ళి సుగ్రీవ, జాంబవంత, హనుమదాదులను కలిసి వారికి తగిన సహాయంచేసి వారి సహకారంతో, ఆంజనేయుని ఇతర వానర వీరులను సీతను కనుగొనటానికై పంపాడు. అందు ఆంజనేయుడు అమ్మవారు లంకలో అశోకవనంలో ఉన్నదని చూచి వచ్చి రామాదులందరికి చెప్పాడు. అప్పుడు శ్రీరాముడు సుగ్రీవ, ఆంజనేయాది వానర సైన్యం సహాయంతో సముద్రానికి వారధికట్టి లంకపైకి దండెత్తి రావణాదులను కూల్చి, రావణుని తమ్ముడు విభీషణుని లంకకు రాజును చేశాడు. అటు పిమ్మట పుష్పక విమానంపై సీతా రామ లక్ష్మణులు వానర వీరులందరితో కలిసి అయోధ్యను చేరి కోసల రాజ్యానికి రాజై రాముడు అనేక సంవత్సరాలు పరిపాలించాడు.

**నలభై ఏడవ అధ్యాయము – నవమ స్కంధము**

**జవాబులు :** 1.3 కపిల మహర్షి ఆశ్రమంలో 2.4. అంశుమంతుడు 3. భగీరథుడు

* * *

## నలభై ఎనిమిదవ అధ్యాయము - నవమ స్కంధము

**1. భవిష్యత్తులో రాజులకథ 2. చంద్రవంశ రాజుల కథ 3. పరశురాముని చరిత్ర**

**1) ప్రశ్న :** జనకుని వంశం అనేక తరాలు మారి చివరకు సీతాదేవిని బిడ్డగా పొందడం జరిగింది. శ్రీరాముని భర్తగా పొందిన సీతాదేవి తండ్రి పేరేమి?

**జవాబు :** 1. దేవరాతుడు 2. సీరధ్వజుడు
3. కీర్తిరాతుడు 4. మహారోముడు

**2) ప్రశ్న :** చంద్ర వంశీకుడైన గాధి మహారాజుకు కలిగిన కుమారుడు రాజై మరలా బ్రహ్మర్షియై లోక విఖ్యాతుడైనాడు. ఆయన పేరేమి?

జవాబు : 1. విశ్వామిత్రుడు 2. వశిష్ఠుడు
3. జనకుడు 4. నలుడు

**3) ప్రశ్న :** ఋచీక మహర్షికి సత్యవతికి జమదగ్ని పుట్టాడు. సత్యవతి తల్లి విశ్వామిత్రుని కన్నది. కాగా జమదగ్నికి పుట్టిన బిడ్డలలో నారాయణాంశతో జన్మించింది ఎవరు?

**జవాబు :** జవాబులకాలంలో ఉన్నది.

**4) ప్రశ్న :** పరశురాముడు ఈ భూమిపై ఉన్న రాజులందరిని ఎందుకు సంహరించాలని పూనిక వహించాడు?

**జవాబు :** హైహయ వంశపురాజు కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయుని ఆరాధించి అతడి కృపవల్ల శత్రు విజయమూ, వేయిచేతులూ, అణిమాది సిద్ధులూ పొంది భూమిపై వెలుగొందాడు. ఒకనాడా రాజు వేటకువెళ్ళి అలసి జమదగ్ని మహర్షి ఆశ్రమానికి వచ్చాడు. వచ్చిన రాజుకు, పరివారానికి మహర్షి తన వద్ద ఉన్న హోమధేనువు అనుగ్రహంతో వారందరికీ భోజనం పెట్టాడు. తిని కూర్చున్న

రాజుకు హోమధేనువుపై కోరికకలిగింది. భటులకు ఆజ్ఞ ఇచ్చి బలవంతంగా ధేనువును తన రాజధానికి తీసుకొని వెళ్ళాడు. అంతలో పరశురాముడు ఆశ్రమానికి వచ్చి జరిగింది తెలుసుకొని, కవచాన్ని ధరించి, గండ్రగొడ్డలి, ధనస్సునూ చేబూని కార్తవీర్యార్జునుని పైకి యుద్ధానికి వెళ్ళాడు. కార్త వీర్యార్జునుడు తన సైనికబలంతో ఎదురుతిరిగాడు. పరశురాముడు ఆ సైన్యాన్ని రాజును సంహరించి హోమ ధేనువును దూడతోపాటుగా ఆశ్రమానికి తెచ్చాడు. కార్త వీర్యార్జునుని కొడుకులు తండ్రిని చంపిన వాడిపై పగతీర్చు కోవడానికి ఎదురు చూస్తున్నారు. ఒకనాడు పరుశురాముడు తన అన్నలతో కలిసి అడవికి వెళ్ళాడు. అదే సమయమని వాళ్ళు యాగశాలలో ప్రవేశించి జమదగ్ని తలనరికారు. అప్పుడు జమదగ్ని భార్య రేణుక గోలుగోలున ఏడుస్తూ రామారామా అని ఇరవై ఒక్కసార్లు గుండెలు బాదుకొన్నది. అప్పుడు పరశు రాముడు వచ్చి తన వారికి ధైర్యం చెప్పి మాహిష్మతీ నగరానికి వెళ్ళి ఆ రాజు కొడుకు లందరినీ సంహరించి రక్తం ఏరులై పారేటట్లు చేశాడు. అంతటితో ఆగకుండా భూమిపై ఉన్న మొత్తం రాజ లోకాన్నంతటినీ, తన తల్లి గుండెలు బాదుకున్న ఇరవై ఒక్కసార్లు తిరిగి, తిరిగి సంహరించాడు. ఈవిధంగా పరశు రాముడు రాజలోకంపై పగతీర్చుకున్నాడు.

**5) ప్రశ్న :** చంద్రవంశపు రాజు నహుషుడు ఏవిధంగా దేవేంద్రుడైనాడు? ఆయన సంతతి ఏవిధంగా ప్రవర్తిల్లింది?

**జవాబు :** పురూరవుని కొడుకైన ఆయువునకు నహుషుడు, క్షత్ర వృద్ధుడు, రజి, రంభుడు, అనేనసుడు అనే వాళ్ళు పుట్టారు. అందులో నహుషుడు రాజై నూరు అశ్వమేధయాగాలు చేసి ఇంద్రపదవి నధిష్ఠించాడు. నహుషుని తమ్ముడు క్షత్రవృద్ధుని వంశంలో కొంతకాలానికి దీర్ఘతపుడు పుట్టాడు. అతనికి నారాయణాంశతో ఆయుర్వేదం తెలిసిన గొప్పవాడైన ధన్వంతరి పుట్టాడు. అతణ్ణి కీర్తిస్తే సకల దుఃఖాలు, రోగాలు తొలగిపోతాయి. కాగా నహుషుడు ఇంద్ర పదవిని పొందిన కొలది కాలానికే శచీదేవి పొందు కోరడంవల్ల

అతడు శాపవశాన సర్పమై సప్తర్షులు మోస్తున్న పల్లకీ నుండి జారిపడి భూలోకంలోని అడవిలో అజగరమై పడిఉన్నాడు. నహుషునికి యతి, యయాతి, సంయాతి, ఆయతి, వియతి, కృతి అనే ఆరుగురు కొడుకులు కలిగారు. వారిలో పెద్ద కొడుకు రాజ్యపాలనంపై విరక్తితో అడవికి వెళ్ళి ముక్తిని కోరి తపస్సు చేశాడు. తండ్రి, అన్న రాజ్యం వదలిపోగా యయాతి రాజయ్యాడు. ఈ యయాతి కుమారుడైన యధువుకారణంగా యధువంశం ప్రవర్ధిల్లింది.

## నలభై ఎనిమిదవ అధ్యాయము - నవమ స్కంధము

**జవాబులు :** 1. 2. సీరధ్వజుడు 2. 1. విశ్వామిత్రుడు

3. పరశురాముడు

* * *

## నలభై తొమ్మిదవ అధ్యాయము - నవమ స్కంధము

**1. యయాతి చరిత్ర 2. యయాతిని దేవయాని వరించడం 3. శుక్రాచార్యుడు యయాతిని శపించడం**

**1) ప్రశ్న :** వృషపర్వుడనే రాక్షస రాజుకూతురు శర్మిష్ఠ తమ గురుపుత్రికయైన దేవయానితోనూ, చెలికత్తెలతోనూ ఉద్యానవన విహారానికి వెళ్ళింది. అక్కడ ఆనందంతో దగ్గరలో ఉన్న ఒక కొలనులో వారంతా జలక్రీడలాడ బూనుకొన్నారు. అప్పుడు అక్కడకు తన సతీసమేతుడై వచ్చిన పురుషుని చూచి వారందరూ సిగ్గుపడి తత్తరపాటుతో చీరలు కట్టుకొన్నారు. కాగా ఆ వచ్చిన పురుషుడెవరు?

| **జవాబు :** | 1. దేవేంద్రుడు | 2. వరుణుడు |
|---|---|---|
| | 3. కచుడు | 4. శివుడు |

**2) ప్రశ్న :** పరపురుషుని చూచిన షర్మిష్ఠ, దేవయాని ఇతర చెలికత్తెలు తత్తరపాటుతో చీరలను కట్టుకోవడంలో ఒకరి చీరను ఒకరు కట్టుకొన్నారు. అప్పుడు వారిలో తగవు మొదలైంది. ఆ కారణంగా రాజకుమార్తె అయిన షర్మిష్ఠ తన చెలికత్తెలతో దేవయానిని ఎక్కడ పడవేసి వెళ్ళారు?

| **జవాబు :** | 1. బావిలో | 2. కొలనులో |
|---|---|---|
| | 3. నదిలో | 4. లోయలో |

**3) ప్రశ్న :** దేవయానిని వారందరు నూతిలో పడవేసి వెళ్ళిన తరువాత, దైవవశాన ఆ నూతి దగ్గరకు ఒక రాకుమారుడు వచ్చి ముందుగా ఆమె కట్టుకోడానికి పైబట్టనిచ్చి ఆమె మానాన్ని కాపాడాడు. తరువాత తన కుడిచేతిని అందించి వెలికిలాగాడు. కాగా దేవయానిని నూతిలో నుండి వెలుపలికి లాగిన రాకుమారుడు డెవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** బ్రాహ్మణ కన్య అయిన దేవయానికి, రాకుమారుడైన యయాతికి ఏ పరిస్థితులలో వివాహం జరిగింది? ఈ వివాహానికి శుక్రాచార్యుని స్పందన ఏమిటి?

**జవాబు :** నూతిలోనున్న దేవయానిని తన కుడిచేతిని ఇచ్చి వెలికిలాగిన యయాతితో దేవయాని, నీవు నా చేతిని పట్టుకొన్నావు. ఇక నీవే నా భర్తవు. ఇది దైవఘటన. మన పెండ్లి జరగక తప్పదు. ఓ గుణవంతుడా! నేను రాక్షసులకు గురువైన శుక్రాచార్యుని కుమార్తెను దేవయానిని అని అనగానే యయాతికి కూడా దేవయానిపై మనసు కలిగి ఏమాత్రం తొందర పడకుండా ఈశ్వరాజ్ఞ ఇలా ఉంది కాబోలు అనుకొని ఆ రాజు దేవయానిని వరించాడు. ఇట్లా వరించి యయాతి వెళ్ళాక దేవయాని శుక్రుని దగ్గరకు వెళ్ళి శర్మిష్ఠ చేసిన సంగతంతా చెప్పి కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. అప్పుడు ఈ కఠినాత్ముల ఇళ్ళలో పౌరోహిత్యం చేయడం కన్న ఎక్కడోచోట దొరికిన దానితో తృప్తిపడి జీవించడం మేలు అని దేవయానిని వెంటబెట్టు కొని శుక్రుడు ఊరు వదిలి వెళ్ళాడు. ఈ సంగతి తెలిసికొన్న రాజు వృషపర్వుడు ఆయన దారికడ్డు వెళ్ళి ఆయన పాదాలపైబడి, ప్రసన్నుడయ్యేటట్లు ప్రార్థించాడు. అప్పుడు శుక్రుడు కోపాన్ని మాని శిష్యునితో, వేయిమంది చెలికత్తెలతో నీ కూతురు దాసిలాగా నా పుత్రికను సేవిస్తుంటే నాకోపం తీరుతుంది. ఇట్లా ఊడిగం చేసేటట్లు నీవు చేస్తే నా కూతురును వెంటబెట్టుకొని తిరిగి నీ రాజ్యానికి వస్తాను అన్నాడు. అందుకు వృషపర్వుడు అట్లాగే అని ఆ విధంగానే ఏర్పాటు చేశాడు. శుక్రాచార్యుడు మిక్కిలి ఉత్సాహంతో గొప్ప సంపద కలవాడు, క్షత్రియ కులానికి చెందిన వాడు, ఐన యయాతికి, తన కూతురు దేవయానినిచ్చి పెండ్లి చేశాడు. చెలికత్తెలతో దేవయానికి దాసిగా వస్తున్న 'శర్మిష్ఠతో శరీర సంపర్కం పెట్టుకోవద్దు' అని అల్లుణ్ని హెచ్చరించి పంపాడు.

**5) ప్రశ్న :** తన అల్లుడైన యయాతిని శుక్రాచార్యుడు ఎందుకు శపించాడు? శుక్రుని అనుజ్ఞతో యయాతి ఆ శాప ఫలితాన్ని ఏవిధంగా అనుభవించాడు?

**జవాబు :** ఒకనాడు ఒంటరిగా ఉన్న యయాతి వద్దకు శర్మిష్ఠ వెళ్ళి తన మనసులోని మాటను బైటపెట్టింది. యయాతి శుక్రుని హెచ్చరికను గుర్తుంచుకొని కూడా శర్మిష్ఠను కాదనలేక, ఆమెతో సాంసారిక సుఖం అనుభవించాడు. యయాతి వల్ల శర్మిష్ఠ గర్భవతియై క్రమంగా ద్రుహ్యుడు,

అనువు, పూరువు అనే ముగ్గురు కొడుకులను కన్నది. అంతకుముందే దేవయానికి యధువు, తుర్వసుడు అనే ఇద్దరు కుమారులు పుట్టారు. షర్మిష్ఠ, యయాతిల సంబంధం తెలిసికొని దేవయాని తండ్రి వద్దకు వెళ్ళింది. యయాతి మామగారితో చెప్పవద్దని ప్రాధేయపడినా దేవయాని వినలేదు. విషయం తెలిసికొన్న శుక్రుడు నా మాట కాదని రాక్షస స్త్రీని పొందావు ఇది ధర్మమేనా? నేను చెప్పిందేమిటి? నీవు చేసిందేమిటి? అని పలికి స్త్రీలు అసహ్యించుకొనే ముసలి తనం నిన్ను పొందుగాక అని శపించాడు. యయాతి మామా! నాపై కోపం వద్దు. నీ కూతురు పట్ల నాకు విషయ వాంఛలు ఉడిగిపోలేదు. నన్ను కరుణించమన్నాడు. అందుకు శుక్రుడు సరే నీ కొడుకులలో నీ వృద్ధాప్యాన్ని ఎవరైనా స్వీకరిస్తే వారి యవ్వనం నీకు ప్రాప్తిస్తుంది అన్నాడు. శుక్రుని మాటకు సంతోషించి యయాతి దేవయానిని వెంటబెట్టుకొని నగరానికి వెళ్ళి పెద్ద కొడుకైన యధువుతో ఓ బిడ్డా! నీ తల్లిని కన్న శుక్రుని వల్ల నేడీ ముసలితనం వచ్చింది. ఈ ముసలి తనాన్ని నీవు స్వీకరిస్తే, నీ యవ్వనంతో నేను కొంతకాలం గడిపి మరలా నీ యవ్వనాన్ని నీకిస్తాను అన్నాడు. అందుకు యధువు ఒప్పుకోలేదు. తరువాత తుర్వసుడు, ద్రుహ్యుడు మొదలైన కొడుకులను అడిగాడు. అందరూ యధువు చెప్పినట్లుగానే చెప్పారు. తరువాత శర్మిష్ఠ కొడుకులలో చివరివాడు పూరువును అడిగాడు. అంతకన్న భాగ్యమేముంది అని పూరువు తన తండ్రి ముసలితనాన్ని స్వీకరించి, తన యవ్వనాన్ని తండ్రికిచ్చాడు. ఈ విధంగా యయాతి సకల భోగాలు అనుభవిస్తూ ప్రజారంజకంగా పాలన సాగించాడు.

### నలభై తొమ్మిదవ అధ్యాయము – నవమ స్కంధము

**జవాబులు :** 1. 4. శివుడు 2. 1. బావిలో
3. యయాతి

* * *

## యాభైయవ అధ్యాయము - నవమ స్కంధము

**1. యయాతి దేవయానికి స్వవృత్తాంతాన్ని మేకపోతును ఉపమానంగా చెప్పడం 2. భరతుని చరిత్ర 3. రంతిదేవుని చరిత్ర**

**1) ప్రశ్న :** యయాతి మహారాజు దేవయానితో అప్పటి వరకు జరిగిన తన కథనే దేనిని ఉదాహరణగా చూపుతూ కథా రూపంగా తెలిపాడు?

**జవాబు :** 1. సింహాన్ని 2. నక్కను
3. మేకపోతును 4. పులిని

**2) ప్రశ్న :** చంద్రవంశానికి చెందిన దుష్యంతుడు వేటకై వెళ్ళి అలసి కణ్వాశ్రమం చేరాడు. అక్కడ మహారాజు ఆశ్రమంలో శకుంతల అను ఆమెను చూశాడు. ఆమె యందు మనసు పడ్డాడు. కాగా ఆ శకుంతలను కన్నతల్లి ఎవరు?

**జవాబు :** 1. రంభ 2. ఊర్వశి
3. మేనక 4. తిలోత్తమ

**3) ప్రశ్న :** దుష్యంతుడు శకుంతలతో ఓ కోమలాంగీ! తనకు అన్ని విధాలా తగిన వరుణ్ణి వరించడం రాజ పుత్రిక ధర్మమే అని తియ్యటి మాటలతో ఆమెను ఒప్పించి, దుష్యంతుడు శకుంతలను గాంధర్వ విధిని వివాహమాడి ఆమెను గర్భవతిని చేసి వెళ్ళాడు. కాగా ఆమెకు పుట్టిన బిడ్డ పేరేమి?

**జవాబు :** జవాబుల కాలములో ఉన్నది.

**4) ప్రశ్న :** కణ్వమహర్షి శకుంతలను ఏ విధంగా అత్తవారింటికి పంపాడు? కాగా భరతుడు ఏవిధంగా తన జీవితాన్ని గడిపాడు?

**జవాబు :** కణ్వమహర్షి దినదిన ప్రవర్ధమానమగుచున్న బాలుణ్ణి చూసి శకుంతలతో నీ మగడేమో మహారాజు. ఈ పసివాడు అన్నింటా అందె వేసినచేయి. నీవు పట్టపురాణివై మర్యాద మన్ననలు పొందవలసింది పోయి ఇక్కడ తాపసులతో కలిసి ఈ కొండ కోనల్లో ఎందుకు కష్టపడతావు? నీవిక్కడ నుండి దుష్యంతుని అంతఃపురానికి బయలుదేరి వెళ్ళమని చెప్పాడు. కణ్వమహర్షి

మాటలు విని శకుంతల కొడుకును వెంట బెట్టుకొని దుష్యంతుని దగ్గరకు వచ్చింది. ఆ విధంగా వచ్చి దుష్యంతుని సభా మండపానికి వెళ్ళి నిలబడింది. రాజు పెదవి విప్పి మాట్లాడలేదు. శకుంతల తడబాటు చెందిన మనస్సుతో విచారించింది. ఆ సమయంలో ఓ రాజేంద్రా! ఆమె నీ భార్య, ఈ పిల్లవాడు నీ కొడుకు. కణ్వాశ్రమంలో ఆనాటి నీ వివాహ ప్రయత్నాలను మనసులో ఊహించి ఈమెను స్వీకరించు అని ఆకాశవాణి పలికింది. ఈ విధంగా ఆకాశవాణి సభలోని వారందరికి వినపడేటట్లుగా పలికినందువల్ల ఆ రాజు శకుంతలను ఆదరించి పుత్రుణ్ణి స్వీకరించి కొంతకాలం రాజ్యంచేసి పరలోక గతుడైనాడు. పిమ్మట భరతుడు రాజై ఈ భూమిమీద ఎక్కడా తనకు ఎదురులేకుండా విలసిల్లాడు. గంగా తీరంలోనూ, యమునా తీరంలోనూ అనేక అశ్వమేధ యాగాలను చేశాడు. భరతవంశంలో కొంతకాలం తరువాత రంతిదేవుడు పుట్టాడు. ఈ విధంగా భరతవంశం ఇంకా ఎంతో వృద్ధి జరిగింది.

**5) ప్రశ్న :** భరత వంశీకుడైన రంతిదేవుడు ఏవిధమైన కీర్తిని సంపాదించాడు?

**జవాబు :** భరతవంశస్థుడైన రంతిదేవుడు మహారాజుగా తనకున్న సంపదనంతా ఎడతెగకుండా దీనులకిచ్చి తాను పేదవాడయ్యాడు. నలభై ఎనిమిది రోజులు అన్నమూ, నీళ్ళూ లేకుండా సకుటుంబంగా తిరుగులాడ వలసి వచ్చినా గుండెదిటవును కోల్పోలేదు. ఒకరోజు ఉదయం అతడికి నేయీ, పాయసమూ, నీళ్ళూ లభించాయి. రంతిదేవుని కుటుంబ మంతటినీ ఆకలి దహించివేయగా, ఆ దొరికిన ఆహారాన్ని తినడానికి తొందర పడ్డారు. ఆ సమయంలో ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చి ఆహారం పెట్టమని అడిగాడు. రంతి దేవుడు లేదనకుండా, అతణ్ణి ప్రేమతో గౌరవించి హరి సమర్పణంగా ఆహారంలో అర్ధభాగాన్ని అతడికి ఇచ్చాడు. అతడు తినివెళ్ళాడు. అంతలో ఒక శూద్రుడు ఆహారం కావాలని అర్థించాడు. రంతిదేవుడు లేదనక మిగిలిన ఆహారంలో ఒక భాగాన్ని అతడికిచ్చాడు. అతడు తృప్తిగా వెళ్ళీవెళ్ళగానే కుక్కల గుంపుతో మరొకడు వచ్చాడు. అతడికి మిగిలిన భాగమిచ్చి నమస్కరించి పంపించాడు. వెంటనే ఇంకొకడు వచ్చి అయ్యా నాకు ఎంతకూ దప్పిక తీరటంలేదు. నీ వద్ద

వున్న నీటితో నా గొంతు తడిపినా ప్రాణాలు నిలబెట్టు అన్నాడు. వెంటనే ఆ రంతిదేవుడు తనవద్ద ఉన్న నీటిని ఇచ్చి ఆతని దప్పిక తీర్చాడు. అనంతరం బ్రహ్మ మొదలైన దేవతలు సంతోషించి రంతిదేవునికి మేలు చేయాలని తమ తమ రూపాలతో ఆ రాజు ముందు నిలబడ్డారు. నీ గుండె దిటవును పరీక్షించటంకోసం నీ వద్దకు వచ్చిన వారందరూ తాము కల్పించినవారేనని చెప్పారు. ఆ రాజేంద్రుడు అందరికీ నమస్కరించాడు. ఆతడి మనస్సులో విష్ణుభక్తి ప్రకాశించింది. ఆయనను ఆశ్రయించిన వారి కుటుంబమంతా యోగమహిమ వలన హరి చింతన కలవారై పరమ యోగులుగా మారి సిద్ధపదాన్ని పొందారు. ఇట్లా రంతిదేవుడు స్వస్వరూప జ్ఞానకారణమైన భక్తివల్ల పరమపధానికి వెళ్ళాడు.

### యాభైయవ అధ్యాయము – నవమ స్కంధము

**జవాబులు :** 1. 3. మేకపోతు 2. 3. మేనక

3. భరతుడు

* * *

## యాభై ఒకటవ అధ్యాయము - నవమ స్కంధము

**1. యధువంశ చరిత్రము 2. వసుదేవుని వంశక్రమం**

**1) ప్రశ్న :** రోమపాద మహారాజు తన పెంపుడు కుమార్తె శాంతను ఋష్యశృంగ మహర్షికిచ్చి పెండ్లిచేశాడు. ఈ శాంత ఎవరి కుమార్తె ?

**జవాబు :** 1. కణ్వుడు 2. దశరథుడు
3. హ్రస్వరోముడు 4. కుశద్వజుడు

**2) ప్రశ్న :** షడ్చక్రవర్తులలో ఒకరైన కార్తవీర్యార్జునుడు అనేక యజ్ఞాలు చేశాడు. ఇంకనూ అణిమాది యోగవిద్యలను ఎవరిని ఉపాసించి పొందాడు?

**జవాబు :** 1. దత్తాత్రేయుణ్ని 2. కపిల మహర్షిని
3. నరసింహదేవుణ్ణి 4. పరమేశ్వరుని

**3) ప్రశ్న :** కార్తవీర్యుని కొడుకులలో పరశురాముని బారి నుండి తప్పించుకొన్న ఐదుగురిలో జయద్వజుడు ఒకడు. ఈతనికి తాళజంఘుడు కుమారుడు. ఈ తాళజంఘుని కుమారుడు 'వృష్టి' ఎవరి తేజస్సు వలన జన్మించాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** యధు, వృష్టి, భోజ, అంధక వంశాలవారికి ఎవరు మూలపురుషులు? వారు ఏవిధంగా ఈ భూమిపై వృద్ధిచెందారు?

**జవాబు :** యయాతి మహారాజుకు దేవయానికి పుట్టిన యదువు నుండి యాదవ వంశం మొదలైంది. ఈ వంశంలోని కార్తవీర్యుని కొడుకు జయధ్వజుడు. ఈయనకు తాళజంఘుడు పుట్టాడు. తాళజంఘుని పెద్ద కుమారుడు వృష్టి మహారాజు. ఈయనతో వృష్టి వంశం ప్రారంభమైంది. యదువు తరువాత చాలాకాలం జరిగిన పిమ్మట ఆయన వంశంలోని సాత్త్వతునికి కలిగిన ఏడుగురు కొడుకులలో మహాభోజుడు ఒకడు. ఈ మహాభోజునితోనే భోజవంశం మొదలైంది. సాత్త్వతుని కుమారుడైన ఇంకొకడు అంధకుడు. ఈతనితో మొదలైనదే అంధకవంశం. ఈ విధంగా యధు, వృష్టి, భోజ, అంధక వంశాల వారందరికి మూల పురుషుడు యదువే కాబట్టి వీరందరు యాదవులని పేరు పొందారు. ఈ వంశాలవారు రాజులై అపార

గో సంపదతో, భోగభాగ్యాలతో విలసిల్లారు. భగవంతుడైన శ్రీ మహావిష్ణువు మానవరూపాన్ని పొంది యాదవ వంశంలో వసుదేవునింట జన్మించటం వలన, భూమిపై నున్న అన్ని రాజ వంశాల కంటే మహోన్నతమైన కీర్తిని గడించారు.

**5) ప్రశ్న :** శ్రీ కృష్ణస్వామి జన్మకు కారణమైన వసుదేవుని వంశ క్రమం ఏవిధంగా జరిగింది?

**జవాబు :** యాదవ వంశంలో ప్రసిద్ధుడైన హృదికునికి దేవమీఢుడు, శతధనువు, కృతవర్మ అనే కొడుకులు కలిగారు. దేవమీఢుడికి వసుదేవాదిగా గల పదిమంది కొడుకులు, పృథ, శ్రుత, దేవ్యాదిగాగల ఐదుగురు కూతుళ్ళు కలిగారు. దేవమీఢుడు అనగా శూరసేనుడు తన స్నేహితుడైన కుంతి భోజునికి తన కుమార్తె పృథను పెంచుకోవడానికి ఇచ్చాడు. కుంతి భోజుని కుమార్తె కారణంగా ఆమె కుంతీ దేవిగా లోకంలో ప్రఖ్యాతమైంది. వసుదేవుడు దేవకుని కుమార్తెలైన ఏడుగురిని వివాహమాడాడు. వారిలో దేవకీదేవి చిన్నది. తన భార్యలందరి వలన సంతానాన్ని పొందాడు వసుదేవుడు. నారాయణుడు దేవకీ వసుదేవులకు అష్టమ గర్భంలో దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం ఆవిర్భవించాడు. శ్రీహరి జన్మించిన తరువాత దేవకి మంగళ స్వరూప అయిన సుభద్రను కన్నది. గుణవంతురాలైన ఆమె అర్జునునికి భార్య అయింది. మహావిష్ణువు వసుదేవునింట పుట్టి వ్రేపల్లెలో పెరిగి శత్రువులను నాశనం చేశాడు. ఆది పురుషుడైన తన్ను గూర్చే అనేక యాగాలను చేశాడు. పాండవ కౌరవుల మధ్య జరిగిన యుద్ధంలో శత్రువులందరినీ రూపుమాపి అర్జునుణ్ణి గెలిపించాడు. ఉద్ధవునికి తత్త్వాన్ని తెలియజెప్పాడు. మగధ, పాండవ, సృంజయ, మధు, దశార్హ, భోజ, వృష్ణి, అంధక వంశాలకు చెందిన వారిచే పూజింపబడినాడు. భూభారాన్ని తొలగించాక ఆ తేజోమూర్తి ఆత్మమూర్తిలో కలిసిపోయాడు. ఈ రకంగా వసుదేవుని వంశం ప్రవర్ధమానమైంది.

**యాభై ఒకటవ అధ్యాయము - నవమ స్కంధము**

జవాబులు : 1. 2. దశరథుడు     2. 1. దత్తాత్రేయుణ్ణి
3. ఔర్యముని

* * *

## యాభై రెండవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శుకయోగికి పరీక్షిత్తు ప్రశ్న 2. బ్రహ్మాది దేవతలు దేవకీ గర్భస్థుండగు శ్రీకృష్ణుని స్తుతించడం 3. శ్రీకృష్ణావతార ఘట్టం**

**1) ప్రశ్న :** పురుషోత్తముడైన శ్రీమహావిష్ణువు భూదేవి కోరిక మేరకు భూలోకంలో యాదవవంశంలో జన్మిస్తాడు. దేవతలందరూ మీమీ అంశలతో భూలోకంలో జన్మించవలసింది అని వారందరికి ఎవరు తెలిపారు?

**జవాబు :** 1. జనార్థనుడు 2. దేవేంద్రుడు
3. పరమశివుడు 4. బ్రహ్మదేవుడు

**2) ప్రశ్న :** దేవకీ వసుదేవులను రథంపై కూర్చుండబెట్టుకొని వెళ్తుండగా, నీవు నీ చెల్లెలి మెప్పుకోసం రథసారథివై వెళ్తున్నావు. ఈమె గర్భాన అష్టమగర్భంలో పుట్టినవాడు నిన్ను సంహరిస్తాడు అని కంసుని ఉద్దేశించి చెప్పినది ఎవరు?

**జవాబు :** 1. నారదుడు 2. ఆకాశవాణి
3. దేవతలు 4. బ్రహ్మవేత్తలు

**3) ప్రశ్న :** కంసునితో నీవు పూర్వజన్మలో విష్ణువుచేత చంపబడిన 'కాలనేమి' అనే రాక్షసుడువి. వ్రేపల్లెలో ఉన్న నందుడు, నీ బావ వసుదేవుడు మొదలైన వారంతా దేవతలు. దేవకీ గర్భాన పుట్టిన మహావిష్ణువు రాక్షసాంశలో పుట్టిన వారందరినీ సంహరిస్తాడు అని చెప్పి వెళ్ళిన మహర్షి ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** కంసుడు నారదమహర్షి ద్వారా దేవరహస్యాన్ని విని ఏ రీతిగా స్పందించాడు? దేవకీ గర్భస్తుండగు హృషీకేశుని ఎవరు ఏవిధంగా స్తుతించారు?

**జవాబు :** బ్రహ్మర్షి నారదుని మాటలు విన్న కంసుడు ఎంతో ఆరాటం పొందాడు. ఉవ్వెత్తున రేగిన కోపంతో దేవకీ వసుదేవులను పట్టి బంధించాడు. వారి పుత్రులను విష్ణు స్వరూపులుగా ఎంచి వెంటనే సంహరించాడు. తన తండ్రియైన ఉగ్రసేనుణ్ని పట్టికారాగారంలో పెట్టాడు. తానే శూరసేన దేశాలకు

రాజైనాడు. అనేక మంది రాక్షసులను చేరదీశాడు. జరాసంధుడు కంసుని బల, వీర్య, సంపదచూచి అతనికి బాసటగా నిలిచాడు. యాదవులు కంసుని ఆగడాలు చూసి ప్రక్కన ఉన్న దేశాలకు వలస వెళ్ళారు. కొందరు హన్ని వదలి కంసుని సేవిస్తూ మధురలోనే ఉండిపోయారు. ఆ సమయంలో నారాయణాంశతో ఆదిశేషుడు దేవకీ గర్భాన ప్రవేశించాడు. మహావిష్ణువు యోగమాయను పిలిచి భద్రా! నీవు గోకులమునకు వెళ్ళి అక్కడ దేవకీ గర్భస్తుండగు శేషుని తేజస్సును తీసికొని వ్రేపల్లెలో నందుని ఇంట తలదాచు కొంటున్న రోహిణీ గర్భంలో ప్రవేశపెట్టు, తరువాత నీవు నందుని భార్యయైన యశోద గర్భాన ప్రవేశించమని ఆజ్ఞాపించగా యోగమాయ ఆ విధంగానే చేసింది. లోకమంతా దేవకీదేవికి గర్భస్రావం జరిగిందని అనుకొన్నారు. అటుపిమ్మట రోహిణికి మగశిశువు జన్మించాడు. ఆపైన మహావిష్ణువు అంశ వసుదేవునిలో ప్రవేశించింది. ఆ రకంగా దివ్య తేజస్సును పొందిన వసుదేవుడు తనలో ప్రవేశించిన విష్ణుతేజాన్ని దేవకీదేవి యందు ప్రవేశింపజేశాడు. ఆ కారణంగా దేవకీ దేదీప్యమానంగా ప్రకాశింప సాగింది. సృష్టిలో బ్రహ్మాండ భాండాలన్ని తన కడుపులో ఉంచుకొన్న నారాయణుడు భూమిని ఉద్దరించటానికి దేవకీ కడుపులో ఉదయసూర్యునిలాగా వృద్ధి పొందసాగాడు. ఇలా ఉండగా ఒకనాడు పరమేశ్వరుడూ, బ్రహ్మాది దేవతలూ, నారదాది మహర్షులూ, దేవకీదేవి బంధింపబడి ఉన్న కారగారం దగ్గరకు వచ్చారు. ఆమె గర్భంలో శిశువుగా ఉన్న జగన్నాథుని మహానుభావా! పుట్టుట ఎరుగని నీవు ఇలా పుట్టటం నీకు క్రీడగాని, పుట్టుక కాదు కదా! దేవా! నీవు ఎన్నో అవతారాలు ఎత్తి లోకాలను రక్షించావు అని అనేక విధాల స్తుతించి దేవకీదేవితో అమ్మా! నీ గర్భంలో పురుషోత్తముడు ఉన్నాడు. రేపు పుట్టబోతున్నాడునీ కడుపు చల్లగా వర్థిల్లాలి. ఈ విధంగా విష్ణువును సంస్తుతించి, దేవకీదేవిని దీవించి, బ్రహ్మ మహేశ్వరులతో వెనుదిరిగి వెళ్ళిపోయారు.

**5) ప్రశ్న :** దేవకీదేవి పరమాత్మను ప్రసవించగా, వసుదేవుడు ఏ రీతిగా ఆనందించాడు?

**జవాబు :** పుష్కలమైన పూలతో, పండ్లతో ఉద్యానవనాలు, అరణ్యాలు ఆనందం ప్రకటించాయి. దేవతలు పుష్పవర్షాలు కురిపించారు. గంధర్వులు ఆనందంతో దివ్యగానం చేశారు. అప్సరసలు ఆనంద నృత్యం చేశారు. గ్రహాలు, నక్షత్రాలు అత్యంత శుభస్థానాలతో ఉండగా అర్ధరాత్రి వేళ అష్టమీ తిథిన, రోహిణీ నక్షత్రాన దేవకీదేవి దేవదేవుని ప్రసవించింది. విష్ణువును ప్రసవించిన దేవకీదేవి శరీరం దివ్యకాంతితో ప్రకాశించింది. ఆ పుట్టిన బిడ్డడు చిరునవ్వులు చిందిస్తూ సమస్త కళామయమూర్తిగా ఉన్నాడు. ఆ సమయంలో వసుదేవుడు ఆ బాలుని తేరిపార చూశాడు. ఆ బాలుడు ఆయనకు దివ్యరూపంతో దర్శనమిచ్చాడు. ఆ దివ్యరూపం నీలి మేఘశ్చాయతో, చతుర్బాహువులతో, సర్వాలంకారశోభతో, కిరీటాన్ని సైతం ధరించి మహావిష్ణురూపంగా వసుదేవునకు కనిపించాడు. దివ్య లక్షణాలతో ఉన్న బాలుని చూచిన వసుదేవుడు మళ్ళీమళ్ళీ తేరిపారచూచి పులకించి పోయాడు. ఆశ్చర్యపోయాడు. ఉప్పొంగిపోయాడు. ఆ పారవశ్యం నుండి తేరుకుని ఉత్సాహంతో నిలబడ్డాడు. స్నానం చేయటానికి వీలుకాక పోయినప్పటికీ ఆనంద రసమనే సముద్రంలో మునిగి తేలిన వసుదేవుడు భక్తితో సాష్టాంగపడి నమస్కారం చేశాడు. స్వామీ! నీవు సమస్త సృష్టినీ నీయందు దర్శింప జేస్తావు. ఇటువంటి నిన్ను నేను కుమారుడుగా కన్నానట! ఇలాంటి చోద్యం ఎక్కడైనా ఉందా? అని వసుదేవుడు దేవా! నీవు దుష్టులను దండించడానికి మానవుడిగా అవతరించావని నాకుతెలుసు. ప్రభూ!ఆకాశంలో వినబడిన మాటలు కంసుని ధైర్యాన్ని కూలద్రోశాయి.ఆనాటి నుండి నీవు ఈ యింటిలో పుట్టబోతున్నావని భయపడి, వాడు నీ అన్నలనందరినీ సంహరించాడు. నీవు పుట్టావని ఈ కారాగార భటులు చెబితే ఇక వెనుకాడడు. వెంటనే నీపైకి విరుచుకొని పడడానికి సిద్ధంగా ఉన్నాడు అని వసుదేవుడు తన బిడ్డగా ఉన్న దేవదేవునికి తెలుపుకొన్నాడు.

**యాభై రెండవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 4. బ్రహ్మదేవుడు　　2. 2. ఆకాశవాణి
3. నారదుడు

* * *

## యాభై మూడవ అధ్యాయము - దశమ స్కంధము

### 1. దేవకీదేవి స్వామిని స్తుతించడం 2. దేవకీ వసుదేవుల పూర్వ జన్మల వృత్తాంతం

**1) ప్రశ్న :** దేవకీ వసుదేవులు పసిబిడ్డ స్థానంలో ఉన్న పరమాత్మను చూసి ఆనందించారు. అప్పుడు దేవకీదేవి నీవు నా కడుపున పుట్టుతున్నావని తెలిసిన కంసుడు మమ్ములను ఎక్కడ బంధించినాడని తెలిపింది?

**జవాబు :** 1. అడవిలో 2. గృహనిర్బంధంలో
3. కొండగుహలో 4. కారాగృహంలో

**2) ప్రశ్న :** దేవకీ వసుదేవులు పరబ్రహ్మ స్వరూపుడైన మహావిష్ణువును బిడ్డగా పొందడానికి, పూర్వజన్మలో వారు పృశ్ని, సుతపుడుగా నారాయణుని గురించి ఏ మన్వంతరంలో తపస్సు చేశారు?

**జవాబు :** 1. వైవస్వత మన్వంతరం 2. స్వారోచిషుని మన్వంతరం
3. స్వాయంభువ మన్వంతరం 4. ఉత్తముని మన్వంతరం

**3) ప్రశ్న :** సుతపుడు అనే ప్రజాపతికి తన భార్యయైన పృశ్నియందు నారాయణుడు తాను వారికి బిడ్డగా పుట్టతాను అని చెప్పి ఆ విధంగానే అవతరించాడు. పృశ్నికి కుమారుడుగా జన్మించిన మహావిష్ణువుకు ఏ పేరు పెట్టారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** దేవకీ వసుదేవులు పూర్వజన్మలో ఏమి పుణ్యం చేశారు? ఆ పుణ్యం కారణంగా మహావిష్ణువు వారిని ఏవిధంగా అనుగ్రహించాడు?

**జవాబు :** దేవకీదేవి పూర్వజన్మ వృత్తంతాన్ని తెలుపుతూ మహావిష్ణువు అమ్మా! పూర్వం స్వాయంభువ మన్వంతరంలో నీవు 'పృశ్ని' అనే పేరుతో పుట్టావు. వసుదేవుడు 'సుతపుడు' అనే ప్రజాపతిగా ఉన్నాడు. మీరిరువురు దంపతులై ఇంద్రియాలను జయించి, ఆకులు, అలములూ తింటూ, నాగురించి అనేక సంవత్సరాలు నిష్ఠతో తపమాచరించారు. గాలి, వాన, ఎండ, మంచు మొదలైనవి సహించారు. చక్కని రీతిలో నన్ను పూజించారు. నా నామజపం

చేసి నా తత్త్వాన్ని సమీపించారు. అప్పుడు నా సత్య స్వరూపాన్ని చూసి శ్రేష్ఠమైన వరాలు కోరుకోమన్నాను. అయితే మీరు అతి కష్టసాధ్యమైన మోక్షాన్ని కోరకుండా, నా మాయ మిమ్ములను ఆవరించిన కారణంగా, అప్పటికీ మీకు సంతానం లేనందున, నాతో సాటియైన కొడుకులను ప్రసాదించమని నన్ను అర్థించారు. సృష్టి, సంతానం పొందడం అనేది నా సంకల్పం గనుక నేను మీకోరికను మెచ్చుకున్నాను. అలాగే వరమిచ్చాను. నా సాటివాడు అంటూ వేరొకడు లేడు గనుక నేను మీ దంపతులకు కుమారుడుగా అప్పుడు జన్మించాను. అప్పుడు నా పేరు పృశ్నిగర్భుడు. రెండవ జన్మతో మీరు అదితి, కశ్యపుడు అనే పేర్లతో ప్రఖ్యాతులైన దంపతులుగా జన్మించారు. అప్పుడు నేను మీకు వామనుడుగా జన్మించాను. మూడవ జన్మలో ఇప్పుడు మీకు కుమారుడుగా పుట్టాను. ఇక మీయందు ఎప్పటికీ నా జన్మములేదు అని మహావిష్ణువు దేవకీ వసుదేవులను అనుగ్రహించి నాయందు మీకున్న ప్రేమవలన ఇకముందు మీరు జన్మఎత్తరు అని తన ఆనందమయ రూపాన్ని ఉపసంహరించుకొని పసిబిడ్డని రూపం ధరించాడు.

**5) ప్రశ్న :** నారాయణుడు పసిబిడ్డని రూపం ధరించిన పిమ్మట వసుదేవుడు ఆ బిడ్డను ఏమి చేశాడు? కారాగృహంలో పసిబిడ్డ ఏడుపు విని భటులు తెలుపగా కంసుడు ఏమి చేశాడు?

**జవాబు :** గోవిందుడు దివ్యరూపం వదలి పసిబిడ్డ రూపం ధరించిన పిమ్మట దేవకీ వసుదేవులు దిగ్భ్రాంతులై రెప్పలు వాల్చక అతనినే చూస్తూ ఉండిపోయారు. అటుపిమ్మట వసుదేవుడు తాను చేయవలసిన పనులను శ్రీహరి సంకల్పం వలన గ్రహించాడు. పురిటిల్లుదాటి పరుగెత్తిపోవాలని గ్రహించాడు. అదే సమయానికి వ్రేపల్లెలో నందుని ఇంట యశోదాదేవికి ఆడుబిడ్డగా యోగమాయ జన్మించింది. ఇక్కడ వసుదేవుడు పసిబిడ్డను చేతులలోకి తీసుకొని, హృదయానికి హత్తుకొని బయలుదేరాడు. విష్ణుమాయ కారణంగా కారాగారానికి వేసిన తలుపులు గాని, కాపలా వారివలన గాని వ్రేపల్లెలోని యశోద గృహంలోగాని ఎక్కడా ఏ ఇబ్బంది వసుదేవునికి కలగలేదు.

తాను బయలుదేరి వెళ్తుండగా ఆదిశేషుడు పడగలువిప్పి ఆ బాలునికి గొడుగుగా పట్టి నడిచాడు. వసుదేవుడు చీకటిలో ముందుకుసాగి వెళుతుండగా యమునానది అడ్డువచ్చింది. వసుదేవుడు ముందుకు వెళ్తుండగా ఆయనకు యమునా నది దారి ఇచ్చింది. వ్రేపల్లెకు వెళ్ళి యశోద ప్రక్కలో తాను తీసుకొని వెళ్ళిన చిన్నారి నల్లనయ్యను పడుకోబెట్టి, ఆమె ప్రక్కలో ఉన్న బిడ్డను ఎత్తుకొనివచ్చి దేవకీ ప్రక్కలో పడుకోబెట్టాడు. కారాగృహంలో చిన్నిపాప ఏడుపు విని కాపలా ఉన్న భటులు విష్ణుమాయ విడిపోగా పరుగు పరుగున వెళ్ళి కంసునితో దేవకి ప్రసవించిందని చెప్పారు. కంసుడు గాబరాతో లేచి కంగారుగా బయలు దేరాడు. దేవకి చేతిలో ఉన్న చిన్ని పాపను చంపబోయాడు. దేవకీ దేవి తన అన్నతో అన్నా! ఈ బిడ్డ నీ అల్లుడు కాదు, మేనకోడలు. మగబిడ్డ అయితే నీవు చంపటంలో అర్థం ఉంది. కానీ ఇది ఆడుబిడ్డ, దీనిని చంపవద్దు అని ప్రాధేయపడింది. కానీ కంసుడు ఆమె చేతిలో ఉన్న పసిబిడ్డ కాళ్ళు పట్టుకొని లాగి నేలకేసి విసిరాడు. అయితే ఆ పాప నేలపై పడకుండా ఆకాశానికెగరి, దివ్యశక్తి రూపంతో, ఎనిమిది చేతులు ఆయుధాలు ధరించి ఓరి దుర్మార్గుడా! నన్నేల చంపేవు? నిన్ను చంపుటకు వీరుడొకడు నాతోపాటే జన్మించి మరోదిక్కున పెరుగుతున్నాడు అని చెప్పి ఆ దేవి అదృశ్యురాలైంది. అటుతరువాత కంసుడు దేవకీ వసుదేవులను అనునయవాక్యాలతో శాంతింపజేశాడు. వారిని బంధ విముక్తులనుగా చేశాడు. తాను యోగమాయాదేవి చెప్పిన దానిని గురించి ఆలోచించసాగాడు.

## యాభై మూడవ అధ్యాయము - దశమ స్కంధము

**జవాబులు :** 1. 4. కారాగృహంలో 2. 3. స్వాయంభువ మన్వంతరంలో
3. పృశ్ని గర్భుడు

* * *

## యాభై నాలుగవ అధ్యాయము - దశమ స్కంధము

**1. పూతనా సంహారం 2. బాలకృష్ణుడు తన పాదంతో బండిని తన్నడం**

**1) ప్రశ్న :** వ్రేపల్లెలో నందుడు తనకు కొడుకు పుట్టాడని విని పరమానందంతో యోగ్యులైన విప్రులకు ఎక్కువగా ఏ దానం చేశాడు?

**జవాబు :** 1. కన్యాదానం చేశాడు 2. గోవులను, ధనాన్ని దానం చేశాడు
3. భూదానం చేశాడు 4. వస్త్రదానం చేశాడు

**2) ప్రశ్న :** భవిష్యత్తును గురించి యోగ మాయాదేవి చెప్పినప్పటి నుండి కంసునికి ప్రాణభయం పట్టుకుంది. అందుకు తనవారందరి సలహాతో, మన రాజ్యంలో పుట్టిన పసిపాపలను చంపి వేయాలని నిర్ణయించి, పంపిన రాక్షసులలో మొదటగా వ్రేపల్లెకు ఎవరిని పంపించాడు?

**జవాబు:** 1. పూతన 2. శకటాసురుడు
3. తృణావర్తుడు 4. వత్సాసురుడు

**3) ప్రశ్న :** వ్రేపల్లెలో నందుడికి కొడుకు పుట్టినప్పటి నుండి ఆ పల్లె వాసులందరూ సంతోషంతో ఉండగా, ఒకనాడు నందుడు ఏటేటా చెల్లించవలసిన పన్నులను చెల్లించటానికి మధురా నగరానికి వచ్చి కంసుని కలుసుకొన్నాడు. అచ్చట కట్టవలసిన పన్నులను కంసునికి సమర్పించి వానివద్ద శెలవు తీసికొని ఎవరి ఇంటికి వెళ్ళాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** పసిబాలకుడైన నందనందనుని చేతిలో పూతనాసంహారం ఏవిధంగా జరిగింది?

**జవాబు :** కంసప్రేరేపితయైన పూతన అనే రాక్షసి శిశువులను చంపటానికై బయలుదేరి పల్లెలు, పట్టణాల్లో ఎక్కడ పసిపాపలు కనిపించినా చంపివేస్తూ వెళుతూవుంది. ఆ క్రమంలో వ్రేపల్లెకు వచ్చి ఎవరికంటా పడకుండా ఇల్లిల్లూ తిరిగింది. కామరూపిణి గనుక అందమైన యువతి వేషం ధరించి నందుని

ఇంట్లో ప్రవేశించింది. ఆమె లోపలికి వెళుతూంటే గోపికలందరూ ఏమి మాట్లాడటానికి నోరురాక మైకంలో ఉన్నట్లు నిలబడిపోయారు. ఆమె నేరుగా పసిబిడ్డను పడుకోబెట్టిన మంచం దగ్గరకు వెళ్ళింది. చరాచర జగత్తుకు ప్రభువైన పరమాత్మ పసిబిడ్డడుగా గుర్రుపెట్టి నిద్రిస్తున్నట్లుగా నటించాడు. క్రూరత్వంతో నిండిపోయి, బాలింతరాలి వేషంలో పాలిండ్లలో విషం నింపుకొని వచ్చిందని లోలోపల నవ్వుకున్నాడు. అప్పుడు పూతన పసిబిడ్డ రూపంలో ఉన్న జగన్నాథుడిని తన చేతులతో లేవదీసి అతణ్ని తన పాలిండ్లకు హత్తుకుంది. శిరసు వాసన చూచి ముద్దు పెట్టుకున్నది. తరువాత చిన్ని తండ్రీ! నా చనుబాలు ఒక్క గ్రుక్కెడు త్రాగిచూడు. అపుడు నీ అందమెలా ఉంటుందో తెలుస్తుంది. అందువల్ల ఇప్పుడున్న నా అందానికి కూడా ఫలితం దక్కుతుంది అని ముద్దాడుతున్న పూతనను చూచి యశోదా, రోహిణిలు చూడమ్మా! నీవెవరో క్రొత్త యువతివి. మా బాబును ముట్టుకోకు. అయ్యో వాడికి చన్నుకుడుపకమ్మా! నీచనుబాలు మా అబ్బాయి ఇష్టపడడు. వెంటనే వెళ్ళిపో! అని అరుస్తున్నా పట్టించు కోకుండా పూతన తన స్తన్యాన్ని పట్టింది. ఆయన ఎంతో ఆకలితో ఉన్నట్లు ఆమె బిగువైన చన్నును రెండు చేతులతో పట్టుకొని, నోట పెట్టుకొని గుటుక్కు, గుటుక్కుమని రెండు గ్రుక్కలలో ఆమె శరీరంలోని సత్తువ నంతా త్రాగేసి, చివరకు ప్రాణాలు కూడా త్రాగేశాడు. ఆమె గుండెలు తల్లడిల్లి పోయాయి. అమ్మో నీవు అందరి బాలురవంటి వాడవు కావు. నన్ను విడువు, విడువుమని గిలగిల లాడింది. పెద్ద ఆర్తనాదంతో నేలకూలింది. ఆ రాక్షసికి చావు దగ్గరపడే సరికి కామరూపం పోయి నిజరూపంతో భయంకరాకారంతో నేలకూలింది. అది చూసి గోపగోపిక లందరూ భయం, భయంగా చూస్తూ దూరంగా ఉండిపోయారు. అప్పుడు నందాదులు మధుర నుండి వచ్చి ఆ రాకాసి, కళేబరం చూసి నివ్వెరపోయారు. మధురలో వసుదేవుడు జరగబోయే ఉత్పాతాల గురించి చెప్పాడు. అతడు మహాయోగి అని మెచ్చు కున్నారు. తరువాత పూతన కళేబరాన్ని ముక్కలుగా చేసి పల్లెకు చాలా దూరంగా తీసుకువెళ్ళి దహనం చేశారు. ఈ విధంగా పూతనా సంహారం జరిగింది.

**5) ప్రశ్న :** యశోదా నందనుడు పసివాడై యుండి కూడా బండి నేలతన్నాడు? దానికథ ఏమిటి?

**జవాబు :** యశోద తన బిడ్డ ప్రక్కకు ఒత్తిగిలి బోర్లపడుతున్నాడని, ఆ బిడ్డ జన్మనక్షత్రం రోజున వేడుక చేసింది. ముచ్చటతో గోపికలందరిని పేరంటానికి పిలిచింది. వచ్చిన వారందరనీ గౌరవిస్తూ, పూజిస్తూ సందడిలో, ప్రేమతో పాన్పుపై పడుకోబెట్టిన పిల్లవాడి విషయం మరిచిపోయింది. నిద్ర నుండి లేచిన ఆ పసివానికి ఆకలివేసింది. తల్లి పాలిండ్ల కోసం తడుము కున్నాడు. దొరకలేదు. కోపం వచ్చి కాళ్ళు కొట్టుకో సాగాడు. ఇంతలో ప్రక్కనే బండిపైకెగిరి నేలపైన పడిపోయింది. గోపకులందరూ నివ్వెరపోయి చేస్తున్న పనులు మరచిపోయారు. పండుగ చేసుకోవటం మానివేశారు. గొప్ప భయంతో వారి మనస్సులు బరువెక్కి పోయాయి. అప్పుడు వారిలో వారు ఈ బండి ఆకాశంలోకి తనంతట తాను ఎగురదు కదా! దగ్గర ప్రక్కపైన ఉన్న ఈ పాపడు తన్నడానికి సమర్థుడు కాడు మరి ఏవిధంగా జరిగి ఉండవచ్చు? అని ఆలోచిస్తుండగా అక్కడ ఆడుకుంటున్న పిల్లలు, ఈ బాలకుడు ఆకలితో ఏడుస్తూ కాలెత్తి ఒక తన్ను తన్నాడు. తన్నగానే ఈ బండి అమాంతంగా పైకి వెళ్ళిపోయింది. అంతేగాని మరేకారణం కాదు అని చెప్పారు. ఆ పిల్లల మాటలు విని ఏమిటి? ఈ బాలుడెంత వాడు? బండి ఎంతటిది? వీడు ఈ బండిని ఆకాశానికి ఎగిరేటట్లు తన్నటమా? ఇది నమ్మశక్యంగా లేదు అని వారనుకొన్నారు. వెంటనే విడిపోయిన బండి విడి భాగాలను ఒకదాని కొకటి తగిలించారు. యశోద పరుగెత్తుకొని వచ్చి బిడ్డను ఎత్తుకొని తన పాలిచ్చి పడుకోబెట్టింది.

**యాభై నాలుగవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 2. గోవులను, ధనాన్నిదానం చేశాడు. 2. 1. పూతన
3. వసుదేవుని

* * *

## యాభై ఐదవ అధ్యాయము - దశమ స్కంధము

### 1. తృణావర్తుడనే రాక్షస సంహారం 2. బలరామ కృష్ణుల బాల్య క్రీడలు

**1) ప్రశ్న :** ఒకనాడు యశోద తన ముద్దుల కొడుకును తన తొడలపై పడుకోబెట్టుకొని, ముద్దాడి ప్రేమతో ఒడలు నిమురుతూ ఉంది. ఆ సమయంలో సుడిగాలి రూపంలో వచ్చిన రాక్షసుడు కృష్ణుని అమాంతం ఆకాశానికి ఎత్తుకెళ్ళాడు. కంసుని పంపగా వచ్చిన ఆ రాక్షసుడు ఎవరు?

**జవాబు :** 1. శకటాసురుడు 2. పూతన
3. బకాసురుడు 4. తృణావర్తుడు

**2) ప్రశ్న :** శ్రీకృష్ణుని సుడిగాలి రూపంలో ఎత్తుకెళ్ళిన తృణావర్తుడనే రాక్షసుడు సృష్టించిన సుడిగాలి ఎంత కాలముంది?

**జవాబు :** 1. ఒక్క ముహూర్తకాలం 2. ఒక్క ఘడియ కాలం
3. ఒక్కరోజు కాలం 4. ఒక్క విఘడియ కాలం

**3) ప్రశ్న :** పసివాడు కనబడక పోయేసరికి యశోద ఎంతో దుఃఖంతో కలవరపడి పోయింది. ఓయి చిట్టి తండ్రీ! ఈ సుడిగాలికి ఆపదలో పడిపోయినావా? అని విలపించింది. ఆ బిడ్డను గొంతెత్తి పిలిచింది. లోలోపల పరితాపంతో తపించి పోయింది. శోకంతో సొమ్మసిల్లి పోతూ ఎవరిని నిందించింది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** తృణావర్తుని సంహారం ఏవిధంగా జరిగింది? నందుడు రోహిణీ బిడ్డకు తన యశోద బిడ్డకు ఏరకంగా నామకరణం చేశాడు?

**జవాబు :** తనకు బరువనిపించి క్రింద పడుకోబెట్టిన యశోద కొడుకును, తృణావర్తుడనే రాక్షసుడు సుడిగాలిరూపంలో వచ్చి మహాగర్వంతో ఆ బాలుని ఆకాశంలోనికి తీసుకొని పోగలిగాడు. అయితే క్రమేణ బాలుడు బరువెక్కిపో సాగాడు. చివరకి ఆ బాలుణ్ణి భరించడానికి కావలసిన శక్తి ఆ రాక్షసుని వద్ద

లేకపోయింది. కదకు కదలడమే వాడికి కష్టసాధ్యమై పోయింది. ఇంతకు ముందు ఇలాంటి బాలుణ్ణి నేనెక్కడా చూడలేదే? అనుకొన్నాడు. దిక్కు తోచక ఇక నేనేమైపోతానో అనుకొన్నాడు. ఆ సమయంలో ఆ పసిబిడ్డ రెండు చేతులు రాక్షసుని మెడపట్టుకొని, కొండంత బరువుతో క్రిందికి వ్రేలాడసాగాడు. తన మెడ పట్టుకొని పర్వతమంత బరువుతో దిగలాగుతున్న ఆ బాలకుని పట్టు నుంచి విడిపించు కోలేక ఆ రాక్షసుడు ఉరిలో పడి కొట్టుకొనే పక్షిలాగా గిలగిల కొట్టుకున్నాడు. ఆ చిన్ని బాలుని చేతుల వత్తిడికి తన శరీరం తన ఆధీనంలో లేక ఆకాశంలో నుండి ఆ రాక్షసుడు క్రింద రాళ్ళమీద కూలిపోయాడు. ఆ దెబ్బకు వాడి శరీర భాగాలన్ని తుక్కుతుక్కుగా చితికి పోయాయి. ఆ రాక్షసుని మృత శరీరంపై ఆడుకొంటున్న బాలుణ్ణి చూచి సంతోషించి గోపికలు ఎత్తుకొని తీసికొని వచ్చి దుఃఖ పడుతున్న యశోద చేతికి ఇచ్చి ఆమె దుఃఖాన్ని పోగొట్టారు. అప్పుడు గోపికలకు ఆ బాలుడు విచిత్రంగా ఏమాత్రం బరువు లేకుండా తెలికగా ఉన్నాడు. ఆ విధంగా తృణావర్తుని సంహారం జరిగింది. ఆ రోజులలో ఒకనాడు తమ పురోహితుడైన గర్గమహర్షి నందుని చూడవచ్చాడు. వచ్చిన మహానుబావుని నందుడు ఉచిత రీతిని సత్కరించి గురువర్యా! నీవు ఈ బిడ్డలిద్దరికీ నామకరణం చేయమని వేడుకున్నాడు. నందుని కోరిక మేరకు రోహిణి బిడ్డకు బలరాముడని, యశోద కొడుకుకు కృష్ణుడని నామకరణం చేసి నందుని చూచి నీ కుమారుడు నారాయణునితో సమానుడు అని దీవించి గర్గమహర్షి వెళ్ళాడు. ఈ విధంగా బలరామ కృష్ణుల నామకరణ మహోత్సవం గోప్యంగా నిరాడంబరంగా జరిగింది.

**5) ప్రశ్న :** బలరామ కృష్ణుల బాల్య క్రీడలు పోతన కవీంద్రుడు ఏ విధంగా వర్ణించాడు?

**జవాబు :** శ్రీకృష్ణుడు, బలరాముడు క్రమక్రమంగా బాల్యక్రీడలతో తల్లిదండ్రులను గోపీ గోపకులను చక్కగా సంతోషింప జేస్తున్నారు. మోకాళ్ళమీద చేతులు ఆన్చి నెమ్మదిగా లేచి నిలబడుతున్నారు. ఆ లేవడంలో చేతులు

జారిపోయి ముందుకు తూలిపోతూ, మళ్ళీ లేస్తున్నారు. అటూ ఇటూ నడుస్తున్నారు. వచ్చీరాని ముద్దు మాటలు ముచ్చటగా మాట్లాడుతున్నారు. రోజు రోజుకూ వారి ముఖాలలోని తేజస్సు పెరుగుతూంది. వారిని చూస్తున్న కొద్దీ వ్రేపల్లెలోని జనులకు తన్మయత్వం కలుగుతున్నది. త్రిమూర్తులకు అతీతంగా ఉండే శ్రీమన్నారాయణుడు జన్మలు లేనివాడు గనుక 'అమ్మ' అంటూ ఆయన కెవరూలేరు. ఆ పరమ పురుషుడిప్పుడు బాలకుడై అమ్మలందరికి ఆనందం కలిగేటట్లు 'అమ్మా, అమ్మా' అని పిలవడం నేర్చుకున్నాడు. బలరామ కృష్ణుల బాల్యక్రీడలు గోపికలకు మధుర మధురంగ కనిపిస్తూ ఉన్నాయి. వారు ఆ మాధుర్యాన్ని మరిగి అన్ని పనులూ మరచిపోయి ఆ క్రీడలనే మక్కువతో వీక్షిస్తూ ఉండిపోయారు. కృష్ణుడు రోజు రోజుకు నడవడం మట్లాడడం చక్కగా నేర్చుకున్నాడు. గోపబాలకులతో కలిసి, రకరకాల ఆటలు ఆడసాగాడు. ఈ బాల్యక్రీడలు అతనికి లీలలేగాని నిజమైనవి కావు. అనేక రకాల శ్రీకృష్ణుని బాల్యక్రీడలను పోతన కవీంద్రుడు వ్యాస భాగవతం ద్వారా మనసున దర్శించి వర్ణించాడు.

### యాభై ఐదవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 4. తృణావర్తుడు 2. 1. ఒక్క ముహూర్తకాలం
3. దైవాన్ని

* * *

## యాభై ఆరవ అధ్యాయము – దశమ స్కంధము

### 1. శ్రీకృష్ణుని దుడుకుపనులను గోపికలు యశోదకు చెప్పడం 2. శ్రీకృష్ణుడు తననోటి యందు విశ్వరూపాన్ని తల్లికి చూపడం

**1) ప్రశ్న :** బాల్య క్రీడలలో కృష్ణుడు చేసే అల్లరి అంతకంతకూ పెరుగుతూ పోతూంది. ఆయన అల్లరి భరించలేక గోపికలు కృష్ణుని కుటుంబసభ్యులలో ఎవరికి చెప్పుకున్నారు?

| **జవాబు :** | 1. రోహిణికి | 2. నందునికి |
|---|---|---|
| | 3. యశోదకు | 4. గొల్లపెద్దలకు |

**2) ప్రశ్న :** శ్రీకృష్ణుని అల్లరిలో భాగంగా, తనతోడి వారితో గూడి ఒకరింట్లో పెరుగు త్రాగి, వెళ్ళేటప్పుడు ఆ యింటి కోడలి మూతికి కొంత అంటించి వెళ్ళాడు. దొంగ తిండి తిన్నదని పాపం ఆ కోడలిని వారి కుటుంబసభ్యులు ఎవరు కొట్టారు?

| **జవాబు :** | 1. అత్త | 2. భర్త |
|---|---|---|
| | 3. మామ | 4. తోడికోడలు |

**3) ప్రశ్న :** ఒక గోపవనిత యశోద వద్దకు వచ్చి అమ్మా! నీ కొడుకు చేతి బంతి ఎగిరివచ్చి మా పెరట్లో పడిందని దొడ్డి లోపలికివచ్చాడు. అప్పుడు పెరట్లో మా చిన్నది స్నానం చేస్తూ ఉంది. ఆ సమయంలో కృష్ణుడు ఏమి తీసుకొని వెళ్ళాడని ఆ గోపిక యశోదమ్మతో చెప్పింది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శ్రీకృష్ణుని ఆగడాలను ఏకరువు పెట్టడానికి గోపికలు యశోదవద్దకు వచ్చి ఏ రీతిగా చెప్పుకున్నారు? యశోదాదేవి ఆ గోపికలను ఏ తెరగును సముదాయించి పంపించింది?

**జవాబు :** కృష్ణుని ఆగడాలను ఏకరువు పెట్టడానికి గోపికలు కొందరు యశోద దగ్గరకు వచ్చి అమ్మా! నీ కొడుకు చేసే అల్లరి భరించలేకుండా ఉన్నాము. నిన్నగాక మొన్న పుట్టాడో లేదో అప్పుడే దొంగతనాలు

మొదలుపెట్టాడు. ఇదిగో యశోదమ్మా! మాయింట జొరబడి నీ కొడుకు వెన్న తింటూ ఉంటే చూచి మా చిన్నమ్మాయి అడ్డం వెళ్ళి ఈవలకు లాగింది. మీవాడు ఆ పడుచుపిల్లను ఒడిసిపట్టుకొని రొమ్ముమీద గోళ్ళతో గీరి పారిపోయాడు. నీ కొడుకు చేసిన పనులకు గొప్పగా నవ్వేవు గాని ఇది విను. మా వాడలో ఉన్న గోపికలందరమూ కలిసి క్రిష్ణయ్య వస్తాడేమో అని పాలు, పెరుగులు భద్రంగా ఇండ్లలో పెట్టి తలుపులకు తాళాలువేసి పైన ముద్రలు కూడా వేశాము. మేమందరమూ తాను వచ్చేదారి వంకకు చూస్తూ కాపలా ఉన్నాము. ఎప్పుడు వచ్చాడో ఏమిటో? తలుపుల తాళాలు వేసినవి వేసినట్లే ఉన్నాయి. నీ కొడుకు ఒక ఇంట్లో నాట్యం చేస్తున్నాడు. ఒక ఇంట్లో పాటలు పాడుతూ ఉన్నాడు. ఒక ఇంట్లో నవ్వుతూ ఉన్నాడు. ఒక ఇంట్లో నుండి ఎక్కిరిస్తున్నాడు. మరొక ఇంట్లో నుండి రకరకాల జంతువుల అరుపులూ, పక్షుల కూతలూ కూస్తూ ఉన్నాడు. ఇలా చేసి చేసి ఎక్కడకు పోతాడో? ఎప్పుడు పోతాడో? కనబడకుండా మాయమవుతాడు. తీరా తలుపులు తీసిచూస్తే ఖాళీ కడవలు మాత్రం అటూ ఇటూ పడి ఉంటాయి. మీరు ఎంత పెద్దవాళ్ళైతే మాత్రం ఇలా నవ్వుతూ బిడ్డలను పేదవాళ్ళమైన మా ఇళ్ళపైకి పంపుతారటమ్మా ఎక్కడైనా? అప్పుడు యశోద అమ్మలారా! మా కన్నయ్య నావళ్ళో నుండి ఎక్కడికీ పోడు. నా బిడ్డను ఇలా అల్లరి పెట్టటం మీకేమైనా బాగుందా? మావాడికి మరేమీ తెలియదు. ఏదో తనంతట తాను ఆడుకుంటూ ఉంటాడు. ఈ నా బిడ్డపైన నిందలు వేయకండి. మిమ్ములను బతిమాలు కుంటాను అని గోపికలను సముదాయించి సర్దిచెప్పి ఒప్పించి పంపి వేసిందే గాని యశోదమ్మ కొడుకును ఏమాత్రం కోపగించలేక పోయింది.

**5) ప్రశ్న :** బాలకుని నోట బ్రహ్మాండాన్ని చూచిన యశోదకు ఆ పరిస్థితి ఎందుకు వచ్చింది? ఏ విధంగా జరిగింది?

**జవాబు :** ఒకనాడు బలరాముడు మొదలగు గోపబాలురు యశోదమ్మ కడకువచ్చి అమ్మా! కృష్ణుడు మన్ను తిన్నాడు అని చెప్పారు. తల్లి ఒడిచేరిన కృష్ణుని నేత్రాలు భయ సంభ్రమాలతో చలిస్తున్నాయి. అంతట ఆ యమ్మ కృష్ణుని చేయిపట్టుకొని, అతని హితమును కోరుచూ కుమారా! నీతోటి వారు

చెప్పినట్లుగా మన్నెందుకు తిన్నావు? అని అడిగిన అమ్మతో కృష్ణుడు అమ్మా! నేను మన్ను తిననేలేదు. వీరందరూ నాపై అసత్యం చెబుతున్నారు. కల్పితపు మాటలతో నాపై చాడీలు చెబుతున్నారు. కానీ నీవు వీరి మాటలే సత్యమని నమ్మితే నా నోటిని పరిశీలించి వాసన చూడు. నేను నీ ఎదుటనే ఉన్నాను గదా! అని అనగానే యశోదమ్మ సరే నీ నోరు తెరువు అన్నది. అప్పుడు కృష్ణుడు తన నోటిని తెరచి చూపాడు. ఆ నోటిలో యశోదమ్మ అంతరిక్షము, దిక్కులు, పర్వతాలు, ద్వీపాలు, సముద్రాలు మొదలగు వాటితోకూడి సమస్త భూమండలము, సత్త్వరజస్తమో గుణాలతో నిండియున్న సమస్త చరాచర జగత్తు ఆమెకు గోచరించింది. అంతేగాదు, ఆ చిన్నారి ముఖమునందు గోకులమును, తనను, కృష్ణునిగూడ చూసింది. ఆ చిన్ని కృష్ణుని నోట ఈ అద్భుత దృశ్యాలు కనబడటంతో ఆమె ఇది కలయా? వైష్ణవమాయా! నా బుద్ధి భ్రమించెనా? బహుశా ఈతడు మనో వాక్కాయ కర్మలకు, ఊహలకు అందని విశ్వాత్మకుడై ఉండవచ్చు. ఈతని వలననే ఈ జగత్తంతయు వ్యక్తమగుతున్నది. ఈ స్వామి యొక్క స్వరూపము 'ఇట్టిది' అని తెలుపుటకు సాధ్యము కానిది. అందువలన ఈ పరమాత్మ పాదములకు ప్రణమిల్లెదను, ఈ పరమాత్మయే నాకు శరణ్యుడు అని యశోదాదేవి తాత్త్విక చింతనలో మునిగి యుండగా సర్వేశ్వరుడు ఆమెపై విష్ణుమాయను ప్రసరింపజేశాడు. ఆ ప్రభావంతో ఆమెలో శ్రీకృష్ణునిపై పుత్ర వాత్సల్యం పెల్లుబికింది. తన బిడ్డ పరమాత్మయను భావము మటు మాయమయ్యింది. అటుపిమ్మట తన బిడ్డను ఒడిలోకి తీసికొన్న యశోదమ్మకు ఎప్పటివలె పుత్ర ప్రేమ కలిగింది. ఈ విధంగా కృష్ణుడు తననోటి యందు అమ్మకు విశ్వరూపాన్ని చూపించాడు.

**యాభై ఆరవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 3. యశోదకు  2. 1. అత్త
3. ఆ అమ్మాయి చీరను

* * *

## యాభై ఏడవ అధ్యాయము - దశమ స్కంధము

**1. యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతము 2. పెరుగు కుండను పగులగొట్టిన కృష్ణుని యశోద పట్టుకోవడం**

**1) ప్రశ్న :** ఈ జగత్తుకంతటికీ ప్రభువైన భగవంతుణి పాలిచ్చి పెంచే తల్లిగా జన్మించడానికి, ఈ యశోదాదేవి వెనుకటి జన్మలో ఏమి పుణ్యాన్ని చేసి ఉండవచ్చునన్న సందేహాన్ని పరీక్షన్మహారాజు శుకమహర్షిని అడిగాడు?

**జవాబు :** 1. తపస్సు 2. నోములు
3. ఆరాధన 4. దానాలు

**2) ప్రశ్న :** శ్రీహరిని పోషించే తండ్రిగా పుట్టడానికి నందగోపుడు ఏమి చేసి యుండవచ్చని శుకయోగీంద్రునితో పరీక్షిన్మహారాజు తన సందేహాన్ని వెలిబుచ్చాడు?

**జవాబు :** 1. నోములు 2. దానాలు
3. తపస్సు 4. ఆరాధన

**3) ప్రశ్న :** దేవకీ వసుదేవులు మరియు యశోదా నందులు వీరిలో ఎవరిని అదృష్టవంతులుగా పరీక్షిత్తు మహర్షితో చెప్పాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** రాజయోగియైన పరీక్షిత్తు శుకమహర్షితో స్వామీ! పరమాత్మునికి తన స్తన్యమిచ్చిన యశోద పెంచి ఆయన బాల్య లీలలను కన్నులారా గాంచిన నందుడు, వీరిరువురి పూర్వజన్మ వృత్తాంతాన్ని తెలుపుమనగా శుకమహర్షి ఏ రీతిగా తెలిపాడు?

**జవాబు :** మహారాజా! చెబుతాను విను. వసువులు అనే దేవతలలో ద్రోణుడు అనేవాడు ముఖ్యుడు అతని భార్య పేరు ధర. శ్రీహరి భూభారాన్ని తగ్గించటానికి నిర్ణయమైన తరువాత, ఆయనకు అనుకూలురుగా దేవతలను భువిపై

జన్మించమని చెప్పే క్రమంలో బ్రహ్మదేవుడు ద్రోణ దంపతులను కూడా భూమిపైన జన్మించమని ఆదేశించాడు. అంతట వారు విశ్వేశ్వరుడైన విష్ణుదేవుని సేవించే భాగ్యం ప్రసాదించినట్లైతే అలాగే భూమిపై జన్మిస్తాము' అన్నారు. బ్రహ్మదేవుడు 'అలాగే' అని అనుగ్రహించాడు. ఆ ద్రోణుడనే వసువే ఈ నందుడు. ధరాదేవి యశోదగా జన్మించింది. శ్రీహరి కూడా బ్రహ్మదేవుని మాట మన్నించి ఆ దంపతులను తల్లిదండ్రులుగా అంగీకరించి, ఎంతో భక్తితో, సంతోషంతో గౌరవించాడు.

**5) ప్రశ్న :** శ్రీ కృష్ణుని బాల్య లీలలు చెపుతూ శుకయోగి, యశోదాదేవి పెరుగు చిలుకుతున్న కుండను కన్నయ్య పగులగొట్టాడని చెప్పాడు. ఆ పరిస్థితి ఏరీతిగా సంభవించింది?

**జవాబు :** ఒకనాడు యశోదమ్మ తన ఇంటనున్న యువతులందరిని వేర్వేరు పనులకై పంపి ఆమె చిలికే స్తంభం వద్ద కుదురులో పెరుగు కుండను పెట్టి, అందులో మిసమిసలాడే మీగడ పెరుగు పోసింది. తరి త్రాటిని కవ్వానికి తగిలించి పెరుగు చిలకడం మొదలు పెట్టింది. ఆ సమయంలో కృష్ణుడు తల్లివద్దకు వచ్చి 'అమ్మా! నాకు పాలివ్వవే!' అంటూ గంతులు వేస్తూ దగ్గరకు వచ్చి కవ్వాన్ని కదలకుండా పట్టుకొన్నాడు. అప్పుడు యశోద నవ్వుతూ దధి చిలకడం ఆపి కృష్ణునికి పాలివ్వసాగింది. బాలుడు పాలు త్రాగుతుండగా, పొయ్యిమీద పాలు పొంగుతూ ఉంటే చూచిన యశోద కృష్ణుణ్ణి దింపి, పాలకుండ దింపడానికి గబగబా లోపలికి వెళ్ళింది. పాలు పూర్తిగా త్రాగకుండా మధ్యలో ఆపి వెళ్ళిందన్న కోపంతో కృష్ణుడు ఒకరాతితో పెరుగుకుండ బద్దలు కొట్టాడు. పగిలిన దధి బాండంలోని వెన్నతింటూ బయటకు వెళ్ళాడు. ఇంతలో వచ్చిన యశోద పెరుగుకుండ పగిలి ఉండటం చూచి ఇది తన కొడుకు చేసిన పనేనని గ్రహించి, లోలోపల నవ్వుకొని కొడుకుకోసం చూస్తే ఆ కొంటె కృష్ణుడు కనబడలేదు. అతణ్ణి వెతకుతూ వెళ్ళగా మరొక ఇంటిలో ఉట్టిమీద వెన్నతీసి కోతికి పెడుతున్నాడు. కృష్ణుని అలా చూసిన యశోద బెత్తం తీసుకొని, కన్నయ్యా! నీవు ఇంత వరకూ ఎవరి చేతికీ చిక్కలేదని, ఎవరూ నిన్ను

అడ్డుకోలేరని, నీకు బొత్తిగా అదురూ బెదురూ లేకుండా పోయింది. కానీ ఇవాళ ఎలా తప్పించు కొంటావో చూస్తాను అని కృష్ణుని పట్టుకోవడానికి ప్రయత్నించింది. ఈ విధంగా దధిభాండ వికలనం చేసి వెళుతున్న కృష్ణుని వెంబడించిన యశోదను చూచి చుట్టుప్రక్కల ఉండే గోపికలు నవ్వుకున్నారు.

**యాభై ఏడవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1.2. నోములు  2.3. తపస్సు

3. యశోదా నందులు

* * *

## యాభై ఎనిమిదవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుని యశోదమ్మ రోటికి కట్టివేయడం 2. నందాదులు బృందావనానికి వెళ్ళడం**

**1) ప్రశ్న :** దధిబాండ వికలనం చేసినవాడు, ఇరుగు పొరుగిళ్ళలో వెన్న దొంగిలించడం చూచిన యశోద తన కొడుకును ఏ ఉపాయంతో వశం చేసుకోవాలను కొన్నది?

**జవాబు :** 1. సామోపాయం ద్వారా (మంచి మాటల ద్వారా)

2. ఏదైనా ఇచ్చి (దానోపాయం)
3. భేదోపాయం (తాను చేయబోయే దుడుకుపనిని ముందుగానే అడ్డగించి)
4. దండోపాయం (దండించి)

**2) ప్రశ్న :** తన ముంగిలిలో పరుగెత్తుతూన్న బాలకృష్ణుని పట్టుకోవాలని శ్రమ పడుతూన్న తల్లిని జూచి, ఆమెకు చిక్కాలనే చిక్కాడు. తాను పట్టుకొన్న తరువాత యశోద, కృష్ణునికి ఏ శిక్ష వేయాలనుకొన్నది?

**జవాబు :** 1. కొట్టాలనుకొన్నది 2. కట్టివేద్దామని అనుకొన్నది
3. వదిలేద్దామని అనుకొన్నది 4. లాలించి పాలిద్దా మనుకొన్నది

**3) ప్రశ్న :** యశోద తన చేత పట్టుబడ్డ కృష్ణుడితో నిన్ను పట్టుకోవాలంటే ఎవరికీ పట్టుబడవని నీవనుకొంటున్నావు. నేను పట్టుకోవాలని పట్టుబట్టితే నిన్ను పట్టుకోవడం పెద్ద కష్టమనుకున్నావా? అంటూ యశోదాదేవి నోటివెంట అప్రయత్నంగానే ఏ విధమైన భగవంతుని లీలావైభవాలను స్మరించింది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**5) ప్రశ్న :** తన చేతికి చిక్కిన బాలకృష్ణుని తల్లి యశోద ఏవిధంగా కట్టివేసింది? అనంతరమా బాలకృష్ణుడు ఏమి చేశాడు?

**జవాబు :** కృష్ణుణ్ణి చిక్కించుకొని గట్టిగా పట్టుకొన్న యశోద అతణ్ణి గట్టిగా రోటికి కట్టడానికి అతడి నడుము చుట్టూ ఒక త్రాడు చుట్టింది. అది రెండు అంగుళాలు తక్కువైంది. మరోత్రాడు జతచేసినా అప్పుడు కూడా ఆ రెండు అంగుళాలే తక్కువైంది. మరొక్క త్రాడు ముడివేసి చూచినా అంతే తక్కువైంది. ఆ తల్లి ఇంట్లో ఉన్న త్రాళ్ళన్నీ వరుసగా ముడివేసినా అంతే వెలితి ఉండి పోయింది. ముజ్జగములూ దాగి ఉన్న ఆ చిరుబొజ్జను కట్టడం ఎవరితరం? ఆ వింతనూ పిల్లవాణ్ణి చూచి యశోదా గోపికలూ నివ్వెర పోయారు. పాపం ఈ శ్రమ వలన శరీరమంతా చమటలు పట్టుతూ కట్టడానికి శక్యం కాని తనను కట్టి వేయాలనే పట్టుదలతో తంటాలు పడుతున్న తల్లిని చూచి నల్లనయ్య జాలిపడ్డాడు. భవ బంధాలను తొలగించి మోక్షాన్ని ప్రసాదించే భగవంతుడు బాలకృష్ణుడై ఇప్పుడు తల్లి కష్టం చూడలేక ఆమె కట్టుతున్న త్రాటికే కట్టుబడి పోయాడు. ప్రియ మిత్రుడైన శివుడుగానీ, ఆయన వక్షస్థలాన్ని ఆశ్రయించుకొని ఉన్న లక్ష్మీదేవిని గానీ, ఆయన కొడుకునని విర్రవీగే బ్రహ్మదేవుడు గానీ శ్రీహరి వలన యశోద పొందిన అనుగ్రహాన్ని పొందలేక పోయారు. భక్తులకు పట్టుబడినట్లుగా భగవంతుడు జ్ఞానులకుగానీ, మౌనులకుగానీ, దానపరులకు గానీ, యోగీశ్వరులకు గానీ పట్టుబడడు. యశోదాదేవి కృష్ణుని అలా రోటికి కట్టివేసి, ఇంటిపనులలో మునిగి పోయింది. బాలకృష్ణుడు ఆ యింటి పెరట్లో ఉన్న జంట మద్దిచెట్లను చూశాడు. వారు నారద మహర్షి శాపకారణంగా శ్రీహరి కృపకోసం అక్కడ పడి ఉన్న కుబేరుని కుమారులు నలకూబరుడు, మణిగ్రీవుడు అను యక్షులు. వారిద్దరినీ చూచి బాలకృష్ణుడు రోటిని ఈడ్చుకుంటూ వెళ్ళి ఆ జంట మద్ది చెట్ల మధ్య నుండి వెళ్ళేక్రమంలో రోలు అడ్డం తిరిగింది. బాలకృష్ణుడు బలంగా లాగేసరికి ఆ మద్దిచెట్లు పడిపోయాయి. ఆ చెట్ల నుండి నలకూబరుడు, మణిగ్రీవుడు వెలువడి స్వామి అనుగ్రహాన్ని పొందివారి స్థానమైన ఉత్తర దిక్కుకు వెళ్ళారు. ఈ విధంగా బాలకృష్ణుడు యక్షులను అనుగ్రహించాడు.

**5) ప్రశ్న :** నందాదులు వ్రేపల్లెను వీడి బృందావనానికి ఎందుకు పోవలసి వచ్చింది? అక్కడ ఏవిధంగా వారు స్థిరపడ్డారు?

**జవాబు :** కృష్ణుడు బాల్యక్రీడలు చూపుతూ వ్రేపల్లె వాసులందరినీ వినోదింప జేస్తున్నాడు. ఒకనాడు నందునితో పాటు గ్రామస్తులందరూ ఒకచోటచేరి, అప్పటి వరకూ సంభవించిన భయంకరమైన ఉత్పాతాలను, వాటిని కృష్ణుడు తప్పించు కోవటాన్నీ గురించి సమాలోచించ సాగారు. వారిలో ఉపనందుడనే వృద్ధుని బుద్ధిలో అకస్మాత్తుగా దైవసంకల్పం వలన ఒక ఆలోచన మెరిసింది. ఇక్కడ లోగడ చిన్ని కృష్ణునికి అపకారం చేయడానికే రాక్షసి ఒకతే చనుబాలు ఇచ్చింది. ఒకసారి రాళ్ళతో సహా సుడిగాలి వీచింది. నిన్న మొన్న జరిగినది రెండు చెట్లు కృష్ణునిపై పడినాయి. ఇన్ని జరిగినా ఆ శ్రీమన్నారాయణుని దయవలన ఆపదలు తప్పి పోయాయి. ఇప్పటికైనా మరో క్షేమకరమైన ప్రదేశానికి వెళ్ళటం మంచిది. ఇక్కడికి కొంత దూరంలో ఉన్న యమునానదికి దగ్గరలో 'బృందావనం' అనే ప్రదేశం ఉన్నది. అక్కడ పశువులకు మేత పుష్కలంగా ఉంటుంది. అక్కడ కొండలు, నది, చెట్లు, తీగలూ కలిగి ఎంతో అందమైన ప్రదేశమది. అక్కడకు పోదాం పదండి అని ఉపనందుడు చెప్పిన దానికి అక్కడి వారందరూ అంగీకరించారు. ఒక క్రమ పద్ధతిలో ముందుగా ఆవుల మందలనూ, వాటి రక్షగా బండ్లు, ఆ బండ్లలో స్త్రీలు, పిల్లలు, వృద్ధులు పయనం సాగించారు. గోపకులు కవచాలు, ధనుర్బాణాలు ధరించి, పూజ్యులైన పురోహితులు వెంటరాగా వెళ్ళడానికి పల్లెలోని మిగిలిన వారందరూ బయలు దేరారు. గుంపులు గుంపులుగా వెళ్ళి పుణ్య భూమియైన బృందావనంలో ప్రవేశించారు. అందరూ నదిలో స్నానాలు చేసి తళ తళలాడే వస్త్రాలు ధరించి, ఆనందంగా మాధవుని మీద మధురమైన పాటలు పాడుతూఉన్నారు. క్రమేణా ఇండ్లను ఏర్పాటు చేసుకొని స్థిరంగా ఉండసాగారు. బలరామ కృష్ణులు బృందావనం ప్రాంతంలో తమ ఈడు వారితో కలిసి సంతోషంగా దూడలను కాచుకోసాగారు.

### యాభై ఎనిమిదవ అధ్యాయము – దశమ స్కంధము

జవాబులు : 1.4. దండోపాయం 2.2. కట్టివేద్దామనుకొన్నది
3. దశావతారాలను

* * *

# యాభై తొమ్మిదవ అధ్యాయము - దశమ స్కంధము

## 1. వత్సాసుర, బకాసురుల కథ – శ్రీకృష్ణుడు గోపకులతో కలసి చల్దులారగించ బోవడం

**1) ప్రశ్న :** ఒకనాడు బలరామ కృష్ణులు యమునా నదీ తీరాన గోపబాలకులతో కలసి గోవత్సాలను మేపుతూ ఉండగా వత్సాసురుడనే రాక్షసుడు వారిని చంపాలని వచ్చి తాను ఏ రూపం ధరించాడు?

**జవాబు :** 1. కోడెదూడ 2. గాడిద
3. గుర్రం 4. కొండచిలువ

**2) ప్రశ్న :** గోపాలకుల దూడలలో దూడయై కలిసిపోయిన వత్సాసురుని శ్రీకృష్ణుడు గమనించి, దాని కాళ్ళు, తోక పట్టుకొని ప్రక్కనే ఉన్న చెట్టుకేసి బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు వత్సాసురుడు చచ్చిపోయాడు. ఆ చెట్టుకూడా కూలిపోయింది. కాగా కూలిపోయిన ఆ చెట్టు పేరేది?

**జవాబు :** 1. మద్దిచెట్టు 2. చందనపు చెట్టు
3. వెలగచెట్టు 4. తాటిచెట్లు

**3) ప్రశ్న :** ఒకనాడు ఉదయాన్నే గోపాలురంతా దూడలను తోలుకొని అడవికి వెళ్ళారు. ఎండ తీవ్రంగా ఉండడంతో వారంతా దాహశాంతి కొరకు ఒక కొలను వద్దకు వెళ్ళారు. అచట వారు ఒక భయంకరమైన కొంగను చూశారు. ఆ కొంగ రూపంలోనున్న రాక్షసుడెవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శ్రీకృష్ణుడు బకాసురుని ఏవిధంగా సంహరించాడు?

**జవాబు :** లేగదూడల సంరక్షణకై గోపాల బాలకులతో కలిసి వెళ్ళిన కృష్ణయ్య, వాటిని మేపుకొని తిరిగి వస్తున్న సమయంలో వారు ఒక భయంకరమైన కొంగను చూశారు. అది భయంకరమైన కన్నులు కలిగి కృష్ణుణ్ణి చంపడానికి

అక్కడ వేచి వుంది. ఆ కొంగ అన్ని పనులూ మానివేసి, ఏకాగ్ర చిత్తంతో ఆ అడవిలోని కొలనులో మునిలాగా నిలబడి ఉన్నది. ఇంక ఏవిధమైన కోరికలు లేవు. ఒక్క కృష్ణునిపైననే దాని దృష్టి కేంద్రీకరింపబడి ఉంది. శత్రువై కృష్ణుని చంప జూచినా, ఆ ప్రయత్నంలో మహర్షులు చేయదగిన తపస్సు దానికి సిద్ధించింది. ఆ కొక్కెర ఒక్కసారిగా కృష్ణునిపైకి దూకింది. తన ముక్కుతో కృష్ణుణ్ణి ఒడిసిపట్టి మింగి వేసింది. బ్రహ్మాండాన్ని తనలో నుండి పుట్టిస్తున్న, క్రీడామయుడైన కృష్ణుని ఆ బకం మింగింది. అప్పుడు బలరాముడు, గోపాలబాలురు కృష్ణుడు కనపడకపోయే సరికి ప్రాణంలేని వారివలె అచేతనులై కంపించి పోయారు. ఆ విధంగా మింగబడినా కృష్ణుడు ఆ రాకాసి కొంగ గొంతుకు అడ్డంపడి లోపలకు వెళ్ళకుండా, ఆ బకాసురుని కంఠం ముందు భాగమూ, దౌడలూ, కాలాగ్నివలె మండిస్తూ విజృంభించాడు. మహామహిమ కలిగిన అతడు మింగుడు పడలేదని నిందిస్తూ ఆ బకాసురుడు కృష్ణుణ్ణి బయటకు వెళ్ళగక్కాడు. అలా బయటకు క్రక్కివేసిన కృష్ణుణ్ణి ఆ కొక్కెర రాక్షసుడు ముక్కుతో పొడిచి చంపాలని భీకరంగా నోరుతెరచి ముందుకు దూకాడు. ఆ కొంగ ముక్కు రెండు భాగాలనూ కృష్ణుడు రెండు చేతులతోనూ పట్టుకొని గడ్డి పరకను చీల్చినట్లు నిలువున చీల్చివేశాడు. దేవతలు పుష్పవృష్టి కురించారు. బలరాముడు, గోపాలురూ అందరూ సంతోషించారు. ఈ విధంగా బకాసురుని వధించి కృష్ణుడు గోపాలకులు, బలరామునితో కలిసి ఇళ్ళకు వెళ్ళారు.

**5) ప్రశ్న :** శ్రీకృష్ణుడు గోప బాలురతో కూడి వనభోజనం ఏ విధంగా చేశాడు? కాగా అఘాసురుని కృష్ణుడు ఏ రీతిగా సంహరించాడు?

**జవాబు :** ఒకనాడు బలరామకృష్ణులు గోపబాలురూ అందరూ కలసి వనభోజనాలు చేయాలని సరదాపడ్డారు. ప్రొద్దుటేలేచి గబగబా తమ ఇంటి లేగదూడలను బయటకు తోలుకొని వచ్చారు. తల్లులు సిద్ధంచేసి ఉంచిన రకరకాల పిండివంటలు మూటలు కట్టుకొని, అన్నపు కావడులతో మోసుకొని తెచ్చుకున్నారు. అడవిలో పండ్లుతిని, ఆ రుచులకు పరవశించిపోయారు.

ఒకరితో ఒకరు పోట్లాడుకున్నారు. కేరింతలుకొడుతూ, పరుగెడుతూ, పడుకుంటూ, అలసిపోతూ, ఇలా ఎన్నోరకాల ఆటలు ఆడుకున్నారు. తీయని పిండి వంటలు ఒకడిచేతిలో నుండి మరొకడు లాక్కొని పారిపోతూవుంటే, ఇంకొకడు అది లాక్కునిపోయి, దూడల మధ్య అటూఇటూ పరుగెత్తుతూ, అందకుండా ఏడిపించాడు. ఈ రీతిగా ఆనందంగా కృష్ణునితో గూడి గోపబాలకులు విందు భోజనాలు తింటూ ఆడుకున్నారు. ఏ పరమపురుషుడి పాదపద్మాల ధూళిని మహాయోగులు కూడా చూడలేరో, అటువంటి కృష్ణునితో ఆ బాలకులు కలిసి మెలిసి ఆడుకున్నారు. అతన్ని కౌగలించుకొంటూ తన్నుతూ, గ్రుద్దుతూ, హాస్యాలాడుతూ మీద పడుతూ, ప్రేమిస్తూన్న ఆ గోపబాలుర భాగ్యమెంతటిదో కదా! ఆ విధంగా ఆడుతూ పాడుతూ దూడలు తోలుకొని ఇళ్ళకు వెళ్ళారు. కొంతకాలం పిమ్మట బకాసురుని తమ్ముడైన అఘాసురుడు కంసుని పంపునవచ్చి శ్రీకృష్ణ బలరామాదులను చంపివేయాలని వారు లేగదూడలతో వచ్చేదారిలో పెద్దకొండ చిలువ రూపంలో కాచుకొని ఉన్నాడు. గోపబాలురు ఆ కొండచిలువ పామును చూచి ఎవరూ భయపడకుండా బకాసురుని చంపిన కృష్ణుడు ఉండగా మనకేమి భయం అని అఘాసురుని నోటిలోకి ప్రవేశించారు. కృష్ణుడు కూడా వారితోపాటు ఆ కొండ గుహవంటి నోరు కలపాము నోటిలోకి ప్రవేశించి, కంఠ ద్వారం దగ్గర చేరి తన శరీరాన్ని విపరీతంగా పెంచి, ఆ రాక్షసునికి ఊపిరి అందకుండా చేసి దానిని సంహరించాడు. చనిపోయిన కొండచిలువ రూపంలో ఉన్న అఘాసురుని పొట్ట చీల్చుకుని కృష్ణుడు, బలరామాదులు, దూడలు అందరూ బయటకు వచ్చారు. ఈ విధంగా శ్రీకృష్ణుడు అఘాసుర సంహారం జరిపాడు.

### యాభై తొమ్మిదవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 1. కోడెదూడ 2. 3. వెలగచెట్టు
3. బకాసురుడు

* * *

## అరవైయవ అధ్యాయము – దశమ స్కంధము

### 1. శ్రీకృష్ణునితో కలిసి గోపాలబాలకులు చల్దులారగించడం 2. బ్రహ్మ లేగలను, గోపబాలకులను అంతర్ధానం చేయడం

**1) ప్రశ్న :** ఆవులదూడలు యమునా నదిలో నీరుత్రాగి విశాలమైన పచ్చిక బయళ్ళలో మేస్తున్నాయి. మధ్యాహ్న సమయంలో శ్రీకృష్ణుడు తన తోడి మిత్రులతో గూడి భోజనం చేయాలని ఆలోచించి, వారందరిని ఏ ఆకారంలో కూర్చోబెట్టుకొని, తాను కూర్చొన్నాడు?

**జవాబు :** 1. చతురస్రాకారం  2. దీర్ఘచతురస్రాకారం
3. మండలాకారం  4. త్రిభుజాకారం

**2) ప్రశ్న :** గోపబాలురతో గూడి శ్రీకృష్ణుడు చల్దులారగించే, ఆ ఆనందమయ బాల్యలీలలను దివినుండి ఆశ్చర్యానందాలతో ఎవరు తిలకించారు?

**జవాబు :** 1. దేవతలు  2. యక్షులు
3. గంధర్వులు  4. కిన్నెరలు

**3) ప్రశ్న :** శ్రీకృష్ణుని అద్భుత లీలలను చూసి ఆనందించి, ఆ ప్రభువు అద్భుత మహిమను చూడదలచి, యమునా తీరంలోని ఆవుల, దూడలను, గోపాలురను మాయం చేసి వేరొకచోట దాచాడు. అట్టిపని చేసిన దివ్య పురుషుడెవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** యమునా తీరంలో శ్రీకృష్ణుడు గోపబాలురతో కలిసి చల్దులు ఆరగించే సమయంలో ఆవులదూడలు, గోపబాలురు ఏ రీతిగా అదృశ్యమైనారు? కృష్ణుడు ఆ సమయంలో ఏమి చేశాడు?

**జవాబు :** పచ్చిక బయళ్ళలో పసరాలను వదలి, యమున ఒడ్డున ఇసుక తిన్నెలపై వినోదిస్తూ, చల్దులు ఆరగిస్తూ కృష్ణునితో కూడి ఉన్న గోపబాలకులకు కొంత సేపటికి దూడలు కనిపించలేదు. వారు కంగారు పడుతూ ఉండగా

కృష్ణుడు మిత్రులారా! మన లేగదూడలు లేత పచ్చికల మేతలలో లీనమై ఉత్సాహంతో అడవిలో చాలాదూరం వెళ్ళినట్లున్నాయి. అవి ఎక్కడికి వెళ్ళినా నేను వెతికి తోలుకు వస్తాను. మీరు కంగారు పడకుండా చల్దులు ఆరగిస్తూ ఉండండి అని కృష్ణుడు దూడలను వెతుకుతూ వెళ్ళి, ఇవిగో ఇక్కడ పచ్చికమేశాయి. ఇక్కడ ఒకచోట మందగా చేరాయి. ఇక్కడ మంద విడిపోయింది అని వాటి అడుగులను బట్టి చూస్తూ చాలా దూరం వెళ్ళాడు. అప్పుడు బ్రహ్మదేవుడు శ్రీకృష్ణుని బాల్యలీలలను, మహిమలను చూచి తరించాలని, లోకాలకు తెలియ పరచాలని తలంచి లేగదూడలను గోపబాలకులను ఒక రహస్య ప్రదేశంలో దాచి ఉంచాడు. అక్కడ కృష్ణుడు దూడల జాడలు కనబడక కొలనువద్దకు వచ్చాడు. అక్కడ తనతోటి బాలకులు కనిపించలేదు. ఇక్కడ ఏదో మాయ జరిగిందని నిశ్చయించుకున్నాడు. అన్నీ ఎరిగినవాడు గనుక ఇది బ్రహ్మదేవుని పనేనని గ్రహించి, వెంటనే వెనుదిరిగి పెదవులపై చిరునవ్వులు చిందిస్తూ తానే గోవత్సాల రూపాలనూ, బాలకుల రూపాలనూ ధరించాడు. 'ఇకలేగలను ఇళ్ళకు మళ్ళించండి' అని చెబుతున్న కృష్ణుడూ, మరలించే గోపబాలురూ, మరలింపబడే లేగదూడలు అన్నీ తానే అయి ఆ లీలా గోపాలుడు తమ గోకులానికి తిరిగి బయలు దేరాడు. ఈ విధంగా కాలం గడుస్తూ ఉంది.

**5) ప్రశ్న :** బ్రహ్మదేవుడు తాను ఉంచిన లేగలను, గొల్లపిల్లలను ఏమి చేశాడు? శ్రీకృష్ణుడు ఆ అజుని ఏ రీతిగా అనుగ్రహించాడు?

**జవాబు :** బాలకృష్ణుని లీలా విశేషాలను వీక్షింపనెంచి బ్రహ్మదేవుడు కృష్ణుడు కాస్తున్న లేగలను, ఆయనతో ఉన్న గోప బాలురను మాయం చేసి వారిని ఒక రహస్య ప్రదేశంలో ఉంచాడు. కృష్ణుడు అది గ్రహించి లేగదూడల ఆకారాలు, గోపబాలుర ఆకారాలు తానే ధరించి యథాప్రకారం గోకులానికి తిరిగి బయలుదేరాడు. గోకులంలో వారివారి ఇండ్లలో లేగలుగా, గోప బాలకులుగా ఎవరికీ అనుమానం రాకుండా ప్రవర్తించాడు ఆ లీలావినోది. ఒకనాడు బలరాముడు కృష్ణునితో మహాత్మా! ఇంతకుముందు వరకూ లేగదూడలన్నీ

ఋషుల అంశలతో జన్మించినవనీ, గోపబాలకులందరూ దేవతల అంశలనీ నాకు అనిపిస్తూండేది. ఇప్పుడు చూస్తే లేగలూ, బాలకులూ అందరూ నిస్సందేహంగా నీవే అని నాకనిపిస్తూంది. ఈ వింత ఏమిటి? అని అడుగగానే కృష్ణుడు అన్నగారి యెడల అనుగ్రహంతో ఉన్న రహస్యం విప్పిచెప్పాడు. బలరాముడు గ్రహించాడు. ఈ విధంగా శ్రీహరి బాలురు, లేగదూడలుగా చరించింది ఒక ఏడాది. ఆ కాలం బ్రహ్మదేవుని కాలమానంలో ఒక తృటి కాలంగా కనిపించింది. అతడు వచ్చి లేగల రూపంలో బాలకుల రూపంలో కనిపిస్తున్న బాలకృష్ణుని చూచి నివ్వెరపోయి, తన తండ్రియైన మహావిష్ణువు బాలకృష్ణుడుగా చేసే లీలలను చూసి ఆనందించాడు. ఈ పరమాత్మకు తల్లులు కాగలిగిన గోపికలు, ఈయనతో నడవగలిగిన గోవులు, లేగలూ ఎంత పుణ్యము చేసుకున్నారో కదా! వీరి భాగ్యరేఖ ఎంత అద్భుతమైనదో ఊహించటానికి విధాతనైన నాకే సాధ్యం కావటం లేదు అని అనుకుంటూ ఆ బాలకృష్ణుని అనేక విధాల కీర్తిస్తూ బ్రహ్మదేవుడు మూడు సార్లు కృష్ణునకు ప్రదక్షిణం చేసి, పాదాలకు మ్రొక్కి, దేవా! నా ఆయుర్ధాయం ఉన్న అన్ని రోజులూ నీకు నమస్కరించే భాగ్యం కలిగించమని కోరుకున్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు బ్రహ్మదేవుని క్షమించి గౌరవించాడు. ఇంతకు ముందు మాయం చేసిన గోవులనూ, గోపబాలకులను ఇసుక తిన్నెలపైకి చేర్చాడు. బ్రహ్మదేవుడు బాలకృష్ణుని చేత అనుగ్రహింపబడి తన సత్యలోకానికి వెళ్ళాడు. శ్రీకృష్ణుడు తాను ధరించిన రూపాలను ఉపసంహరించుకొని, బ్రహ్మ అప్పగించిన గోపబాలకులతోనూ, లేగదూడలతోనూ ఆనందంగా గోకులానికి తిరిగి వెళ్ళాడు. బ్రహ్మ దేవుడు తమనుదాచి వుంచిన సంవత్సర కాలాన్ని కృష్ణుని మాయకారణంగా గోపబాలకులు కొద్దిసేపుగా భావించారు.

**అరవైయవ అధ్యాయము – దశమ స్కంధము**

జవాబులు : 1.3. మండలాకారము 2.1. దేవతలు
3. బ్రహ్మదేవుడు

* * *

# అరవై ఒకటవ అధ్యాయము - దశమ స్కంధము

**1. బలరాముడు ధేనుకాసురుని వధించడం 2. కాళీయ మర్ధనం**

**1) ప్రశ్న :** గోపబాలకులతో ఆటలాడుతూన్న శ్రీకృష్ణునితో ఇక్కడికి దగ్గరలో తాటిచెట్లతోపు ఉంది. అందులో కావలసినన్ని పండ్లున్నాయి. కానీ అందు ధేనుకాసురుడనే రాక్షసుడున్నాడు. మీరనుకొంటే వాడిని జయించవచ్చునని బలరామ కృష్ణులకు తెలిపిన మిత్రుని పేరేమి?

**జవాబు :** 1. దారుకుడు 2. ఉద్దవుడు
3. సాత్యకి 4. శ్రీధాముడు

**2) ప్రశ్న :** బలరామ కృష్ణులు తమ మిత్రుల మాటలు విని తాళవనంలో ప్రవేశించి తాటి చెట్టుని ఊపగా పడిన తాటి పండ్ల సవ్వడికి ధేనుకాసురుడు గాడిద రూపంలో వచ్చాడు. ఆ గాడిదను నాలుగు కాళ్ళు పట్టుకొని బలరాముడు ఎక్కడికేసి కొట్టి వాడిని చంపాడు?

**జవాబు :** 1. నేలపై కొట్టి 2. తాటిచెట్టుకేసి కొట్టి
3. వెలగచెట్టుకేసి కొట్టి 4. పొన్నచెట్టుకేసి కొట్టి

**3) ప్రశ్న :** ఒకనాడు కాళిందీ నదిని కలుషితం చేస్తున్న కాళీయుని శ్రీకృష్ణుడు ఆ నది నుండి వెళ్ళగొట్టాడు. ఆ రోజున బలరాముడు గోపబాలకులతో కలసి వచ్చాడా? రాలేదా?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శ్రీకృష్ణుడు కాళిందీ మడుగును పరిశుద్ధం చేయాలని ఎందుకు సంకల్పించాడు? అందుకు ఏ రీతిగా సమాయత్తమైనాడు?

**జవాబు :** గోపాలకులతో కూడి గోవులను తోలుకొని శ్రీకృష్ణుడు అడవికి వెళ్ళాడు. ఆ రోజు బలరాముడు మాత్రం వెళ్ళలేదు. తీవ్రంగా ఉన్న ఎండలో గోవులూ, గోపబాలకులూ, దాహంతో తపించిపోయి సొమ్మసిల్లి పోయారు. వారంతా యమునానది మడుగులో విషం కలిసిన నీళ్ళు త్రాగి ప్రాణాలు

కోల్పోయి పడిపోయారు. భగవంతుడగు శ్రీకృష్ణుని దయామృత వర్షంతో, పశువులను, గోపకులను మళ్ళీ బ్రతికించాడు. తన ఎదుట జరిగిన సందర్భాన్ని చూసి కృష్ణుడు కాళీయుడు అనే నాగుని విషంచేత నిండిపోయిన కాళిందీ మడుగును పరిశుద్ధం చేయడానికి సంకల్పించాడు. ఆ మడుగు ఒడ్డునే ఒక పొన్నచెట్టు ఉంది. శ్రీకృష్ణ పదస్పర్శచేత పునీతమైన ఆ చెట్టు కొమ్మ మీదకు ఎక్కిన కృష్ణుడు నడుముకు ఉన్న దట్టీని గట్టిగా బిగించి చుట్టుకున్నాడు. తల వెంట్రుకలను నెమలి పింఛంతో గట్టిగా బిగించి కట్టుకున్నాడు. భుజాలు చరిచి, రెండు పాదాలు గట్టిగా ఊదిపట్టి, ఆ గోపాల సింహుడు ఆ చెట్టు కొమ్మమీద నుంచి మడుగులోకి కుప్పించి దూకాడు. ఆ మడుగులో నుండి గభీలుమని పెద్ద చప్పుడు లేచింది. నిశ్శబ్దమైన వాతావరణంలో ఆ శబ్దము దిక్కులలో ప్రతి ధ్వనించింది. ఇది ఇలా ఉండగా గోకులంలో యశోదానందులు మొదలైన గోప గోపీజనం తమకు తటస్థించిన కొన్ని దుశ్శకునాలు చూసి భయం నిండిన మనసులతో ఆందోళన పడ్డారు. శ్రీకృష్ణుని శక్తి తెలియక అతడు గోపాలకులతో, గోవులతో సహా ఎక్కడైనా ఆపదలో పడ్డాడేమో అని వారంతా దుఃఖిస్తూ గోకులం నుండి బయలుదేరి కృష్ణుని వెతకటం ప్రారంభించారు. బలరాముడు శ్రీకృష్ణుని శక్తి తెలిసిన వాడవటంచేత ఆ యాదవులందరూ పడుతున్న ఆందోళనను చూచి నవ్వుకున్నాడు.

**5) ప్రశ్న :** శ్రీ కృష్ణుడు కాళీయమర్దనం ఏ విధంగా చేశాడు?

**జవాబు :** యమునానదిలోని కాళిందీ మడుగు పరిసరాలను, మడుగులోని నీటిని విషపూరిత మవటానికి కారణమైన కాళీయుడనే సర్పాన్ని తరిమివేసి నదీ జలాలను నిర్మలం చేయనెంచి కృష్ణుడు నడుముకు ఉన్నదట్టీ గట్టిగా బిగించికట్టి చేరువనే ఉన్న పొన్నచెట్టు ఎక్కి మడుగులో దూకాడు. కృష్ణుడు దూకిన శబ్దం విని ఆ మడుగులోపలి కాళీయుడనే నాగేంద్రుడు కోపంతో వీడెవడో కుర్రవాడు ఇక్కడ నేనున్నాను అని కూడా లెక్క చెయ్యకుండా ఉన్నాడు. భయంకరమైన భరింప శక్యంకాని నా విషాగ్ని జ్వాలలతో వీడిని భస్మంచేసి కూల్చి వేస్తాను. లోకులందరికి నా కోపమెంతటిదో ఈనాడు

తెలిసిరావాలి అనుకొని కాళీయుడు విజృంభించాడు. తన ఘోరవిషాగ్ని జ్వాలలు గప్పుగప్పున ప్రసరిస్తుండగా కృష్ణుణ్ణి పెద్దకాటు వేశాడు. కృష్ణుడు ఆ నీళ్ళలో యథేచ్ఛగా విహరిస్తూ, భయమూ, కంపమూ ఏ కోశానా కనిపించకుండా, మహా గంభీరంగా ఉన్నాడు. కాళీయుడు తన పొడవైన శరీరంతో గట్టిగా కృష్ణుని పెనవేసి బంధించాడు. గోపాలకులు తమ ప్రాణ మిత్రుణ్ణి ఆ స్థితిలో చూచి భయపడి పోయారు. ఇంతలో కృష్ణుణ్ణి, గోపబాలురను వెతుకుతూ వచ్చిన గోకుల వాసులంతా కృష్ణుని అడుగు జాడల గుర్తులను బట్టి చూస్తూ కాళిందీ మడుగు వద్దకు వచ్చారు. అక్కడి జలాలలో మహా సర్పంచేత కాటుపడి పాము పడగలచేత ఆవరించ బడియున్న కృష్ణుణ్ణి చూశారు. అప్పుడు వారంతా కృష్ణా, కృష్ణా అని విలపిస్తూ, దుఃఖంతో తపించి పోయారు. గోపికలు యశోదను పట్టుకొని ఏడుస్తూన్నారు. వెంటనే కృష్ణుడు విజృంభించి తన శరీరాన్ని పెంచి, కాళీయుడు భరించలేనట్లుగా అతడు తలలు వంచాడు. ఆ వంచిన కాళీయుని పడగలపై శ్రీకృష్ణుడు నృత్యం చేశాడు. ఆ మహాసర్పం బలహీనుడైనాడు. ఒక్కొక్క నోటివెంట రక్తం, మాంసం క్రక్కాడు. పౌరుషం నశించి నీరసించి పోయాడు. ఈ విధంగా శ్రీకృష్ణుడు కాళీయ మర్ధనం చేశాడు.

**అరవై ఒకటవ అధ్యాయము– దశమ స్కంధము**

**జవాబులు :** 1. 4. శ్రీధాముడు 2. 1. నేలపైకొట్టి
3. రాలేదు

* * *

# అరవై రెండవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుని కాళీయుని భార్యలు స్తుతించడం 2. కాళీయుని పూర్వకథ 3. గో, గోప, గోపికా సంఘాన్ని కార్చిచ్చు చుట్టు కోవడం**

**1) ప్రశ్న :** కాళీయుని పడగలపై నాట్యం చేస్తున్న శ్రీకృష్ణుడు సామాన్యుడు కాదని, కాళీయుని భార్యలు శ్రీకృష్ణ దర్శనానికి ఎవరిని ముందుంచుకొని వచ్చారు?

**జవాబు :** 1. బంధువులను 2. తమ బిడ్డలను
3. యశోదాదేవిని 4. గోపబాలకులను

**2) ప్రశ్న :** బాలకృష్ణునికి నమస్కరించిన నాగాంగనలు, తమ భర్త ప్రాణాలు తీయవద్దని, తమను క్షమించి వదలి ఎక్కడ ఉండమంటే అక్కడ జీవిస్తాము అని శరణాగతి కోరిన వారిని కరుణించి శ్రీకృష్ణుడు కాళీయుని తన కుటుంబంతో కలిసి ఎక్కడకు వెళ్ళమన్నాడు?

**జవాబు :** 1. సముద్రంలోకి 2. రమణకద్వీపానికి
3. హిమాలయపర్వత ప్రాంతానికి 4. వింధ్యపర్వత ప్రాంతానికి

**3) ప్రశ్న :** కాళీయుని భార్యలు బాలకృష్ణుని స్తుతించి ఏమి కోరిక కోరినారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** యమునా నదిలోని కాళింది మడుగులో నివసించక ముందు కాళీయుడు నివసిస్తున్న రమణక ద్వీపాన్ని ఎందుకు వదిలి పెట్టాడు? అతడొక్కడూ గరుత్మంతుని కేమి అపచారం చేశాడు?

**జవాబు :** పాములంటే భయపడే జనులందరూ నెలనెలా మధురమైన పదార్థాలను నాగులకు నైవేద్యాలుగా చెట్ల మొదళ్ళలో పెట్టి వెళ్ళేవారు. గరుత్మంతుడు తమను చంపకుండా తమ భాగాలకు వచ్చిన పదార్థాలను కొన్నింటిని నాగులు ఆ ఖగరాజుకు సమర్పించే వారు. కానీ కాళీయుడు మాత్రం తన విషం చాలా గొప్పదనే దురహంకారంతో, గరుత్మంతునికి

పెట్టకుండా ఎగగొట్టి అంతా తానే ఆరగించేవాడు. ఇది తెలిసికొన్న గరుత్మంతుడు కోపించి కాళీయుని తలలు చీల్చి చెండాడి, పడగలు చించి వస్తాను అని బయలుదేరాడు. అలా వచ్చిన గరుత్మంతుని కాళీయుడు ఎదుర్కొన్నాడు. నాలుకలు చాచి, మహా వేగంతో తల త్రిప్పుచూ గరుత్మంతుని కాటువేశాడు. తరువాత గరుత్మంతుడు విజృంభించి కాళీయుని తరుముకుంటూ తన ఎడమరెక్కతో దెబ్బకొట్టాడు. ఆ దెబ్బకు కాళీయుడు కోరలు విరిగి, తలలు చితికి చీలికలు అయిపోయాయి. అప్పుడు భయపడి పారిపోయిన ఆ కాళీయుడు యమునా నదిలోని మడుగులో ప్రవేశించాడు. అంతకు పూర్వం 'సౌబరి' అనే మహర్షి అక్కడ తపస్సు చేస్తుండేవాడు. అక్కడ ఉన్న చేపలను తినడానికి వస్తున్న గరుత్మంతుని బారి నుండి కాపాడమని చేపలు మహర్షి సౌబరిని కోరాయి. మహర్షి ప్రసన్నుడై ఈనాటి నుండి గరుత్మంతుడు ఈ మడుగు చెంతకు వస్తే చనిపోతాడు అని శపించాడు. ఆ కారణంగా ఆ మడుగు చెంతకు గరుత్మంతుడు రాడని తెలిసి కాళీయుడు తనకు సురక్షితమైన ప్రదేశం ఇదేనని అప్పటి నుండి ఆ మడుగులోనే నివాసముండసాగాడు.

**5) ప్రశ్న :** కాళీయ మర్ధనం జరిగిననాటి రాత్రి బృందావన వాసులందరూ ఎక్కడ ఉన్నారు? అక్కడ వారికి ఏ విధమైన అపకారం జరిగింది?

**జవాబు :** కాళీయుని ఆదేశించి మడుగు నుండి వెడలి వచ్చిన మాధవుణ్ణి చూసి బృందావన వాసులందరికీ! ప్రాణాలు లేచివచ్చాయి. యశోదా రోహిణులతో పాటు నందాదులు పరమానందం పొందారు. బలరాముడు తమ్ముణ్ణి కౌగలించుకున్నాడు. ఈ విధంగా బృందావన వాసులంతా పరమ సంతోషంతో ఆ రాత్రి యమునా తీరంలోనే ఉండిపోయారు. ఎవరికీ సరియైన ఆహారం లేక నీరసించి గోవులతోపాటు అక్కడ ఉండిపోయారు. ఆ మహారణ్యంలో ఆ రాత్రి ఒక పెద్ద దావానలం వారిని చుట్టిముట్టి మీది మీదికి వచ్చింది. వారందరూ ఆ మంటలకు తాళలేక గోపాలకృష్ణుని శరణాగతులై ప్రార్థించారు. కృష్ణా నీ పాదాలు నమ్మిన వారికి ఆపదలు ఎక్కడుంటాయి? అతి తీవ్రమైన భయంకరంగా విజృంభిస్తూ ఉన్న ఈ దావాగ్నిని

మీదకు రాకుండా ఆపుచేసే ఉపాయం ఆలోచించమని వారు ప్రార్థించారు. ఆ విధంగా ఘోష పెడుతున్న గోపకులను కృష్ణుడు కరుణించాడు. జగదీశ్వరుడు అనంతుడైన కృష్ణుడు ఆ మహాదావాగ్నిని త్రాగివేశాడు. అది చూచిన యాదవులందరు కృష్ణునికి జయజయ ధ్వానాలు చేశారు. అనంతరమా శ్రీకృష్ణుడు గోవులతోనూ, తనవారితోనూ కలిసి నెమ్మదిగా బృందావనానికి వెళ్ళాడు. ఈ విధంగా కృష్ణుడు యాదవులను ఆ విపత్తు నుండి కాపాడి గోపాల బాలురతో కలిసి ఆటపాటలతో వినోదిస్తున్నాడు.

**అరవై రెండవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 2. తమబిడ్డలను 2. 1. సముద్రము
3. పతిభిక్ష పెట్టమని

* * *

## అరవై మూడవ అధ్యాయము - దశమ స్కంధము

**1. గ్రీష్మఋతు వర్ణనం 2. బలరాముడు ప్రలంబాసురుని వధించడం 3. శ్రీకృష్ణుడు దావానలం నుండి గో, గోప సంఘాన్ని కాపాడటం 4. వర్షఋతు వర్ణనం**

**1) ప్రశ్న :** బృందావనంలో బలరామకృష్ణులు ఆనందంగా కాలం గడుపుతూండగా ఎండాకాలం వచ్చింది. అప్పుడు చల్లదనం కోసం యమునా తీరానికి వచ్చిన గోపాలురు తీగలతో అల్లిన పల్లకీలో ఎవరిని ఉంచి మోస్తూ ఆనందించారు?

**జవాబు :** 1. నందుడిని 2. సాత్యకిని
3. కృతవర్మను 4. బలరామ కృష్ణులను

**2) ప్రశ్న :** నదీ తీరాలలో, పచ్చని బయళ్ళలో గోవుల మేపుతూ ఆనందంగా ఉన్న బలరాకృష్ణుల వద్దకు గోపాలకుని వేషంలో వచ్చిన రాక్షసుడెవరు?

**జవాబు :** 1. తృణావర్తుడు 2. శకటాసురుడు
3. ప్రలంబాసురుడు 4. బకాసురుడు

**3) ప్రశ్న :** గోపాలకుని వేషంలో వచ్చిన ప్రలంబాసురుడు చేసిన మోసాన్ని గ్రహించిన బలరాముడు ఆతడిని ఏ విధంగా చంపాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ఒకనాడు గోవులను మేపుతున్న కృష్ణాదులకు, అడవిలో దైవికంగా చెలరేగిన కార్చిచ్చు నుండి తప్పించుకోవలసి వచ్చింది. వారు ఆ ఆపద నుండి ఏవిధంగా బయట పడ్డారు?

**జవాబు :** గోపాల బాలకులు ఆటలలో మునిగి ఉండగా ఆవులు అడవిలో రకరకాల గడ్డిని మేస్తూ పోయి పోయి మరొక అడవిలో దూరాయి. అక్కడ చెలరేగిన కార్చిచ్చు గాలి వేడికి తట్టుకోలేక అవి బెదరి, వణికిపోతూ 'అంబా' అని ఆక్రోశించాయి. గొల్లపిల్లలు పశువుల ఘోష విన్నారు. ఆటలు చాలించి,

ఆవులను వెతకటానికి బయలు దేరి, వాటి అడుగుల జాడలను అవి మేసిన గడ్డి గుర్తులను బట్టి అవి వెళ్ళిన దారిలో తామూ వేగంగా వెళ్ళారు. అలా వెళ్ళి మంటలపాలు కాకుండా ఆ అరణ్యం నుండి తమ గోవులను మరలించారు. శ్రీకృష్ణుడు ఆ గోవులను పేరుపేరున పిలిచాడు. పిలువగనే అవి 'అంబా' అంటూ మారు ధ్వనిచేస్తూ మరలివచ్చాయి. ఆ వనంలో దైవికంగా జనించిన దావాగ్ని ఈడ్చి విసిరే వాయువు వల్ల పెచ్చు పెరిగి అంబర మంటుతున్నది. గట్టనక, పుట్టనక అడ్డమైన వాటిని పట్టి వడగాలుస్తూ, ఆ మంటలు నలుమూలలా అలుము కొన్నాయి. అది చూచి గొల్లపిల్లలు ప్రాణభయంతో కలతచెంది శ్రీకృష్ణునికి సాగిలపడి మ్రొక్కి కృష్ణా ఈ కార్చిచ్చు చూడు! ఇప్పుడు దీనినెలా దాటడం? మంటలలో చిక్కుకొని అలమటిస్తున్న మమ్ముకాపాడు. తనతోడివారు విన్నవించు కొన్న విన్నపాన్ని విని, తన ఎదుట ఎటుచూచినా కనిపించే దావాగ్నిని చూచి, వీరిని, గోవులను ఎలాగైనా కాపాడాలని ఎంచి, మిత్రులారా! మీరు కండ్లు మూసుకోండి. ఈలోపల నేను అగ్నిని అణచి వేస్తానన్నాడు. వారు అలాగే చేశారు. వెంటనే కృష్ణుడు ఆ దారుణమైన దావానలాన్ని అలవోకగా నోటితో పీల్చి త్రాగివేశాడు. తన యోగమహిమ చేత మాధవుడు దావాగ్నిని త్రాగివేసి గోప బాలకులను ఒక వటవృక్షము దగ్గరకు తెచ్చి విడిచి పెట్టాడు. వారంతా సంతోషించి శ్రీకృష్ణుని పొగుడుతూ గోవులను తోలుకొని ఇండ్లకు వెళ్ళారు.

**5) ప్రశ్న :** తన ఈడు యాదవ బాలకులతోనూ, గోవులతోనూ ఆ నందనందనుడు సంవత్సరంలో క్రమపద్ధతిగా వచ్చే వర్షాకాలాన్ని ఏవిధంగా గడిపాడు?

**జవాబు :** కాలగతి ననుసరించి వచ్చిన వర్షాకాలంలో ఉత్తర దిక్కులో మెరుపు మెరిసింది. మబ్బులు దక్షిణ దిక్కుకు తరలి పోతున్నాయి. అప్పుడప్పుడు తూర్పు గాలి వీస్తూంది. జలచర సమూహానికి సంతోషం సమకూడింది. చాతక పక్షుల దప్పిక తీరింది. అడవిలోని దావాగ్ని అణగి పోయింది. ఎండకు వాడి నేలవ్రాలక చీడపీడలకు గురిగాక, నవనవ లాడుతూ నలుపెక్కి పైరు

ఏపుగా పెరిగింది. ప్రజలకు సంకటం తీరింది. ఆ వర్ష ఋతువులో శ్రీకృష్ణుడు అడవుల అంచుల్లో ఆవులను మేపుతూ, బలరామునితో, గోపాల బాలకులతో గూడి కందమూలాలు, ఫలాలు ఆరగిస్తూ మడుగుల గట్లమీద, మనోహరమైన శిలావేదికల మీద గూర్చుండి సంతోషంగా చల్దులు ఆరగించాడు. అప్పుడు నిర్మలమైన బృందావనమనే వినువీధిలో శ్రీకృష్ణుడునే మేఘం మిక్కిలి విఖ్యాతంగా విహరించింది. ఆ లక్ష్మీవల్లభుడైన యదునందునుడు గోవులను, కోడెదూడలను పూజించాడు. ఎడతెగని వర్షాలతో అడవి అంతా పచ్చబడిన పచ్చిక బయళ్ళలో, గోవులు కడుపార మేసి కుండల కొద్దీ పాలిస్తున్నాయి. ఈ విధంగా కృష్ణుడు యధోచిత విహారాలతో వర్షాకాలం గడిపాడు.

**అరవై మూడవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1.4. బలరామ కృష్ణులను 2.3. ప్రలంబాసురుడు
3. పిడికిటి పోటులతో

* * *

## అరవై నాలుగవ అధ్యాయము - దశమ స్కంధము

### 1. శరదృతు వర్ణనం 2. హేమంతఋతు వర్ణనం 3. గోపికా వస్త్రాపహరణం

**1) ప్రశ్న :** కాలగతిలో వర్షరుతువు వెళ్ళి శరదృతువు ప్రవేశించింది. ఆకాశం నులివెచ్చని సూర్యకాంతిని ప్రసరింపజేసి జీవులను ఆనందింపజేస్తుంటే, శ్రీకృష్ణుడు హాయిగా ఆలమందలతో గూడి బృందావనంలో పశువులను మేపుతున్నాడు. ఆ ఆనందమయ బృందావనాన్ని ఒక గొల్లచేడియ ఏ మహానగరంతో పోల్చుకున్నది?

**జవాబు :** 1. అయోధ్యానగరం 2. అమరావతి నగరం 3. మిథిలానగరం 4. మధురానగరం

**2) ప్రశ్న :** కాలచక్రంలో శరదృతువు వెళ్ళి హేమంత ఋతువు ప్రవేశించింది. గోప కన్యలందరూ కాళిందీ నదికి వెళ్ళి ఆ నది గట్టున అమ్మవారి ప్రతిమ నుంచి, ఆమెను సురబిళ కుసుమాలతో అలంకరించి, పలు నైవేద్యాలు సమర్పించారు. ఈ రీతిగా గోపకన్యలు ఏ వ్రతాన్ని ఆచరించారు?

**జవాబు :** 1. మహాలక్ష్మీవ్రతం 2. సరస్వతీవ్రతం 3. సత్యనారాయణవ్రతం 4. కాత్యాయనీ వ్రతం

**3) ప్రశ్న :** కాళిందీనది ఒడ్డున గోపకన్యలు కాత్యాయనీ దేవిని పూజించి నైవేద్యాలు సమర్పించి నమస్కరిస్తూ దైవ నివేదితమైన ప్రసాదాన్ని ఆరగిస్తూ ఒక నెలరోజులు చేయవలసిన కాత్యాయని వ్రతాన్ని ఆచరిస్తూ ఎవరిని తమకు భర్తగా అనుగ్రహించమని అమ్మవారిని కోరారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** కాత్యాయనీ వ్రతంలో భాగంగా వ్రజ భామినులు యమునా తీరంలో ఏమేమి పనులు చేశారు?

**జవాబు :** కాత్యాయనీ దేవి వ్రతం చేస్తున్న నెల రోజులలో ఒకనాడు గోపికలు ప్రాతః కాలంలోనే మేల్కొన్నారు. ఒకరిని ఒకరు రండు రండని తమ నెచ్చెలులను

పేరుపేరున పిలుచుకున్నారు. ఒకరిని ఒకరు చేయిచేయి పట్టుకొని బయలుదేరారు. కమలాక్షుని మీద పాటలు పాడుతూ మందగమనలై యమునా తీరానికి చేరుకొన్నారు. అలా కాళిందీ నదీతీరం చేరి ఒక ఏకాంత స్థలంలో చీరలు విడిచారు. కళంక రహితులగు ఆ పఙజ నయనలు నదిలో జంకులేక జలకాలాడుటకై పట్టుదలతో నీట ప్రవేశించారు. ఆ పద్మనేత్రలు పద్మాక్షుని మీద పాటలు పాడుతూ తమ ఇచ్చకొలది వేడుకతో జల క్రీడలాడినారు. వారి ఆ విహారాలు, ఆ ఆనందపారవశ్యాలు లోకంలో ఎవరికీ లేవు. ఆ విధంగా నదీజలాలలో మునుగుతున్న గోపకన్యలను దూరంలో ఉన్న శ్రీకృష్ణుడు తెలుసుకున్నాడు. వెంటనే తోడి బాలకులతో ఆ ప్రాంతానికి వచ్చాడు. ఈ రీతిగా ఆ గోపకన్యలు కాత్యాయనీవ్రత నిర్వహణలో భాగంగా యమునానదిలో జలకాలాడారు.

**5) ప్రశ్న :** శ్రీకృష్ణుడు గోపికా వస్త్రాపహరణం ఏ తెరగున నిర్వహించాడు?

**జవాబు :** కాత్యాయనీ వ్రత దీక్షలో ఉన్న గోపకన్యలు కాళిందీ నదిలో వివస్త్రలై స్నాన మాచరిస్తున్నారని తెలిసికొని శ్రీకృష్ణుడు తన తోడి బాలకులతో కలిసి అక్కడకు వచ్చాడు. వారిని సవ్వడి చేయకుండా ఉండమని కనుసైగచేసి, చప్పుడు కాకుండా అడుగులిడుతూ మౌనంగా పొదల మాటుననే మెల్లిమెల్లిగా పొంచి పొంచి వంగి వంగి నడిచాడు. సరిగ్గా సమయం చూసి సమీపించి ఆ గొల్ల చెలువల వలువలు అపహరించాడు. ఆ విధంగా వలువలు దొంగిలించిన విశ్వవిభుడైన పరమాత్మ పిల్లవాని లాగా తోడి పిల్లలతో గూడి పరియాచకానికై ఆనందంతో నడచి ఒక పొన్నచెట్టును ఎక్కాడు. అతడధిష్ఠించగానే ఆ చెట్టు వృక్షజన్మం వల్ల తనకు కలిగిన సంతాపాన్ని వెంటనే పోగొట్టుకున్నది. తమ వస్త్రాపహరణం చేసి పొన్నచెట్టెక్కిన గోవిందునితో వ్రజకాంతలు మామా! మా చీరలు ముట్టు కోవద్దు! ఎత్తుకొని పోవద్దు! మమ్మల్ని మన్నించు మా మానములను మనస్సులనెందుకు హరిస్తావు. ఈ పని మానుము అని ఇది నీకు తగిన పనేనా? మా వలువలెందుకు అపహరిస్తావు? అందరిలో నీవు మహా ధర్మపరుడవూ గదా! ఆడువారు స్నానం చేసేటప్పుడు, మగవారు ఆ

చోటికి రావచ్చునా? ఈ మాదిరి అల్లరి పనులు ఎవరైనా చేస్తారా? నీకు బానిసలమై ఉంటాము. మా చీరలు మాకివ్వు అనగా కృష్ణుడు మీరు కొంచెమైనా మొగమాటం లేక నన్ను నిందిస్తున్నారే! కానీ మీ తప్పు మీరు ఆలోచించటం లేదు. వ్రతదీక్షలో ఉన్న ఆడవారు వంటిమీద నూలుపోగైనా లేకుండా నదిలో స్నానం చేయవచ్చునా? ఇది అంబికకు అపరాధం కావించడమే కదా! ఈ విధంగా నోము నోచే జవ్వను లెక్కడైనా ఉంటారా? సరే మీరు ఎవరిని పతిగా కోరి ఈ వ్రతం చేస్తున్నారో నిజం చెప్పండి. మీరు నీటి నుండి వెంటనే వెలుపలికి వచ్చి నా దగ్గరకు రండి. మీ వలువలు తీసుకోండి. ఇదిగో ఇప్పుడే మీకిచ్చివేస్తాను. శ్రీకృష్ణుని మాటలు విని ఆ గొల్ల చెలియలు ఒకరి మొగం ఒకరు చూచుకొని నవ్వుకొన్నారు. అంత వారు లజ్జించారు. ఆ చలికి గడగడ లాడుతూ ఆ కన్నెలు ఒకరికి ముందు, ఒకరికి వెనుక వదుగుతూ వచ్చారు. ఏ ఉత్తమ శ్లోకుణ్ణి స్మరిస్తే వ్రత భంగాలన్ని తొలగిపోతాయో అట్టి పరాత్పరుణ్ణి ఆ గొల్ల ముద్దియలు వీక్షించారు. దయాలవాలుడైన శ్రీకృష్ణునికి నమస్కరించగా ఆయన ఆ చెలువలకు వలువలిచ్చాడు. శ్రీకృష్ణ దర్శనంతో వ్రతలోపం జరగకుండా ఆ నారీమణులు చీరలు ధరించారు. శ్రీకృష్ణుని గోపికా వస్త్రాపహరణం ఈ విధంగా జరిగింది.

**అరువై నాలుగవ అధ్యాయము - దశమ స్కంధము**

**జవాబులు :** 1. 2. అమరావతీనగరం 2. 4. కాత్యాయనీవ్రతం
3. శ్రీకృష్ణుని

* * *

## అరవై ఐదవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణునికి మునుల భార్యలు అన్నాన్ని సమర్పించడం 2. ఇంద్రయాగ విషయమై నందాదులు కృష్ణునితో సంప్రదించడం 3. శ్రీకృష్ణుడు గోవర్ధన గిరినెత్తడం**

**1) ప్రశ్న :** శ్రీకృష్ణుడు బృందావనంలో గోవులను కాస్తూ ఆనందంగా ఉండగా, ఒక గోపబాలుడు కృష్ణునితో తనకు ఆకలిగా ఉన్నదని విన్నవించుకొన్నాడు. బలరామ సహితుడైన శ్రీహరి ఆ సమయంలో ఎవరిని అనుగ్రహింపదలచాడు?.

**జవాబు :** 1. బ్రాహ్మణపత్నులను 2. మునులను
3. గోపాలబాలురను 4. గోపికలను

**2) ప్రశ్న :** తనకు ఆకలిగా ఉన్నదని చెప్పిన గోపబాలకులతో కృష్ణుడు ఓ గోపబాలకులారా! ఈ వనంలో భూసురులు యాగం చేస్తున్నారు. మీరు అచటికి వెళ్ళి బలరామకృష్ణులు పంపించినారని చెప్పి అర్థించండి. మీకు అన్నం పెడతారు అని కృష్ణుడు గోపకులకు చెప్పిన విప్రులు చేస్తున్న యాగం పేరేమిటి?

**జవాబు :** 1. పుత్రకామేష్ఠి 2. అశ్వమేధయాగం
3. ఆంగిరసమనే సత్రయాగం 4. విశ్వజిత్ యాగం

**3) ప్రశ్న :** శ్రీకృష్ణుని మాట ప్రకారం గోపకులు వెళ్ళి భూసురపత్నులను అన్నమడిగారు. వారంతా దేవకీనందనుని దర్శించాలని, తగిన ఆహార పదార్థాలను తీసికొని వచ్చి కృష్ణునికి సమర్పించి ధన్యత చెందారు. కాని బ్రాహ్మణులు తమ భార్యలు నోచుకొన్న భాగ్యానికి తాము నోచుకోలేక పోయామని చింతించారు. వారు ఎవరికి భయపడి శ్రీకృష్ణ దర్శనానికి రాలేకపోయారు.

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** ఇంద్రయాగం చేయ సంకల్పించిన నందాదుల చేత శ్రీకృష్ణుడు ఏ పూజ చేయించాడు? దాని ఫలితాన్ని తెలపండి.

**జవాబు :** ఒకనాడు నందాదులు గోకులంలో ఇంద్రయాగం చేయ సంకల్పించి ఒకచోట చేరి యుండగా, శ్రీకృష్ణుడు వారిని చేరి మీరేదో యాగం చెయ్యాలని ఉన్నట్లుగా ఇక్కడకు వచ్చినట్లున్నారు. అనగా వారు ఇంద్రయాగం గురించి చెప్పారు. ఇంద్రయాగం చేస్తే, దేవేంద్రుడు సంతృప్తిపడి వర్షాలు సకాలంలో కురిపిస్తాడు. వానవలన భూమిపై గడ్డి పెరుగుతుంది. ఆ గడ్డి మేసి మన పసు సంపద తేజోవంతమవు తుందని చెప్పారు. నాయనా! ఆవులు హాయిగా జీవిస్తే మందలలో పాడి ప్రభలు తుంది. చక్కగా పాడి ఉంటే నరులు, సురలు సంతృప్తిగా జీవిస్తారు. అప్పుడు కృష్ణుడు తండ్రీ! తాము చేసిన కర్మము చేతనే ప్రాణి పుడుతున్నది. కర్మచేతనే వృద్ధి పొందుతున్నది. కర్మచేతనే లయిస్తుంది. కర్మలాచరించు వానికి తగిన ఫలాలు ఆయా కర్మలే ఇస్తుండగా మధ్యలో ఇంద్రుని వల్ల భయపడవలసిన పనిలేదు. ఒకవేళ ఇంద్రునికి కోపము వచ్చినా మనకు కొరతేమీలేదు. మనకు, మన పశువులకూ తృణ జలాదులచే నిత్యమూ పోషిస్తున్న పర్వతానికీ, మనకు దీవెనలొసగే విప్రవర్యులకు సంతుష్టి కలిగేటట్లుగా యాగం చేద్దాము. భక్తితో అద్రికి పూజలు చేయండి. పతితులకూ, అనాథలకూ భోజనాలు పెట్టండి. కుక్కలు, కోతులు మొదలైన జంతువులకు ఆహారం పెట్టండి. నా మాటపై నమ్మకముంచండి అని పలికిన శ్రీకృష్ణుని మాటలకు అందరూ అంగీకరించారు. అందరూ అనుకున్నట్లుగానే పర్వతానికి నైవేద్యాలు పెట్టి పూజించారు. వెన్నుడు పర్వతాకృతి దాల్చి బృందావన వాసులు పెట్టిన నైవేద్యాలను ఆరగించాడు. అప్పుడా కమలాయతాక్షుడు ఓ గోపకులారా! ఆలకించండి. ఈ కొండ మనం నివేదించిన పదార్థాలను ఆరగిస్తుంది. మనకు ఆపద వచ్చినప్పుడు ఆదుకొంటుంది అంటూ గిరి ప్రదక్షిణం చేసి వ్రజవాసులందరూ కృష్ణునితో కలిసి బృందావనం చేరారు. జరిగినదంతా తెలిసికొన్న ఇంద్రుడు మిక్కిలి కుపితుడై గొల్లలు పెరుగులు, నేతులు తిని క్రొవ్వెక్కారు. జంకు గొంకు లేక మహేంద్రుడనైన నన్ను మరిచి అద్రికి

పూజచేశారు అని సంవర్తకమనే మేఘాలను పిలిచి బృందావనంపై వడగళ్ళవాన కురియండని ఆజ్ఞాపించాడు. ఈ విధంగా గోకులం ఇంద్రయాగం చేయనందు ఇంద్రుడు వారిని ఇబ్బందులపాలు చేయ ప్రయత్నించాడు.

**5) ప్రశ్న :** శ్రీకృష్ణస్వామి గోవర్ధన గిరిని ఎందుకు ఎత్తవలసి వచ్చింది? అటుపిమ్మట ఏమి జరిగింది?

**జవాబు :** ఇంద్రయాగం చేయకుండా కొండకు పూజ చేశారని వ్రజ వాసులపై ఇంద్రుడు కినుక వహించి సంవర్తకమనే మేఘాలను రావించి బృందావనంపై దారుణమైన వర్షధారలు కురిపించాడు. ఇంతకుముందెన్నడూ కనీ వినీ ఎరుగనంత వర్షధాటికి తట్టుకోలేక గడగడ వడకుతూ గోవిందుని గోపికలు ఎలుగెత్తి పిలిచారు. ఇలా పెను కోలాహలంతో గగ్గోలు పడిన పల్లెను జూచి వృద్ధులూ, ప్రభుద్దులూ అయిన యాదవులు దుష్ట శిక్షకుడూ, శిష్ఠ రక్షకుడూ అయిన శ్రీకృష్ణుడికి నమస్కరించారు. కృష్ణా! ప్రళయాన్ని తలపించే ఈ వానధాటికి గోకులమంతా భయంతో నిండివుంది. వారి భయం బాపి వెంటనే రక్షించక ఇలా చూస్తూ ఉండటం నీకు న్యాయమటయ్యా? అని పలికిన గోపవృద్ధుల మాటలు విని సర్వజ్ఞుడైన శ్రీ కృష్ణుడు ఇదంతా దేవేంద్రుని పనేనని గ్రహించాడు. వెంటనే ఓ గోప నెలతలారా! ఓ గోప నాయకులారా! భయపడకండి ఏ కొండకు మనం పూజలు చేశామో, అదే మనలను కాపాడుతుంది. అని ఆ గోవర్ధనగిరిని అవలీలగా పైకెత్తి తన కుడిచేయి చిటికెనవ్రేలు పైమోపి పట్టుకున్నాడు. దారుణమైన వడగళ్ళ వానకు భయమొందిన గోపికలకూ, గోపకులకూ, గోగణానికీ ఆ కొండను పెద్ద గొడుగుగా పట్టాడు. ఏడు పగళ్ళు, ఏడు రాత్రులూ తెరిపిలేని జడివానకు, ఆ అచలఛత్రం మాటున గొల్లలెల్లరూ ఏమాత్రం వానకు తడవకుండా జీవించారు. ఈ మాదిరి సప్తవాసరాలు హరి గోవర్ధనగిరిని ధరించాడు. ఇంద్రుడు త్రిలోకాధి పతిననే అహం విడిచి అణకువతో కామధేనువును ముందుంచుకొని, వర్షమేఘాలను వెనుకకు పంపి తాను నంద నందనుణ్ణి దర్శించి పరమాత్మ పాదాలను పూజించాడు. కామధేనువు పాలతో

స్వామిని అభిషేకించి సర్వేశ్వరా! నీ విచిత్ర లీలా వైభవం ఎరుగుటకు నేనెంతవాణ్ణి. నన్ను మన్నించు మనగా కృష్ణుడు సురేశ్వరా! నీవు సంపదచే కన్ను గానకున్నందున నీ మదాతిరేకం మాన్పుటకై నీ యాగం నిలిపివేశాను. నా యాజ్ఞ నిర్వర్తిస్తూ నీ అధికారం నిర్వహించుకో. ఇంద్రాధిపత్యం వల్ల గర్వించకు ఇక వెళ్ళు. నీకు భద్రమగు గాక అని స్వామి మహేంద్రుని తన దేవతా సమూహంతో వెళ్ళమని ఆనతిచ్చాడు.

**అరవై ఐదవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 1. బ్రాహ్మణపత్నులను 2. 3. ఆంగిరసమనే సత్రయాగం
3. కంసునికి భయపడి

* * *

## అరవై ఆరవ అధ్యాయము - దశమ స్కంధము

### 1. వరుణ నగరము నుండి నందుని శ్రీకృష్ణుడు తోడ్కొని రావడం 2. శ్రీకృష్ణ సన్నిధికి గోపికలు రావడం 3. గోపికా గీతలు

**1) ప్రశ్న :** నందుడు ఒక ఏకాదశీ పుణ్య దివసాన ఉపవాసం చేసి విష్ణుపూజ చేశాడు. అసురవేళయని గమనింపక తెల్లవారక మునుపే ద్వాదశీ స్నానం చేయడానికని యమునా నదికి చేరి నీటిలో దిగాడు. అపుడా నందరాజును పట్టుకొని వరుణ నగరానికి తీసికొని వెళ్ళింది ఎవరు?

**జవాబు :** 1. వరుణుడు 2. ముసలి
3. వరుణునిదూత 4. చేపరూపంలో ఉన్న ఒక రాక్షసుడు

**2) ప్రశ్న :** ఒకసారి యమునా నదిలో నందుడు అదృశ్యుడు కావడం, కృష్ణుడు ఆయనను, వరుణ నగరానికి వెళ్ళి తీసికొని రావడం చూచి గోపకులంతా శ్రీకృష్ణుని సాక్షాద్భగవంతునిగా భావించారు. అప్పుడు కృష్ణుడు వారందరికీ తన శాశ్వతమైన లోకాన్ని చూపనెంచి, తన బంధువు లందరినీ యమునా నదిలోని ఏ మడుగులో మునగమని చెప్పాడు?

**జవాబు :** 1. కాళిందీ మడుగు 2. ప్రభాసతీర్థం
3. శంఖతీర్థం 4. బ్రహ్మకుండం

**3) ప్రశ్న :** శ్రీకృష్ణస్వామి దయా విశేషం వలన గోపకులు బ్రహ్మకుండంలో మునిగి, దివ్యలోకాన్ని దర్శించి వచ్చి ఆ నందనందనుణ్ణి ఆశ్చర్యంతో అవలోకించి, వినుతించి అర్చించారు. అనంతరం శరదృతువులో జన సందోహానికి సంతోషం సమకూర్చే పూర్ణిమా చంద్రబింబం గగనవీధిలో ఉదయ పర్వతం చెంత ఉదయించింది. ఈ విధంగా ఉదయించిన పూర్ణిమను ఏమని పిలిచేవారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** యమునాతీరంలో శరద్రుతువులోని పున్నమనాటి వేళ శ్రీకృష్ణుడు, గోపికలు ఎలా కలుసుకున్నారు? ఏ రీతిగా విహరించారు?

**జవాబు :** ఒకనాటి శరద్రాత్రి వేళ శ్రీకృష్ణుడు యమునా తీరంలో లోకాన్ని సమ్మోహింప జేసే ఒక మోహన గీతం మురళిపై ఆలపించాడు. ఆమధుర గానానికి అధీనమైన చిత్తాలతో గొల్ల జవరాండ్రు తత్తరపాటు చెందారు. తాము చేస్తున్న పనిని అక్కడే వదిలేసి మనసు మాధవుని వశమై పరవశిస్తూ, తమ వారందరూ ఈ వేళప్పుడు వద్దని వారించినా వినకుండా తొందర తొందరగా నడచి గోకులము నుండి బయలుదేరి నంద నందనుని సందర్శించటానికి వచ్చారు. ప్రారబ్ధ పుణ్య పాపాత్మకమైన సంసారబంధాల నుండి విడివడి, సత్త్వ రజస్తమోమయమైన శరీరం వదలి ముక్తిని పొందాలనే కోరికతో వచ్చారు. వచ్చిన గోపికలను ముకుందుడు ఓ తీవబోడులారా! మీకు శుభమేకదా! క్రూర మృగాలు సంచరించే ఈ సమయంలో మీరింత దూరం రావచ్చునా? ఈ రాత్రివేళ ఎందుకు వచ్చారు? చాల్చాలు ఇక మీ మంద పట్టులకు వెళ్ళండి. ఈ తెగువతో కూడిన పనులు మీకు తగవు ఓ చెలులారా! నన్ను చింతించుట, నన్ను గూర్చి వినుట, నన్ను చూచుట, నాపైని పాటలు పాడుట ఇలా నాపై మనసుంచితే చాలు. మీరు ధన్యురాండ్రవుతారు. ఇక మీరు మరలిపొండి! అని శ్రీకృష్ణుడు చెప్పగా విని వారంతా విచారంలో మునిగి పోయారు. ఆ గోపికలు స్వామీ! నీవు కరుణకు పెన్నిధివి. నీ పాదదాస్యమిచ్చి రక్షించు. ఓ గోకుల వల్లభా! నిన్ను చూచినా, నీ సంగీతాన్ని విన్నా చెట్లూ, మృగాలూ, పక్షులూ, ధేను సమూహమూ సంతోషంతో పులకించి పోతాయి. మరి అంగనలు నినుకనీ, నీగానం వినీ ద్రవించిపోరా? ఈ విధంగా విహ్వలత్వం పొందిన వ్రజ సుందరీ మణులు పల్కిన దీనవచనాలు ఆకర్ణించి యోగీశ్వరుడూ, ఆత్మా రాముడూ అయిన శ్రీకృష్ణుడు నవ్వి వారితో ఆటలాడాడు. అనంతరం వారికి ఆత్మశాంతిని కలిగించి అనుగ్రహించేందుకు ఆ పరమాత్ముడు అదృశ్యమైనాడు. అప్పటివరకు తమ మధ్యనే ఉన్న కృష్ణుని వారు వెతక నారంభించారు. ఈ రీతిగా గోపాల, గోపికలు యమునా తీరంలో విహరించారు.

**5) ప్రశ్న :** కృష్ణుడు అదృశ్యమైనాడని గోపికలు ఆయనను కనుగొనలేక అచ్చటచ్చట ఏ రీతిగా వెతికారు? కమలాక్షుడు వారికి పునర్దర్శనం ఏ తెఱుగున కల్పించాడు?

**జవాబు :** యమునా తీరంలో వెన్నెలవేళ వెన్నుని మురళీరవం విని మనసులు వశం తప్పి, ఆకర్షితులై వచ్చిన గోపికలను కొంతతడవు, పరవశింపజేసి

స్వామి అదృశ్యమైనాడు. అప్పుడా గోపికలు మాధవుని కనుగొనలేక ఆయనపై పాటలు పాడుతూ వెదకసాగారు. కనిపించిన చెట్లను, పూపొదలను పేరుపేరున పిలిచి అడిగారు అందాల గోవిందుని కాంచినారా! అని ఓ రమానాయకా! ఇంత రాత్రివేళ ఇలువెడల వద్దని మా చుట్టాలందరూ చెపుతున్నా వినక, నీమెత్తని పాట సవ్వడి చెవులలో నిండగానే, మోహితులమై పరుగు పరుగున వచ్చాము. నీవెక్కడి కేగినావో యెరుగము. నీ వంటి జాలిమాలిన వాడెందైనా ఉంటాడా? మమ్ము నట్టడవిలో ఇట్టే వదలిపెట్టి వెళ్ళడం నీకు ధర్మమా? నీ మనసును కర్కశం ఆవహించిన మా మంద భాగ్యాన్ని ఏమనుకోవాలి? ఈ విధంగా ఆ కాంతలు మధురమైన కంఠస్వరంతో కృష్ణుని గుణాలను స్తుతిస్తూ, పాడుతూ, ప్రియతమా రమ్ము అని విలపించగా లోకాలను రక్షించే ఆ పరమాత్ముడు త్రిజగన్మోహనుడై వారి ముందు సాక్షాత్కరించాడు. వచ్చిన మనోహరుణ్ణి చూచి గోపికలు వికసించిన మోము గలవారై వారంతా తలా ఒకరీతిగా పరమానంద భరితులైనారు. అప్పుడు ఆ యమునా తీరంలో గొల్ల పడతుకలు తనచుట్టూ చేరి కొలువగా వారందరినీ వెంటనిడుకొని మందార సుమ సౌరభంతో, మొల్లపువ్వుల నెత్తావితో గూడిన మంద మారుతాలు తమను తాకగా, దగ్గరలో నున్న సైకత స్థలానికి చేరాడు. అక్కడ గోపికలు జ్ఞానోదయంచే పరమాత్మను దర్శించి కృష్ణ విరహంవల్ల కలిగిన తాపం పోగొట్టుకొన్నారు. వారి కోరికలన్నీ చక్కగా నెరవేరాయి. అప్పుడా ముద్దరాండ్రు ఆయన పాదాలను తమచేతులతో ఒత్తుతూ, ఆయనను స్పృశిస్తూ, తూలనాడుతూ, సూటి పోటి మాటలాడుతూ ఇంచుక కోపం దీపిస్తున్న మోములు గలవారై, ప్రేమతో వారన్న మాటలకు స్వామి నేను మిక్కిలి కరుణగల వాణ్ణి. మీకు ఆత్మ బాంధవుణ్ణి. నాయెడ మీకు అనవరతమైన ధ్యానం సమకూర్చడానికి కనుమరుగైనాను. నా మీది కరుణతో ఓర్చుకొనండి అని పలికిన నందనందనుని మాటలు విని గోపకాంతలు ఆనందించారు.

### అరవై ఆరవ అధ్యాయము - దశమ స్కంధము

**జవాబులు :** 1. 3 వరుణుని దూత 2. 4. బ్రహ్మకుండం
3. రాకాపూర్ణిమ

* * *

## అరవై ఏడవ అధ్యాయము - దశమ స్కంధము

**1. రాసలీల 2. జలక్రీడ**

**1) ప్రశ్న :** శరత్కాలములోని చంద్రకాంతిలో యమునా తీరాన శ్రీకృష్ణుడు చిత్రాకారుడై రమణీమణులతో రాసక్రీడ సలపడానికి ఆరంభించాడు. ఆ విధంగా నిర్వహించే రాసగోష్ఠిలో గోపికలు ఏ ఆకారంలో నిలబడ్డారు?

**జవాబు :** 1. దీర్ఘచతురస్రాకారం 2. చతురస్రాకారం
3. వలయాకారం 4. త్రిభుజాకారం

**2) ప్రశ్న :** రాసలీల చాలించి ఆ గోపతనయుడు తనను పరివేష్ఠించి యున్న చెలువలతో గూడి ఏమి చేయటానికి ఉబలాట పడ్డాడు?

**జవాబు :** 1. గోకులానికి వెళ్ళడానికి 2. చెట్లక్రింద ఆడేందుకు
3. జలక్రీడ ఆడేందుకు 4. పొదరిండ్లలో దూరేందుకు

**3) ప్రశ్న :** శుకయోగీంద్రునితో పరీక్షిన్మహారాజు మహాత్మా! పరమేశ్వరుడు ధర్మానికి భర్త, కర్త, ధర్మ స్వరూపుడు కదా! మరి అటువంటప్పుడు పరసతులతో కూడి, శరద్రాత్రి వెన్నెలలో విహరించటం ఏమి ధర్మం? అని అడుగగా యోగిరాజా! తేజస్వంతులైన ఇంద్రుడు, చంద్రుడు, సర్వభక్షకుడూ, ఇలాంటి దేవతలు సర్వమును అనుభవించి కూడా దోషఫలాన్ని పొందరు. రాజా! అన్నీతానైన ఈశ్వరుడు శాస్త్రవశ్యుడుకాడు. తమ ఇష్టము వచ్చినట్లు ప్రవర్తిస్తూంటారు. వారికది తప్పుకాదు అని చెప్పాడు. కాగా శుకయోగి చెప్పిన సర్వభక్షకుడైన దేవత ఎవరు?

**జవాబు:** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** యమునా తీరంలో శరత్కాలవెన్నెలలో గోపికలతో కూడి శ్రీకృష్ణుడు రాసక్రీడను ఏరీతిగా నిర్వహించాడు?

**జవాబు :** యమునా తీరంలో శరద్రాత్రి వెన్నెలకాలంలో శ్రీకృష్ణుడు పలికించిన వేణునాదానికి, తన్మయులై తమవారందరినీ వదలి వచ్చిన గోపికలతో, ఆ

సర్వాంతర్యామి చిత్రాకారుడై రమణీమణులతో రాసక్రీడ సలపడానికి ఆరంభించాడు. గోపికలు గోవిందుని చుట్టూ వలయాకారంగా ఏర్పడి, ఒకరి చేతులు ఒకరు సవిలాసంగా పట్టుకొని తిరిగారు. ఎందరు గోపికలో, అందరికీ తానొక్కడే అందరి వాడైనాడు. గోపిక ప్రక్క తానూ, తన ప్రక్క గోపికా ఉండేలాగున నిలచి రాసమండలం కల్పించాడు. అది నృత్యవిద్యా మహాసముద్రానికి చుట్టూ ఏర్పడిన చలియలికట్ట చందంగా పొలుపారింది. ఇలా భగవంతుడైన శ్రీకృష్ణుడు ఎందరు గోప వధువులో, అందరికీ తానందరై ఆత్మారాముడైనప్పటికీ బాలుడు తన ప్రతి బింబాలతో ఆడుకొనేటట్లు వారితో రాసలీల సాగించాడు. ఆ నందకుమారుడు కలిసి మెలసి నవ్వుతూ, చూస్తూ, సల్లాపాలు సలుపుతూ మెలిగాడని, ఆ ఇందుముఖులు తమ పూర్వజన్మ పుణ్యాలను మిక్కిలి శ్లాఘించుకొన్నారు. ఆ గోపవధువుల మధ్యలో తామర రేకుల నడుమ దుద్దువలె ఆ గోపాలుడు లయబద్ధంగా మురళీ రంధ్రాల మీద తనచేతి వేళ్ళను సారిస్తూ పూరించాడు. ఇట్టి రాసక్రీడను అంబరతలం నుండి దేవతాంగనలు విలాసవంతంగా తిలకించి సమ్మోహితులైనారు. ఈ విధంగా స్వామి రాసక్రీడను నిర్వహించాడు.

**5) ప్రశ్న :** రాసక్రీడ జరిగిన అనంతరం ఆ శ్రీకృష్ణుడు గోపికలతో కూడి ఏ విధంగా జలక్రీడ నిర్వహించాడు?

**జవాబు :** రాసక్రీడ నిర్వహించే సమయంలో కలిగిన అలసటను, చెమటను పోకార్చుటకు శ్రీకృష్ణుడు చెలువలతో కూడి జలక్రీడ లాడటానికి ఉబలాటపడ్డాడు. అతడు కాళిందీ జలాలలో ప్రవేశించాడు. అతనికన్న ముందుగా గోప స్త్రీలు యమునలో ప్రవేశించి ఇక్కడ అడుగు లోతు, ఇక్కడ మోకాలి లోతు, ఇక్కడ మొలలోతు, ఇక్కడ నడుము లోతు, ఇక్కడ రొమ్ము లోతు అంటూ ఏటి నీటిలోనికి దిగారు. అరచేతులతో నీటిని చరిచారు. శ్రీకృష్ణుడు దోసిటితో నీటిని వారిపై చల్లగా వారు పలు విధాలుగా తడిసిపోయారు. వారు దోసిళ్ళతోతీసికొన్న నీటిని కృష్ణునిపై చల్లారు. ఇంకనూ ఆ పూబోండ్లు చిగురుటాకుల వంటి చేతులతో తామర పూరేకులను విభుని

మీదకు వెదజల్లారు. అందరూ ఆ నీట మునిగి అతిశయమైన ఆనందంతో నందనందనుడు గోపసుందరీ మణులతో నీటి నుండి వెడలివచ్చి సొమ్ములు, మంచి గంధము, వస్త్రాలు మొదలైనవి అలంకరించు కొన్నారు. ఈ రీతిగా ఆ శరత్కాలంలో నారాయణుడు సలిపిన రాసక్రీడ, జలక్రీడ అది ఆయనకే చెల్లును. ఇతరులు అనుసరింపలేనిది. అనుసరింప సాధ్యంకానిది. ఈశ్వరునకు ధర్మాధర్మ ప్రసక్తిలేదు. ధర్మమూ ఆయనే అధర్మమూ ఆయనే. గోపాలకులలో, గోపికలలో తక్కిన జీవరాసులలో ఎవడు అంతరాత్మయై వ్యవహరిస్తాడో ఆ మహనీయుడికి పరాంగన లెవరు? క్రీడార్థ మవతరించిన ఆ సర్వవ్యాపి – ఇలా క్రీడించినాడే కానీ ఇందులో దోషం లేదు. ఆ తెల్లవారు జామున కృష్ణుని వీడి గోపాంగనలు తమ ఇండ్లకు వెళ్ళారు. అతని మాయచే భ్రాంతి వహించిన గోపాలురు గోపికలను కోపగించు కోలేదు. ఈ రీతిగా జలక్రీడ ముగిసింది. అని యోగిరాజుకు తెలిపాడు.

**అరవై ఏడవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 3. వలయాకారం 2. 3. జలక్రీడ ఆడేందుకు
3. అగ్ని

* * *

# అరవై ఎనిమిదవ అధ్యాయము - దశమ స్కంధము

**1. సర్పరూపియగు గంధర్వుని శాప విమోచనం 2. శ్రీకృష్ణుడు శంఖచూడుని సంహరించడం 3. వృషభాసుర సంహారం**

**1) ప్రశ్న :** ఒకనాడు గొల్ల పెద్దలందరితో కూడి నందుడు జాతరకై ఎడ్ల బండ్లనెక్కి అంబికావనానికి వెళ్ళారు. అక్కడ సరస్వతీనదిలో స్నానాలు చేసి వారందరు అక్కడ ఉన్న దైవాన్ని పూజించి కానుకలు సమర్పించారు. ఆ వారందరు వెళ్ళిన జాతర పేరేమి?

**జవాబు :** 1. కాత్యాయని జాతర 2. కౌముదినీ జాతర
3. కాళికాజాతర 4. పశుపతి జాతర

**2) ప్రశ్న :** జాతరకై వెళ్ళిన యాదవులు అంబికావనంలో స్నానాధికాలను పూర్తి చేసుకొని, వారు నీరు మాత్రమే స్వీకరించి, నియమంతో ఉండి, అందరూ నిద్రకు ఉపక్రమించారు. ఆ సమయంలో ఒక కొండచిలువ సర్పం ఎవరిని చుట్టుకొని మింగటానికి ప్రయత్నించింది?

**జవాబు :** 1. నందుని 2. యశోదను
3. బలరాముని 4. కృష్ణుని

**3) ప్రశ్న :** అంబికా వనంలో నందుడుని పట్టుకొని మింగడానికి ప్రయత్నిస్తున్న సర్పాన్ని శ్రీకృష్ణుడు కాలితో తన్నాడు. వెంటనే ఆ సర్పం ఒక విద్యాధరుని రూపం దాల్చింది. అంగీరస వంశస్తుల శాప కారణంగా సర్పరూపం దాల్చిన ఆ విద్యాధరుడి పేరేమి?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శంఖచూడుడను యక్షుని శ్రీకృష్ణుడు ఎందుకు సంహరించ వలసి వచ్చింది? ఏవిధంగా సంహరించాడు?

**జవాబు :** బృందావనంలో గోప సుందరులు తమచుట్టూ పరివేష్టించి ఉండగా బలరామ కృష్ణులు మనోహరంగా మధుర గీతాలు ఆలపించారు.

సర్వ ప్రాణులకూ సమ్మోహం కలిగించే విధంగా గానం చేస్తూ బలరామ కృష్ణులు మత్తిల్లిన వారి మాదిరి వనంలో విచ్చలవిడిగా విహరిస్తున్నారు. వారందరూ ఒడలెరుగక ఆ వనసీమలో అట్టే పారవశ్యంలో మునిగిఉన్న సమయంలో, కుబేరుని భటుడు శంఖచూడుడనే వాడు బలరామ కృష్ణుల రక్షణలో ఉన్న గోపకాంతలను తన యోగ బలంతో బలాత్కారంగా పట్టుకొని ఉత్తరదిశకు తీసికొని పోసాగాడు. అపుడా భామినిలు 'బలరామా, కృష్ణా' అంటూ బెబ్బులి బారినపడ్డ ఆవులవలె ఆక్రందనం చేశారు. అంత ఆ బలరామ కృష్ణులిద్దరూ చెలరేగి 'ఓ ముగ్ధలారా! మీరు భయపడకండి' అంటూ గోపికలకు ధైర్యంచెప్పి ఆ యక్షునితో తలపడ్డారు. వాడు ఆ అన్నదమ్ము లిద్దరినీ చూచి కలతచెంది ఆ నెలతలను అక్కడ వదలి తత్తర పాటుతో ఉత్తర దిక్కునకు మహావేగంగా పరుగెత్తసాగాడు. అప్పుడు కృష్ణుడు గోపికలను కాపాడుతూ ఉండుమని అన్నకు చెప్పి తాను శంఖచూడుని వెంబడించి, వాడు ఏ రూపంలో వెళ్ళుతున్నాడో తానూ ఆ రూపంలోనే వెంబడిస్తూ వెళ్ళి వానిని పట్టుకున్నాడు. సాటిలేని తన పిడికిటి పోటుతో వాని శిరం తునిగి పడేటట్లు పొడిచాడు. వాడిని ఆ విధంగా సంహరించి గోవిందుడు ఆతని కిరీటంలో వెలుగొందే మణిని తెచ్చి గోపికలు చూస్తూండగా తన అన్న బలరామున కిచ్చి సంతోష పరచాడు. ఆ విధంగా కుబేర భటుడు శంఖచూడుడిని శ్రీకృష్ణుడు సంహరించాడు.

**5) ప్రశ్న :** అరిష్టుడనే రాక్షసుడు శ్రీకృష్ణుని చంపదలచి ఏ రూపంలో వచ్చాడు? ఆతనిని శ్రీకృష్ణుడు ఏరీతిగా సంహరించాడు?

**జవాబు :** శ్రీకృష్ణుని చంపాలనే తలంపుతో అరిష్టుడనే రాక్షసుడు ఎద్దురూపం ధరించి కృష్ణాదుల గోవుల మందలో చేరాడు. వృషభరూపం దాల్చిన దనుజుడు వెంటనంటగా దూడలు ఆవుల కడకు పరుగెత్తి పోయాయి. ఆవులూ, దూడలూ చెల్లాచెదరుగా వచ్చి గోపకుల దాపునకు చేరాయి. గోవిందుడు అంతా గ్రహిస్తూన్నాడు. వృషభాసురుడు గిట్టలతో నేల ద్రవ్వుతూ, కండ్ల నుంచి గుప్పుగుప్పున నిప్పులు రాలుతుండగా వచ్చి కృష్ణుని ఎదుర్కొన్నాడు. అంత ఆ

యశోదా నందనుడు వృషభాసురుని రెండు కొమ్ములూ పట్టుకున్నాడు. ఏనుగు మరొక ఏనుగును పడద్రోసినట్లు వాణ్ణి పద్దెనిమిది అడుగుల దూరం పడనెట్టి వేశాడు. అపుడా రాక్షసుడు తల్లడిల్లి సొమ్మసిల్లి దేహాన చెమటలు గ్రమ్మగా నేలవ్రాలి తెప్పరిల్లి మళ్ళీ దనుజ మర్దనుడైన జనార్దనుణ్ణి ఢీకొన్నాడు. అంతట ఆ వృషభాసురుని కొమ్ములు పట్టి నేలపై పడగూల్చి కాలితో త్రొక్కి పట్టాడు. అంతట వాని కొమ్ము పెరికి దానితోనే వాణ్ణి చావబాదాడు. అప్పుడా రాక్షసుడు బలముడిగి రొప్పుతూ, ముక్కుతూ, మూల్గుతూ, ముక్కునా, నోటా నెత్తురు గ్రక్కుతూ, మలమూత్రాలు మిక్కుటంగా వదులుతూ ఆ వృషభం రూపం దాల్చిన అరిష్టుడనే రాక్షసుడు అసువులు గోల్పోయాడు. ఇలా వృషభ దైత్యుని సంహరించ గానే వేల్పులు గుంపులై గోపాలునిపై పుష్పవర్షం కురిపించారు. గోపకులు హర్షించారు. గోపాంగనలు ఉప్పొంగి పోయారు. ఆ గోవిందుడు బలరామునితో మిక్కిలి ఆనందిస్తూ మందకు మరలి వెళ్ళాడు.

**అరవై ఎనిమిదవ అధ్యాయము - దశమ స్కంధము**

**జవాబులు :** 1. 4. పశుపతి జాతర 2. 1. నందుని
3. సుదర్శనుడు

* * *

## అరవై తొమ్మిదవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుడు కేశివ్యోమాసురులను సంహరించడం 2. అక్రూరుడు బృందా వనానికి రావడం 3. అక్రూరుడు యమునలో బలరామ కృష్ణులను దర్శించడం**

**1) ప్రశ్న :** కంసుని పంపున వచ్చిన రాక్షసుడు, అశ్వ రూపందాల్చి నందుని మందలో చేరి, అక్కడి వారందరిని భయకంపితులను చేసిన రాక్షసుని పేరేమి?

**జవాబు :** 1. కేశి 2. వృత్రాసురుడు 3. బకాసురుడు 4. ముష్టికుడు

**2) ప్రశ్న :** దానవహంత కృష్ణుడెక్కడ? అని వెతుకుతూ కృష్ణుణ్ణి మ్రింగడానికై 'కేశి' అనే రాక్షసుడు అశ్వరూపంలో రాగా కృష్ణుడు ఆ రాక్షసుని సంహరించాడు. ఆ సమయంలో ఆనంద నందనుని దర్శించిన మహర్షి ఎవరు?

**జవాబు :** 1. గర్గమహర్షి 2. దుర్వాసమహర్షి 3. నారదమహర్షి 4. వ్యాసమహర్షి

**3) ప్రశ్న :** ఒకనాడు కృష్ణాదులు 'దాగుడు మూతలాట' ఆడుకొంటుండగా, ఒక రాక్షసుడు గోపాలకుని రూపంలో వచ్చి, ఒక గోపాలకుని కళ్ళుమూసి తీసికొని వెళ్ళి ఒక కొండ గుహలో దాచాడు. విషయం తెలిసికొన్న కృష్ణుడు ఆ రాక్షసుని కొట్టి నేలకూల్చాడు. ఆ పరమాత్మ చేతిలో ఆ విధంగా మరణించిన అసురుని పేరేమి?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** అక్రూరుడు అనే యాదవుడు ఎవరి పంపున, ఏ తెరుగున బృందావనం వచ్చాడు?

**జవాబు :** నందవ్రజంలో వున్న బలరామ కృష్ణులు వసుదేవుని బిడ్డలని నారద మహర్షి వలన తెలిసికొన్న కంసుడు, ఏ విధంగా నైనా వారిని మధురకు రప్పించి అంత మొందించాలని ఆలోచన చేశాడు. అనంతరం కంసుడు తనకు అనుకూలుడైన అక్రూరుడనే యాదవుని పిలిపించి, అక్రూరా! నీవు నందవ్రజం

వెళ్ళి అక్కడ మనకు రావలసిన కప్పం తీసికొని నాచే నిర్వహింపబడే ధనుర్యాగానికి నందాదులైన గొల్ల పెద్దలను, బలరామ కృష్ణులను వెంట తీసికొనిరావాలి అని ఆజ్ఞాపించాడు. అంత అక్రూరుడు సంతోషంతో మరునాడు ప్రాతఃకాలాన కాలోచిత కార్యక్రమాలను పూర్తిచేసుకొని రథమెక్కి నందవ్రజం వెళ్తున్నాడు. త్రోవలో గడచిన జన్మలో ఏ తపస్సు చేశానో, ఏ దానం చేశానో గదా! కాకున్న పరమ యోగుల దృష్టికి కూడా గోచరం కాని భగవంతుడు, పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీకృష్ణుని నేను దర్శించ బోతున్నాను అని అనేక విధాల తనకు కృష్ణ దర్శన భాగ్యాన్ని గురించి తలపోశాడు. ఇంకనూ ఈ అక్రూరుడు ఆ కంసుని పంపున నన్ను హింసించడానికి వచ్చిన పరమ దుర్మార్గుడని శ్రీకృష్ణుడు అనుమానిస్తాడేమో అని సందేహిస్తూ, సర్వాంతర్యామి యైన పరమాత్మ నన్ను ఎలా మన్నిస్తాడో! నా భాగ్యం ఎలా ఉందో కదా! అని తలపోస్తూ ప్రయాణించి, గోవులు ఇళ్ళకు చేరే సాయంత్ర సమయానికి బృందావనం చేరాడు. అక్కడ పాలుపితికే వాడలో ఉన్న బలరామ కృష్ణులను అక్రూరుడు సందర్శించాడు. మేను పులకించి ఆనంద భాష్పాలతో నిండిన కన్నులతో, ఉత్కంఠతతో రథం దిగి, ఆ రామ కృష్ణుల పాదాలకు వినయంతో నమస్కరించాడు. అప్పుడు కృష్ణుడు అక్రూరుని ఆలింగనం చేసుకొన్నాడు. అటుపిమ్మట రామకృష్ణులు అక్రూరుని చేయి పట్టుకొని తమ గృహానికి తీసికొని వెళ్ళారు. నందుడు అక్రూరుని సాదరంగా ఆహ్వానించి గౌరవించాడు. శ్రీకృష్ణుని కోరికపై అక్రూరుడు తాను వచ్చిన పనిని గురించి చెప్పాడు.

**5) ప్రశ్న :** బలరామ కృష్ణ, నందాదులను తోడ్కొని వస్తున్న అక్రూరుని, మధుర ప్రయాణం ఏ రీతిగా సాగింది?

**జవాబు :** అతిథి మర్యాదలు అయిన తరువాయి శ్రీకృష్ణుడు అడిగిన మీదట అక్రూరుడు తనను కంసుడు పంపిన విధమును, కంసుని ధనుర్యాగ దురాలోచనను గురించి వివరించి చెప్పాడు. అంతట శ్రీకృష్ణుడు ధనుర్యాగానికి వెళ్ళాలని నిర్ణయించి నందాది గొల్ల పెద్దలకు తెలిపాడు. శ్రీకృష్ణుని మధురా నగర ప్రయాణవార్త తెలియగానే గోపవనితలు కలత చెందినారు. మరునాటి

సూర్యోదయ సమయాన నందాది గొల్లపెద్దలు వెంటరాగా, బండ్ల నిండా కానుకలు ఎత్తించుకొని, అక్రూరుడు తోలే రథమెక్కి బలరామ కృష్ణులు మధురకు అభిముఖంగా పయనించారు. ఆ విధంగా వెళ్తూ పావన యమునా నదికి దగ్గరగా రథం ఆపి, నదిలో దిగి బలరామ కృష్ణులు ఆ జలాన్ని త్రావి తిరిగి వచ్చి రథమెక్కారు. అంత అక్రూరుడు వారికి నమస్కరించి ఆ నదిలో దిగిస్నానం చేస్తూ, ఆ నదీ జలాలలో బలరామ కృష్ణులను చూశాడు. వీరిద్దరూ రథంలో ఉన్నారు కదా! ఇక్కడకు ఎప్పుడు వచ్చారు అని రథంవైపు చూడగా, అక్కడ రథంపై అన్నదమ్ములు ఏదో మాట్లాడుకుంటున్నారు. ఇదేమి వింతయని మరలా నీటిలో మునిగి, ఆ జలాలలో చూశాడు. అక్కడ ఆదిశేషునిపై శయనించి యున్న పురుషోత్తముణ్ణి చూశాడు. అంతట అక్రూరుడు భక్తి సంభ్రమాలతో తటాలున చేతులు జోడించి దగ్గుత్తికతో భగవంతుని స్తోత్రం చేశాడు. అంతట అక్రూరుడు నీటి నుండి బయటకు వెలువడి వచ్చి రథాన్ని అధిరోహించాడు. అప్పుడు కృష్ణుడు అక్రూరా! స్నానానికి వెళ్ళి చాలా సేపయినది. నీటిలో ఏమైనా వింతలున్నాయా? అని అడిగాడు. అప్పుడు అక్రూరుడు స్వామీ విచిత్రములన్నీ నీలోన ఉన్నాయి. నీలో లేనిది ఎక్కడా ఏదీ ఉండదు అని చెప్పి సాయంకాలానికి మధురానగరానికి చేరే విధంగా రథం నడిపాడు.

### అరవై తొమ్మిదవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 1. కేశి 2. 3. నారదమహర్షి
3. వ్యోమాసురుడు

* * *

## డెబ్బైయవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుడు మధురానగర ప్రవేశం 2. శ్రీకృష్ణుడు వాయక సుధాములు సమర్పించే పూజలను స్వీకరించడం 3. సూర్యాస్తమయ, చంద్రోదయ వర్ణనలు 4. సూర్యోదయ వర్ణన**

**1) ప్రశ్న :** మధురానగరానికి చేరిన బలరామ కృష్ణులు తమ విడిదిలో పాలబువ్వ ఆరగించి మనసులో కంసుని ప్రయత్నాలన్నీ గమనిస్తున్నారు. కాని కంసుడు మాత్రం కలత నిద్రలో ఎటువంటి దుస్స్వప్నాలను గాంచాడు?

**జవాబు :** 1. అశ్వాన్ని అధిరోహించినట్లు 2. రథమెక్కి వెళ్తున్నట్లు 3. గాడిదనెక్కి వెళ్తున్నట్లు 4. ఎద్దునెక్కి వెళ్తున్నట్లు

**2) ప్రశ్న :** సూర్యోదయ సమయంలో చల్లని గాలులు వీచాయి. పద్మాలు పూచాయి. చీకట్లు పటాపంచలై గుహలలో దూరాయి. తుమ్మెదలు తమ్మి పూదేనియను త్రాగి ఆనందించాయి. తూరుపుకొండపై ఉదయించిన సూర్యుని కిరణాలు అరుణిమతో నిండిన బ్రహ్మాండాన్ని వర్ణించిన కవికి ఏ వర్ణంలో దృగ్గోచరమైంది?

**జవాబు :** 1. తెలుపురంగులో 2. పీతాంబరం రంగులో 3. కుంకుమ నీటి రంగులో 4. సువర్ణమయమై

**3) ప్రశ్న :** బలరామ కృష్ణులు అలంకరించుకొని మల్ల రంగస్థలం చూడటానికి ఉబలాటపడ్డారు. వారిద్దరూ రంగస్థలం వాకిలి దగ్గరకు వెళ్ళి అక్కడ ఒక మదించిన ఏనుగును చూశారు. ఆ ఏనుగు పేరేమి?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** బృందావనం నుండి వచ్చిన బలరామ కృష్ణులు మధురానగర వీధులలో నడచి వస్తుండగా, అక్కడి ప్రజలు ఏవిధంగా స్పందించారు?

**జవాబు :** నంద వ్రజం నుండి మధురా నగర పొలిమేరలో ఉన్న తోపులో దిగి అక్కడ బసచేయడానికి సిద్ధపడి కృష్ణాదులు అక్రూరుని పంపించారు. అంతట అపరాహ్నవేళ నందాదులను అక్కడ ఉంచి కృష్ణుడు బలరాముని కొందరు

గోపకులతో కలసి మధురానగర ప్రవేశం చేయటానికి బయలు దేరాడు. అల్లంత దూరంలో అగడ్తలు, కోటలు, బురుజులు, పతాకాలు, రాజ భవనాలు, వీధులు, గుఱ్ఱాలు, రథాలు, ఏనుగులు, వీరులు, మేడలు, గొప్ప ఉద్యానాలు, నడబావులు వీనివల్ల అత్యద్భుతమైన శోభతో ఒప్పునట్టి మధురను చూశాడు. అనంతరం ఆ పట్టణంలో ప్రవేశించి వస్తుండగా ఆ పురమందలి అందగత్తెలు గోవిందుని చూడటానికి ఉబలాట పడ్డారు. వారందరూ ఎత్తైన మేడలపై గుంపులుగూడి కన్నుల కాంక్ష తీరేటట్లు శ్రీకృష్ణుణ్ణి చూశారు. ఆ గుంపులో ఒకరితో ఒకరు చెలీ! ఈ కృష్ణుణ్ణి గోపికా స్త్రీలు ధ్యానిస్తూ కీర్తిస్తూ, సంభాషిస్తూ, స్పృశిస్తూ, నవ్వుచూ, లాగుచూ, లాలిస్తూ నిత్యము ఆనందిస్తున్నారు. వారు ఇటువంటి ఆదరాన్ని పొందటానికి గడచిన జన్మలలో ఏ అరణ్యాలలో ఎటువంటి నోములు నోచినారో కదా! అని అనుకుంటూ అదేపనిగా తమ నేత్రాలతో హరి రూపాన్ని ఆస్వాదిస్తూ హృదయములందు నిల్పుకున్నారు. సంతోషంతో పూల జల్లులు కురిపించారు. అనంతరం ఆ మధురా నగరంలోని బ్రాహ్మణులు పలువిధాలైన చందనద్రవ్యాలను, పూలు, పండ్లు, మున్నగు వానినీ శుభకరమైన పచ్చని అక్షతలనూ కానుకలుగా ఇస్తూ ఆ వసుదేవ సుతులను ఉత్సాహంగా పూజించారు.

**5) ప్రశ్న :** మధురానగర వీధులలో తిరుగుతూ శ్రీకృష్ణుడు ఎవరెవరిని ఏఏ విధాలుగా అనుగ్రహించాడు?

**జవాబు :** మధురానగర వీధులగుండా వస్తున్న బలరామ కృష్ణులు అక్కడ ఒక చేనేత పనివాడు తాను నేసిన వస్త్రాలను, ఆభరణాలను ఆ బలరామకృష్ణులకూ, తమ వెంట వస్తున్న గోపకులకూ సంతోషంతో ఇచ్చాడు. అంతట ఆ రామకృష్ణులు వాటిని దయతో స్వీకరించి, అందంగా అలంకరించుకున్నారు. తరువాత ఆ స్వామి మిక్కిలి సంతుష్టుడై ఆ చేనేత పనివానికి ఐశ్వర్యాదులను అనుగ్రహించి, తన సారూప్యతనూ, సంపత్తినీ ప్రసాదించాడు. అటుపిమ్మట ఆ బలరామ కృష్ణులు పూలదండలు కట్టే సుధాముని ఇంటికి వెళ్ళి, ఆతడు భక్తితో సమర్పించిన పూజలను స్వీకరించి,

ఆతడు ఇచ్చిన పూదండలు ధరించి, సుధాముడు భక్తితో కోరిన కోరికలను అనుగ్రహించారు. అంతట బలరామ సహితుడై శ్రీకృష్ణుడు రాజవీధిలో సాగిపోయాడు. అలా వెళ్తూ పలు రకాలైన మైపూతలుంచిన పాత్ర పట్టుకొని వస్తున్న కుబ్జ అనునామెను చూశాడు. ఓ పద్మాక్షి నీవెవరు? ఈ లేపనాలు మాకిస్తే నీవు చక్కగా ప్రకాశిస్తావు అన్నాడు. అంత ఆ కుబ్జ ఓ సుందరాంగా! అందరికీ అందాలు ఎక్కడ నుండి వస్తాయి. నన్ను త్రివక్ర అంటారు. కంస మహారాజు గారికి సుగంధ లేపనాలను తయారు చేస్తూంటాను. మీరు ఈ లేపనాలు పూసుకొనండి అని కృష్ణునికి ఆ త్రివక్ర ప్రేమతో మైపూతలు ఇచ్చింది. ఆ రీతిగా కృష్ణుడు తన వారితో కలిసి ఆ లేపనాలను వంటినిండా పూసుకొని ప్రసన్నుడైనాడు. ఆమెను అనుగ్రహింపదలచి ఆమె మీగాళ్ళ మీద తన అడుగులుంచి త్రొక్కిపట్టి, తనచేతి రెండు వ్రేళ్ళతో ఆమె గడ్డం క్రిందపెట్టి దేహము చక్కగా సాగునట్లు పైకెత్తాడు. అంతతో ఆమెకున్న వంపులన్నీ పోయి ఆమె సౌందర్యం ఇనుమడించింది. అంత ఆ త్రివక్ర స్వామిని తనను అనుగ్రహించమన్నది. నా వచ్చిన పని అయిన తరువాత నీ యింటికి వస్తాను అన్నాడు. ఈ రీతిగా వారందరినీ అనుగ్రహించి శ్రీకృష్ణస్వామి అంగడి వీధిలో వెళ్ళి పురజనులు ఇచ్చిన విశేష కానుకలను స్వీకరించి ధనుశ్శాలకు వెళ్ళాడు. అక్కడ ధనస్సు రక్షకులు వద్దంటున్నా వినకుండా, పక్కున నవ్వి ఆ ధనస్సును ఎడమచేతితో పైకెత్తి అల్లె త్రాటిని తగిలించి నారిని పట్టి లాగి, మదపుటేనుగు చెరకుగడను విరిచినట్లుగా, ఆ ధనస్సును రెండుగా విరిచాడు. అక్కడ ఎదురు తిరిగిన వారిని ఆ వింటి ముక్కలతోనే కొట్టాడు. ఆ విధంగా బలరామ కృష్ణులు మధురానగరంలో విహారం చేసి అక్కడ నుండి బయలుదేరి తమ విడుదులకు వెళ్ళారు.

### డెబ్బైయవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 3. గాడిదనెక్కినట్లుగా 2. 3. కుంకుమనీటిరంగులో
3. కువలయాపీడనం

* * *

## డెబ్బై ఒకటవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుడు కంసుని ఏనుగును వధించడం 2. బలరామకృష్ణులు చాణూరముష్టికులను సంహరించడం 3. కంసవధ**

**1) ప్రశ్న :** బలరామ కృష్ణులు రంగస్థలానికి చేరగానే కువలయాపీడమనే మదపుటేనుగును మావటీడు వారిపైకి ఉసిగొల్పాడు. ఆ విధంగా మావటీడు ఎవరి ఆజ్ఞ ప్రకారం అలా చేశాడు?

**జవాబు :** 1. మంత్రి గారి ఆజ్ఞ 2. ఉగ్రసేనుడి ఆజ్ఞ
3. అక్రూరుని ఆజ్ఞ 4. కంసుని ఆజ్ఞ

**2) ప్రశ్న :** కువలయాపీడము మావటీడు ఉసిగొల్పిన విధంగా విజృంభించి కృష్ణుణ్ణి ఎదుర్కొన్నది అంత కృష్ణుడు అటు ఇటు తిరిగి దానికి దొరికినట్లే దొరికి మాయమై దాని కాళ్ళ మధ్యలో దాగికొన్నాడు. ఆ పోరులో ఏనుగు కృష్ణుడు ఎక్కడ ఉన్నది ఏ విధంగా తెలిసికొన్నది?

**జవాబు :** 1. వాసన పసిగట్టి 2. ప్రక్కకు తిరిగి కంటితో చూచి
3. మావటీ చేసిన సైగతో 4. క్రింద చూస్తున్న ప్రేక్షకుల సైగతో

**3) ప్రశ్న :** కృష్ణుడు కువలయాపీడనమనే ఏనుగును ఏ ఆయుధంతో చంపాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** చాణూర ముష్టికులను బలరామ కృష్ణులు ఏరీతిగా సంహరించారు?

**జవాబు :** కువలయాపీడమును సంహరించిన అనంతరం రామకృష్ణుల పైకి అమిత బలశాలురైన చాణూరుడు, ముష్టికుడు అను మల్లయోధులను కంసుడు పంపించాడు. తనపైకి వస్తున్న చాణూరునితో కృష్ణుడు నీవు బలమైన కరకు శరీరం కలవాడివి. మీరిరువురు మల్ల యుద్ధంలో నిష్ణాతులు. మేము పిన్నవాళ్ళం. ఎలాంటి సాములూ తెలియని వాళ్ళం. ఇట్టి మాతో మిమ్ములను పోరికి పంపి వినోదించే మీ రాజు గారికి వినోదం కలిగిస్తాను. నీవు నావంతు, మా అన్న బలరాముడు ముష్టికుని ఎదుర్కొంటాడు అని అనగానే పలురకాలైన

బలవిన్యాసాలలో బలరాముడు, ముష్టికుడూ తమ బలం చూపుతూ ఒకరినొకరు త్రోసుకుంటూ పోరాటం సాగించారు. లీలామానుష బాలుడైన కృష్ణుడు చాణూరుని పలువిధాల ముప్పు తిప్పలుపెట్టి చివరకు కర్కశంగా వాని చేతులు పట్టుకొని గిరగిర త్రిప్పి నేలపై కొట్టాడు. ఆ విధంగా అచ్యుతుని చేత గిరగిరా త్రిప్పబడిన చాణూరుడు బాగా నలిగినవాడై నోటి నుండి నెత్తురు కారగా పుడమి మీదపడి ప్రాణాలు విడిచాడు. అటు పిమ్మట బలరాముడు అపార బాహుబలంతో బలవంతుడైన ముష్టికుణ్ణి పట్టుకొని అటూ ఇటూ త్రిప్పాడు. అది చూచి కంసుడి సేన బెదరి పోయింది. బలరాముడు అలా త్రిప్పి త్రిప్పి నేలపై పడవేసి వాడిపై ఎక్కి గొంతునులిమాడు. అప్పుడు ముష్టికుని నోటి వెంట నెత్తురు వరదలై పారింది. బలరాముడు ముష్టికుణ్ణే కాక వాడి మిత్రులు కూటుడు, తోసలుడు, శలుడు అను వారిని కూడా యముని చెంతకు పంపించాడు. ఈ విధంగా బలరామ కృష్ణులు చాణూర ముష్టికులను సంహరించారు.

**5) ప్రశ్న :** శ్రీకృష్ణునిచేతిలో కంస సంహారం ఏ విధంగా జరిగింది?

**జవాబు :** చాణూర ముష్టికుల మరణం చూచి కంసుడు తన మంత్రులతో ఈ గోప బాలకులను వెంటనే పురము నుండి వెళ్ళగొట్టండి. గోపాలుర ధనాన్ని లాగుకొనండి. నందుని బంధించండి. వసుదేవుని వధించండి. నా తండ్రి ఉగ్రసేనుని కూడా వధింపుడు అని కంసుడు పలుకుతుండగా, కొండ శిఖరాన తిరుగుతున్న జింకను సంహరించటానికి కుప్పించి దుమికే సింహం లాగా కృష్ణుడు కంసుని సంహరించదలచినవాడై గురిచూసి మంచె మీదికి యుద్ధోత్సాహంతో దూకాడు. కొలువులో ఉన్న ప్రజలంతా తల్లడిల్లారు. తానున్న మంచెమీదికి దుమికి వస్తున్న కృష్ణుణ్ణి చూచి కంసుడు ఖడ్గాన్ని చేతపట్టి ఎదిరించాడు. గరుత్మంతుడు పామును పట్టే విధంగా శ్రీకృష్ణుడు కంసుని కత్తి విసరును తప్పించుకొని ఆతని జుట్టు ముడి పట్టుకుని మల్లరంగస్థలం మీదికి పడత్రోశాడు. కంసుడు మంచె మీది నుండి మల్లక్రీడారంగ మధ్యలో వచ్చిపడి లేచి కదనానికి సిద్ధమైనాడు. అప్పుడు జరిగిన పోరులో కంసుడు

అసువులుబాశాడు. అందరూ చూస్తుండగా కంసుని కళేబరాన్ని కృష్ణుడు కొంతదూరం ఈడ్చాడు. వైరభావముతోనైనా నిరంతరమూ శ్రీకృష్ణునే స్మరిస్తూన్నందున కంసుడు జ్యోతి స్వరూపముతో కృష్ణ భగవానుని యందు లీనమయ్యాడు. ఈ విధంగా కంస సంహారం జరిగింది.

**డెబ్బై ఒకటవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 4. కంసుని ఆజ్ఞ 2. 1. వాసన పసిగట్టి
3. ఏనుగు దంతంతో

* * *

# డెబ్బై రెండవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుడు దేవకీ వసుదేవులను చెరవిడిపించి, ఉగ్రసేనునికి పట్టము కట్టడం 2. శ్రీకృష్ణుడు గోపకాంతల చెంతకు ఉద్ధవుని పంపడం 3. భ్రమర గీతలు**

**1) ప్రశ్న :** కంససంహారం అయిన తరువాత దేవకీ వసుదేవులను చెఱ విడిపించడానికై కృష్ణుడు ఎవరితో కలిసి వెళ్ళాడు?

**జవాబు :** 1. నందునితో 2. గోపకులపెద్దలతో 3. బలరామునితో 4. ఉద్ధవునితో

**2) ప్రశ్న :** చెరసాల నుండి విడిపించిన కృష్ణుడు తల్లిదండ్రులకు నమస్కరించి, అమ్మా! నాన్నా! ఈ శరీరాలకు కర్తలు మీరే కదా! బిడ్డలను పెంచే ముద్దు ముచ్చటలు మీకూ మాకూ దక్కలేదు. ఇదంతా మీకు కోరిక ఉండి కూడా తీరలేదంటే అదంతా ఏ కారణంగా శ్రీకృష్ణుడు తెలిపాడు?

**జవాబు :** 1. నందుని కారణంగా 2. యశోద కారణంగా 3. యోగమాయ కారణంగా 4. దైవయోగం కారణంగా

**3) ప్రశ్న :** శ్రీకృష్ణుడు తల్లిదండ్రులను చెర విడిపించి, యాదవులందరినీ పిలిచి తమ ఇచ్ఛ వచ్చినట్లు జీవించునటుల ఏర్పాటు చేశాడు. అటుపిమ్మట ఆ వాసుదేవుడు మధురానగరానికి ఎవరిని రాజుగా నియమించాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** కంసుని మరణానంతరం బలరామ కృష్ణులు మధురలో ఏ రీతిగా ఉన్నారు? నంద వ్రజాన్ని మరచాడా? లేక ఏమి చేశాడు?

**జవాబు :** కరుణారసంతో నిండిన మధుసూధనుని మధురాతి మధురమైన కటాక్ష వీక్షణాలతో మనసులోని భీతి తొలగినవారై తీయతీయని సల్లాపాలతో బృందావనం నుండి వచ్చిన వారూ, మధురా పట్టణంలోని ప్రజలూ కలసి మెలసి జీవించారు. ఒకనాడు బలరామునితో కలిసి కృష్ణుడు నందుని వద్దకు వెళ్ళి నీవూ, యశోదాదేవి మా తల్లిదండ్రులని భావిస్తూ వుంటిమి. మమ్ములను

ఎంతో గారాబంగా పెంచారు. మీ మంచితనం వల్ల ఆయా వయసుకు తగిన ఆట పాటలతో పెరిగి ఇంత వారమైనాము. మీరు గోకులంలో మాకు చేసిన ఉపచారాలు మేమెక్కడున్నా మా మనసు నుండి ఎన్నటికీ మరలిపోవు. మేము ఈ మధురా నగరంలో కొంతకాలముండి వ్రేపల్లెకు వస్తాము అని పలికిన కృష్ణుడు వస్త్రాలు, ఆభరణాలు మొదలైన సంపదలు ఇచ్చి ఆదరంతో కౌగిలించుకొని నందుని బృందావనానికి సాగనంపాడు. నందుడు పోలేక పోలేక వ్రేపల్లెకు వెళ్ళాడు. అనంతరం వసుదేవుడు బలరామ కృష్ణులకు ఉపనయనాది సంస్కారాలు నిర్వహించాడు. అనంతరమా అన్నదమ్ములు సమస్త విద్యలూ నేర్వటానికై గురువును అన్వేషిస్తూ కాశీ పట్టణానికి వెళ్ళారు. అక్కడ సాంధీపని అను పండితోత్తముని వద్ద విద్యార్థులై సకలవిద్యలు నేర్చుకున్నారు. అంతట గురుదక్షిణగా గురువుగారి కోరికపై ఆయన కుమారుడు సముద్రంలో స్నానం చేస్తూ మరణించాడు అని తెలిసికొని యమధర్మరాజు వద్దకు వెళ్ళి తమ గురుపుత్రుని తెచ్చి ఇచ్చారు. అటు పిమ్మట బలరామకృష్ణులు మధురకు చేరి, వ్రేపల్లెలో తమనే తలచుకుంటూ, భక్తితోనూ, ప్రేమతోనూ నిండియున్న గోపకాంతల చెంతకు, యశోదా నందులకు తమ సందేశాన్ని ఉద్ధవుని ద్వారా ఆతనికి చెప్పి పంపించారు. అంత ఉద్ధవుడు నందవ్రజం చేరి శ్రీకృష్ణుని మాటలను, ఆయన సందేశాన్ని యశోదా నందులకు, గోపకాంతలకు వేరువేరుగా వినిపించాడు.

**5) ప్రశ్న :** ఉద్ధవుడు నంద వ్రజంలో శ్రీకృష్ణుని ఆనతిమేరకు వ్యవహరించే క్రమంలో, అచటి గోపికలు తమ హృదయాలలోని కృష్ణభక్తిని ఉద్ధవునకు ఎలా తెలిపారు?

**జవాబు :** ఉద్ధవుడు నంద వ్రజంలో యశోదానందులతో శ్రీకృష్ణుడు త్వరలో ఇక్కడకు వస్తాడు. మిమ్ములను దర్శించుకుంటాడు అనిచెప్పి వారికి ఊరట కలిగించి ఆ రాత్రి నందుని ఇంట గడిపి, వేకువనే పెరుగు చిలికే చప్పుళ్ళకు నిద్రలేచి, నిత్యానుష్ఠాన కార్యక్రమములను పూర్తిచేసుకొని, ఒక ఏకాంత స్థలంలో ఉన్నాడు. అక్కడికి గోప కాంతలు వచ్చి ఉద్ధవా! నీవు శ్రీకృష్ణుని చెలికాడవు.

ఆయన క్షేమం తల్లిదండ్రులకు తెలుపగోరి నిన్నిక్కడకు పంపగా నీవు వచ్చావు. మరి అంతకంటే ఈ వ్రేపల్లెలో ఆయన సందేశాన్ని వినిపింప తగిన వారెవరున్నారు? అని ఒక గోపిక అంటూండగా, ఇంకొక ముదిత విధివశాన తన సమీపంలో మధుర ఘీంకారము చేస్తున్న గండు తుమ్మెదను చూచి, ఉద్ధవుడు వినునట్లుగా, ఓ మధుపమా! నీవు మా పాదాలు స్పృశించవద్దు. మధురాపురకాంతల స్తన కుంకుమ అంటుకొన్న మా ప్రాణవల్లభుని పుష్ప మాలికలలోని మకరందం గ్రోలి ఆ కుంకుమచేత ఎర్రబడిన ముఖము గలదానవు గదా! నీవు మమ్ము విరహాన బారదోచి, పౌరాంగనల శోభన గృహాలలో నిత్యము కులుకుతున్న నిన్ను అతడు మన్నించు నేమోకాని మేము మాత్రం మన్నించము అని ఆ భ్రమరాన్ని శ్రీకృష్ణుని రాయబారిగా ఎంచి ఒకరు మార్చి ఒకరు తమ విరహవేదనను తెలుపుకున్నారు. శ్రీకృష్ణ విరహవేదనతో ఉన్న గోపికలు, తమకు శ్రీకృష్ణునునకు కలిగిన ఎడబాటును ఉద్ధవునితో చెప్పుకుని ఇంతసేపు శోకించారు. అప్పుడు ఉద్ధవుడు చెప్పిన శ్రీకృష్ణ సందేశం విని వారంతా విరహవేదనలు విడిచి అతణ్ణి పూజించారు. ఇలా శ్రీకృష్ణలీలలు వర్ణిస్తూ ఉద్ధవుడు కొన్ని మాసాలు వ్రేపల్లెలో గడిపాడు. పిదప నందాది యదు పుంగవులను వీడ్కొని రథమెక్కి మధురకు బయలుదేరి వెళ్ళాడు.

**డెబ్బై రెండవ అధ్యాయము - దశమ స్కంధము**

**జవాబులు :** 1.3. బలరామునితో 2.4. దైవయోగం కారణంగా
3. ఉగ్రసేనుడిని

* * *

# డెబ్బై మూడవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుడు కుబ్జను అనుగ్రహించడం 2. శ్రీకృష్ణుడక్రూరుని హస్తినకు పంపడం 3. అక్రూరుడు ధృతరాష్ట్రునితో హితోపదేశంగా సంభాషించడం**

**1) ప్రశ్న :** శ్రీకృష్ణుడు పూర్వం తనను తన ఇంటికి ఆహ్వానించిన కుబ్జ లతాంగిని తరింపజేయ నెంచి, ఉద్దవునితో కూడి కుబ్జ ఇంటికి వెళ్ళాడు. ఆ అవకాశాన్ని ఉపయోగించుకొని కుబ్జ మాధవుని ఏమి వరం కోరుకొన్నది?

**జవాబు :** 1. మోక్షాన్ని 2. సకల సంపదలను 3. సంతానాన్ని 4. పాదసేవా భాగ్యాన్ని

**2) ప్రశ్న :** శ్రీకృష్ణుడు హస్తినాపురికి అక్రూరుని పంపనెంచినవాడై బలరామునితో, ఉద్దవునితో కలిసి అతని ఇంటికి వెళ్ళాడు. అక్రూరుడు వారిని పూజించి, ఆర్యులారా! మీ శౌర్యం చేత కంసునీ, వాని అనుయాయులను సంహరించారు. మీ వలన ఇంకనూ ఎవరు ఉద్ధరింపబడనున్నారని అక్రూరుడు తెలిపాడు?

**జవాబు :** 1. యాదవకులం 2. సూర్యవంశం 3. హస్తినాపురవాసులు 4. కంసానుచరులు

**3) ప్రశ్న :** శ్రీకృష్ణుని పంపున అక్రూరుడు హస్తినాపురం వెళ్ళాడు. అక్కడ తాను విదురునితో గూడి కుంతీదేవిని దర్శించాడు. ఆమె చెప్పిన మాటలు విన్నాడు. అటు పిమ్మట అక్రూరుడు ఎవరిని కలిసి వెళ్ళాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** అక్రూరుడు శ్రీకృష్ణుని ఆనతి చొప్పున హస్తినకు వెళ్ళి అక్కడ ఏరీతిగా వ్యవహరించాడు?

**జవాబు :** పాండురాజు చనిపోగా తల్లియగు కుంతీదేవితో పాటు పాండవులు ధృతారాష్ట్రుని ఆజ్ఞచే విచ్చేసి హస్తినలోనే ఉన్నారు. ఆ అంబికేయుడు దుర్యోధనాదులైన తన కొడుకు యందలి వ్యామోహముతో, కురుపాండవుల యందు సమబుద్ధి కలిగి ఉండుటలేదు. మనకు వారును వీరును బంధువులే

గనుక, ఇరుపక్షాల వారికి మేలు చేకూర్చి వారూ వీరు సంతోషించేటట్లు, హస్తినలో ఉన్న దుస్థితిని నివారించుటకై తనను పంపిన, శ్రీకృష్ణుని మాటలు జ్ఞప్తి యందుంచుకొని అక్రూరుడు, హస్తినలో కొన్ని రోజులుండి అక్కడ వారి వారి తీరు తెన్నులను గమనించ గలిగాడు. ఒకనాడు విదురునితో కూడి పాండవులను, కుంతీదేవిని చూసి సత్కారాలు పొందాడు. అప్పుడు కుంతి అక్రూరునితో అన్నా! తల్లిదండ్రులూ, చెల్లెండ్రు, అల్లుళ్ళు, మా తమ్ములు నిన్నిక్కడకు పంపేవేళ నీతో ఏమి చెప్పారు? మా దుఃఖాలు వారు ఆలోచిస్తున్నారా? వారందరూ సుఖంగా ఉన్నారా? నేనిక్కడ దుర్బుద్ధులగు కౌరవుల నడుమ తోడేళ్ళ గుంపులో ఆడుజింక ఉన్న విధంగా ఉన్నాను. బలరామ కృష్ణులు ఎన్నడైనా ఈ మేనత్త బిడ్డల క్షేమము తలంతురా? భక్తవత్సలుడైన శ్రీకృష్ణుడుండగా మేము దుఃఖములచే కృశింప వలసివచ్చింది. ఆ పుండరీకాక్షుడు ఈ భూమిని సమభాగాలుగా భాగించి న్యాయ ప్రకారం నా బిడ్డల కిప్పించునా? అని పలికి శ్రీకృష్ణుని స్మరించి, నన్ను కాపాడమని దుఃఖిస్తున్న కుంతీదేవిని విదురుడు, అక్రూరుడూ దుఃఖోపశమన వాక్యాలతో, ఇంపైన మాటలతో ఆమెకు దుఃఖశాంతిని కలిగించారు. ఈ రీతిగా అక్రూరుడు హస్తినలో జరిగే సందర్భాలను తెలిసి కొంటున్నాడు.

**5) ప్రశ్న :** ధృతరాష్ట్రునితో అక్రూరుడు ఏవిధంగా సంభాషించాడు?

**జవాబు :** హస్తినాపురంలో అక్రూరుడు బంధుమిత్రుల నడుమ సుఖాసీనుడై ఉన్న ధృతరాష్ట్రునిచేరి, ధృతరాష్ట్ర మహారాజా! నీ తమ్ముడగు పాండుభూపతి మరణానంతరం నీవు ఈ రాజ్యాన్ని ఏలుతూ, ధర్మబుద్ధితో కాపాడుతూ ఉన్నావు. ఆ విధంగానే పాండవులను సమదృష్టితో చూచుకొందువేని నీకు శ్రేయస్సు, యశస్సు, క్షేమం కలుగుతాయి. ఇందుకు వ్యతిరేకంగా వర్తిస్తే దుర్గతి కలుగుతుంది. ఏ ఒక్కనికీ ఈలోకమందు మరియొకనితో ఉనికి శాశ్వతం కాదు. మరి పుత్రకళత్ర గృహాదుల వల్ల ఒరుగున దేమున్నది? తండ్రి సంపాదించిన ధనమంతయూ అతని పుత్రులు అనుభవిస్తారు. అటుపై తండ్రి చచ్చినా, బ్రతికినా అతని విషయం పట్టించుకోరు. ఓ రాజా! నీవు అధర్మపరుడవై

గడించిన విత్తమెల్ల దుర్బుద్ధులైన నీ కొడుకులు గైకొనగా భువి యందును, దివి యందునూ నీవు నిందలు పొందుతావు. నీవు పుట్టంధుడవు కావున జ్ఞాననేత్రుడవై సంశయము మాని పాండవులకు వారి భూభాగం ఇచ్చివేయి అని పలికిన అక్రూరునితో ధృతరాష్ట్రుడు అక్రూరా! నీవు పల్కిన మాట నిజమైనది. మంగళకరమైనది. కాని తానెంత వివేక వంతుడైనను పరమేశ్వర సంకల్పము నెవడు తప్పించగలడు? పరమ పురుషుడగు శ్రీకృష్ణునకు వందనములు అర్పిస్తున్నాను. ఆ మహామహుని దివ్య చిత్తమున నెట్లున్నదో అట్లే జరుగగలదు అని అక్రూరుని వీడ్కొలిపాడు. అప్పుడు అక్రూరుడు మహారాజా! నీ అభిప్రాయాన్ని గ్రహించాను. నీకేది ఇష్టమో అట్లే కావింపుమని పలికి హస్తినాపురమునుండి మరలి మధురకు చేరి ధృతరాష్ట్రుని చందమంతయు శ్రీకృష్ణ బలరాములకు తెలిపాడు.

**డెబ్బై మూడవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 4. పాదసేవా భాగ్యాన్ని 2. 1. యాదవకులం
3. ధృతరాష్ట్రుని

* * *

## డెబ్బై నాల్గవ అధ్యాయము - దశమ స్కంధము

**1. మధురాపురంపై జరాసంధుని దండయాత్ర 2. కాలయవనుడు మధురాపురాన్ని ముట్టడించడం 3. ద్వారకా నిర్మాణం**

**1) ప్రశ్న :** కంసుని మరణానంతరము ఆతని భార్యలైన అస్తి, ప్రాస్తి అనువారు దుఃఖిస్తూ తమ తండ్రి వద్దకు వెళ్ళి జరిగిందంతా చెప్పుకొన్నారు. కాగా అస్తి, ప్రాస్తి అనువారి తండ్రి ఎవరు?

**జవాబు :** 1. కాలయవనుడు 2. జరాసంధుడు
3. శిశుపాలుడు 4. బాణాసురుడు

**2) ప్రశ్న :** తన అల్లుడైన కంసుని శ్రీకృష్ణుడు సంహరించాడని తన కుమార్తెల ద్వారా విని జరాసంధుడు, మధురపైకి యుద్ధాన్ని ప్రకటించాడు. అపారమైన సైన్యంతో బయలుదేరి జరాసంధుడు మధురానగరాన్ని చుట్టూ ముట్టడించిన సైన్యం మొత్తం ఎన్ని అక్షౌహిణులుగా ఉన్నది?

**జవాబు :** 1. ఇరువదిమూడు అక్షౌహిణులు 2. పద్దెనిమిది అక్షౌహిణులు
3. ఏడు అక్షౌహిణులు 4. పదనొకండు అక్షౌహిణులు

**3) ప్రశ్న :** తన అల్లుని చంపిన కృష్ణుని పైకి జరాసంధుడు, అపారసైన్యంతో యుద్ధానికి వచ్చాడు. అప్పుడు బలరామ కృష్ణులు మగధవీరులను జయించడానికే నిశ్చయించుకొని కృష్ణుడు శంఖాన్ని పూరించాడు. ఆ శంఖం పేరేమి?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** కాలయవనుడు ఏ కారణంగా మధురపై దండయాత్ర చేశాడు?

**జవాబు :** బలరామ కృష్ణులు జరాసంధుని పరాభూతుని చేసి, ఉగ్రసేన మహారాజుతో జరిగినదంతా చెప్పి సంతోషంగా ఉన్నారు. జరాసంధుడు తరువాత పదిహేడుసార్లు పదినేడు అక్షౌహిణీ సేనతో దండెత్తాడు. తడవ తడవకూ తన బలాలన్నీ నశించిపోగా పద్దెనిమిదవసారి కూడా కదనానికి సిద్ధపడి వచ్చాడు. అప్పుడు నారదుడు కాలయవనుడి వద్దకు వెళ్ళి నీవు

ఎందరో రాజులను జయించి కూడా యాదవులను ఎందుకు జయించలేకున్నావు. యాదవులలో ఒక్కడు బలాధిక్యంతో జరాసంధుడు మున్నగు వారిని తొలగగొట్టి ఎదురులేని వాడయ్యాడు. ఆతని పరాక్రమాలు నీవు వినలేదా? అన్నాడు. అంత కాలయవనుడు అడిగిన మీదట శ్రీకృష్ణుని గురించిన అన్ని విషయాలు తెలిపాడు. అప్పుడు కాలయవనుడు మునిపుంగవా! యాదవుడనగా ఎంతవాడు? ప్రళయకాల యముడైనప్పటికి నన్నెదిరించి నిలువలేడు. నా బాహువుల నుండి వెలువడే నిశితాస్త్ర శరపరంపరలు జనింపజేసే అగ్నిజ్వాలలలో అతణ్ణి బూడిద చేస్తాను అని వీరోక్తులాడి కాలయవనుడు మూడుకోట్ల మ్లేచ్ఛవీరులను కూర్చుకొని మధురా నగరాన్ని ముట్టడించాడు. ఈ విధంగా నారదుడు చెప్పిన మాటల కారణంగా ఆ యవనుడు మధురపైకి దండయాత్ర చేశాడు.

**5) ప్రశ్న :** సముద్రంలో ద్వారకానగరాన్ని శ్రీకృష్ణుడు విశ్వకర్మచేత ఎందుకు నిర్మింపజేశాడు? ఆ నగరం ఏఏ సౌకర్యాలను కలిగిఉంది?

**జవాబు :** మధురా నగరాన్ని ఒకవైపు కాలయవనుడు ముట్టడించాడు. నేడో, రేపో జరాసంధుడు దాడి చేయుటకు సిద్ధంగా ఉన్నాడు. వారిరువురు రెండువైపులా పోరాడుతారు. మనం మన శక్తికొలది ఒకవైపు పోరాడుతుంటే రెండవవైపున దాడి చేయువారు మన పట్టణాన్ని ముట్టడించి మన బంధువు లందరికి చెడుపు చేయవచ్చు. కాబట్టి వైరులు దండి విడియుటకు, పోరుసల్పుటకు గాని వీలుగాని విషమ ప్రదేశంలో ఒక దుర్గం నిర్మించి అందులో మన వారందరినీ ఉంచాలి అని కృష్ణుడు ఆలోచించి సముద్రుణ్ణి అడిగి సాగర మధ్యంలో పండ్రెండు ఆమడల పొడవు, అంతే వెడల్పు కలిగిన దుర్గమ ప్రదేశాన్ని సంపాదించాడు. దాని మధ్య సర్వజనులకు అచ్చెరువు కూర్చునట్టి ఒక పట్టణం నిర్మించుమని దేవశిల్పి అయిన విశ్వకర్మను ఆజ్ఞాపించాడు. శ్రీకృష్ణుని ఆదేశం మేరకు విశ్వకర్మ సముద్ర మధ్యంలో ఒక పురాన్ని నిర్మింపజేశాడు. ఆ నగరం చుట్టు లోతైన కందకం, ఉన్నతమైన కోటలు చక్కని ద్వారాలతో, తలుపులతో, గోడలతో, స్తంభాలతో, గడియలతో, గడపలతో, వీధి అరుగులతో, కిటికీలతో ముంగిళ్ళతో, చావళ్ళతో,

పానీయశాలలతో కూడిన సౌధాలు, కోట బురుజులు, ప్రాకారాలు, మేడలు, రాజమార్గాలు, సోపాలు, హేమరత్న మయాలై శోభా సమృద్ధితో సొంపారుతున్నాయి. ఈ విధంగా విశ్వకర్మచే నిర్మించబడిన ద్వారకా పట్టణానికి శ్రీకృష్ణుడు తన యోగ మహిమచేత మధురానగర ప్రజలందరినీ చేర్చి బలభద్రునకు తెలిపాడు.

**డెబ్బై నాల్గవ అధ్యాయము - దశమ స్కంధము**

**జవాబులు :** 1. 2. జరాసంధుడు 2. 1. ఇరువది మూడు అక్షౌహిణులు
3. పాంచజన్యం

* * *

## డెబ్బై ఐదవ అధ్యాయము - దశమ స్కంధము

**1. ముచుకుందుని తీక్షణమైన చూపులతో కాలయవనుడు బూడిద కావడం**
**2. ముచుకుందుని పూర్వ కథ 3. ముచుకుందుడు శ్రీకృష్ణుని స్తుతించడం**

**1) ప్రశ్న :** కాలయవనుడు మధురా నగరాన్ని ముట్టడించి కొన్ని రోజులైనా ఒక్కడు కూడా వెలుపలికి రాలేదు. ఒకరోజు కృష్ణుడు ఆయుధం ధరించకుండా మధుర నుండి ఏ దిశగా వెలుపలికి వచ్చాడు?

| **జవాబు :** | 1. ఉత్తరం | 2. తూర్పు |
|---|---|---|
| | 3. దక్షిణం | 4. పడమర |

**2) ప్రశ్న :** శ్రీకృష్ణుని తేరిపారజూచిన కాలయవనుడు వీడు ఆ నారదుడు సూచించిన శూరుడు కావచ్చును అని భావించి మూర్ఖుడైన ఆ యవనుడు కావరంతో లోక రక్షకుడైన కృష్ణుని పట్టుకోవడానికి ప్రయత్నించాడు. ఆ సమయంలో కాలయవనుడు ఏ వాహనాన్ని అధిరోహించి ఉన్నాడు?

| **జవాబు :** | 1. అశ్వం | 2. ఏనుగు |
|---|---|---|
| | 3. రథం | 4. గాడిద |

**3) ప్రశ్న :** తనను పట్టడానికి కాలయవనుడు రాగా కృష్ణుడు వానికి పట్టుబడకుండా దిక్కులదిరేటట్లు పరుగెత్తాడు. అప్పుడా పురుషోత్తముడు తొందరపడకు రమ్ము, రమ్ము అని వానికి చిక్కినట్లుగానే పరుగెడుతూ చిక్కకుండా ఆ యవనుని ఎక్కడికి తీసికొని వెళ్ళాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** కాలయవనుని శ్రీకృష్ణుడు ఏవిధంగా అంత మొందించాడు? కాగా ముచుకుందుడు ఎవరు?

**జవాబు :** కృష్ణుడు ఇదిగో దొరికాడు, అదిగో పట్టుకుంటాను అని ఆశకు లోబడి ఆయుధు శ్రేష్ఠుని అడుగు జాడలలో కాలయవనుడు తాను కూడా ఒక కొండ గుహలో ప్రవేశించాడు. నీవు ఎవరికీ చిక్కవని నారదుడు చెప్పాడు.

కానీ నీవు ఇప్పుడు నాకు చిక్కావు అని యవనుడు ఆ గుహలో నిద్రిస్తున్న పురుషుని ఈతడే కృష్ణుడనుకొని కర్కశమైన తనకాలితో ఒకతన్ను తన్నాడు. ఆ కాలి దెబ్బకు పర్వతగుహ ప్రతిధ్వనించింది. అంతట నిద్రిస్తున్న పురుషుడు లేచి ఒడలు విరుచుకొని, పద్మాలవంటి కన్నులు విచ్చి, కోపంతో నలువైపుల చూచాడు. ఆ తీక్షణమైన చూపుతో కాలయవనుడు కాలి బూడిద అయ్యాడు. ఒక్క క్షణంలో యవనుని భస్మము గావించిన మహాపురుషుడు ముచుకుందుడు. ఈయన ఇక్ష్వాకు వంశంలో జన్మించిన మాంధాత యొక్క కుమారుడు. అతడు రాక్షసులకు భయపడిన దేవతలను బహుకాలం సంరక్షించాడు. దేవలోకాన్ని కాపాడిన ఆ రాకుమారుణ్ణి మెచ్చుకొని వేల్పులు అతనిని వరం కోరుకోమనగా మోక్షాన్ని కోరాడు. మోక్షమివ్వడానికి భగవంతుడు నారాయణుడు తప్ప మాకెవ్వరికీ అధికారము లేదు. అనగా ఆ రాకుమారుడు వేల్పులను నిద్రను కోరాడు. దేవతలు ఇచ్చిన నిద్రకు లోబడి ఇంత కాలము కొండగుహలో పవళించి ఉన్నాడు. కాలయవనుడు భస్మమైన పిదప శ్రీకృష్ణుడు ముచుకుందుని ఎదుట సాక్షాత్కరించాడు.

**5) ప్రశ్న :** పరమాత్ముడైన శ్రీకృష్ణుని ముచుకుందుడు ఏ తెరగున కీర్తించాడు?

**జవాబు :** తన ఎదుట సాక్షాత్కరించిన పరమ పురుషునికి నమస్కరించి మహాత్మా! నీవు ఎవరు? నీకు ఇష్టమైతేనే చెప్పు. నేను ఇక్ష్వాకు వంశజుడైన మాందాత పుత్రుడను. దేవతల అనుగ్రహంచే బహుకాలం నిద్రలో ఉన్న కారణంగా ఇంద్రియ వ్యాపారాలు మరచి ఉన్నాను. నేను నిద్రిస్తుండగా ఎవడో ఒకడు వచ్చి నాకు నిద్రాభంగము కలిగించాడు. ఆ దుర్మార్గుడు తన పాపంవల్ల భస్మమైనాడు. పిదప నారాయణ స్వరూపుడవైన నిన్ను దర్శించాను. అనగా కృష్ణుడు తన అవతార ప్రాధాన్యతను గురించి తెలిపి నీవు పూర్వం నన్ను ఆరాధించావు. ఆ కారణాన నిన్ను అనుగ్రహించడానికై ఈ గుహకు వచ్చాను. నీకిష్టమైన వరాలు అడుగు ఇస్తాను అన్నాడు. అంత ముచుకుందుడు నంద పుత్రునికి నమస్కరించి, ఈతడు సాక్షాత్తు నారాయణుడని తెలిసికొని దేవా! ఉన్నత పీఠం అధివసించిన చక్రవర్తి అయినప్పటికీ, సుందరీమణుల

మందిరాలలో కామసుఖాలు అనుభవిస్తాడే కాని నిన్ను అన్వేషింపడు. ఈశ్వరా! జ్ఞానహీనుడు మనస్సును బంధించి, గొప్ప భోగాలను విడనాడి ఇంద్రియ లోపాలను అణచివేసి, తపస్సుచేసి ఇంద్రపదవి నభిలషిస్తాడే కాని నీ అమృత స్థానాన్ని కోరడు. అచ్యుతా! విజ్ఞుడైన వాడు ముక్తిదాయకుడవైన నిన్ను సేవించి, తనకు ప్రతి బంధకాలైన విషయ భోగాలను వాంచింపడు. కావున కృష్ణా! నాకు నీ పాదసేవనం తప్ప తక్కిన వేమియూ వద్దు. ఆపన్నుడనైన నన్ను మన్నించి కాపాడు మంటూ వేడుకొన్న, ముచుకుందునితో స్వామి ఓ రాజోత్తమా! నీవు పూర్వం క్షాత్ర ధర్మం అవలంభించి, వేట మొదలైన వేడుకలతో జంతువులను సంహరించావు. కనుక తపస్సుచే ఆ పాపం బాపుకో, మరుసటి జన్మలో విప్రుడవై ప్రాణులపై మైత్రి కలిగి నన్ను పొందగలవు అని నారాయణుడు ఆ ముచుకుందునికి వీడ్కోలిచ్చాడు. ముచుకుందుడు శ్రీకృష్ణ స్వామికి నమస్కరించి గుహనుండి వెలుపలికి వచ్చి బదరికాశ్రమాన్ని చేరి అచ్యుతుని ఆరాధింపసాగాడు.

**డెబ్బై ఐదవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1.2. తూర్పు 2. 1. అశ్వం

3. ఒక కొండగుహలోకి

* * *

## డెబ్బై ఆరవ అధ్యాయము - దశమ స్కంధము

**1. జరాసంధుడు ప్రప్రశవర్షణగిరిని దహించడం 2. రుక్మిణీ కల్యాణ కథా ప్రారంభం 3. శ్రీకృష్ణుడు కుండిన నగరానికి రథారూఢుడై వెళ్ళడం**

**1) ప్రశ్న :** ముచుకుందుని అనుగ్రహించి, మ్లేచ్ఛులను సంహరించి, మధురానగరంలో ఉండే సిరి సంపదలను ద్వారకాపురికి తరలించే సమయంలో అనేక అక్షౌహిణీ సైన్యంతో మధురపైకి దండెత్తి వచ్చిన రాక్షసరాజు ఎవరు?

**జవాబు :** 1. శిశుపాలుడు 2. రుక్మి
3. జరాసంధుడు 4. సాళ్వుడు

**2) ప్రశ్న :** మధుర పైకి యుద్ధానికి వచ్చిన జరాసంధునితో యుద్ధానికి తలపడకుండా బలరామ కృష్ణులు కేవలం సామాన్య మానవులవలె, రణభీరువుల మాదిరి జంకి పోయినట్లుగా వెళ్ళి వెళ్ళి ఒక పర్వతం ఎక్కారు. జరాసంధుడు ఆ పర్వతం చుట్టూ దండు విడిచాడు. బలరామ కృష్ణులు ఎక్కిన ఆ పర్వతం పేరేమిటి?

**జవాబు :** 1. వింధ్యపర్వతం 2. మైనాక పర్వతం
3. గుహ్యాద్రి 4. ప్రప్రశవణగిరి

**3) ప్రశ్న :** జరాసంధుడు బలరామ కృష్ణులు ఎక్కిన పర్వతానికి చుట్టూ కట్టెలు పేర్చి దహించివేసి తన బలగాలతో తన రాజ్యానికి తిరిగి వెళ్ళాడు. అటు పిమ్మట బలరామ కృష్ణులు ఆ కొండ ప్రదేశంలో ఎక్కడ నుండి తప్పించుకొని వెళ్ళారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** పరీక్షిన్మహారాజుకు శుకయోగీంద్రుడు రుక్మిణీ కల్యాణ గాథను వివరించే క్రమంలో, రుక్మిణి తనమనసులోని మాటను ఎవరిద్వారా తెలియపరచింది?

**జవాబు :** రుక్మిణీ కల్యాణ గాథను శ్రీ శుకుడు వివరిస్తూ పరీక్షిన్మహారాజా! బ్రహ్మదేవుని ఆజ్ఞ ననుసరించిరైవతుడనే రాజు రేవతి అనే పేరుగల కన్యనుదెచ్చి

బలరామునికిచ్చి వివాహం చేశాడు. అటుపిమ్మట ఓ రాజా! విదర్భదేశానికి కుండిన నగరాన్ని రాజధానిగా చేసుకొని భీష్మక మహారాజు పాలిస్తున్నాడు. ఆ రాజుకు రుక్మి ఆదిగాగల ఐదుగురు కొడుకులు, రుక్మిణి అను ఒక కుమార్తె కలిగారు. రుక్మిణి దినదిన ప్రవర్ధమానమై యుక్తవయసు రాగా, ఆమె తన తండ్రిగారి ఇంటికి వస్తున్న అతిథుల వలన శ్రీకృష్ణుని రూప, యవ్వన, సద్గుణాలను విని, అతడే తనకు తగినవాడని నిర్ణయించు కొన్నది. శ్రీకృష్ణుడు కూడా కన్యామణి యగు రుక్మిణి రూపం, వివేకం, సత్ప్రవర్తన, శుభలక్షణాలు అన్నీ గ్రహించాడు. ఆమెను వివాహమాడాలని నిశ్చయించుకున్నాడు. కానీ రుక్మిణి అన్నగారైన రుక్మి ఛేది దేశాధిపతి శిశుపాలునకిచ్చి పెళ్ళి చేయాలని సంకల్పించాడు. అంతట రుక్మిణి తన అన్న చెడు తలంపు గ్రహించి, తన మేలుగోరే అగ్నిద్యోతనుడనే విప్రుని రావించి, తన అన్న చేసే దుష్కృత్యాన్ని తెలిపి, నీవు ఏవిధంగానైనా ద్వారకకు వెళ్ళి శ్రీకృష్ణునకు నా పరిస్థితిని విన్నవించుమని చెప్పి పంపించింది. అగ్నిద్యోతనుడు ద్వారకా నగరం వెళ్ళి శ్రీకృష్ణుని దర్శించి పెండ్లి కుమారుడవు కమ్మని ఆశీర్వదించాడు. అంతట చక్రధారి పండితోత్తమా మీది ఏ దేశం, ఇచ్చుటకు వచ్చుటకుగల కారణమేమి? అని అడుగగా, ఆ విప్రుడు రుక్మిణీదేవి విషయమంతా చెప్పాడు. కృష్ణా! నీకూ రుక్మిణికీ ఈడూ జోడూ బాగా కుదిరింది. మీ వివాహం తప్పక జరిగి తీరుతుంది. ఆలస్యం చేయక వెంటనే బయలు దేరమని ఆ దేవకీ నందనుని హృదయం కూడా తెలిసికొన్న అగ్నిద్యోతనుడు  తొందరచేశాడు అని శ్రీ శుకుడు రాజుకు చెప్తున్నాడు.

**5) ప్రశ్న :** శుకయోగి పరీక్షిన్మహారాజుతో శ్రీకృష్ణుడు కుండిన నగరానికి రథారూఢుడై ఏవిధంగా బయలుదేరి వచ్చాడని చెప్పాడు?

**జవాబు :** విదర్భ రాకుమారి పంపిన వార్తనూ, ఆమె రూప విశేషాలను ఆ యదుకుల చక్రవర్తి, సావధానంగా ఆలకించాడు. అంతట ఓ భూసురాగ్రణీ! రుక్మిణి మీద నాకునూ అగ్గలమైన కోరిక. రుక్మి మా పెండ్లి కోర్వలేక చెడు తలంపుతో నున్నాడని నాకింతకు మునుపే తెలుసు. నేను విదర్భ దేశానికి

వస్తాను. విరోధులు అడ్డగిస్తే ఆహవంలో వారిని హతమారుస్తాను. రుక్మిణిని చిటికెలో తెస్తాను అన్నాడు. ఇక్కడ ఇలా ఉండగా అక్కడ రుక్మిణీదేవి, తాను పంపిన ద్విజోత్తముడు ద్వారకకు వెళ్లాడో లేదోనని ఆందోళన చెందసాగింది. భీష్మక మహారాజు కుమారుని ఎదిరించలేక వివాహ ప్రయత్నాలు ముమ్మరం చేశాడు. ద్వారకలో కృష్ణుడు కుండిననగర ప్రయాణానికి సిద్ధం కావటానికి, అగ్నిద్యోతనుని అడిగి వివాహ ముహూర్తమెప్పుడో తెలిసికొన్నాడు. ఆ సమయాని కంటే ముందుగా కుండిన నగరానికి వెళ్ళాలని సారథి దారుకునికి తెలిపాడు. దారుకుడు శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వాలాహకమనే అశ్వాలను పూన్చిన రథాన్ని సిద్ధసంకల్పుడై శ్రీకృష్ణుడు అగ్నిద్యోతనునితో పాటు అధిరోహించాడు. ఆ రాత్రి పయనించి ఆ నర్తక దేశాలుదాటి వెన్నుడు విదర్భకు విచ్చేశాడు. నగరమంతా పెండ్లి శోభతో అలంకృతమై ఉంది. పెండ్లికొడుకు శిశుపాలునితో పాటు దేశ, దేశాల రాజులకు భీష్మకుడు విడుదులను ఏర్పాటు చేశాడు. రుక్మిణి ఏకాంత మందిరంలో కూర్చుని లోలోపల ఆందోళన చెందసాగింది. అంతట అగ్నిద్యోతనుడు రుక్మిణీదేవిని సాభిప్రాయంగా చూసి, ఓ బాలామణీ! సుదర్శ నాయుధుడు నీ ఉత్తమగుణాలు మెచ్చుకున్నాడు. ఆయన మన నగరానికి వచ్చియున్నాడు. నీ యదృష్టంనేటికి ఫలించింది తల్లీ! అని పలికి వెళ్ళాడు. రుక్మిణి ఆనంద పరవశురాలైనది.

### డెబ్బై ఆరవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 3. జరాసంధుడు 2. 4. ప్రశ్రవణగిరి
3. ప్రశ్రవణగిరి కొండకొమ్మునుంచి

* * *

## డెబ్బై ఏడవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని అపహరించడం 2. సోదరుని భంగపాటుకు బాధపడుతున్న రుక్మిణీదేవిని బలభద్రుడు ఓదార్చడం 3. రుక్మిణీ శ్రీకృష్ణుల వివాహం**

**1) ప్రశ్న :** కుండిన నగరానికి కృష్ణుడొక్కడే వెళ్ళాడని, బలరాముడు అసంఖ్యాకమైన సైన్యంతో తానుకూడా వచ్చాడు. బలరామ కృష్ణులు తన నగరానికి వచ్చారని తెలిసికొని భీష్మక మహారాజు వారిని పూజించి, సకల సదుపాయాలూ కల్పించాడు. కాగా రుక్మిణీదేవి పెండ్లికుమార్తెయై దేవతా పూజకొరకు ఏ దేవాలయానికి వెళ్ళింది?

**జవాబు :** 1. వినాయకస్వామి ఆలయం 2. విష్ణ్వాలయం
3. కుమారస్వామి ఆలయం 4. గౌరీదేవి ఆలయం

**2) ప్రశ్న :** గౌరీపూజ అయిన పిమ్మట దేవాలయం వెలుపలికి వచ్చిన రుక్మిణీదేవి, ముత్తైదువుల నడుమ నుండి శ్రీకృష్ణుని దర్శించింది. అప్పుడా రుక్మిణీదేవిని పుండరీకాక్షుడు శత్రు రాజులు చూస్తుండగానే రథమెక్కించుకొని, పాంచజన్యాన్ని పూరించాడు. బలరాముడు ససైన్యంగా వెంటరాగా కృష్ణుడు ఏ నగరం వైపు రథాన్ని నడిపాడు?

**జవాబు :** 1. హస్తినాపురం 2. కుండిననగరం
3. ద్వారకానగరం 4. వారణాసినగరం

**3) ప్రశ్న :** శ్రీకృష్ణుడు రుక్మిణీ కన్యారత్నాన్ని రథముపై తీసికొని వెళ్తున్నాడని తెలిసి, శిశుపాల, జరాసంధాది యోధులు వారి వెంటబడ్డారు. బలరాముడు ససైన్యంగా ఎదురు తిరిగాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో అందరూ వెనుదిరిగిపోగా రుక్మిణి అన్నగారైన రుక్మి మాత్రం వదలలేదు. అప్పుడు కృష్ణుడు రుక్మిని పట్టుకొని తలగొరిగి బంధించాడు. ఆ సమయంలో రుక్మి బంధనాలను విప్పి ఆతనిని వెనుకకు పంపించింది ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో వున్నది.

**4) ప్రశ్న :** తన సోదరుని భంగపాటుకు వగచిన రుక్మిణీదేవిని ఎవరు ఏ రీతిగా ఓదార్చారు?

**జవాబు :** మా సరివాడవా మా పాపగొనిపోవయని రుక్మి పలుకుతూ కదనానికి కాలుదువ్వాడు. ఆ నల్లనయ్య ఆతనిని ఎదిరించి విరదుని గావించగా, రుక్మి కత్తిపట్టి వచ్చాడు. కృష్ణుడు ఆతని కత్తిని, కవచాన్ని పొడిచేసి, శిరసు ఖండించ బోయాడు. అప్పుడు రుక్మిణి ప్రాణేశ్వరుని పాదాలు పట్టి తన సోదరుని చంపవద్దని వేడుకొన్నది. అప్పుడు వాసుదేవుడు రుక్మిని ఒక చెంపతల, మీసం గొరిగి అవమానించి బంధించాడు. అంతట బలభద్రుడు వచ్చి రుక్మిని బంధ విముక్తునిగా జేసి పంపించాడు. బలరాముడిలా చేసి రుక్మిణీదేవిని అవలోకించి అమ్మా! అగ్రజుడు అవమానింపబడ్డాడని బాధతో మా కృష్ణుని నిందించవద్దు. గత జన్మలో చేసిన కర్మలను బట్టి జీవులు మంచిచెడ్డలనుభవిస్తుంటారు. నీతో బుట్టినవాడు కర్మశేషంతో ఈనాడిక్కడ ఈవిధమైన పరాభవం పొందాడు. చంపదగిన నేరం అయినప్పటికీ బంధువులను చంపరాదు. క్షమించి విడిచిపెట్టటమే న్యాయం. చంపితే పాపం తప్పదు. ఓ రుక్మిణీ! అజ్ఞానం వలన కలిగే దుఃఖాన్ని విజ్ఞానమనే చూపుతో విడిచిపెట్టు. నీవు మతిమంతురాలవు. అజ్ఞానుల మాదిరి శోకించటం నీకు తగదు అని అనేక విధాల బలరాముడు రుక్మిణీ దేవిని ఓదార్చాడు. అటుపిమ్మట వాసుదేవుడు రాజసంతో రాజలోకాన్ని జయించి, రుక్మిణీదేవితో కూడి విభ్రాజమానమైన తన పట్టణానికి చుట్టాలందరూ స్తుతింపగా వేంచేశాడు.

**5) ప్రశ్న :** శ్రీ శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజుకు రుక్మిణీ కల్యాణ గాధను ఏవిధంగా వివరించాడు?

**జవాబు :** పరీక్షిన్మహారాజుతో శుకయోగి మహారాజా! ద్వారకా నగరంలో యధు వల్లభుని పెండ్లివేడుకలు ప్రారంభమైనాయి. గాత్ర సంగీతాలు, వాద్యగానాలు, నాట్యాలు వేడుకగా జరిగాయి. ఇంటింటా ఆడువారు, మగవారు

అందరూ అలంకారాలు చేసుకున్నారు. వివాహ మహోత్సవానికి ఆహ్వానాలు అందుకొని మిత్రదేశాల రాజులందరూ వచ్చారు. మంగళాచారాలకై ద్వార పార్శ్వాలలో అరటి స్థంభాలు నాటారు. రంగవల్లులు కర్పూర, కుంకుమలతో తీర్చారు. అగరు ధూపాలు వేశారు. పూర్ణకుంభాలు ఉంచారు. వింత వింత పూలతో, మేలుకట్లతో, రత్న తోరణాలతో, గాలికి రెపరెపలాడు జండాలతో ఆ ద్వారకా నగరం విలసిల్లింది. ఒక శుభసమయాన కల్యాణ వేషధారిణీ, రమణీ, శిరోమణీ అయిన రుక్మిణీ దేవిని శ్రీకృష్ణస్వామి పెండ్లాడినాడు. అఖండ తేజో విరాజితులైన ఆ రుక్మిణీ కృష్ణులకు ఆ ద్వారకానగర వాసులు తమ భార్యలతో కలిసి వచ్చి కానుకలు సమర్పించారు. ఈ విధంగా రుక్మిణీ దేవిని పెండ్లాడిన శ్రీకృష్ణుని చూసి పట్టణంలోని ప్రజలందరూ సంతోషంతో విలసిల్లారు అని శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజుకు రుక్మిణీ కల్యాణ గాధను వినిపించాడు.

**డెబ్బై ఏడవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 4. గౌరీదేవి ఆలయం   2. 3 ద్వారకానగరం
3. బలరాముడు

* * *

## డెబ్బై ఎనిమిదవ అధ్యాయము - దశమ స్కంధము

**1. ప్రద్యుమ్న కుమార చరిత్ర 2. శతధన్వుడు సత్రాజిత్తును చంపడం 3. శ్రీకృష్ణుడింద్ర ప్రస్థానానికి వెళ్ళడం**

**1) ప్రశ్న :** పూర్వం పరమేశ్వరుని కంటి మంటలలో కాలిబూడిదైపోయిన మన్మథుడు, ఈశ్వరుణ్ణి తన దేహం కోసం ప్రార్థించి ఆయన అనుగ్రహంతో రుక్మిణీ శ్రీకృష్ణులకు కుమారుడుగా పుట్టాడు. ప్రద్యుమ్నుడుగా పేరు ధరించిన ఈతనిని తల్లి పొత్తిళ్ళలో ఉండగానే ఒక రాక్షసుడు కామరూపంలో వచ్చి అపహరించుకొని వెళ్ళాడు. ఆ రాక్షసుని పేరేమిటి?

**జవాబు :** 1. శంబరాసురుడు 2. బాణాసురుడు
3. శిశుపాలుడు 4. వృత్రాసురుడు

**2) ప్రశ్న :** పొత్తిళ్ళలో ఉన్న బిడ్డను ఎత్తుకొని వెళ్ళిన శంబరాసురుని, ఆ బిడ్డను తాను పెంచుకొనే విధంగా అనుమతి పొందిన రతీదేవికి అక్కడ ఉన్న పేరేమిటి?

**జవాబు :** 1. మాయావతి 2. రతీదేవి
3. ధాత్రేయిక 4. ప్రియంవద

**3) ప్రశ్న :** మాయావతి పెంచుతున్న ప్రద్యుమ్నుడు త్వరలోనే యౌవనవంతుడై, రతీదేవి ద్వారా విషయమంతా తెలిసికొని ఆమెను పెండ్లాడి, శంబరాసురుని జయించి, ద్వారకానగరానికి వచ్చాడు. ఈ విషయమంతా శ్రీకృష్ణాదులకు తెలిపిన మహర్షి ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** పరీక్షిన్మహారాజుతో శుకయోగి శ్రీకృష్ణ, సత్యభామల వివాహాన్ని గురించి ఏవిధంగా తెలిపాడు?

**జవాబు :** సూర్యుని ఉపాసించి సత్రాజిత్తు శమంతకమణిని సంపాదించి, దాని వలన రోజూ ఎనిమిది బారువుల బంగారాన్ని పొందుతున్నాడు. ఆ

మణి ఎక్కడ పూజింపబడుతుందో ఆ దేశం సుభిక్షంగా ఉంటుందని శ్రీకృష్ణుడు సత్రాజిత్తును, మణిని ఉగ్రసేన మహారాజు కివ్వమని అడిగాడు. సత్రాజిత్తు నిరాకరించాడు. ఒకనాడు ఆ మణిని ధరించి సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనజిత్తు అడవికి వేటకు వెళ్ళాడు. సింహ మొకటి ప్రసేనజిత్తును చంపి, దానిని తీసుకొని వెళుతుండగా జాంబవంతుడు ఆ సింహాన్ని చంపి మణిని తీసికొని వెళ్ళాడు. సత్రాజిత్తు తన తమ్ముని కృష్ణుడే చంపి మణిని దొంగిలించాడని నిందించాడు. అంతట కృష్ణుడు అడవికి వెళ్ళి ప్రసేనుడి అడుగు జాడల ఆధారంగా జాంబవంతుని జయించి ఆ మణితోపాటు, జాంబవంతుని కుమార్తె జాంబవతిని పరిణయ మాడాడు. అంతట కృష్ణుడు ఆ శమంతక మణిని తెచ్చి సత్రాజిత్తు కిచ్చాడు. సత్రాజిత్తు సిగ్గుపడి మణిని తీసికొని పశ్చాత్తాపం పొందాడు. ఈ నా పాప పరిహారంగా శమంతకమణిని, నా కుమార్తెయైన సత్యభామనూ ఇచ్చి మాధవుని పాదాలు పట్టుకుంటాను అప్పుడే నాకు నిష్కృతి అని ఆ మణిని, కన్యామణిని శ్రీకృష్ణునకు సమర్పించాడు. కాని వాసుదేవుడు మణిని సత్రాజిత్తునకే ఇచ్చి సత్యభామను స్వీకరించి అంగరంగ వైభవంగా సత్యభామా దేవిని వివాహ మాడాడు అని జాంబవతీ, సత్యభామలతో శ్రీకృష్ణస్వామి యొక్క కల్యాణాన్ని శ్రీశుకులు పరీక్షిన్మహారాజుకు వినిపించాడు.

**5) ప్రశ్న :** శతధన్వుడు సత్రాజిత్తును ఎందుకు సంహరించాడు?. తరువాత శ్రీకృష్ణుడు హస్తినాపురం వెళ్ళి అక్కడ ఏమిచేశాడు?

**జవాబు :** అక్రూరుడూ, కృతవర్మ శతధన్వుడితో దుర్మార్గుడైన సత్రాజిత్తు సత్యభామను నీకిస్తానని చెప్పి శ్రీకృష్ణుని కిచ్చాడు. ఏదో విధంగా నీవు శమంతక మణిని సంగ్రహించుమని ప్రేరేపించారు. అంతట శతధన్వుడు నిద్రిస్తున్న సత్రాజిత్తును పశువును చంపినట్లు చంపి మణిని తీసికొని వెళ్ళాడు. తండ్రి మరణానికి దుఃఖించి, సత్యభామ ఆయన శరీరాన్ని నూనెతొట్టిలో భద్రపరచి వెళ్లి శ్రీకృష్ణునితో చెప్పింది. కృష్ణుడు శతధన్వుని సంహరించాలని నిర్ణయించాడు. అది తెలిసిన శతధన్వుడు, కృతవర్మ, అక్రూరుల సహాయం అర్థించాడు. అంతట వారిరువురు వాసుదేవునికి నమస్కరించే వారమే కాని వైరానికి మేము

రాము అని చెప్పారు. అప్పుడు శతధన్వుడు శమంతక మణిని అక్రూరుని ఇంట ఉంచి తాను పారిపోయాడు. బలరామ కృష్ణులు వెంటబడి మిథిలానగర సమీపాన శతధన్వుని కృష్ణుడు సంహరించాడు. ఆతని వద్ద శమంతకమణిని వెతకి, లేనట్లు నిర్ధారించుకొని శ్రీకృష్ణుడు వెనుదిరిగాడు. బలరాముడు మిథిలా నగరానికి వెళ్ళాడు. శ్రీకృష్ణుడు ద్వారకకు వచ్చి అక్రూరుని పిలిచి నీవద్ద శమంతక మణిని శతధన్వుడు దాచినాడని నాకు తెలుసు అన్నాడు. అప్పుడు అక్రూరుడు వస్త్రంలో దాచి ఉంచిన మణిని శ్రీకృష్ణున కిచ్చాడు. కాని బంధువులందరి సమక్షంలో కృష్ణుడు ఆ మణిని అక్రూరునకే యిచ్చి నీ యింట ఎల్లప్పుడూ యజ్ఞకార్యాలు జరుగుగాక! అన్నాడు. అటుపిమ్మట పాండవులను చూచి రావాలని కృష్ణుడు సాత్యకి మొదలైన యాదవవీరులతో కలిసి హస్తినాపురం వెళ్ళాడు. అక్కడ కొన్ని నెలల పాటు ఉంటూ, ఒకనాడు అర్జునుడూ, తానూ వేటకై వెళ్ళి దాహశాంతికై యమునా నదికి వెళ్ళి అక్కడ శ్రీకృష్ణుని పతిగా కోరి తపస్సు చేస్తున్న సూర్య పుత్రిక కాళిందిని వెంట బెట్టుకొని హస్తినాపురం వచ్చారు. అటు తరువాత ధర్మరాజాదులతో కూడి ద్వారకకు వచ్చి శ్రీకృష్ణుడు అందరి సమక్షంలో వైభవంగా కాళిందిని వివాహమాడాడు.

### డెబ్భై ఎనిమిదవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 1. శంబరాసురుడు  2. 1. మాయావతి

3. నారదమహర్షి

* * *

## డెబ్బై తొమ్మిదవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుడు కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అను వారలను పరిణయమాడటం 2. నరకాసురునిపై యుద్ధానికి సత్యభామా సమేతుడై శ్రీకృష్ణుడు వెళ్ళడం 3. సత్యభామ నరకాసురునితో యుద్ధము చేయడం**

**1) ప్రశ్న :** లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుడు తాను మొత్తం ఎంత మంది రాకుమార్తెలను వివాహ మాడాడు?

**జవాబు :** 1. ఐదుమంది 2. ఎనిమిదిమంది 3. ఆరుగురిని 4. ఏడుగురుని

**2) ప్రశ్న :** భూదేవి ప్రియ పుత్రుడైన నరకాసురుడు దేవమాతయైన అదితీదేవి కుండలాలనూ, వరుణదేవుని ఛత్రాన్ని, దేవతల మణిపర్వతాన్ని అపహరించాడనీ ఇంద్రుడు వాసుదేవునికి విన్నవించాడు. అంత శ్రీకృష్ణుడు నరకాసురుని సంహరించడానికై ఏ వాహనంపై యుద్ధానికి బయలుదేరాడు?

**జవాబు :** 1. అశ్వ వాహనం 2. ఏనుగు వాహనం 3. గరుడ వాహనం 4. రథ వాహనము

**3) ప్రశ్న :** నరకాసుర సంహారానికై గరుడవాహనారూఢుడై బయలుదేరు సమయాన శ్రీకృష్ణుని అష్టభార్యలలో ఒకామె నాథా! నీవు రణరంగంలో విజృంభించి రాక్షస సమూహాలను చెండాడుతూ ఉంటే చూడాలని ఉంది. దయచేసి నన్ను రణరంగానికి తీసికొని వెళ్ళమని ఆ ప్రియురాలు ప్రియునకు ప్రియం కలిగేటట్లుగా పలికిన రాణి పేరేమి?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** కృష్ణుడు కాళిందిని వివాహమాడిన పిమ్మట మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అనువారలను ఏవిధంగా వివాహమాడాడు? పిమ్మట శ్రీకృష్ణుడు ఎంతమందని వివాహమాడాడు?

**జవాబు :** శ్రీకృష్ణుడు కాళిందీదేవిని ద్వారకలో బంధువులందరి సమక్షంలో వివాహమాడిన అనంతరం ఆయన తన మేనత్త రాజాదిదేవి కుమార్తె

మిత్రవిందను స్వయంవరంలో పరాక్రమాన్ని ప్రదర్శించి పెండ్లి చేసుకొన్నాడు. అటు పిమ్మట కోసలదేశాన్నేలే నగ్నజిత్తు అనే రాజు కుమార్తె సత్యను కూడా ఏడు ఆబోతులను తన బాహుబలంతో కట్టడిచేసి నాగ్నజితిని పెండ్లాడాడు. సత్యకు నాగ్నజితి అను పేరు కూడా కలదు. తదుపరి కేకయ దేశాధిపతి శ్రుతకీర్తి కుమార్తె భద్రను ఆమె సోదరులు సంతర్థనాదులు తమ సోదరిని ఎంతో ఇష్టంతో శ్రీకృష్ణునికిచ్చి వివాహం చేశారు. అనంతరం మద్రరాజ కుమార్తె లక్షణ అను కన్యను స్వయంవరం నుండి ఎత్తుకొనివచ్చి ఆమెను కూడా వివాహమాడాడు. ఈ విధంగా శ్రీకృష్ణుడు రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అను ఎనిమిది మంది భార్యలను వివాహమాడాడు. అదేవిధంగా శ్రీకృష్ణ భగవానుడు నరకాసుని వధించి అతనిచే బంధింపబడియున్న వేలకొలది సుందరీమణులకు బంధవిముక్తిని కలిగించి వారిని కూడా వివాహమాడాడు.

**5) ప్రశ్న :** నరకాసుర సంహారం ఏరీతిగా జరిగింది?

**జవాబు :** చంద్రముఖియైన సత్యభామ కోపంతో కనుబొమలు ముడివేసి వీరత్వం మూర్తీభవించినట్లు కనులెఱ్ఱజేసి, వాడియైన బాణాలను ప్రయోగిస్తూ, శత్రువైన నరకాసురుణ్ణి నొప్పిస్తున్నది. అదేసమయంలో అనురాగంతో మందహాసం చేస్తూ, శృంగారాధి దేవతలాగ సరసపు చూపులు శ్రీకృష్ణునిపై ప్రసరింపజేసి మెప్పించింది. అప్పుడు సత్యభామ ప్రయోగించే బాణాల వలన రాక్షస సైన్యం శక్తి కోల్పోయి, యుద్ధంలో వెనుకంజ వేసి నరకుని మరుగు జొచ్చింది. ఆ సమయంలో వాసుదేవుడు సత్యా! రాక్షస సైన్యం యుద్ధరంగం నుండి పారిపోయింది. నిన్ను విజయలక్ష్మి వరించింది. నీ ధైర్యసాహసాలకు మెచ్చుకున్నాను అని ఆమె చేతనున్న ధనస్సు తిరిగి తీసికొన్నాడు. అప్పుడు నరకాసురుడు కృష్ణా! పురుషుల ఎదుట ఒక స్త్రీ పౌరుషం ప్రదర్శిస్తుంటే యుద్ధంమాని మౌనం ప్రదర్శించటం నీకు గొప్పకాదు. రాక్షసవీరులు వీరాధి వీరులు కాబట్టి ఆడువారితో పోరాటానికి ఆరాటపడరు అని పలికిన నరకునితో కృష్ణుడు తొందరపడకు నా చేతి ధనస్సు నుండి వెలవడే బాణ పరంపరతో

నిన్ను చెండాడుతాను అని నరకుని సైన్యంపై శతఘ్ని అనే దివ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. అప్పుడా సైనికులు తీవ్ర వేదనకు గురియైనారు. నరకుడు తన చేతనున్న శక్తి ఆయుధాన్ని గరుత్మంతునిపై ప్రయోగించాడు. కాని దాని వలన వైనతేయుడు ఏమీ చెక్కు చెదరలేదు. అంత నరకుడు శూలాన్ని పట్టుకొని పైకెత్తే లోపుగా శ్రీకృష్ణుడు తన చక్రాయుధం ప్రయోగించగా, అది నరకుని శిరస్సును ఖండించింది. నరకాసురుడు యుద్ధ రంగంలో నేలకూలాడు. ఈ విధంగా నరకాసుర సంహారం జరిగింది.

**డెబ్బై తొమ్మిదవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 2. ఎనిమిది మంది 2. 3. గరుడవాహనం
3. సత్యభామ

* * *

# ఎనభైయవ అధ్యాయము – దశమ స్కంధము

**1. భూదేవి శ్రీకృష్ణుని స్తుతించడం 2. శ్రీకృష్ణుడు దేవలోకానికి వెళ్ళి పారిజాత వృక్షాన్ని తేవడం**

**1) ప్రశ్న :** నరకాసురుడు నేలకొరిగాడు. దేవతలు పూలవాన కురిపించారు. అటు పిమ్మట అదితీదేవి కర్ణ కుండలాలు, వైజయంతీ వనమాల, వరుణుడి వెల్లగొడుగు, గొప్ప రత్నాన్ని వాసుదేవుని వద్దకు తెచ్చి సమర్పించి నమస్కరించి ఆ దేవదేవుని కీర్తించింది ఎవరు?

**జవాబు :** 1. నరకుని కుమారుడు భగదత్తుడు 2. భూదేవి
3. నరకుని భార్య 4. మురాసురుడు

**2) ప్రశ్న :** శరణన్న నరకుని కొడుకు భగదత్తునికి శ్రీకృష్ణుడు అభయమిచ్చి సర్వసంపదలు ప్రసాదించాడు. అనంతరం నరకాసుర సౌధంలో ప్రవేశించాడు. ఆ రాజసౌధంలో నరకుడు ఘోర యుద్ధాలలో రాజులను ఓడించి చెరపట్టి తెచ్చిన గుణవతులైన రాజకన్యలు మొత్తం ఎంత మందిని శ్రీకృష్ణుడు అక్కడ చూశాడు.

**జవాబు :** 1. అరవదివేలమంది 2. వేయిమంది
3. పద్దెనిమిదివేలమంది 4. పదహారువేలమంది

**3) ప్రశ్న :** నరకాసురుని సంహరించి శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై, దేవమాతయైన అదితి కుండలాలను ఆమెకు సమర్పించటానికి దేవలోకం వెళ్ళాడు. అచట అతిథి పూజలన్నీ అయిన పిమ్మట శ్రీకృష్ణుడు దేవలోకం నుండి ఒక దివ్య వృక్షాన్ని తీసుకొని వచ్చాడు వృక్షం పేరేది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** నరకాసురుని సంహరించిన తరువాత భూదేవి శ్రీకృష్ణుని ఏ విధంగా కీర్తించింది.

**జవాబు :** నరకాసురుని శ్రీకృష్ణుడు సంహరించిన పిమ్మట భూదేవి దేవతా సంబంధమైన వస్తువులన్నింటిని తెచ్చి వాసుదేవునికి సమర్పించి, నమస్కరించి భక్తి భావంతో ఆ దేవదేవుని ఈ విధంగా స్తుతించింది. ఓ పరమేశ్వరా! అనంత లీలా విలాసా! మహానుబావా! నీవు అనంత శక్తిమంతుడవు. వసుదేవ సుతుడవు. భక్తులు కోరిన రూపం ధరించువాడవు. ఆదిపురుషుడవు. సర్వ జగత్తుకు కారకుడవు. పుట్టుకలేని వాడవు. బ్రహ్మ పుట్టుకకు కారణమైన వాడవు. అట్టి నీకు నేను నమస్కరిస్తున్నాను. ఓ దేవా! ఈ చరాచర మయమైన సమస్త ప్రపంచం అద్వితీయుడవైన నీయందే ఉద్భవిస్తుంది. భక్తమందారా! ధీనరక్షణా! దయతో ఇటుచూడు. ఈ బాలుడు నరకుని కొడుకు భగదత్తుడు. నిన్ను చూచి భయపడుతున్నాడు. వీడు వేరే దిక్కులేనివాడు. ఆర్థి నొందినవాడు తండ్రిలాగా పరాక్రమవంతుడు కాడు అని విన్నవించుకున్న భూదేవి మాటలు మన్నించి భగదత్తునికి అభయమిచ్చి సర్వసంపదలు ప్రసాదించాడు. రాజధానియైన ప్రాగ్జ్యోతిష నగరంలో భగదత్తునికి పట్టంగట్టాడు.

**5) ప్రశ్న :** నరకుని చెరసాలలో ఉన్న రాజకన్యలను శ్రీకృష్ణుడు ఏరీతిగా వారికి ఆశ్రయం కల్పించాడు? వారిని వివాహమాడిన విధమెట్టిది?

**జవాబు :** శ్రీకృష్ణుడు నరకుని సౌధంలో ప్రవేశించి, నరకుడు అనేక మంది రాజులను ఓడించి వారి స్త్రీలను చెరపట్టి తెచ్చిన రాజకన్యలను పదహారువేల మందిని చూశాడు. ఆ రాజ పుత్రికలు రాక్షస సంహారి సుందరాకారుడూ, సుగుణాకారుడూ, మానినీ మానస చోరుడూ, మనోహరుడు అయిన శ్రీకృష్ణుని మిక్కిలి కుతూహలంతో చూశారు. శ్రీకృష్ణుని సౌందర్యం, చాతుర్యం, గాంభీర్యం మొదలైన సుగుణాలకు ఆకర్షితులై మోహించారు. అతడే తమ ప్రాణవల్లభుడు కావాలని ఎవరికి వారు భావించారు. పాపాత్ముడైన రాక్షసుడు మనలను చెరపట్టాడని ఎప్పుడూ భావించే వాళ్ళం. వాని ధర్మాన ఈ పద్మాక్షుని దర్శించాం. పూర్వజన్మలో ఏపుణ్య ఫలం కారణంగానో ఇంతటి భాగ్యానికి నోచుకున్నాము అని అనేక విధాలుగా అనుకుంటూ ఆ కన్యలు గుంపులుగా కూడి ఆ శ్రీకృష్ణుని ఆలోకించారు. శ్రీకృష్ణుడు నన్ను చూచే నవ్వాడు. నావైపే చూశాడు. నన్నే

కరుణించాడు. నన్నే పెండ్లాడుతాడు అని ఆ రాజకన్యలందరూ తమలో తాము ఎవరికి వారు తలపోశారు. ఈవిధంగా తన ఆదరణకోసం ఉవ్విళ్ళూరుతున్న ఆ కన్యలందరకూ చీరలను, ఆభరణాలను, పూల మాలలను, సుగంధ పూతలను శ్రీకృష్ణుడు పంపించాడు. నరకాసురుని కోశాగారంలోని నానా విధాలైన ధన సంపదలనూ, రథ గజ తురగ పదాతి దళాలనూ ద్వారకకు పంపించాడు. ఈ పదహారువేల మంది రాజకన్యలనూ పల్లకీలలో ఎక్కించి ద్వారకకు పంపించాడు. సత్యా సమేతుడై ద్వారకకు చేరిన కృష్ణుడు పదహారువేల మంది రాజకన్యలకు తగిన గృహోప కరణాలతో పాటు వారికి వేరు వేరు సౌధాలను ఏర్పాటుచేశాడు. ఆ మహానుబావుడు ఒక శుభముహూర్తాన ఈ పదహారు వేల భవనాలలో ఉన్న పదహారువేల రాజకన్యలను, పదహారువేల రూపాలతో, పదహారువేల రీతులతో శోభిస్తూ శాస్త్రోక్తంగా వివాహమాడాడు. ప్రేమ నిండిన చూపులతో, సంభాషణలతో, దానాది క్రియలలో శ్రీకృష్ణుడు ఎక్కువ తక్కువలు లేక వారందరికి అన్ని విధాలుగా కన్పించి ఉత్తమమైన గృహస్థ ధర్మాన్ని పాటిస్తూ ఆనందించాడు. వారిని ఆనందింప జేసాడు.

**ఎనభైయవ అధ్యాయము - దశమ స్కంధము**

**జవాబులు :** 1. 2. భూదేవి 2. 4. పదహారువేలమందిని
3. పారిజాత వృక్షం

* * *

## ఎనభై ఒకటవ అధ్యాయము - దశమ స్కంధము

**1. రుక్మిణీదేవితో శ్రీకృష్ణుని విరసోక్తులు 2. రుక్మిణీదేవి శ్రీకృష్ణుని స్తుతించడం 3. కృష్ణుడు రుక్మిణీదేవిని ఊరడించడం**

**1) ప్రశ్న :** ఒకనాడు మహారాణి అంతఃపురంలో శరత్కాలపు వెన్నెలవలె తెల్లనైన పాన్పుపై జగదీశ్వరుడైన శ్రీకృష్ణుడు సుఖాసీనుడై ఉన్నాడు. ఉద్యానవనం నుంచి పారిజాత సుగంధ పవనాలు వీస్తున్నాయి. ఆ సుందర సుమధుర సమయాన, వింజామరను తీసికొని తన జీవితేశ్వరునికి మెల్లిగా విసరడం మొదలు పెట్టిన రాణిగారు ఎవరు?

**జవాబు :** 1. రుక్మిణి 2. భద్ర
3. జాంబవతి 4. కాళింది

**2) ప్రశ్న :** శ్రీకృష్ణ లాలితయైన రుక్మిణీదేవి, ఆయన వాగమృతధారలకు ఆమె ముఖారవిందం సంతోషంతో వికసించింది. అంతట ఆ రమణీమణి రుక్మిణితో కూడి శ్రీకృష్ణుడు ఎక్కడ విహరించాడు?

**జవాబు :** 1. సముద్ర జలాలలో 2. భవన సౌధాగ్రాలపైన
3. ఉద్యానవనాలలో 4. యమునా సాగర సంగమంలో

**3) ప్రశ్న :** భగవంతుడైన శ్రీకృష్ణుడు ప్రతినిత్యం తన్ను సేవిస్తూ, పట్టపు రాణిననే గర్వంతో ఉన్న రుక్మిణీదేవిని ఆత్మాభిమానం అంతరించే విధంగా కొన్ని మాటలు మాట్లాడాడు. అందుకు ఆ మానవతి అంతులేని ఆవేదనతో బాధపడింది. అంతట శ్రీకృష్ణుడు ఆమెను లాలించి, బుజ్జగించి, వూరడిల్లునట్లుగా చేశాడు. అంతట రుక్మిణీదేవి స్వస్థచిత్తురాలై తనస్థానం ఎక్కడ అని కోరింది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** రుక్మిణీదేవి మానసిక కల్లోల స్థితిని అనుభవించడానికి, శ్రీకృష్ణుడు ఆమెతో ఏరీతిగా మాట్లాడాడు?

**జవాబు :** అంతఃపురంలో రుక్మిణీదేవి, ఆమె సఖులూ సేవిస్తుండగా, శ్రీకృష్ణుడు సుఖాసీనుడై ఉన్నాడు. ఆ సమయంలో చెలికత్తె చేతిలోని వింజామరను తీసికొని తన జీవితేశ్వరునికి మహారాణి మెల్లగా విసరడం ప్రారంభించింది. రూపవతి, వివేకవతీ, సౌందర్యవతీ, సౌభాగ్యవతీ, సద్గుణవతీ అయిన తన ప్రియసఖి రుక్మిణీదేవిని చూచి శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వుతూ చమత్కారంగా ఇలా అన్నాడు. బలంలో, శౌర్యంలో, భోగంలో, కులంలో, రూపంలో, సంపదలో, సద్గుణంలో రాజులందరి కంటే ఆచైద్యుడు ఘనుడు. అటువంటి శిశుపాలునికి నీ తల్లీ తండ్రీ, సోదరుడూ నిన్నిచ్చి వివాహం చేద్దామనుకుంటే ఒప్పుకోక, సముద్ర గర్భంలో తలదాచుకున్న పిరికివాడను నన్నెందుకు నీవు వివాహమాడావు? నా సంబంధం తగినది కాదని గ్రహించలేక పోయావు. తెలియక నన్ను వివాహమాడావు. చాలా పొరపాటు చేశావు. ఇప్పటికైనా మించి పోయింది ఏమీలేదు. నీవు నీకు తగిన రాజేంద్రుని మరెవరినైనా వివాహమాడవచ్చు. గుణహీనులైన వారితో సంబంధం తగదు. సాల్వుడు, జరాసంధుడు, శిశుపాలుడు, మీ సోదరుడు రుక్మి బలగర్వంతో నన్ను ద్వేషంతో చూస్తున్నారు. వారి అహంకారాన్ని అణచడానికి మాత్రమే నిన్ను ఆనాడు తీసికొని వచ్చాను. అంతేగాని కాంతలపట్ల, సంతానంపట్ల, ఐశ్వర్యంపట్ల ఆసక్తి కలిగికాదు. కామమోహాలకు నేను లోనుకాను. అటువంటి మమ్ములను కట్టుకొని ఓ లతాంగీ! ఎందుకు బాధపడతావు? అని శ్రీకృష్ణుడు తనను ప్రతినిత్యం సేవిస్తూ పట్టపురాణిననే గర్వంతో ఉన్న రుక్మిణీదేవి ఆత్మాభిమానం అంతరించే విధంగా పలికాడు. అందుకు ఆ మానవతి ఇంతకు ముందెన్నడూ తన ప్రాణప్రియుని నోట వినని అప్రియమైన మాటలు విని అంతులేని ఆవేదనతో బాధపడింది.

**5) ప్రశ్న :** అమిత ఆవేదనకు గురియైన రుక్మిణీదేవిని శ్రీకృష్ణుడు ఏ విధంగా లాలించి ఊరడించాడు? అటుపిమ్మట ఆమె పరమాత్మను ఏ తెరగున కీర్తించింది?

**జవాబు :** శ్రీకృష్ణుడు రుక్మిణీదేవితో పలికిన అప్రియమైన పలుకులు ఆమెకు చెవులలో సూదులుపెట్టి పొడిచినట్లు బాధ కలిగించాయి. పెద్దపులి గాండ్రింపు

విన్న లేడిలాగా, కీలు తప్పి క్రిందపడిపోయిన బంగారు బొమ్మలాగా నిశ్చేష్టురాలై నేలపై వాలిపోయింది. ఆ విధంగా ఆమె క్రింద పడిపోగా వేదవేద్యుడైన ఆ శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని పట్టుకొన్నాడు. సాధ్వీ శిరోమణియైన ఆమెను లేవనెత్తాడు. శ్రీకృష్ణుడు సంభ్రమంతో ఆమె దేహానికి జారిపోయిన ఆభరణాలన్నింటినీ అలంకరించాడు. తామరరేకుల విసనకర్రతో విసిరాడు. పైటను సరిచేశాడు. ముఖం నిమిరాడు. గట్టిగా కౌగిలించుకొని సేదతీర్చి హృదయానందం కలిగించాడు. అంతట రుక్మిణీదేవి పురుషోత్తముని అందమైన ముఖారవిందాన్ని సిగ్గుతో గూడిన స్నిగ్ధమైన చూపులతో చూస్తూ దేవా! నీవు అనంత తేజోమూర్తివి. జ్ఞానము, సుఖము, బలము, ఐశ్వర్యము మొదలైన సద్గుణాలన్నీ నీలోనే ఉన్నాయి. ఓ సర్వలోకేశ్వరా! సచ్చిదానంద మూర్తీ, పుణ్యపురుషా! నీకు నేను తగినదానను కాను. నామనస్సు నిన్ను వరించింది. ఓ రాజీవలోచనా! రాజసంతో విరాజిల్లే నీ శుభదృష్టితో నిన్ను చేరుకొనేటట్లు చూడడం, నన్ను దయార్ద్ర దృష్టితో చూడడంగానే భావిస్తాను అని తనను కీర్తించిన తన సతీమణిని చూచి సంతోషించాడు. పిమ్మట రుక్మిణీదేవిని ఊరడించి, కృష్ణుడు బేలా! నేను నవ్వులాటకు అన్నమాటలకు నీవెందుకు ఇంత బాధపడుతున్నావు. నీ మనస్సు తెలిసుకోవటం కోసం ఇలా అన్నాను. నిన్నిలా బాధ పెట్టినందుకు నన్ను మన్నించు. నీ సద్గుణాలకు నేనెంతో సంతోషించాను అని ఆమె కోరిన కోరికలు తీర్చాడు.

**ఎనభై ఒకటవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 1. రుక్మిణి 2. 3. ఉద్యానవనాలలో
3. స్వామిపాదాల చెంత

* * *

## ఎనభై రెండవ అధ్యాయము - దశమ స్కంధము

**1. విదేహరాజు రుక్మిని బలరాముడు చంపడం 2. బాణాసురుడు పరమేశ్వరానుగ్రహాన్ని పొందడం 3. బాణాసురుడు అనిరుద్ధుని నాగపాశ బద్ధుని చేయడం**

**1) ప్రశ్న :** విదర్భరాజైన రుక్మి తనకుమార్తెకు స్వయంవరం చాటించగా, అది తెలిసి ప్రద్యుమ్నుడు సంతోషించి తన మేనమామ కుమార్తె స్వయంవరానికి తానుకూడా వెళ్లాడు. అక్కడ చేరిన రాజలోకాన్ని ఎదిరించి ప్రద్యుమ్నుడు రుక్మి కుమార్తెను వివాహమాడాడు. ఆ రాకుమార్తె పేరేమిటి?

**జవాబు :** 1. చారుమతి 2. రుక్మవతి
3. రుక్మలోచన 4. భద్ర

**2) ప్రశ్న :** ధీరుడైన కృతవర్మ కుమారుడు, రుక్మి ఇంకొక కుమార్తెను విహమాడాడు. ఆమె పేరేమిటి?

**జవాబు :** 1. రుక్మలోచన 2. రుక్మవతి
3. చారుమతి 4. భద్ర

**3) ప్రశ్న :** శ్రీకృష్ణుని మనుమడైన అనిరుద్ధుని వివాహాన్ని పురస్కరించుకొని, రుక్మిణీ కృష్ణులు, బలరాముడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు, సాంబుడు మొదలగు యాదవవీరులు విదర్భకు వచ్చారు. రుక్మి మనస్ఫూర్తిగా ఇష్టపడి తన మనుమరాలిని అనిరుద్ధునికిచ్చి వివాహం చేశాడు. రుక్మి మనుమరాలి పేరేమిటి?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** రుక్మి మనుమరాలు పెండ్లి సందర్భంగా కృష్ణాదిగాగల యాదవులందరూ సంతోషంతో విదర్భకు వచ్చారు. కాగా రుక్మిని బలరాముడు ఎందుకు వధింపవలసి వచ్చింది?

**జవాబు :** రుక్మి తన మనుమరాలు రుక్మలోచనను అనిరుద్ధునకిచ్చి మనస్ఫూర్తిగా వివాహం చేశాడు. ఆ వివాహ శుభసందర్భంలో రత్నఖచిత భూషణాలు

అలంకరించుకొని రుక్మిణీ కృష్ణులు, బలరాముడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు, సాంబుడు మున్నగు యాదవులు విదర్భ రాజధానికి వచ్చారు. వివాహం జరిగినన్ని రోజులు ఆనందంగా కాలంగడిపారు. ఒకరోజున యాదవులంతా మహావైభవంతో ఉత్సాహపూరితులై ఉండగా కొందరు భూపాలురు అది చూచి ఓర్వలేక పోయారు. కళింగుడు రుక్మిని చూసి నీకింతకు ముందు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకోవడానికి ఇదే మంచి సమయం బలరామునికి జూదంపై మక్కువ ఎక్కువ. కాని ఆటలో అంతనేర్పరి కాదు. అందువలన నీకే విజయం లభిస్తుంది. ఈ విధంగా నీపగ తీర్చుకోవచ్చు అని కళింగాధీసుడు పురికొల్పగా రుక్మి తనకు జరిగే నష్టాన్ని గమనించకుండా బలరామునితో జూద మాడటానికి సిద్ధమయ్యాడు. బ్రహ్మవ్రాత తప్పించటం ఎవరికీ శక్యంకాదు. అటుపిమ్మట బలరాముడు రుక్మి జూదం ఆడటం ప్రారంభించిన మొదలు ప్రతి ఆటలో రుక్మి విజయం సాధించసాగాడు. పందెం పెంచుకొంటూ పోయారు. ఒకసారి బలరాముడు రుక్మిపై విజయం సాధించాడు. కాని ఆ గెలుపుకు రుక్మి అంగీకరించక ప్రక్కన ఉన్న రాజులను న్యాయం అడిగారు. వారేమి చెప్పలేదు. బలరాముడు మరలా మరో ఆటాడి రుక్మిపై విజయం సాధించాడు. ఈసారి కూడా రుక్మి గెలుపును అంగీకరించ లేదు. సరికదా! జూదంలో ప్రావీణ్యమున్న రాకుమారులతో పశువుల కాపరులు ఆడి గెలువగలరా? అని అహంకారంతో అవహేళనగా నవ్వాడు. అప్పుడు బలరాముడు కోపంతో పళ్ళు పటపట కొరుకుతూ ఒక ఇనుప గుదియను చేతభూని రుక్మినీ, అతనిపక్షం వారినీ చావబాదాడు. అందు రుక్మి అసువులు బాశాడు. ఇదంతా శ్రీకృష్ణుడు చూస్తూనే ఉన్నాడు. అటు తరువాత యాదవ వీరులు వధూవరులను రథమెక్కించుకొని తమ రాజ్యానికి బయలుదేరారు. ఈవిధంగా బలరాముడు రుక్మిని సంహరించటజరిగినది.

**5) ప్రశ్న :** బాణాసురుడు ఎవరు? ఆతనికి శంకరుడు ఏ వరాన్ని అనుగ్రహించాడు? శ్రీకృష్ణుని మనుమడైన అనిరుద్ధుని బాణుడు ఎందుకు నాగపాశబద్ధునిగా చేశాడు?

**జవాబు :** బలిచక్రవర్తి కుమారులలో పెద్దవాడు బాణుడు. శంకరానుగ్రహం వలన అతనికి వేయిచేతులు, అపరిమిత మైన బలసంపద ప్రాప్తించింది. ఒకనాడు బాణాసురుడు ఈశ్వరుని దర్శించి దేవా! నిన్ను ఆశ్రయించిన ఈ భక్తుని కరుణించి నీవు పార్వతీ సహితంగా నా కోట వాకిట రక్షకుడవై యుండి నన్ను రక్షించమనగా, ఆ భక్తవ శంకరుడు తన భక్తుని ప్రార్థన మన్నించి పార్వతీ సహితుడై శోణపురం చేరాడు. ఇలా ఉండగా బాణుని కూతురు ఉషాకన్య తాను స్వప్నంలో అనిరుద్ధునితో సుఖించినట్లు కలగన్నది. తన స్వప్న వృత్తాంతాన్ని తన చెలికత్తె అయిన చిత్రరేఖకు చెప్పింది. ఏ విధంగానైనా నన్ను నా స్వప్న సుందరుని కలపమన్నది. అందుకు చిత్రరేఖ తన నేర్పరి తనంతో చిత్రలేఖనం ద్వారా అనేక మంది రాజుల చిత్ర పటాలను చూపించింది. చివరకు ఆ స్వప్న సుందరుడు అనిరుద్ధుడు అని తెలిసికొని చిత్రరేఖ తనకు తెలిసిన యోగవిద్యా నైపుణ్యంతో అనిరుద్ధుని తెచ్చి ఉషాబాలకు అప్పగించింది. ఉష ఎంతో సంతోషించింది. ఈవిధంగా అనిరుద్ధునకు విషయమంతా చెప్పి అతనితో కొంతకాలం పాటు ఉష్టభోగాలు అనుభవించింది. ఫలితంగా ఆమె గర్భవతి అయింది. విషయం తెలిసికొన్న బాణుడు అనిరుద్ధునిపైకి తన అనుచరులను పంపాడు. వారిని అతడు తేలికగానే చెదరగొట్టాడు. అంతట బాణాసురుడు తానే పూనుకొని శౌర్యక్రోధాలతో అనిరుద్ధునిపైకి దూకి భీకర యుద్ధం చేశాడు. ఈవిధంగా విజృంభించి బాణాసురుడు రూపసంపన్నుడూ, రణసన్నద్ధుడూ అయిన అనిరుద్ధున్ని నాగపాశంతో బంధించాడు. ఇది ఇలా ఉండగా ద్వారకలో నాలుగు నెలలుగా అనిరుద్ధుని జాడ ఎవరికీ తెలియలేదు.

### ఎనభై రెండవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 2. రుక్మవతి 2. 3. చారుమతి
3. రుక్మలోచన

* * *

## ఎనభై మూడవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుడు బాణాసురునిపై దండెత్తడం 2. శివకేశవుల యుద్ధం 3. బాణుడు రెండవసారి యుద్ధానికి రావడం**

**1) ప్రశ్న :** అనిరుద్ధుని అంతర్ధానం జరిగి నాలుగు నెలలైన పిదప శ్రీకృష్ణ, బలరామాది యదువీరులకు అనిరుద్ధుని వృత్తాంత మంతా వారికి తెలిపినది ఎవరు?

**జవాబు :** 1. గూఢచారులు 2. ఉద్ధవుడు
3. సాత్యకి 4. నారదుడు

**2) ప్రశ్న :** అనిరుద్ధుని వృత్తాంతమంతా నారద మహర్షి చెప్పగా వినిన శ్రీకృష్ణుడు ఒక శుభముహూర్తంలో బాణాసురునిపైకి దండయాత్ర చేయడానికి సిద్ధమయ్యాడు. పట్టువస్త్రాలు, అనేక ఆభరణాలు ధరించి, శంఖ, చక్ర గధా యుధాలను ధరించి చతురంగ బలాలను కదిలించాడు. సైభ్య, సుగ్రీవాలాహక, మేఘపుష్పాలనే అశ్వాలను పూన్చిన శ్రీకృష్ణుని రథానికి సారథిఎవరు?

**జవాబు :** 1. సాంబుడు 2. ప్రద్యుమ్నుడు
3. దారుకుడు 4. కృతవర్మ

**3) ప్రశ్న :** బలరాముడు, సాత్యకీ, ప్రద్యుమ్నుడు మొదలైన యదువీరులు మదోన్మత్తులై శత్రువీరులను అణచివేయాలనే ఉత్సాహంతో శ్రీకృష్ణుని అనుసరించి కొన్నాళ్ళు ప్రయాణించి నదులు, సరోవరాలు, ఉద్యానవనాలు దాటి బాణుని కోటను ముట్టడించారు. కాగా యాదవులు ముట్టడించిన నగరము పేరేది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శివకేశవులకు ఏకారణంగా యుద్ధమయింది? ఆ యుద్ధం ఏరీతిగా జరిగింది?

**జవాబు :** బాణునికి ఇచ్చిన వరం కారణంగా పరమశివుడు బాణుని తన కొడుకుల కన్న మిన్నగా అభిమానించాడు. బాణుని పక్షాన యుద్ధం చేయాలనే

కోరికతో ప్రమదులు వెంటరాగా భయంకరమైన శూలాన్ని ధరించి బయలు దేరాడు. పరమేష్ఠి ఇలా బయలుదేరి యుద్ధోత్సాహంతో ప్రతిపక్షంతో తలపడ్డాడు. శ్రీకృష్ణుడు సింహనాదం చేసి శార్‌ఙ్గమనే తన ధనస్సును ఎక్కుపెట్టి బాణవర్షాన్ని కురిపించాడు. యుద్ధ విశారదులైన ప్రమదగణాలూ, భూతపిశాచ, డాకినీ వీరులను దిగ్భ్రమ చెంది పారిపోయేటట్లు చేశాడు. ఇలా బాణ ప్రయోగం చేసి శ్రీకృష్ణుడు విజృంభించటాన్ని సహించలేక పరమేశ్వరుడు నిప్పులుక్రక్కే శరపరంపరను పీతాంబరుని పైకి ప్రయోగించాడు. ఒకరి కొకరు బ్రహ్మాస్త్ర, వాయవ్యాస్త్ర, ఆగ్నేయాస్త్ర, పాతుపతాస్త్ర, నారాయణాస్త్ర, సుదర్శ నాయుధాల నెన్నింటినో ప్రయోగించు కున్నారు. చివరకు పరమేశ్వరుడు నిరుత్సాహం చెందే సమయం కనిపెట్టి శ్రీకృష్ణుడు సమ్మోహనాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్ర ప్రభావం కారణంగా శంకరుడు స్వాధీనం తప్పి నందీశ్వరునిపై వాలిపోయాడు. శూలపాణి స్పృహ తప్పట చూచి చక్రపాణి, ఇతర యాదవ వీరులు విజృంభించారు. ఆ సమయాన బాణుడు ససైన్యంతో శత్రువులను ఎదుర్కొన్నాడు. బాణాసురుడు అయిదు వందల చేతులతో ధనస్సులను పట్టి తక్కిన అయిదు వందల చేతులతో రెండేసి బాణాల చొప్పున సంధించే సమయంలో శ్రీకృష్ణుడు విక్రమించి ఆ ధనుస్సులను ధ్వంసం చేసి, సారథిని సంహరించి, రథాన్ని నుగ్గు గావించాడు. శ్రీకృష్ణుడు పాంచజన్యాన్ని పూరించాడు. ఆయన భయంకర పరాక్రమానికి వెరగుపడి బాణాసురుడు ఏమీ చేయలేక నిశ్చేష్టుడయ్యాడు. ఆ సమయంలో బాణుని తలపాగా వీడిపోగా, భూషణాలు రాలిపోగా యాదవులు పరిహసిస్తుండగా తన పట్టణానికి పారిపోయాడు. అప్పటికి అంతవరకు శివకేశవుల యుద్ధం జరిగింది.

**5) ప్రశ్న :** బాణాసురుడు తన పట్టణానికి పారిపోయిన పిమ్మట మరలా యుద్ధభూమికి వచ్చి ఏరీతిగా యుద్ధం చేశాడు?

**జవాబు :** చిరుగంటల సవ్వడితో, బంగారు ధ్వజ పతాకాలతో, వేగవంతమైన అశ్వాలను పూన్చిన ఉన్నత రథాన్ని అధిరోహించి బాణాసురుడు రెండవసారి యుద్ధ రంగానికి వచ్చాడు. అతని వేయి చేతులలో ధనుర్బాణాలూ,

భయంకరమైన ఖడ్గాది ఆయుధాలు ప్రకాశిస్తున్నాయి. అతడు కదనరంగంలో మధ్యాహ్న మార్తాండునివలె ప్రకాశిస్తూ శత్రువులైన శ్రీకృష్ణాదులను ఎదుర్కొన్నాడు. ఆ బలిపుత్రుడు తన భుజబలం ద్యోతకమవుతుండగా ఒకేసారి వేయి చేతులతో శ్రీకృష్ణునిపై వాడి బాణాలను ప్రయోగించాడు. మురాంతకుడు ఆ బాణవర్షాన్ని లెక్క చేయకుండా మార్గమధ్యంలోనే వాటిని తన అర్ధచంద్రాకార బాణాలతో త్రుంచి వేశాడు. అటు పిమ్మట శ్రీకృష్ణుడు కన్నులెర్రజేసి రోషంతో తన సుదర్శనా యుధాన్ని ప్రయోగించాడు. అది సూర్యమండల శోభతో వెలుగొందుతూ, శత్రువుల గర్వాంధకారాన్ని నివారిస్తూ, సమస్త దేవతల స్తుతులను అందుకుంటూ, బాణాసురుని వేయి చేతులలో నాలుగింటిని మాత్రం వదలి తక్కిన వానిని తోటమాలి అరటి మొదలును నరకివేసినట్లు ధ్వంసం చేసింది. ఈవిధంగా రెండవసారి బాణాసురుడు యుద్ధ భూమికి వచ్చినప్పుడు జరిగింది.

### ఎనభై మూడవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 4. నారదుడు 2. 3. దారుకుడు 3. శోణపురం

* * *

## ఎనభై నాలుగవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శివుడు శ్రీకృష్ణుని స్తుతించడం 2. ఉషానిరుద్ధ సహితుడై శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్ళడం 3. నృగమహారాజు చరిత్ర**

**1) ప్రశ్న :** బాణుని హస్తాలలో నాలుగు తప్ప అన్నింటిని నరికివేసిన కృష్ణుని పరమేశ్వరుడు స్తుతించాడు. ఈశ్వరునకు బాణుడంటే ఎంతోదయ. అందువల్ల ఆయన అతనిని రక్షించటానికి లోకనాయకుడైన శ్రీకృష్ణుని చెంతకు వచ్చి దేనిని పఠించి శ్రీకృష్ణుని స్తుతించాడు?

**జవాబు :** 1. విష్ణు సహస్రనామం 2. పురుషసూక్తం 3. స్త్రీ సూక్తం 4. భగవద్గీత

**2) ప్రశ్న :** శంకరుడు స్తుతించగా శ్రీకృష్ణుడు సంతోషించి పరమేశ్వరా! ఈ బాణుడు సమస్త భూభారాన్ని నా భుజస్కంధాలపై మోయగలనని అహంకరించాడు. కావున వీని భుజబల గర్వాన్ని అణచివేయక తప్పలేదు. కాని శంకరా! ఈ బాణుడు చంపదగిన వాడుకాడు అని తెలిపాడు. కాగా బాణుడు ఎవరి వంశంవాడు కనుక వీడు అవధ్యుడు అని వాసుదేవుడు ఈశ్వరునితో తెలిపాడు?

**జవాబు :** 1. కంసుని 2. రావణుని 3. శిశుపాలుని 4. ప్రహ్లాదుని

**3) ప్రశ్న :** వాసుదేవుడు శంకరునితో శంకరా! ఈ బాణాసురుడు నీ భక్తులలో అగ్రేసరుడుగా స్తుతింపబడుతూ జరామరణాది భయాలు లేకుండా జీవిస్తాడు అని శ్రీకృష్ణుడు అనుగ్రహించగానే పరమేశ్వరుడు పరమానందం పొందాడు. నిరంతర పరమేశ్వర ధ్యానానురక్తుడైన బాణుడు అప్పుడు ఆనందించి ఎవరి పాదాలకు నమస్కరించాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శ్రీకృష్ణ బాణాసురుల యుద్ధం ముగిసిన తరువాత ఉషానిరుద్ధుల కథ ఏమైంది?

**జవాబు :** బాణాసురునికి విజ్ఞాన దీపం ఆవిర్భవించటం వలన భుజబల గర్వం తొలగిపోయింది. గోవిందునికి పాదాభివందనం చేశాడు. అనంతరం బాణుడు తన నగరానికి వెళ్ళి ఉషానిరుద్ధులకు సంతోషంతో వస్త్రా భరణాదుల నిచ్చి, దాసీజనులను తోడిచ్చి బంగారు రథంపై ఎక్కించి మిక్కిలి వైభవంతో తీసికొనివచ్చి కన్యతో పాటుగా అనిరుద్ధుని గోవిందునకు అప్పగించాడు. శ్రీకృష్ణుడు సంతోషించాడు. అంతట హరునివద్ద సెలవు తీసికొని, హరి బాణాసురుని అచటనే నిలిపి, అత్యంత వైభవోపేతంగా పరివార సమేతుడై ఉషానిరుద్ధులను ముందిడుకొని మంగళ వాద్యధ్వనుల నడుమ ద్వారకా నగరానికి బయలు దేరాడు. కొన్నిరోజులు ప్రయాణించి యాదవులు అనునిత్యము సుఖవైభవాలకు భోగ భాగ్యాలకూ నెలవైనదీ, సుజనులకు కాపురమైనదీ అయిన ద్వారకా నగరాన్ని దర్శించారు. అత్యంత సుందరంగా అలంకరింపబడి ఉన్న ఆ ద్వారకా నగరంలో మంగళ వాయిద్యాల నడుమ ఉషా సమేత అనిరుద్ధుడు, శ్రీకృష్ణాదిగాగల యాదవులు ప్రవేశించి ఎవరి మందిరాలకు వారు వెళ్ళారు.

**5) ప్రశ్న :** నృగమహారాజు ఎవరు? ఈయనకు గల శాపమేమిటి? ఏ విధంగా అది పరిహారమైనది?

**జవాబు :** ఒకనాడు ప్రద్యుమ్నాదిగా గల యాదవులు వైభవంగా ఉద్యాన వనానికి వెళ్ళారు. ఒకచోట వారికి ఒక నీరులేని పాడుబడ్డ బావిలో అతిపెద్దదైన ఊసరవెల్లి కనిపించింది. వారు దానిని బయట పడవేయాలని ప్రయత్నించి విఫలులైనారు. విషయం శ్రీకృష్ణునకు తెలిపారు. ఆయన వచ్చి ఆ ఊసరవెల్లిని తన ఎడమ చేతితో ఒక గడ్డి పరకను లాగినట్లు లాగి బయట పడవేశాడు. అప్పుడు ఆ ఊసరవెల్లి ఒక దివ్యపురుషుని రూపం ధరించింది. ఆ పురుషోత్తమునికి నమస్కరించాడు. అంత ఆ దివ్యపురుషుడు శ్రీకృష్ణుని ఆనతి మేరకు తన కథను చెప్పసాగాడు. ఓ విశ్వవేద్యా! నేను ఇక్ష్వాకు పుత్రుడను

నాపేరు నృగుడు. నేను మహారాజుగా కీర్తి సంపదలతో శోభించాను. ఒకసారి నేను దానం చేసిన గోవు తప్పించుకొని మరలా నామందలోకి చేరింది. అది తెలియక ఆ గోవును నేను మరొక బ్రాహ్మణునికి దానం చేశాను. ఆ ఆవును విప్రుడు తోలుకొని పోతుండగా, మొదట దానం పొందిన కశ్యపుడనే విప్రుడు దానిని గ్రహించి ఈ గోవునాది అన్నాడు. వారిలో వారు కలహించుకొని నాదగ్గరకు వచ్చారు. విషయం తెలిసికొని నన్ను మన్నించి నీకు ఎన్ని ఆవులు కావాలన్నా ఇస్తాను అన్నాను. కశ్యపుడు అందుకు అంగీకరించక నాపై కోపించి దానకర్తవు, అపహర్తవు రెండూ నీవే అయ్యావు. నిన్నేమనాలి అన్నాడు. నేనెంత ప్రాధేయపడి బ్రతిమలాడినా ఫలితం లేక పోయింది. ఎవరికి వారు వెళ్ళిపోయారు. అటు పిమ్మట నాకు ఆయువు పూర్తికాగానే యమభటులు నన్ను యముని ముందు నిలబెట్టారు. యమధర్మరాజు నీవు చేసిన దానధర్మాలు, యజ్ఞకార్యాలు పుణ్యఫలం అనుభవించటాని కంటె ముందు పాప ఫలాన్ని అనుభవించి రమ్మని, ఇది బ్రహ్మదేవుని ఆజ్ఞ అని నన్ను అచటి నుండి త్రోసివేశాడు. అప్పటి నుండి ఇప్పటి వరకు ఈరీతిగా ఉన్నాను. ఈనాడు సమస్త పాపాలను పోగొట్టగల నీ పాదపద్మాలను దర్శించి ఘోరదుర్దశ నుండి బయటపడి నిర్మల హృదయుడనయ్యాను అని నమస్కరించాడు. అంతట నృగమహారాజు వాసుదేవుని ఎన్నో విధాల కీర్తించి ఆయన అనుజ్ఞతో అచట చేరిన సకల జనులు ఆనందాశ్చర్యాలు పొందుతుండగా దివ్య విమానంలో స్వర్గానికి వెళ్ళాడు. ఈ విధంగా ఆ నృగ మహారాజును శ్రీకృష్ణుడు అనుగ్రహించాడు.

## ఎనభై నాలుగవ అధ్యాయము - దశమ స్కంధము

**జవాబులు :** 1. 2. పురుషసూక్తం 2. 4. ప్రహ్లాదుని
3. శ్రీకృష్ణుని

* * *

## ఎనభై ఐదవ అధ్యాయము - దశమ స్కంధము

**1. బలరాముడు వ్రేపల్లెకు వెళ్ళడం 2. శ్రీకృష్ణుడు పౌండ్రక వాసుదేవుని సంహరించడం 3. బలరాముడు ద్వివిధుడను వానరుని జంపడం**

**1) ప్రశ్న :** ఒకనాడు బలరాముడు తన బంధుమిత్రుల్ని చూచి రావటానికి వ్రేపల్లెకు వెళ్ళాడు. ఎంతోకాలంగా స్నేహ, సాంగత్యాలు కలిగి ఉండడం వల్ల గోపికలు, గోపాలురు అతనిని ఆలింగనం చేసుకొని, వారంతా బలరామునితో మధురలోని ఎవరి క్షేమసమాచారాన్ని గురించి అడిగారు?

**జవాబు :** 1. దేవకీదేవి 2. వసుదేవుని 3. శ్రీకృష్ణుని 4. ఉగ్రసేనుని

**2) ప్రశ్న :** బలరాముడు వ్రేపల్లెకు వచ్చినాడని తెలిసి గోపాలురు ఆనందం నిండిన హృదయాలతో ఆయనకు పాదనమస్కారాలు చేశారు. ఆ విధంగా వ్రేపల్లెలోని వారందరితో బలరాముడు ఆనందంగా ఎన్ని నెలలు ఉన్నాడు?

**జవాబు :** 1. రెండు నెలలు 2. మూడు నెలలు 3. నాలుగు నెలలు 4. ఐదు నెలలు

**3) ప్రశ్న :** వ్రేపల్లెలో బలరాముడు తన యీడు వారందరితో కలిసి, ఉద్యాన వనాలలోనూ, నదీ తీరాలలోని ఇసుక తిన్నెలపైనా, చంద్రకాంత శిలావేదికలపైనా స్వేచ్ఛగా విహరించే సమయంలో అక్కడ ప్రవహించే నదిని జలకేళి కోసం 'ఇటురా' అని పిలిచాడు. ఆ నది పేరేమి?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** పౌండ్రక వాసుదేవు డెవరు? ఎందుకు పౌండ్రకుని శ్రీకృష్ణుడు సంహరించాడు.

**జవాబు :** కరూశ దేశపు రాజు పౌండ్రకుడు తన దూతను పిలిచి 'భూలోకంలో వాసుదేవడను పేరు నా ఒక్కడికే చెల్లుతుంది. ఇతరులకు ఏమాత్రం చెల్లదు.

శ్రీకృష్ణుడు పొగరెక్కి వాసుదేవుడనే పేరు పెట్టుకున్నాడట. నీవు పోయి వద్దని చెప్పు అని బలగర్వంతో మదోన్మత్తుడై పురుషోత్తముని చెంతకు పౌండ్రకుడు తన దూతను పంపాడు. శ్రీకృష్ణుడు సభదీర్చి ఉండగా ఆ దూతవచ్చి సంకోచించ కుండా ఓ శ్రీకృష్ణా! మా రాజు చెప్పిన మాటలు విను. భూమిని రక్షించడానికి వాసుదేవుడనే పేరు నాకుండగా నీవు సిగ్గు విడిచి ఆ పేరు పెట్టుకున్నావు. నా పేరూ నా చిహ్నాలు ధరిస్తున్నావు. నీవు కేవలము గోపాలుడివి. ఇక నుంచి అయినా వాసుదేవ నామమును, నా చిహ్నాలను విడిచి నాకు దాసుడవై బ్రతుకు లేదా యుద్ధానికి సిద్ధపడు అని పలికిన దూతతో కృష్ణుడు ఓరీ! మీ రాజు ఏ చిహ్నాలను ధరించాడో, ఆ ఆయుధాల తోనే నేను అతనిని వధిస్తాను. యుద్ధానికి సిద్ధంగా ఉండమని చెప్పు అని దూతను పంపించాడు. ఆ దూత వెళ్ళి జరిగినదంతా తన రాజుకు తెలిపాడు. ఆ సమయంలో పౌండ్రకుడు తన స్నేహితుడు కాశీరాజు వద్ద ఉన్నాడు. కాశీరాజు కూడా తన స్నేహతునికి బాసటగా తన బలగంతో వచ్చాడు. శ్రీకృష్ణుడు కాశీ రాజ్యానికి వచ్చాడు. పోరు ఘోరంగా జరుగుతున్న సమయంలో మిత్ర సహితుడైన పౌండ్రకుని కృష్ణుడు చూశాడు. అంత వాసుదేవుడు పౌండ్రకునిపై బాణాలు ప్రయోగించాడు. రథాన్నికూల్చి, సారథిని సంహరించి, ఉద్దండ పరాక్రమంతో చక్రాయుధాన్ని ప్రయోగించి పౌండ్రకుని శిరస్సు ఖండించాడు. పౌండ్రకుడు నేల కూలాడు. కాశీరాజును కూడా సంహరించి ఆతని శిరస్సును బాణాలతో పైపైకి ఎగరకొట్టుతూ ఆతని పట్టణంలో పడేటట్లు చేశాడు. ఈవిధంగా పౌండ్రకుని మిత్ర సహితంగా సంహరించి శ్రీకృష్ణుడు తన నగరానికి వచ్చి మిక్కిలి వైభవంతో కాలం గడుపుతున్నాడు.

**5) ప్రశ్న :** బలరాముడు ద్వివిదుడనే వానరుణ్ని ఎందుకు సంహరించాడు?

**జవాబు :** ద్వివిదుడనే వానరుడు మహా గర్విష్ఠి. వాడు నరకాసురుని చెలికాడు. తన మిత్రుడైన నరకుని చంపిన వారిపై పగతీర్చదలచి శ్రీకృష్ణ పాలితమైన ప్రాంతానికి వచ్చి అక్కడ పల్లెలనూ, పట్టణాలను తగులపెట్టటం, వనాలనూ, సరోవరాలనూ, నాశనం చేయటం, ఆవుల మందలను బెదిరించటం,

సౌధాలను పడద్రోయటం, అగడ్తలను పూడ్చివేయటం, స్త్రీ పురుషులను బంధించటం, పండిన పండ్ల చెట్లను విరిచేయటం, యువతులను నీళ్ళలో ముంచటం ఈ విధంగా అందరినీ బాధిస్తూ ఉన్నాడు. ఒకనాడు ద్వివిదుడు రైవత పర్వత ప్రాంతంలో బలరాముని చూశాడు. అప్పుడా వానరుడు బలరాముని ముందుకు వచ్చి చెట్ల కొమ్మలను ఊపుతూ, వెక్కిరిస్తూ, తన తోకను బలరామునికి తాకిస్తూ, నాలుక వెళ్ళబెడుతూ, గోళ్ళతో గోకుతూ, పండిన పండ్లను కొరికివేస్తూ ఇంకా అనేక వికృతిచేష్టలు చేస్తూ ఉన్నాడు. అదిచూచి బలరామునికి కోపం వచ్చి ఒక రాతితో కొట్టాడు. వాడారాతి దెబ్బలను తప్పించుకొని ప్రక్కనే ఉన్న ఒకచెట్టు పెకలించి దానితో బలరాముని కొట్టాడు. అంత బలరాముడు బంగారు కట్లు వేసిన ముసలా యుధాన్ని చేతపట్టి ద్వివిదుణ్ణి కొట్టాడు. బలరాముడు కొట్టిన దెబ్బకు వానరుని శరీరం నుండి రక్తం చిమ్మింది. అప్పుడా ద్వివిదుడు బలరామునిపై రాళ్ళ వర్షం కురిపించాడు. అంతట బలరాముడు తన చేతనున్న ఆయుధాలను ప్రక్కనపెట్టి ద్వివిదుని మెడపట్టి గొంతునులిమి చంపాడు.

### ఎనభై ఐదవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1.3. శ్రీకృష్ణుని 2.1. రెండు నెలలు
3. యమునానది

* * *

# ఎనభై ఆరవ అధ్యాయము - దశమ స్కంధము

## 1. బలరాముడు హస్తినాపురాన్ని గంగలో త్రోయబూనడం 2. పదహారువేల ఎనిమిది మంది స్త్రీలతో నివసిస్తున్న శ్రీకృష్ణ తత్త్వాన్ని నారదుడు తెలుసుకోవడం

**1) ప్రశ్న :** శ్రీకృష్ణుని కుమారుడైన సాంబుడు ఒకనాడు దుర్యోధనుని కుమార్తెను రథంపై ఉంచుకొని తీసికొని వెళ్ళాడు. ఆవిధంగా సాంబుని చేత అపహరింప బడిన దుర్యోధనుని కుమార్తె పేరేమి?

**జవాబు :** 1. చారుమతి 2. లక్షణ
3. శకుంతల 4. ఉషాకన్య

**2) ప్రశ్న :** తమ రాజకుమార్తెను తీసుకొని వెళ్తున్న సాంబుడిని కౌరవులు వెంబడించి వాడియైన బాణాలు ప్రయోగించారు. సాంబుడు వారిని ఎదుర్కొన్నాడు. ఈ విషయాన్ని ద్వారకలో శ్రీకృష్ణాదులకు ఎవరు తెలిపారు?

**జవాబు :** 1. నారదుడు 2. ఉద్ధవుడు
3. గూఢచారులు 4. దుర్యోధనుడు పంపిన వార్తాహరుడు

**3) ప్రశ్న :** ఒక్క సాంబుడిని ఎదిరించలేక అవమానభారంలో ఉన్న కౌరవులు మరలా యుద్ధానికి సిద్ధమై అతనిని ఎదుర్కొని, ఒక్కమారుగా ముట్టడించి బంధించారు. ఇది తెలిసిన యాదవులంతా హస్తినపైకి రాబోగా వారిని వారించి వారిలో ఎవరు హస్తినాపురానికి వచ్చారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** హస్తినను బలరాముడు గంగలో త్రోయబూనుటకు గల కారణమేమి?

**జవాబు :** బలరాముడు కుల వృద్ధులతో కలిసి హస్తినాపురానికి వెళ్ళాడు. ఆ పట్టణ సమీపంలో ఉన్న ఒక ఉపవనంలో తాను ఉండి నగరంలోనికి ఉద్ధవుని పంపించాడు. ఉద్ధవుడు కౌరవుల కొలువుకూటానికి వెళ్ళి ధృతరాష్ట్రాది పెద్దలకు, సుయోధనునకు నమస్కరించి వారి ప్రశంసలు అందుకొని,

బలరాముడు వచ్చి పట్టణ సమీపంలోని ఉపవనంలో ఉన్నాడని చెప్పాడు. అప్పుడు కౌరవులు సంతోషించి బలరామునికి అర్ఘ్యపాద్యాదులర్పించి గౌరవించారు. తన చుట్టూ కూర్చున్న వారందరిని కుశల ప్రశ్నలతో సంభాషించి దుర్యోధనునితో ఇంతమంది సేనాపతులు ఒక్కటై బాలకుణ్ణి బంధించటం తప్పు. అయినా మా ఉగ్రసేన మహారాజు బంధుక్షేమం కోరి మీరు చేసిన తప్పును మన్నించాడు అని పలికిన బలరాముని పలుకులకు దుర్యోధనునికి చాలా కోపం వచ్చింది. చాలు చాలు కాలవైపరీత్యం! కాళ్ళకు తొడిగే చెప్పులు తలమీదికెక్కాయి. బంధువులని గౌరవించటం చేతనే యాదవులు పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. మనతో సమానంగా విర్రవీగే యాదవులతో స్నేహసంబంధాలు చాలు. సిగ్గు లేకుండా మమ్ములను ఆజ్ఞాపించే వరకూ వచ్చారంటే ఏమనాలి? నిరుపయోగమైన మాటలతో పని ఏముంది? అని పౌరుషంగా మాట్లాడుతూ దిగ్గునలేచి తన సౌధానికి వెళ్ళాడు. దుర్యోధనుని పరుషవాక్కులకు బలరామునికి కోపం వచ్చింది. ప్రక్కనే ఉన్న యాదవ వృద్ధులను చూచి, రాజ్యవైభవం వల్ల కలిగిన మదంతో కళ్ళు మూసుకొని పోయిన దుర్యోధనుడి మాటలు విన్నారు కదా! తాము శిరస్సులట మేము చెప్పులమట. రాజ్యమదంతో ఇలా వాగిన వాడి వంశాన్నే లేకుండా చేస్తాను అని మహాక్రోధాన్ని ప్రదర్శించాడు. తన చేతనున్న నాగలిని పైకెత్తి కౌరవ రాజధాని హస్తినాపురం చిట్టచివరి భాగంలో నాగలి చివరి భాగాన్ని చొప్పించి ఆ పట్టణాన్ని పెకలించి గంగలో కలపటానికి ఉద్యుక్తుడైనాడు. అప్పుడు ఆ పట్టణం గోపురప్రాకారం సౌధాలతో సహ ఒకవైపుకు ఒరిగింది. పౌరులు హాహాకారాలు చేశారు. ఈ మహోపద్రవాన్ని నివారించడానికి, బలరాముని రౌద్రావేశం తగ్గించడానికి మరో మార్గం లేక దుర్యోధనాదులు బలరాముని శరణు వేడారు. కన్యతో సహా సాంబుణ్ణి సమర్పించారు. ఆ విధంగా బలరాముడు వారిని వెంట బెట్టుకొని ఆనందంగా ద్వారకా నగరానికి వెళ్ళాడు.

**5) ప్రశ్న :** పదహారువేల రాజకన్యలనూ, అష్టభార్యలనూ ఆదరిస్తూ వైభవంగా ద్వారకానగరిలో ఉన్న శ్రీకృష్ణస్వామిని నారదమహర్షి ఏరీతిగా దర్శించాడు?

**జవాబు :** శ్రీకృష్ణుడు నరకాసురుని చంపి వాని మందిరంలో బంధీలుగా ఉన్న పదహారువేల మంది రాజకన్యలను, ఒక్కమారుగా అందరికీ అన్ని రూపాలుగా కనపడి వివాహం చేసుకొన్నాడనే వార్త నారదుడు విని ఆయన వైభవాన్ని దర్శించాలనే కాంక్షతో ఒకనాడు ద్వారకకు వచ్చాడు. మిక్కిలి ఎత్తైన మేడలతో, ఆ సౌధాల గవాక్షాలలో నుంచి అగరు ధూప ధూమాలు వెలువడు తున్నాయి. ఆ పట్టణంలో చంద్రకాంతమణులు చెక్కిన స్ఫటిక స్థంభాలతో కూడిన నవరత్న ప్రాసాదాలను నారద మహర్షి దర్శించాడు. అష్టదిక్పాలుర పట్టణాలను తలపించే ఆ ద్వారకా పట్టణాన్ని నారదుడు ప్రవేశించి, అక్కడ విశ్వకర్మచేత నిర్మింపబడ్డ అంతఃపురంలోని పదహారువేల సౌధాలలోనూ శ్రీకృష్ణుణ్ణి చూశాడు. సమానమైన వయోరూప గుణాలతో విలసిల్లే వేలాది లీలావతులు సేవిస్తూ ఉండగా, బంగారు సింహాసనంపై కూర్చుని ఉన్న గోపాలకృష్ణుణ్ణి, ఆ మహర్షి అవలోకించాడు. తనను సమీపిస్తున్న నారదునికి కృష్ణుడు ఎదురువెళ్ళి తీసికొని వచ్చి, ఒక సింహాసనముపై కూర్చుండజేసి పూజించాడు. అటు పిమ్మట శ్రీకృష్ణుని అనుమతితో నారద మహర్షి వెలుపలికి వచ్చి, వాసుదేవుని యోగ మాయా విశేషం తెలిసికోదలచి వేరొక నారీమణి ఇంటికి వెళ్ళాడు. అక్కడ కృష్ణుని దర్శించాడు. అటు పిమ్మట ముందుకు సాగి నారదుడు, ఒక వనిత ఇంటిలో జలకేళి సలుపుతూ ఆనందిస్తున్న ముకుందుని చూశాడు. ఒక తరుణీమణి ఇంటిలో యోగనిష్ఠలో ఉన్న కృష్ణుని చూచాడు. ఈవిధంగా పదహారువేల స్త్రీల నివాసాలలోనూ, తన మాయా ప్రభావంతో ఉన్న మహా పురుషుడైన శ్రీకృష్ణుని నారదమహర్షి దర్శించాడు. ఈరీతిగా సంతుష్టాంత రంగుడైన నారదుడు, మాధవుని తత్త్వదర్శనం చేసికొని తన మనస్సులో ఆ దివ్య మంగళమయ స్వరూపాన్ని నిలుపుకొని వెళ్ళిపోయాడు.

## ఎనభై ఆరవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 2. లక్షణ 2. 1. నారదుడు
3. బలరాముడు

* * *

## ఎనభై ఏడవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణునితో నారదుడు ధర్మరాజు రాజసూయాన్ని నెరవేర్చమని చెప్పడం 2. శ్రీకృష్ణుడు ధర్మరాజు చెంతకు వెళ్ళడం 3. పాండవులు శ్రీకృష్ణునికి ఎదురువచ్చి తీసికొనిపోవడం**

**1) ప్రశ్న :** ఒకనాడు నారద మహర్షి నంద నందనుని వద్దకు వచ్చాడు. శ్రీకృష్ణుడు మహర్షిని పూజించి, ఆయనను ఎవరి క్షేమ సమాచారాన్ని గురించి అడిగాడు?

**జవాబు :** 1. జనక మహారాజు గురించి 2. కాశీరాజు గురించి
3. జరాసంధుని గురించి 4. పాండవులను గురించి

**2) ప్రశ్న :** నారద మహర్షి శ్రీకృష్ణునితో కృష్ణా! ధర్మరాజు లోక ధర్మాన్ననుసరించి యజ్ఞం చేయతల పెట్టాడు అని చెప్పాడు. కాగా ధర్మరాజు చేయాలనుకొన్న యజ్ఞం పేరేది?

**జవాబు :** 1. రాజసూయ యజ్ఞం 2. పుత్రకామేష్ఠి యాగం
3. విశ్వజిత్ యాగం 4. దీర్ఘ సత్రయాగం

**3) ప్రశ్న :** ధర్మరాజు నిర్వహించతలపెట్టిన యజ్ఞ రక్షణకై నీవు రావాలి అని పలికిన నారదమహర్షి మాటలు విని శ్రీకృష్ణుడు సంతోషించి చిరునవ్వుతో ఎవరిని సలహా అడిగాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శ్రీకృష్ణుడు నారదుని మాట ప్రకారం కర్తవ్యం వివరించమని అడిగిన ప్రకారం ఉద్ధవుడు ఏమి చెప్పాడు? వాసుదేవుడు ఆ ప్రకారంగా ఏమిచేశాడు?

**జవాబు :** ధర్మరాజు యాగ సంరక్షణార్థం నీవు హస్తినకు వెళ్ళమని నారదుడు చెప్పిన ప్రకారం, కర్తవ్యాన్ని ఆలోచించమని వాసుదేవుడు ఉద్ధవునితో చెప్పాడు. అప్పుడు ఉద్ధవుడు సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుని పాదాలను మనసులో ధ్యానించుకొని

దేవా! నాకు తెలిసిన విధానాన్ని వివరిస్తాను. నారద మహర్షి చెప్పినట్లుగా, నీ భక్తుడైన ధర్మరాజు చేయబోయే యాగాన్ని రక్షించడం అవశ్య కర్తవ్యం. సమస్త దిక్కులనూ జయించటానికి మూలమైన, రాజసూయయాగ సందర్భంలో జరాసంధుణ్ణి సంహరించటం, వాని చేత బంధింపబడ్డ రాజులను చెరనుండి విముక్తులను కావించడం కూడా సిద్ధిస్తాయి అని పలికిన ఉద్ధవుని పలుకులకు నారదుడూ యాదవులూ అందరూ సంతోషించారు. అప్పుడు శ్రీకృష్ణుడు హస్తినకు వెళ్ళుటకు నిశ్చయించాడు. చిరుగంటల మ్రోతలతో శైభ్య, సుగ్రీవ, వాలాహక, మేఘ పుష్పాలనే అశ్వాలను పూన్చిన రథం దారుకుడు సిద్ధం చేశాడు. ఉగ్రసేనుడికి, బలరాముడికి, గురువులకూ, పెద్దలకూ చెప్పి ఆదరంతో వారు సాగనంపగా, చతురంగ బలసమేతుడై శ్రీకృష్ణుడు బయలు దేరాడు. వాసుదేవుడు తనను అనుసరించి వచ్చు తన వారందిరితో కూడి ఇంద్రప్రస్థనగరం వైపుగా ముందుకు సాగాడు. ఇలా శ్రీకృష్ణుడు ప్రయాణం చేస్తూ సౌవీరాది దేశాలను అతిక్రమించి, ఇందుమతీ నదిని దర్శించి, దృషద్వతీ, సరస్వతీ నదులను దాటి, పాంచాల, మత్స్య దేశాలను గడించి, ఇంద్రప్రస్థ నగరాన్ని చేరి పట్టణానికి సమీపంలో ఉన్న ఉపవనంలో విడిది చేశాడు. ఈ రీతిగా వాసుదేవుని ఇంద్రప్రస్థ ప్రయాణం సాగింది.

**5) ప్రశ్న :** ఇంద్రప్రస్థ పురం చేరిన శ్రీకృష్ణునికి ధర్మజాదులు ఏరీతిగా స్వాగత సత్కారాలు చేశారు?

**జవాబు :** తమ పట్టణానికి చేరువలో శ్రీకృష్ణుడు విడిదిచేసి ఉన్నాడని తెలిసి ధర్మరాజు తన వారందరితో కలిసి అతిశయించిన భక్తితో, అనురక్తితో ఆయనకు స్వాగతం చెప్పడానికి వచ్చాడు. ధర్మరాజు ఇలా వచ్చి శ్రీకృష్ణుని గట్టిగా కౌగలించుకొని, పులకిత శరీరుడై ఆనందభాష్పాలు చెక్కిళ్ళ తడుపుతుండగా, ఆ సంతోష పారవశ్యంతో ప్రపంచాన్నే మరచిపోయాడు. భీమార్జునులు వాసుదేవుని ఆలింగనం చేసుకొని ఆనందించారు. నకుల సహదేవులు ఆ పరమాత్మకు నమస్కరించారు. అటు పిమ్మట శ్రీకృష్ణుడు వారు కావించిన పూజలను స్వీకరించి, అందరిని సమాదరించాడు. అనంతరం చతురంగ

బలసమేతుడై మణి తోరణాలతో అలంకృతమై, అత్యంత వైభవోపేతమైన ఇంద్రప్రస్థ పట్టణం లోనికి ప్రవేశించాడు. అంతఃపురంలో కుంతీదేవిని చూసి, ఆమెను విచారించి, ద్రౌపదీ నమస్కారాలను స్వీకరించాడు. అనంతరం శ్రీకృష్ణుని భార్యలైన రుక్మిణీ ఆదిగా గల వారందరికీ ద్రౌపది గంధ పుష్పాక్షతలు, పువ్వులూ, తాంబూలాలు, పట్టు చీరలూ, మణి భూషణాలూ ఇచ్చి పూజించింది. ధర్మరాజు కృష్ణుని అంతఃపుర కాంతలకూ ఆయన పరివారానికి వారివారి యోగ్యతలకు తగినట్లు విడుదులు ఏర్పాటు చేశాడు. కృష్ణుడు కూడా ధర్మరాజు కావించిన గౌరవ మర్యాదలకు సంతోషించి అర్జునునితో కలిసి సరస వినోద విహార కార్యక్రమాలతో కొన్ని నెలల పాటు అక్కడ కాలం గడిపాడు.

### ఎనభై ఏడవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 4. పాండవుల గురించి 2. 1. రాజసూయ యజ్ఞం 3. ఉద్ధవుని

* * *

## ఎనభై ఎనిమిదవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుని మాట ప్రకారం ధర్మరాజు తన తమ్ములను దిగ్విజయానికి పంపడం 2. శ్రీకృష్ణ భీమార్జునులు జరాసంధుని వధించుటకై వెళ్ళడం 3. భీమ జరాసంధుల యుద్ధం**

**1) ప్రశ్న :** ఒకనాడు ధర్మరాజు తన వారందరితో కొలువుదీరి శ్రీకృష్ణునితో రాజసూయయాగం చెయ్యాలని నా హృదయం ఉవ్విళ్ళూరుతున్నది అని పలుకగా కృష్ణుడు అందుకు ఈ రాజలోకమంతటిలోకి నీవే సమర్థుడవు. దీని వలన నీ శాసనం ఎక్కడ వరకు స్థిరంగా ఉంటుంది అని చెప్పాడు?

**జవాబు :** 1. పది దిక్కులలోను 2. ఎనిమిది దిక్కులలోనూ
3. నాలుగు దిక్కులలోను 4. సమస్త భూమండలం లోనూ

**2) ప్రశ్న :** శ్రీకృష్ణుని అండదండలతో రాజసూయయాగాన్ని నిర్వహించాలని తలపెట్టిన ధర్మరాజు, ముందుగా తన నలుగురు తమ్ములను, నాలుగు దిక్కులకు పంపి, ఆయా దిక్కులలో గల రాజులను జయించి రమ్మని పంపించాడు. ఆ క్రమంలో భీముని ఏ దిక్కుకు పంపించాడు?

**జవాబు :** 1. ఉత్తర దిక్కుకు 2. తూర్పు దిక్కుకు
3. దక్షిణ దిక్కుకు 4. పశ్చిమ దిక్కుకు

**3) ప్రశ్న :** ధర్మరాజు పంపగా భీమార్జుననకులసహదేవులు వెళ్ళి తమ పరాక్రమాలను ప్రదర్శించి ఆయా దిక్కులలోని రాజులందరిని జయించి, అపార ధనరాసులను సంగ్రహించి తెచ్చారు. వారిలో అర్జునుడు ముందుకు వచ్చి ఒక్క రాజు మాత్రం కప్పం కట్టలేదు అని చెప్పాడు. ఆ ఒక్క రాజు ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** జరాసంధుని అంతం చేయడానికి ధర్మరాజుకు శ్రీకృష్ణుడు తెలిపిన ఉపాయమేది? ఏరీతిగా జరాసంధ వధాకార్యాన్ని నిర్వహించ బూనారు?

**జవాబు :** ధర్మరాజు పంపున నలుదిక్కులకు వెళ్ళిన నలుగురు తమ్ములలో అర్జునుడు జరాసంధుడు కప్పం కట్టలేదని తెలుపగా ధర్మరాజు వికల మనస్కుడైనాడు. అప్పుడు శ్రీకృష్ణుడు ధర్మారాజా! జరాసంధునికి బ్రాహ్మణులంటే భక్తి విశ్వాసాలు అధికం. వారేది అడిగినా లేదనక ఇస్తాడు. అందుచేత నేనూ, భీముడూ, అర్జునుడూ బ్రాహ్మణ వేషాలతో వెళ్ళి వాణ్ణి యుద్ధబిక్ష అర్థిస్తాము. అతడు తప్పకుండా మా కోరిక తీరుస్తాడు. అప్పుడు మల్లయుద్ధంలో భీముడి చేత వాణ్ణి చంపించ వచ్చును అని తెలుపగా ధర్మరాజు ఈ ఉపాయం బాగుంది అని అంగీకరించాడు. అనంతరం కృష్ణార్జున భీమసేనులు మువ్వురూ బ్రాహ్మణ వేషాలతో బయలుదేరి వెళ్ళారు. ఆ మువ్వురూ అనతి కాలంలోనె గిరివ్రజపురం చేరి జరాసంధుని చూసి ఓ మగధరాజా! అతిథిపూజ చేయటంలో అత్యంత ఆసక్తి కలిగిన వాడవని నీకు దిగంతాలలో మంచి పేరున్నది. అది విని నీచెంతకు వచ్చాము. మా కోరిక తప్పక తీర్చు. దాతలలో పేరెన్నికగల వాడివి అని పలుకుతున్న వారు బ్రాహ్మణులు కారని వారి శారీరక దారుఢ్యాన్ని చూచి క్షత్రియులని గ్రహించి జరాసంధుడు, మీకేమి కావాలో అడగండి. ఏమడిగినా ఇస్తాను అన్నాడు. అప్పుడు కృష్ణుడు మహారాజా! మేము యుద్ధబిక్ష అడుగుతున్నాం. నేను కృష్ణుడను వీరిరువురు భీమార్జునులు నీవు మాలో ఒక్కరితో యుద్ధం చేయవలసి ఉంది అన్నాడు. కృష్ణుని మాటలు విని జరాసంధుడు నవ్వి నీ పరాక్రమము నాకు తెలియనిది కాదు. నన్ను చూచి పారిపోయావు. కాగా అర్జునుడు నాకంటే చిన్నవాడు. నాతో సమఉజ్జీ అయిన భీమునితోనే నేను తలపడతాను అని భీమునికి ఒక గదను ఇప్పించి తాను ఒక గదను ధరించాడు. తరువాత పట్టణానికి వెలుపల సమతలమైన ప్రదేశానికి ఆ నలుగురూ చేరారు.

**5) ప్రశ్న :** భీముడు జరాసంధుని ఏవిధంగా జయించాడు?

**జవాబు :** భీమ జరాసంధులిద్దరూ రెండు సింహాలూ, రెండు వృషభాలూ, రెండు మత్తేభాలు తలపడిన విధంగా పరస్పరం ఎదిరించి భయంకరంగా యుద్ధం చేశారు. వారిరువురూ ఒకరిని ఒకరి వీపులూ, మూపులూ,

ముంజేతులూ, శిరస్సులూ, తొడలూ, మోకాళ్ళూ, నడుములూ బద్ధలయ్యేటట్లు గదలతో పరస్పరం మోదుకున్నారు. ఆ పోరాటంలో వారి గదా దండాలు ఖండ ఖండాలయి పోయాయి. అప్పుడు భీమ జరాసంధులిద్దరూ నిరుత్సాహ పడకుండా, బాహుదండాలు చాచి ముష్టి యుద్ధానికి తలపడ్డారు. వారిద్దరూ శరీరాలు పగిలి గుల్లలయ్యేటట్లు కాళ్ళతో పొడుచుకొంటూ, పిడికిటి పోట్లతో నొప్పించుతూ సోలుతూ వాలుతూ, రొప్పుతూ రోజుతూ పరాక్రమాన్ని ప్రదర్శిస్తూ పోరాటం సాగించారు. అప్పుడు కృష్ణుడు జరాసంధుని పుట్టుకనూ, చావునూ తెలిసినవాడు కాబట్టి భీముడు చూస్తూ ఉండగా ఒక చెట్టుకొమ్మను పట్టుకొని రెండుగా చీల్చి 'వీణ్ణి ఇలాచేసి చంపు' అని సూచన చేశాడు. అది గ్రహించిన భీముడు వెంటనే జరాసంధుణ్ణి క్రింద పడద్రోసి ఒక కాలిని తనకాలితో త్రొక్కిపట్టి రెండోకాలిని చేతులతో గట్టిగా పట్టుకొని పెళపెళ మనే శబ్దం పుట్టేటట్లు మదించిన ఏనుగు తాటి చెట్టును చీల్చే విధంగా వాణ్ణి తలవరకూ చీల్చి చంపేశాడు. ఆ భయంకర దృశ్యం చూసి పురజనులు భయంతో హాహాకారాలు చేశారు. ఈ విధంగా జరాసంధుని భీముడు జయించాడు.

### ఎనభై ఎనిమిదవ అధ్యాయము - దశమ స్కంధము

**జవాబులు :** 1. 4. సమస్త భూమండలంలోనూ 2. 2. తూర్పుదిక్కుకు
3. జరాసంధుడు

* * *

# ఎనభై తొమ్మిదవ అధ్యాయము - దశమ స్కంధము

**1. కారాగృహ విముక్తులైన రాజులు శ్రీకృష్ణుని స్తుతించడం 2. శిశుపాల వధ**

**1) ప్రశ్న :** జరాసంధుణ్ణి సంహరించినందుకు భీముణ్ణి శ్రీకృష్ణార్జునులు కౌగిలించుకొని ప్రస్తుతించారు. దయామయుడూ, భక్తవత్సలుడూ అయిన శ్రీకృష్ణుడు మగధ రాజ్యానికి, జరాసంధుని కుమారుని పట్టాభిషిక్తునిగా చేశాడు. కాగా ఆవిధంగా పట్టాభిషిక్తుడైన రాకుమారుని పేరేమిటి?

**జవాబు :** 1. దంతవక్త్రుడు 2. సాళ్వుడు
3. సహదేవుడు 4. రుక్మి

**2) ప్రశ్న :** జరాసంధునికి లోబడి అతని చెరసాలల్లో దుఃఖంతో క్రుగ్గుతూన్న రాజ కుమారులందరిని, మరచిపోకుండా విడిపించిన వాసుదేవుడు అటుపిమ్మట వారందరిని ఎక్కడకు పంపించాడు?

**జవాబు :** 1. ఎవరి రాజ్యాలకు వారిని 2. ఇంద్రప్రస్థానికి
3. ద్వారకానగరానికి 4. మగధలోనే ఉండునట్లుగా

**3) ప్రశ్న :** భీమాదులు జరాసంధుని చంపి, ఇంద్రప్రస్థ పురానికి చేరారు. మగధలో జరిగిన జరాసంధ వధను గురించిన అన్ని వివరాలను శ్రీకృష్ణుడు ముందుగా ఎవరికి చెప్పాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శ్రీకృష్ణ ఆజ్ఞానువర్తియైన ధర్మరాజు తాను నిర్వహించ తలపెట్టిన రాజసూయ యజ్ఞ నిర్వహణలో ఎవరెవరికి ఏ ఏ బాధ్యతలను అప్పగించాడు?

**జవాబు :** శ్రీకృష్ణుని ఆదేశాను సారం ధర్మరాజు వేదవ్యాసుడు, కశ్యపుడు, భరద్వాజుడు మొదలైన మునీశ్వరులనూ, భీష్మ, ద్రోణ కృపాది గురువులనూ, ధృతరాష్ట్ర విదురాది కురువృద్ధులనూ, దుర్యోధనాది బంధుజనాన్నీ, సమస్త రాజులనూ, బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర ముఖ్యులనూ యజ్ఞానికి రప్పించాడు. ఆహ్వానించిన వారంతా సంతోషంతో ఇతర కార్యక్రమాలను పర్యవేక్షిస్తుండగా

బ్రాహ్మణ శ్రేష్ఠులు శాస్త్ర ప్రకారం యజ్ఞం ప్రారంభించారు. యజ్ఞభూమిని బంగారు నాగళ్ళతో దున్నించి, సువర్ణమయమైన పరికరాలతో ఏలోపం లేకుండా ధర్మరాజుకు యజ్ఞ దీక్షనిచ్చారు. ధర్మరాజు సమస్త భూపతులూ తమకర్పించే ధన, కనక, వస్తు, వాహనాలను స్వీకరించటానికి దుర్యోధనుని నియమించాడు. యాచకులు అడిగిన వస్తువులను దానం చేయటానికి కర్ణుణ్ణీ, షడ్రసోపేత భోజన పదార్థాలను తయారు చేయించటానికి భీముణ్ణి, శ్రీకృష్ణునికి పరిచర్యలు చేయడానికి అర్జునుని, యజ్ఞానికి అవసరమైన సంభారాలను సమకూర్చటానికి నకులుణ్ణి, దేవ బ్రాహ్మణులనూ, గురువులనూ, పెద్దలనూ పూజించటానికి సహదేవుణ్ణి, యాగానికి విచ్చేసిన సమస్త ప్రజలూ మృష్టాన్న పానాలతో, సంతుష్టు లయ్యేటట్టు చేయటానికి ద్రౌపదినీ ధర్మరాజు నియమించాడు.దేవతలతో సమానులైన ఋత్విజులు రాజసూయ యాగానికి, అనువైన మంత్రాలతో హవ్య ద్రవ్యాలను ధర్మరాజు చేత వేలిపించి యాగాన్ని చేయించారు.

**5) ప్రశ్న :** ధర్మరాజు ఆనందంగా నిర్వహిస్తున్న రాజసూయ యాగంలో శిశుపాలుని శ్రీకృష్ణుడు ఎందుకు సంహరింపవలసి వచ్చింది? ఏవిధంగా సంహరించాడు?

**జవాబు :** ధర్మరాజు యాగ నిర్వహణలో భాగంగా, ఎవరికి అప్పగించిన బాధ్యతలను వారు సక్రమంగా నిర్వహించారు. యజ్ఞ పరిసమాప్తమైన చివరి దినాన ఋత్విజులనూ, సభా సదులనూ, పెద్దలనూ, విప్రులనూ పూజించాలని భావించాడు. ఈవిధంగా పూజించే క్రమంలో అగ్రపూజకు అర్హుడెవరనే ప్రశ్న పుట్టింది. సభలో ఉన్నవారు తమకు తోచిన విధంగా తలకొక రీతిగా చెప్పారు. వారి మాటలను వారించి బుద్ధిమంతుడైన సహదేవుడు, భగవంతుడైన శ్రీకృష్ణుణ్ణి చూపించి, ఈ మహాత్ముణ్ణి సంతుష్టుణ్ణి చేసినట్లైతె సమస్త లోకాలు సంతోషిస్తాయి అని ధర్మరాజుతో కాలమూ, దేశమూ, యజ్ఞమూ, కర్మమూ, కర్తా, భోక్తా, ప్రపంచమూ, దైవమూ, గురువూ, మంత్రమూ, అగ్ని, హవ్యద్రవ్యాలు, సృష్టి స్థితి లయాలు సమస్తమూ తానేయై ప్రకాశించే ఏకైక దివ్య స్వరూపుడు ఈ కృష్ణ పరమాత్మ ఒక్కడే, కనుక ఆలస్యం చేయకుండా శ్రీకృష్ణుణ్ణి పూజించు

అని సహదేవుడు చెప్పగా, సభలోని వారంతా సంతోషంతో ఇది సముచితం అన్నారు. అంతట ధర్మరాజు శ్రీకృష్ణుని పాదాలను భక్తితో కడిగాడు. ఆ జలాన్ని తనతో పాటు కుంతీ, ద్రౌపదీ, ఇతర పాండవులు తమ శిరస్సులపై జల్లుకున్నారు. బంగారు జలతారు వస్త్రాలతో, రత్నాలతో ధర్మరాజు శ్రీకృష్ణుణ్ణి సమ్మానించాడు. ఇలా పూజింపబడిన గోవిందుని సుందరాకారాన్ని కనులనిండా దర్శించిన ధర్మరాజు కన్నుల నుండి ఆనంద భాష్పాలు జాలువారాయి. తన్మయంలో మునిగాడు. అప్పుడు దమఘోషుని కుమారుడైన శిశుపాలుడు ఆ వైభవాన్ని చూచి ఓర్వలేక, అసూయతో ఆసనం దిగి నిలబడి నిర్భయంగా తనచేయెత్తి కృష్ణుని వైపు చూపుతూ, ఆయన వినేటట్లు సహదేవుని మాటలతో బుద్ధిమంతులైన పెద్దల బుద్ధులు ఎందుకు దారితప్పాయో? యోగ్యులూ, సత్యగుణ సంపన్నులూ, తపోధనులూ, తేజస్వులూ, ఐశ్వర్య వంతులూ, పరబ్రహ్మ స్వరూపం తెలిసిన వారూ, యోగీశ్వరులూ ఎందరో ఈ సభలో ఉండగా, బుద్ధిహీనుడైన ఒక గొల్లపిల్లవాణ్ణి పూజించటానికి ఎలా సమ్మతించారు? యజ్ఞ నిర్వహణలో శాస్త్రీయమైన ఈ పూజను పూజార్హుడు కానివానికి ఎలా సమర్పిస్తారు? అంటూ ఇంకా ఎన్నో విధాల అమంగళకరమైన మాటలతో శిశుపాలుడు శ్రీకృష్ణుణ్ణి నిందించాడు. శ్రీకృష్ణుణ్ణి నిందించిన నిందా వాక్యాలు వినలేక మునులూ, రాజులూ చెవులు మూసుకున్నారు. ఎవరు వారించాలని ప్రయత్నించినా శిశుపాలుడు లక్ష్యపెట్టలేదు. తనకు ఎదురుగా దెబ్బలాటకు సిద్ధంగా ఉన్న శిశుపాలుణ్ణి శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రంతో వాడి శిరస్సును ఖండించాడు. అతడి శరీరం నుండి వెలువడిన దివ్యతేజస్సు శ్రీకృష్ణునిలో ప్రవేశించింది. ఆవిధంగా శివుపాల వధ జరిగింది.

### ఎనభై తొమ్మిదవ అధ్యాయము – దశమ స్కంధము

**జవాబులు :** 1. 3. సహదేవుడు 2. 1. ఎవరి రాజ్యాలకు వారిని
3. ధర్మరాజు

* * *

## తొంబైయవ అధ్యాయము - దశమ స్కంధము

**1. సాళ్వుడు ద్వారకపై దండెత్తడం 2. శ్రీకృష్ణుడు దంతవక్త్రుని వధించడం 3. బలరాముని తీర్థయాత్ర**

**1) ప్రశ్న :** రుక్మిణీ పరిణయ సందర్భంలో శిశుపాలునికి సహాయంగా వచ్చి, చావు దెబ్బలుతిని పరాజితులైన రాజులలో సాళ్వుడు ఒకడు. అతడు ఆ పరాభవానికి ప్రతీకారం తీర్చుకోవాలని, యాదవులను నాశనం చెయ్యాలని ఒక ప్రశాంత ప్రదేశంలో ఎవరిని గురించి తపస్సు చేశాడు.

**జవాబు :** 1. శివుని గురించి 2. దత్తాత్రేయుని గురించి
3. కుమారస్వామిని గురించి 4. బ్రహ్మదేవుని గురించి

**2) ప్రశ్న :** పరమశివుని మెప్పించి సాళ్వుడు విశ్వకర్మ నిర్మితమైన ఒక విమానాన్ని సంపాదించాడు. తన కోరిక మేరకు పయనించే సౌబక మనే విమానాన్ని ఉపయోగించి, శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థంలో ఉన్న సమయంలో ద్వారకా నగరంపై దండెత్తి ఎన్నిరోజులు యుద్ధం చేశాడు?

**జవాబు :** 1. ఏడు దినాలు 2. పది దినాలు
3. పదిహేను దినాలు 4. ఇరువది ఏడు దినాలు

**3) ప్రశ్న :** ఇంద్రప్రస్థం నుండి శ్రీకృష్ణుడు ద్వారకకు వస్తూ, సాళ్వుడు చేస్తున్న యుద్ధాన్ని చూశాడు. సాళ్వుడు ఆయనను చూచి ఉత్సాహంగా ముందుకు వచ్చాడు. వారిద్దరు సాగించిన యుద్ధంలో శ్రీకృష్ణుడు ఏ ఆయుధంతో సాళ్వుని సంహరించాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శ్రీకృష్ణుడు దంతవక్త్రుని ఏవిధంగా అంతం చేశాడు.

**జవాబు :** శ్రీకృష్ణుడు సాళ్వుణ్ణి, సౌబక విమానాన్ని ధ్వసంచేయటం చూసి దంతవక్త్రుడు తన మిత్రులైన సాళ్వ, పౌండ్రక, శిశుపాలురకు ఉత్తరక్రియలు నిర్వహించి తనకు శత్రువైన కృష్ణునిపైకి యుద్ధానికి వచ్చాడు. పండ్లు పటపట

కొరుకుతూ, కన్నుల నిప్పులు రాలుస్తూ, పాద ఘట్టనంచేత భూమి వణికేటట్లు నడుస్తూ, తన చేతనున్న గదను గిరగిరా త్రిప్పుతూ తన మీదికి వస్తున్న వీరుని కృష్ణుడు చూశాడు. ఆయన కూడా గధాహస్తుడై రథం దిగాడు. విరోధికి ఎదురుగా నడిచాడు. అప్పుడు దంతవక్త్రుడు కృష్ణా! నా భాగ్యవశం చేత ఈనాడు నా కంటపడ్డావు. బంధువు రూపంలో ఉన్న విరోధివి నువ్వు. నిన్ను చంపి నా మిత్రుల ఋణాన్ని తీర్చుకుంటాను అంటూ దుర్భాషలాడుతూ వాడు తన చేతనున్న గదాదండంతో కృష్ణుని తలమీద మోదాడు. అప్పుడు ఆగ్రహించిన కృష్ణుడు తన గదాయుధంతో దంతవక్త్రుని వక్షఃస్థలాన్ని పగులగొట్టాడు. ఆ దెబ్బకు వాడు రక్తం క్రక్కుతూ నేలకొరిగాడు. అతడి శరీరం నుండి ఒక సూక్ష్మతేజం వెలువడి శ్రీకృష్ణునిలో ప్రవేశించింది. అది చూసి దంతవక్త్రుని సోదరుడు విదూరథుడు కృష్ణునిపైకి వచ్చి యుద్ధంలో మరణించాడు. ఈ విధంగా కృష్ణుడు ఆ వంశం వారిని పెక్కు మందిని సంహరించి పరమానందంతో ద్వారకానగరం ప్రవేశించాడు.

**5) ప్రశ్న :** బలరాముడు ఏ కారణంగా తీర్థయాత్రకు వెళ్ళాడు? ఏఏ తీర్థాలను దర్శించాడు?

**జవాబు :** బలరాముడు కౌరవులకూ పాండవులకూ కురుక్షేత్ర యుద్ధం ప్రారంభం కానున్నదని తెలుసు కొన్నవాడై ఇరుపక్షాలకూ కావలసిన వాడు కాబట్టి తీర్థయాత్ర నెపంతో ద్వారక నుంచి వెళ్ళి పోయాడు. బలరాముడు తీర్థయాత్రలో భాగంగా మొదటగా ప్రభాసతీర్థంలో స్నానంచేసి పితృదేవతలకు ప్రీతితో తర్పణాలు వదిలాడు. పిమ్మట క్రమంగా సరస్వతి, బిందు సరోవరం, వజ్రతీర్థం, విశాలానది, సరయు, యమున, గంగ మున్నగు పుణ్యనదులలో స్నానంచేసి దేవ, ఋషి, పితృగణాలకు తర్పణాలు సమర్పించాడు. అనంతరమాయన నైమిశారణ్యం ప్రవేశించాడు. అక్కడ మునుల కోరికపై పల్వలుడు అనే రాక్షసుని సంహరించాడు. తరువాత కౌశికీనదిలో స్నానమాడి, అటనుండి గండకీ నదిని దాటి, గంగాసాగర సంగమం దర్శించి, మహేంద్రగిరిని చేరుకుని అక్కడ పరశురాముని దర్శించు కొన్నాడు. తదుపరి దక్షిణ దిశగా పయనించి

సప్త గోదావరిని చూసి, కృష్ణవేణీ, పంపా, భీమానదినీ దర్శించాడు. అటు పిమ్మట శ్రీశైలం, తిరుమల, కాంచీపురం మొదలైన దివ్య క్షేత్రాలను దర్శించుకొని కావేరీ నదిలో స్నానం చేసి రంగనాధుని దర్శించుకొని మరలా ప్రభాస తీర్థానికి వెళ్ళాడు. అచట కురుపాండవ యుద్ధంలో రాజులు సైన్యం అందరూ హతమైనారనీ, దుర్యోధనుడూ, భీముడూ యుద్ధానికి సిద్ధమౌతున్నారని విని అచ్చటకి వచ్చాడు. వారిరువురిని ఉద్దేశించి మీరిద్దరూ సమానులే కావున యుద్ధానికి పూనుకోవడం దేనికి అన్నాడు. కాని వారు ఆయన హితవచనాలను వినలేదు. యుద్ధానికే సిద్ధమైనారు. కానున్నది కాక మానదని బలరాముడక్కడ నుంచి ద్వారకకు చేరుకున్నాడు. ఈవిధంగా బలరాముని తీర్థయాత్ర సాగింది.

### తొంబైయవ అధ్యాయము - దశమ స్కంధము

**జవాబులు :** 1. 1. శివుని గురుంచి 2. 4. ఇరువది ఏడు దినాలు
3. సుదర్శన చక్రంతో

* * *

## తొంబై ఒకటవ అధ్యాయము - దశమ స్కంధము

**1. కుచేలోపాఖ్యానం 2. శ్రీకృష్ణుడు సకుటుంబంగా గ్రహణ స్నానానికి వెళ్ళడం 3. శ్రీకృష్ణుని భార్యయైన లక్షణ తన వివాహ విశేషాలను ద్రౌపదికి తెలపడం**

**1) ప్రశ్న :** శ్రీకృష్ణుని బాల్య సఖుడు కుచేలుడు. కుచేలము అనగా చిరిగిపోయిన వస్త్రము అని అర్థము. చిరిగి పోయిన వస్త్రాలను ధరించే దారిద్ర్యాన్ని అనుభవించే ఆయనకు మొదట ఉన్న పేరేది?

| **జవాబు :** | 1. ఉద్ధవుడు | 2. సాంబుడు |
|---|---|---|
| | 3. సుధాముడు | 4. కృతవర్మ |

**2) ప్రశ్న :** ఆకలితో కృశించిపోతున్న బిడ్డలకు పట్టెడన్నము పెట్టలేని తల్లి కుచేలుని భార్య. మహాపతివ్రత. ఒకనాడు భర్తతో మీకు శ్రీకృష్ణుడు బాల్య స్నేహితుడని చెప్పావు కదా! ఆ మహానుబావుణ్ణి దర్శిస్తే మన దారిద్ర్య బాధ తొలగుతుందని చెప్పి ఒప్పించింది. ద్వారకకు ప్రయాణమై వెళుతున్న కుచేలునికి, వట్టి చేతులతో పోకూడదని ఆయన భార్య ఏమిచ్చి పంపించింది?

| **జవాబు :** | 1. ఫలాలు | 2. పుష్పాలు |
|---|---|---|
| | 3. ఆకులు | 4. అటుకులు |

**3) ప్రశ్న :** ద్వారకా నగరంలో రాజమార్గం గుండా వెళ్తుండగా కుచేలుడు ఒకానొక వధూమణి మందిరంలో శ్రీకృష్ణుని దర్శించాడు. అప్పుడు కృష్ణుడు తన చెలికాడిని ఆదరించి, నీవిక్కడికి వస్తూ నాకేమి తెచ్చావు అని చిరిగిపోయిన ఉత్తరీయంలోని మూటను విప్పి ఒక గుప్పెడు అటుకులను ఆరగించాడు. ఇంకొక గుప్పెడు తీసికొని ఆరగించబోగా వారించినది ఎవరు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** సూర్యగ్రహణ సందర్భంగా శమంత పంచక క్షేత్రానికి శ్రీకృష్ణాదులు వెళ్ళి అక్కడ ఏఏ విధులను నిర్వర్తించారు?

**జవాబు :** బలరామకృష్ణులు రానున్న సూర్య గ్రహణాన్ని తెలిసికొని, ప్రజలందరూ తమ వెంటరాగా కుటుంబ సమేతంగా శమంత పంచక క్షేత్రానికి వచ్చారు. ఆ బలరామ కృష్ణులు తమ వారందరితో కూడి ఆ పుణ్యతీర్థాలలో స్నానాలు చేశారు. బంధువులందరితోకలిసి భోజనాలు చేసి సరస సల్లాపాలతో ప్రొద్దుపుచ్చారు. అంతకు ముందే అక్కడకు వచ్చిన ఇతర దేశాల క్షత్రియ శ్రేష్ఠులు ఆ యాదవ శ్రేష్ఠులను చూసి, ఈ ఉగ్రసేనాదులు శ్రీకృష్ణుణ్ణి చూస్తూ, మాట్లాడుతూ, శరీరాన్ని స్పృశిస్తూ, కొనియాడుతూ, కలిసి ప్రయాణంచేస్తూ, కూర్చుంటూ, శయనిస్తూ ఉన్నారు. శ్రీకృష్ణునితో బంధుత్వాలు, మిత్రత్వాలు కలిగే భాగ్యం వీరికెలా ప్రాప్తించిందో కదా! శ్రీకృష్ణ దయాలబ్ధమైన వైభవాలను పొందడానికి ఈ యాదవులందరూ ఏ జన్మలలో ఎంతపుణ్యం చేసికొన్నారోనని ఆ రాజ శ్రేష్ఠులంతా ఆశ్చర్యపడ్డారు. ఆ సమయంలో కుంతీదేవి తన కుమారులకు కౌరవులవల్ల కలిగిన అపకారాలను స్మరించుకొని తన అన్నగారైన వసుదేవునికి చెప్పుకొని కంట తడిబెట్టుకొని, శ్రీకృష్ణుని అనుగ్రహం చేత మేము ఆపదల నుండి గట్టెక్క గలిగాము అన్నది. అప్పుడు యశోద, నందుడు, గోపాలురూ, గోపికలూ శ్రీకృష్ణుని చూడటానికి పరమానందంతో వచ్చారు. బలరామ కృష్ణులు వినయ సుందరులై నంద, యశోదలకు నమస్కరించారు. యశోద బలరామ కృష్ణులను తన గుండెలకు హత్తుకున్నది. పరమానందం పొంగింది. దేవకీ, రోహిణీ యశోదా దేవిని ప్రేమతో కౌగిలించు కొన్నారు. గోపకాంతలు రాకరాక వచ్చిన తమ ప్రాణేశ్వరుడైన శ్రీకృష్ణుని దర్శించి, దేహాభిమానాలను విసర్జించి, అచ్యుతుని అనంత గుణాలను స్తుతించారు. ఈ విధంగా బలరామ కృష్ణులు తమ బంధు మిత్రులతో కలసి ఆనందంగా అక్కడ ఉన్నారు.

**5) ప్రశ్న :** శమంత పంచక క్షేత్రంలో అందరూ సంతోషంగా ఉన్న సమయంలో శ్రీకృష్ణుని భార్య లక్షణ, ద్రౌపదీదేవి ఏమేమి మాట్లాడుకొన్నారు?

**జవాబు :** శమంతక పంచక క్షేత్రంలో శ్రీకృష్ణుని అష్టభార్యలు, ద్రౌపదితో సల్లాపాలాడుతూ ఉన్న సమయంలో ద్రౌపది, మా అన్న శ్రీకృష్ణుడు మిమ్ములను

ఏవిధంగా వివాహమాడాడు అని అడుగగా అందరూ వారివారి వివాహాలను గురించిన విశేషాలను కండ్లకు కట్టినట్లు చెప్పారు. ఆ క్రమంలో లక్షణ అనే శ్రీకృష్ణ సతి ఓ పాంచాల రాజపుత్రీ! నేను మద్రరాజు పుత్రికను. నా తండ్రి నా వివాహానికి ఒక ఉపాయం ఆలోచించి మత్స్యయంత్రాన్ని ఏర్పాటుచేసి, క్రింద నీటిలోని ప్రతిబింబాన్ని చూచి పైన ఉన్న మత్స్యాన్ని కొట్టిన వారిని నాకుమార్తె వివాహ మాడగలదు అని ప్రకటించాడు. ఆ క్రమంలో ఎందరో రాజులు ప్రయత్నించి విఫలులైనారు. అప్పుడు శ్రీకృష్ణుడు విల్లెక్కుపెట్టి బాణం ప్రయోగించి అలవోకగా మత్స్య యంత్రాన్ని పడగొట్టాడు. నాకు పరమానందం కలిగింది. మందగమనంతో వెళ్ళి నాకళ్ళలో సిగ్గు తొణికిసలాడగా, నాచేత నున్న కనక కమల హారాన్ని శ్రీకృష్ణుని మెడలో వేశాను. ఆ శుభసమయంలో నానా విధాలైన మంగళ వాద్యాలు దిక్కులు పిక్కటిల్లేలా మ్రోగాయి. అంత శ్రీకృష్ణుడు నన్ను తన రథం మీద ద్వారకకు తీసికొని వచ్చాడు. మాతోపాటు మా తండ్రిగారు కూడా వచ్చాడు. కన్యారత్నంతో పాటు నా తండ్రి అమేయ రత్నాభరణాలు శ్రీకృష్ణునికి సమర్పించాడు. అంగరంగ వైభవంగాశ్రీకృష్ణునితో ద్వారకలో నా వివాహం జరిగింది అని లక్షణ ద్రౌపదితో చెప్పింది.

**తొంబై ఒకటవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 3. సుధాముడు 2. 4. అటుకలు

3. రుక్మిణీదేవి

* * *

# తొంబై రెండవ అధ్యాయము - దశమ స్కంధము

**1. నారదాది మహర్షుల సలహాతో వసుదేవుడు యజ్ఞం చేయడం 2. బలరామ కృష్ణులు చనిపోయిన తమ సోదరులను తెచ్చి తల్లి దేవకీ దేవికి చూపడం 3. సుభద్రా కల్యాణం**

**1) ప్రశ్న :** లీలామానుష విగ్రహులైన బలరామ కృష్ణులను సందర్శించాలనే కుతూహలంతో వ్యాసుడు, నారదుడు, గౌతముడు, కణ్వుడు, చవనుడూ, గార్గ్యుడు, గాలవుడు మొదలైన మహర్షులు ఎక్కడకు వచ్చారు?

**జవాబు :** 1. మధురానగరం 2. ద్వారకానగరం
3. హస్తినాపురం 4. కుశస్థలి

**2) ప్రశ్న :** నంద నందనుని దర్శించ వచ్చిన మహర్షులు ద్వారకలో పూజలందు కొన్నారు. వారంతా వసుదేవునితో మహావిష్ణువును గురించి ఒక యాగం చెయ్యి. దాని వలన నీకు ఏ ఋణం తీరుతుందని చెప్పారు?

**జవాబు :** 1. పితృఋణం 2. ఋషిఋణం
3. దేవఋణం 4. భాతృఋణం

**3) ప్రశ్న :** తేజోనిధులైన మహర్షులు చెప్పిన ప్రకారం వసుదేవుడు శమంత పంచక క్షేత్ర సమీపాన దేవేంద్ర వైభవంలో యజ్ఞం చేశాడు. ఆ శుభకార్యానికి వచ్చిన యశోదా, నందుడూ, గోప గోపికలు కొన్నాళ్ళు అక్కడ ఉన్నారు. ఉగ్రసేనుడూ, వసుదేవుడూ, బలరామ కృష్ణులు బలవంతం చేసి ప్రార్థించగా అక్కడ వారు ఎన్నాళ్ళున్నారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** బలరామకృష్ణులను తమ తల్లి దేవకీదేవి ఏ కోరిక కోరింది? అందుకు ఆ అన్నదమ్ము లిద్దరూ ఏమి చేశారు?

**జవాబు :** చనిపోయిన గురుపుత్రుని మళ్ళీ తెచ్చి ఇచ్చారని బలరామ కృష్ణులను, ప్రజలు కథలు కథలుగా చెప్పుకుంటుంటే విని దేవకీదేవి బలరామ కృష్ణుల

వద్దకు వచ్చింది. నాయనలారా! మీరు పూర్వం మృతుడై యమలోకంలో ఉన్న గురుపుత్రుణ్ణి తెచ్చి గురుదక్షిణగా సమర్పించిన మహాత్ములు. మీ ప్రభావాన్ని లోకులు వేనోళ్ళ కొనియాడారు. కావున మహానుభావులారా! అలాగే కంసుడు సంహరించిన నా బిడ్డలను తెచ్చి, నా శోకాన్ని నివారింప సమర్థులు మీరే అని కన్నీరు నింపింది. ఇలా ప్రార్థించగా బలరామకృష్ణులు తమ తల్లి పలికిన పలుకులు ఆలకించి, తమ మాయా ప్రభావంతో సుతలానికి వెళ్ళారు. సుతులలోక నివాసియైన బలిచక్రవర్తి బలరామ కృష్ణులకు ఎదురేగి, స్వాగతం పలికి ఉచితాసనాలపై కూర్చొండజేసి పూజించాడు. ఆ దేవదేవుని ఎన్నో విధాల కీర్తించాడు. అనంతరం స్వామీ మీ దాసుణ్ణి. నీ ఆజ్ఞకు బద్ధుణ్ణి, మీరు ఇక్కడకు వచ్చిన పని ఏమిటో తెలుపుమనగా, శ్రీకృష్ణుడు బలి దైత్యేంద్రా! మా తల్లి దేవకీదేవి ప్రసవించిన ఆరుగురు బిడ్డలను, కంసుడు రాక్షసత్వంతో చంపివేశాడు. ఇప్పుడు మాఅమ్మ అయిన దేవకీదేవి పుత్రశోకంతో కుమిలిపోతూ వారిని చూడాలని కోరింది. ఆమె కోరిక తీరుస్తామని మాట ఇచ్చాము. ఇప్పుడు ఆ ఆరుగురు నీదగ్గర ఉన్నారు. వీరిని తోడ్కొనిపోయి భూలోకంలో ఉన్న మా తల్లి శోకాన్ని పోగొడతాము. నా అనుగ్రహం వల్ల వీరికి సుగతి ప్రాప్తిస్తుంది అని పలికి బలి అనుమతితో, దేవకీ తనయులను తీసికొని వచ్చి అమ్మకు చూపి అమ్మా! ఇదుగో వీరే నీ బిడ్డలు చూడుమని బలరామ కృష్ణులు దేవకీదేవితో పలికారు. ఆమెకు పుత్రవాత్సల్యం పొంగి పొరలింది. వారందరినీ ఆలింగనం చేసుకొని ఒడిలో కూర్చో బెట్టుకొంది. అటు తరువాత వైష్ణవ మాయ ప్రభావం చేత, శ్రీకృష్ణుని స్పర్శచేత, వారికి లోగడ బ్రహ్మశాపం తొలగి స్వస్వరూపాలతో తమతమ స్థానాలు చేరుకున్నారు. ఈ విధంగా బలరామ కృష్ణులు తల్లి కోరిన కోరిక దీర్చి ఆమెను సంతోషపెట్టారు.

**5) ప్రశ్న :** అర్జునుడు శ్రీకృష్ణుని చెల్లెలైన సుభద్రను ఏరీతిగా వివాహమాడాడు?

**జవాబు :** అర్జునుడు తన తీర్థయాత్రలో భాగంగా ప్రభాస తీర్థం చేరుకుని, అక్కడ నుండి ద్వారకా నగరం దగ్గర అని తెలిసికొని, సుభద్రమీద తనకున్న ప్రేమాతిశయం చేత ఆమెను చూడాలని అతని మనస్సు తహతహ లాడింది.

బలరాముడు సుభద్రను దుర్యోధనున కిచ్చి వివాహం చేయాలనుకుంటున్న విషయం కూడా అర్జునుడు విన్నాడు. యాదవులకు తాపసుల, విప్రులపట్ల భక్తి మిక్కుటమని తెలిసి అర్జునుడు సన్యాసి వేషంతో ద్వారకలో ప్రవేశించాడు. తన సంకల్పం సఫలం చేసుకోవటం కోసం వర్షాకాలం పోయేంత వరకు, అర్జునుడు శ్రీకృష్ణుడికి తప్ప మరెవరికీ అనుమానం రాకుండా ద్వారక లోనే ఉన్నాడు. ఒకనాడు బలరాముడు కపట సన్నాసిని అర్జునుడని తెలియక అంతఃపురంలోకి భిక్షకోసం ఆహ్వానించాడు. అక్కడ కొంతకాలముండగా సుభద్రార్జునులు ఒకరినొకరు తెలిసికొని, సరస్పరం ప్రగాఢంగా ప్రేమించుకొన్నారు. ఒకనాడు అర్జునుడు శ్రీకృష్ణ, దేవకీ వసుదేవుల అనుమతితో, దేవతా మహోత్సవానికి నగరం వెలుపలకు వచ్చిన సుభద్రను, రథంమీద కూర్చుండ బెట్టుకొని తీసికొని పోసాగాడు. యాదవ వీరులు కొందరు అడ్డగించినా లెక్కచేయక ముందుకుసాగి ఇంద్రప్రస్థానికి చేరుకున్నాడు. బలరామునికీ వార్త తెలిసి శ్రీకృష్ణునితో, నీకు తెలియకుండానే పాండవమధ్యముడు ఇంత చేశాడా అన్నాడు. అందుకు శ్రీకృష్ణుడు, ఇంకా కొందరు ఆత్మబంధువులు, బలరాముని అనునయ వాక్యాలతో అంగీకరింప జేశారు. బలరాముడు కోపం మానుకొని ఏనుగులూ, రథాలూ, అశ్వాలూ, బంగారు ఆభరణాలూ, దాసదాసీ జనాన్ని శ్రీకృష్ణునితో కలిసి సుభద్రార్జునుల పరిణయానికి అరణంగా పంపాడు. ఆ విధంగా ఇంద్రప్రస్థ నగరంతో ఆత్మీయుల సమక్షంలో, సుభద్రార్జునుల వివాహం వైభవంగా జరిగింది.

### తొంబై రెండవ అధ్యాయము - దశమ స్కంధము

**జవాబులు :** 1. 2. ద్వారకానగరం 2. 3. దేవఋణం

3. మూడు నెలలు

* * *

## తొంబై మూడవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శ్రీకృష్ణుడు ఋషి సమేతుడై మిథిలానగరానికి వెళ్ళడం 2. శ్రుతిగీతలు 3. విష్ణుసేవా ప్రాధాన్యతను శుకయోగి పరీక్షిత్తుకు తెలపడం**

**1) ప్రశ్న :** ఒకనాడు శ్రీకృష్ణుడు తన భక్తులను తన దర్శనంతో తరింప జేయడానికి, కొందరు మహర్షులతో కలిసి విదేహ రాజ్యంలోని మిథిలా నరానికి వెళ్ళాడు. శ్రీకృష్ణుడు వస్తున్నాడని తెలిసికొని చాలా సంతోషించి, ఆయనకు ఎదురు వెళ్ళి స్వాగతం పలికి తన ఇంటికి ఆహ్వానించి, ఋషులందరితోనూ, శ్రీకృష్ణుని పూజించి ఆయన కృపకు పాత్రుడైన మిథిలాపుర రాజు ఎవరు?

**జవాబు :** 1. బహులాశ్వుడు 2. సీరధ్వజుడు 3. కుశధ్వజుడు 4. రోమపాదుడు

**2) ప్రశ్న :** మహర్షులతో కలిసి మిథిలానగరానికి వెళ్ళిన శ్రీకృష్ణునికి భక్తితో ఆతిథ్యమిచ్చిన బహులాశ్వునితో పాటు ఒక భూసురుడు శ్రీకృష్ణుని చూచి ఓ దయాసాగరా! నీవూ, ఈ మునీశ్వరులూ మా గృహానికి వచ్చి మమ్ము అనుగ్రహించాలి అని ప్రార్థించాడు. అందుకు కృష్ణుడు సంతోషించి అనుగ్రహించాడు. ఆ విప్రుని పేరేమి?

**జవాబు :** 1. కుచేలుడు 2. ఉద్ధవుడు 3. శృతదేవుడు 4. అక్రూరుడు

**3) ప్రశ్న :** మునులతో కలిసి శ్రీకృష్ణుడు మిథిలానగరంలో బహులాశ్వుని, శృతదేవుని ధన్యులనుగా జేసి, మీ పూర్వజన్మల పుణ్యఫలం పండి, ఈనాడు ఈ మహర్షులునా వెంట మీ ఇండ్లకు వచ్చారు అని వారిరువురిని కరుణతో కటాక్షించి వారికి శుభాలను ప్రసాదించి వారి దగ్గర సెలవు తీసికొని మునులతో పాటు ఎక్కడకు వెళ్ళాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** పరీక్షిత్తు కోరిక మేరకు శుక మహర్షి పరబ్రహ్మ తత్త్వంతో కూడిన నారాయణో పాఖ్యానాన్ని ఏరీతిగా తెలిపాడు?

**జవాబు :** పరీక్షిత్తుతో శ్రీశుకయోగి మహారాజా! సర్వాంతర్యామియైన భగవంతుడు, సమస్త చేతన వర్గానికీ జ్ఞానాన్ని ప్రసాదించే వాడు కనుక వేదాదులు, ఆ పరమేశ్వరుని స్వరూప గుణ వైభవాలను స్తుతిస్తూ ఉంటాయి. నీ సంకల్పానికి అనుగుణంగా అఖిల బ్రహ్మాండాలలో అంతర్యామిగా ఉంటూన్న నారాయణుడు, సమస్త ప్రాణుల కధీశ్వరుడు. ఆయనను తెలిసిన కొందరు తన చరణార విందాలను సదా సేవిస్తూ పరమానందం పొందుతారు. ఆ ప్రభువు అసలైన స్వరూపాన్ని ప్రత్యక్షంగా చూడటం ఎవరికీ సాధ్యం కాదు. ఆ దేవదేవుని సాక్షాత్కరించుకొన్న పరమయోగులకు ఈ సృష్టిలో ఆ ప్రభువు తప్ప తక్కిన సమస్త పదార్థాలూ అసత్యాలనిపిస్తాయి. నిర్వికారుడై స్వతంత్రుడైన ఆ దేవునికి బ్రహ్మాదులు వశులై ఉంటారు. ఈ చరాచర ప్రపంచానికి ఆయనే అధీశ్వరుడు. కనుక ఆ భగవంతుని కృపకు పాత్రులైన వారికి, మోక్షం కరతలామలకం అవుతుంది. ఆయన దయకు పాత్రులు కాని దుష్టాత్ములు దుర్గతిపాలై, బహువిధ శరీరధారులై అణు రూపంగా ఉంటారు. అలాంటి వారిలోనూ అంతరాత్మయై తానుంటాడు. నిరంతరం సతీసుతుల మీదా, గృహ క్షేత్రాదుల మీదా అనురక్తి పెంచుకొన్నవాడు ఈ సంసార సాగరం నుంచి ఎన్నటికీ గట్టెక్కలేడు. సమస్త శరీరధారులలో అంతర్యామియై ఉండే ఆయనకు కర్మ ఫలాలు సోకవు. కర్మ ఫలభోక్త అయిన జీవునకు సాక్షీభూతుడై ఉంటాడు. సకల బ్రహ్మాండానికి నాయకుడైన ఆయన యందు వేదాలు వర్తిస్తూ ఉంటాయి. పరీక్షిన్మహారాజా! నేను నీకు తెలిపిన ఈ నారాయణో పాఖ్యానము సకల వేద శాస్త్ర పురాణ సారం, ఉపనిషత్తులకు సమానం. దీనిని నారద మహర్షి నా తండ్రియైన వేదవ్యాసునికి తెలిపాడు. ఆ మహాత్ముడు నాకు తెలిపిన విధంగా దానిని నీకు నేను సవిస్తరముగా చెప్పాను అని శుకమహర్షి తెలిపాడు.

**5) ప్రశ్న :** శివుని సేవించే వారిలో తేడాలను గురించి అడుగగా పరీక్షిత్తుకు మహాయోగి పుంగవుడు ఏమని సమాధానం తెలిపాడు?

**జవాబు :** శుకమహర్షి పరీక్షిత్తుకు శివకేశవప్రాశస్త్యాలను తెలుపుతూ శివుడు మహాశక్తి సంపన్నుడు. సత్త్వ రజ స్తమోగుణాలతో కూడుకొన్నవాడు. కనుక పరమ శివుని సేవించేవారు ఐశ్వర్య వంతులౌతారు. శ్రీహరి త్రిగాణాతీతుడు. అతణ్ణి కొలిచేవారు కూడా రాగరహితులే. వారు సంపదలు కోరరు. ధర్మరాజు రాజసూయ యాగం చేసిన తరువాత నారదాది మహర్షుల వలన ఎన్నో పుణ్య కథలను విన్నాడు. అతడు నన్ను నీవడిగి నట్టుగానే శ్రీకృష్ణుని అడిగాడు. అందులకు ఆ పురషోత్తముడు మహారాజా! ఎవరిపై నాకనుగ్రహం కలుగుతుందో ఆ ఉత్తముని సమస్త సంపదలనూ నేను హరిస్తాను. అతడు నిస్సహాయుడై అన్నింటినీ త్యజించి అవ్యయానంద చిత్తుడై వైకుంఠప్రాప్తికి అర్హుడౌతాడు. కనుక నన్ను సేవించటం చాలా కష్టమని తలచి కొందరు ఇతర దేవతలను ఆరాధిస్తారు. అలా ఆరాధించి ఆ దేవతలవల్ల ప్రాప్తించిన ఐశ్వర్యాలను నిజమని తలపోస్తూ ఉంటారు. కాని శాశ్వతమైన జన్మ రాహిత్యాన్ని తెలిసికొనలేరు అని శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు తెలిపాడు.

**తొంబై మూడవ అధ్యాయము – దశమ స్కంధము**

**జవాబులు :** 1. 1. బహుళాశ్వుడు 2. 3. శృతదేవుడు
3. ద్వారకకు

* * *

## తొంబై నాలుగవ అధ్యాయము - దశమ స్కంధము

**1. శివద్రోహం చేయబూనిన వృకాసురుడు విష్ణుమాయచే కూలి పోవడం 2. త్రిమూర్తులను సోధించుటకై భృగుమహర్షి వెళ్ళడం 3. మృతులైన విప్రసుతులను శ్రీకృష్ణార్జునులు తేవడం**

**1) ప్రశ్న :** శకుని అనే రాక్షసుని కుమారుడు వృకాసురుడు. ఈతడు ఒకసారి నారదమహర్షిని చూచి మునీశ్వరా! త్రిమూర్తులలో ఎవరు తమ్ము సేవించే భక్తులకు శీఘ్రంగా వరాలిస్తారు? అని ప్రశ్నించాడు. అందుకు నారద మహర్షి సుగుణవంతుల మీద అనుగ్రహాన్ని వెను వెంటనే చూపే దైవం ఎవరుగా వృకాసురునికి తెలిపాడు?

| **జవాబు :** | 1. విష్ణువు | 2. శివుడు |
|---|---|---|
| | 3. బ్రహ్మ | 4. ఎవరూ కాదు |

**2) ప్రశ్న :** నారద మహర్షి మాటలు విని వృకాసురుడు కేదార తీర్థానికి వెళ్ళి, అక్కడ మహేశ్వరుణ్ణి గురించి తపస్సు చేశాడు. ఆ తపస్సుకు మెచ్చిన శివుడు భక్తుడు అడిగిన వరమిచ్చాడు. ఆ వరాన్ని వృకాసురుడు ఎవరిపై పరీక్షింప బూనుకొన్నాడు?

| **జవాబు :** | 1. ఇంద్రునిపై | 2. నారద మహర్షిపై |
|---|---|---|
| | 3. నారాయణునిపై | 4. శంకరునిపై |

**3) ప్రశ్న :** వరగర్వంతో వృకాసురుడు శివుని తలపైనే చేతులుంచాలని తెగించాడు. అది గమనించిన శివుడు వైకుంతానికి వెళ్ళాడు. ఆ విషయం గ్రహించిన నారాయణుడు వటురూపంలో వృకాసురుని చేరి, శివుడు నీకు ఇచ్చిన వరం పనిచేయదు. లేనిపోని శంకలు పెట్టుకోక వెళ్ళు అని తన విష్ణుమాయను ఆవరింపజేశాడు. అప్పుడు వృకుడు తన్ను తాను మరచి తన చేతులను తన తల పైనే ఉంచుకొన్నాడు. అప్పుడేమి జరిగింది?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** త్రిమూర్తులలో సత్త్వగుణ ప్రధానుడైన దైవం ఎవరు? అని అత్యంత ప్రతిభాశాలురైన మహర్షుల మధ్య వచ్చిన ప్రధానాంశాన్ని వారు ఎవరిని పంపి సందేహనివృత్తి చేసుకొన్నారు. వెళ్ళిన మహర్షి ఏ రీతిగా సత్వగుణ ప్రధానమైన దైవాన్ని నిర్ణయించి చెప్పాడు?

**జవాబు :** ఒకప్పుడు సరస్వతీ నదీ తీరాన ఎందరో మహర్షులు, ఒకచోటచేరి పలుయాగాలు వైభవోపేతంగా నిర్వహిస్తున్నారు. ఆ సమయంలో వారి మధ్య సత్త్వగుణ ప్రధానమైన దైవం త్రిమూర్తులతో ఎవరు? అనే చర్చ వచ్చింది. వారెటూ నిర్ణయించలేక త్రిమూర్తుల మాహాత్మ్యాలను తెలుసుకొని రావలసిందని భృగుమహర్షిని పంపారు. భృగుమహర్షి బ్రహ్మదేవుని కొలువులోకి ప్రవేశించి, బ్రహ్మను స్తుతించకుండా మౌనంగా నిలబడ్డాడు. పితామహుడు అతణ్ణిచూసి రుసరుస లాడాడు. కలతపడ్డాడు. బ్రహ్మ తన రోషాన్ని ఎలాగో చల్లార్చు కొన్నాడు. అంతట భృగువు బ్రహ్మను తమోగుణ ప్రధానుడని తలపోసి కైలాసం వెళ్ళాడు. అక్కడ శివుడు భృగువురాకకు సంతోషించి ఆతనిని కౌగలించుకొని ఆప్యాయతను చూపాలని ప్రయత్నించాడు. కాని భృగువు నిర్వికారంగా నిలబడ్డాడు. అందుకు శివుడు భృగువును కోపించి తన శూలంతో పొడవడానికి ప్రయత్నించాడు. పార్వతీదేవి వారించింది. అంతట భృగువు శివుడు రజోగుణ ప్రధానుడని నిర్ణయించుకొని, తాను నేరుగా వైకుంఠానికి వెళ్ళాడు. ఆ సమయంలో విష్ణువు లక్ష్మీదేవి ఒడిలో తలపెట్టుకొని పవళించి ఉన్నాడు. భృగువు వడివడిగా విష్ణువుకు దగ్గరగా వెళ్ళి ఆ నారాయణుని వక్షఃస్థలంపై తన్నాడు. అంతట ఆ పురుషోత్తముడు నిర్వకారంగా పాన్పు నుండి దిగి వచ్చి ఓ తపోధనా! నీ రాకను గురించి తెలియక నేను చేసిన అపరాధాన్ని మన్నించవయ్యా! నీ రాక మాకు శుభదాయకం. ఈ మణిమయ సింహాసనాన్ని అలంకరించుమని మధురంగా మాట్లాడాడు. అటు పిమ్మట భృగువు వైకుంఠాన్ని వీడి మునులతో కలిసి జరిగిన విషయమంతా చెప్పి సత్త్వగుణ ప్రధానుడైన దైవం నారాయణు డొక్కడే అని ఆ మునులందరూ నిర్ణయించి మహావిష్ణువును భక్తితో సేవించి వైకుంఠ ప్రాప్తిని పొందారు. ఈ రీతిగా సత్త్వగుణ ప్రధాన దైవ నిర్ణయం జరిగినది.

**5) ప్రశ్న :** శ్రీకృష్ణుడు ఒక బ్రాహ్మణుని చనిపోయిన కుమారులను ఏ రీతిగా తెచ్చి ఇచ్చాడు?

**జవాబు :** శ్రీకృష్ణుడు కుశస్థల నగరంలో ఉండగా రాజమార్గాన వెళ్తున్న అర్జునునికి, తొమ్మిది మంది బిడ్డలు వరుసగా చనిపోయి పుత్ర శోకంతో ఉన్న విప్రుడు కనిపించాడు. ఆతని ద్వారా జరిగినదంతా గ్రహించినఅర్జునుడు, తాను ఆ విప్రసుతులను తెచ్చి ఇస్తాను అని ప్రతిజ్ఞ చేశాడు. కానిఆ దిశగా ప్రయత్నించి కూడా విఫలుడై, ప్రాయోపవేశానికి ప్రయత్నిస్తుండగాశ్రీకృష్ణుడు వారించి అర్జునునితో ఆ విప్రసుతులను నేను చూపిస్తాను రమ్మని, రథాన్ని అధిరోహించారు. అంత ఆ కృష్ణార్జునులు వైకుంఠానికి వెళ్లారు. అక్కడ తనను సేవించే భక్తుల నడుమ శ్రీదేవి, భూదేవితో కూడివున్న శ్రీమన్నారాయణునికి శ్రీకృష్ణార్జునులు చేతులు జోడించి సంస్తుతించారు. ఆ ఆదిదేవుడు వారిని దయతో చూచి ధరణికి భారమైన దైత్యులనుసంహరించి, ధర్మాన్ని రక్షించడానికి మీరిద్దరూ నా అంశతో నరనారాయణులుగా జన్మించారు. మిమ్ములను చూడాలని ఇక్కడ మహా మునీశ్వరులు కోరారు. అందు కొరకు మీరిక్కడకు రావాలనే ఉద్దేశంతో, ఆ బ్రాహ్మణ కుమారులను ఇక్కడికి తెప్పించ వలసి వచ్చింది. ఈ బాలకులను మీరు తీసికొని వెళ్ళవచ్చు అని పలికి ఆ బాలకుల నిచ్చి విష్ణువు వారికి వీడ్కోలు చెప్పాడు. శ్రీకృష్ణార్జునులువినయంతో భగవంతుని స్తుతించారు. అటు పిమ్మట ఆ విప్ర బాలకులను తెచ్చి తమ తండ్రికి సమర్పించారు. ఆ బిడ్డలను చూచి బ్రహ్మణుడు ఎంతో సంతోషించాడు.

### తొంబై నాలుగవ అధ్యాయము - దశమ స్కంధము

**జవాబులు :** 1.2. శివుడు 2.4. శంకరునిపై

3. వృకాసురుడు తల పగిలి మరణించాడు

* * *

## తొంబై ఐదవ అధ్యాయము - ఏకాదశ స్కంధము

**1. పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రు నడిగిన ప్రశ్న 2. నారదాది మహర్షులు శ్రీకృష్ణ దర్శనానికి రావడం**

**1) ప్రశ్న :** పరీక్షిన్మహారాజుతో శుకయోగీంద్రుడు మహారాజా! పుట్టుకర్మ, రోగం వీటి నుండి విముక్తి కలగడానికి కారణమైన దివ్యౌషదము దేనినిగా స్థిరీకరించి చెప్పాడు?

**జవాబు :** 1. వనమూలికా వైద్యం 2. నారాయణ చరితామృతం
3. సాంసారిక అనుబంధం 4. మహారాజ పదవి

**2) ప్రశ్న :** వాసుదేవుడు తన అవతార ప్రాధాన్యతను అనుసరించి, భూమి పైనున్న అనేక మంది రాజులను, సైన్యాన్ని అంతమయ్యేటట్లుగా చేశాడు. అటుపిమ్మట తన భక్తులైన యాదవులను కూడా అంతం చేయాలని భావించాడు. కాని దానికి ఎవరు కర్త కావాలి అని తలపోశాడు?

**జవాబు :** 1. తనకు తానుగా పూనుకోవాలని 2. రాక్షసులను ఉసిగొల్పి
3. ఇతర రాజన్యులు 4. బోయవానిని

**3) ప్రశ్న :** తన అనుయాయులైన యాదవులను సంహరించడానికి నేనే తప్ప వేరే ఇంకెవ్వరు లేరని భావించిన శ్రీకృష్ణుడు, యదు వంశ నాశనానికి మూల కారణంగా దేనిని చూపించాలను కొన్నాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శ్రీకృష్ణ సందర్శనార్థమై వచ్చిన మహర్షులు ఎవరు? వారు ఆ స్వామిని ఏవిధంగా దర్శించుకొన్నారు? వాసుదేవుడు వారిని ఏ రీతిగా ఆదరించాడు?

**జవాబు :** జటావల్కలాలూ, కమండలాలూ ధరించిన మహర్షులు విశ్వామిత్రుడు, అసితుడు, దుర్వాసుడు, భృగువు, అంగీరసుడు, కశ్యపుడు, కణ్వుడు, వాలఖిల్యులు, అత్రి, వశిష్టుడు, నారదుడు మొదలైన మునిశ్రేష్ఠులు

స్వేచ్ఛావిహారం చేస్తూ శ్రీకృష్ణ దర్శనాభిలాషతో ద్వారకా నగరానికి వచ్చారు. వచ్చిన మహర్షులకు శ్రీకృష్ణుడు ఉచిత రీతిని అర్ఘ్యపాద్యాదులర్పించాడు. వారంతా ఉన్నతాసనాలపై ఆసీనులైన అనంతరం శ్రీకృష్ణునితో పద్మనాభా! నీ దివ్య చరణాలు భవసముద్రం దాటించే తెప్పలవంటివి. నిగమములకు అలంకారాలైనవి. ఆర్తులైన వారికి శరణాలైనవి. ఒకమాటు అణువంత రూపం పొందుతావు. ఒకప్పుడు పెద్ద ఆకృతి ధరిస్తావు. అంతా నీవై అనేక రూపాలు ధరిస్తున్న నీ మహిమస్తోత్రం చెయ్యటానికి అలవిగాక ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. ఇలా ఎన్నో విధాల స్తోత్రం చేసిన మునివరులను సాభిప్రాయంగా చూచి శ్రీకృష్ణుడు నా ధ్యానం, నా నామ స్మరణం పునర్జన్మనూ, వ్యాధులనూ హరిస్తుంది. బ్రహ్మ రుద్రాదులకు శరణమైనది. మంగళ ప్రదమైనది అని పలికి ఆ యోగీశ్వరేశ్వరుడు 'మీరిక్కడికి ఎందుకు వచ్చారు' అని అడిగాడు. అందుకు వారు 'మీ పాద పద్మాలను దర్శించటం కన్న వేరే విశేష మేముంటుంది?' అని వాసుదేవునితో వెళ్ళివస్తాము అని చెప్పి వారు బయలుదేరి ద్వారకకు దగ్గరలో 'పిండారక' మనే పుణ్య తీర్థానికి వెళ్ళారు.

**5) ప్రశ్న :** యాదవ వంశ నాశన కారకమైన ముసలం ఎలా పుట్టింది? ఆ ముసలాన్ని యాదవులు ఏమిచేశారు?

**జవాబు :** శ్రీకృష్ణదర్శనార్థమై ద్వారకకు వచ్చి మహర్షులు వెళ్తూన్న సమయంలో, యాదవ బాలకులు కొందరు పొగరెక్కి తమ నేర్పుతో జాంబవతి కుమారుడు సాంబునకు అందమైన ఆడువేషం వేసి, కప్పురపు తావిగల కలికిగా తీర్చిదిద్దారు. వారు సాంబుని ముందుంచుకొని, ముని సమూహానికి సాగిలపడి మ్రొక్కి, ఎత్తుగా కనబడుతున్న బరువైన గర్భంగల ఈ అమ్మాయి కడుపులో మగపిల్లవాడున్నాడా? ఆడపిల్ల ఉందా? చెప్పండి అని ఆ మునులను అడిగారు. ఆ మాటలకు మహర్షులకు బాగా కోపం వచ్చింది. ఆ బాలురను చూసి మావంటి వారితో హాస్యం చేస్తారా! నిశ్చయంగా యదువంశాన్ని నాశనం చేసే రోకలి ఒకటి ఈ వ్యక్తికి పుడుతుంది. ఆలస్యం లేదు. ఇక పొండి అని పలికారు. మత్తుతో ఉద్రేకించిన యాదవ బాలురు మునుల శాపం విని

భయపడి, సాంబుని పొట్టచుట్టూ చుట్టిన చీరను విప్పుతుంటే, ఆచీర లోపల నుంచి ఇనుపరోకలి ఒకటి నేలమీద పడింది. వారు ఆశ్చర్యపడి శ్రీకృష్ణుని సన్నిధిలో పెట్టి జరిగినదంతా చెప్పారు. అంతా తనకు తెలిసికూడా తెలియని వానివలె వాసుదేవుడు మీ బుద్ధి చెడిపోయింది. పొగరెక్కి తప్పుడు మాటలతో ఆ మహా మునులకు కోపం తెప్పించారు. మునుల శాపం తప్పదు. వారిని నిందించటం వలన యదువంశం నాశనం కాక తప్పదు. ఉగ్రసేనుని అనుమతితో ఆ ముసలాన్ని సముద్రం ఒడ్డున ఒక పెద్ద బండమీద దానిని అరగదీసి యాదవులు ఆ పొడిని సముద్రంలో కలిపారు. పొడిచేయగా మిగిలిన కీలకమైన లోహపు ముక్కను లెక్కించక సముద్రంలో పడవేశారు. దానిని ఒక చేపమింగింది. ఆ చేపను ఒక బోయవాడు వలవేసి పట్టుకొని దాని కడుపులో ఉన్న ఇనుప ముక్కను తన బాణం చివర ములికిగా చేసుకున్నాడు. ఈ విధంగా రోకలిని యాదవులు సముద్రంలో కలిపారు.

**తొంబై ఐదవ అధ్యాయము – ఏకాదశ స్కంధము**

**జవాబులు :** 1. 2. నారాయణ చరితామృతం
2. 1. తనకు తానుగా పూనుకోవాలని 3. బ్రాహ్మణశాపం

* * *

## తొంబై ఆరవ అధ్యాయము - ఏకాదశ స్కంధము

**1. నారద మహర్షి వసుదేవునికి విదేహఋషభ సంవాదాన్ని తెలపడం 2. బ్రహ్మాది దేవతలు శ్రీకృష్ణుని వైకుంఠానికి పిలువవచ్చుట 3. శ్రీకృష్ణుడు ఉపద్రవాలను గమనించి యాదవులందరిని ద్వారక నుండి ప్రభాస తీర్థానికి పంపడం**

**1) ప్రశ్న :** శ్రీకృష్ణ దర్శనార్థమై ద్వారకకు వచ్చిన నారద మహర్షిని వసుదేవుడు పూజించి శ్రీమహాభాగవతంలోని కథలలో ఉన్న ధర్మాలను తెలుపుమని కోరగా, ఆయన వసుదేవునకు ఏ పురాతన పుణ్యకథను వినిపించాడు?

**జవాబు :** 1. రుక్మిణీ కల్యాణ ఘట్టాన్ని 2. అవదూత యదు సంవాదం
3. విదేహ ఋషభ సంవాదం 4. విదుర, ఉద్ధవుల సంవాదం

**2) ప్రశ్న :** స్వాయంభువ మనువుకు నాలుగవ తరం వాడు ఋషభుడు. ఈయనకు కలిగిన వంద మంది కొడుకులలో తొమ్మిది మంది బ్రహ్మ విద్యా విశారదులై, శ్రీహరి భక్తులై అన్ని లోకాలలోనూ తిరిగారు. ఈ తొమ్మిది మంది లోకంలో ఏ పేరుతో ప్రఖ్యాతులైనారు?

**జవాబు :** 1. అసురులు 2 విద్యాధరులు
3. గరుడులు 4. ఋషభులు

**3) ప్రశ్న :** ఋషభ కుమారులు భగవంతుని ప్రతిబింబాలైన పరమ పురుషులవలె, విదేహ రాజుకు మోక్షం పొందే భగవద్భక్తి ధర్మాలను ఉపదేశించి వారు ఎక్కడకు వెళ్ళారు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శ్రీకృష్ణుని పరమపదాన్ని చేరరమ్మని పిలుచుటకు ఎవరెవరు వచ్చారు? ఏ రీతిగా వారు ఆయనను ఆహ్వానించారు?

**జవాబు :** లోకాలను రక్షించడం కోసమే భగవంతుడు కృష్ణుడుగా అవతరించాడు అని హరిభక్తి పరాలైన ఉపాఖ్యానాలను నారదుడు చెప్పగా విని, దేవకీ

వసుదేవులు ఆశ్చర్య చకిత మానసులై శ్రీకృష్ణుని పరమాత్మగా భావించారు అని తెలుపగా పరీక్షిత్తు, మహర్షీ శ్రీహరి గాథామృతాన్ని ఎంత విన్నా తనివితీరుట లేదు. అనంతరం ఏమయినది? వివరంగా తెలుపు మనగా శ్రీశుకుడు రాజా! విను. ఒకసారి సురులు, గరుడులు, విద్యాధరులు, రుద్రుడు, బ్రహ్మ మొదలైన దేవతలూ, మునులూ పద్మాక్షుని చూడటానికి ద్వారవతికి వచ్చారు. వారంతా వేదసూక్తాలతో ఆ పద్మాక్షుని స్తుతించారు. సర్వలోకాధినాథా! సర్వేశ్వరా! పుట్టుకలేని వాడవై కూడా భూభారం తగ్గించటంకోసం నీవు పుట్టావు. నీవు జన్మించి ఇప్పటికి నూట ఇరవై ఐదు సంత్సరాలు గడిచాయి. ఇక పరమపదమైన వైకుంఠానికి వేంచేయి అని దేవతా సమూహాలు ప్రార్థించగా శ్రీకృష్ణుడు వారితో 'యాదవులకు పరస్పర శతృత్వాన్ని కల్పించి వారిని రూపుమాపి భూభారం తగ్గించి వస్తాను. అందుకు సమయమాసన్నమైంది. మీరు పొండి అని చెప్పి వాళ్ళందరినీ వీడ్కొలిపాడు. బ్రహ్మాది దేవతలు తమ తమ స్థానాలకు వెళ్ళారు.

**5) ప్రశ్న :** యాదవులను శ్రీకృష్ణుడు ప్రభాస తీర్థానికి ఏ కారణంగా పంపించాడు?

**జవాబు :** ఒకనాడు శ్రీకృష్ణుడు యాదవులనందరినీ చేరబిలచి యాదవులారా! కాకులూ, గుడ్లగూబలూ బంగారు మేడలపై పగలు అనేక విధాలుగా ఏడుస్తున్నాయి. గుర్రపుతోకల యందు మంటలు పుట్టుచున్నవి. చిలుకలూ, గోరువంకలూ, రాత్రులందు వికార స్వరాలతో అరుస్తున్నాయి. ఒక జంతువు మరొక జాతిజంతువును కంటున్నది. నివాసగృహాలలో పుట్టగొడుగులు పుడుతున్నాయి. సూర్యభింబాన్ని కావిరి కమ్ముకొంటున్నది. ఈ విధంగా చాలా ఉత్పాతాలు కనిపిస్తున్నాయి. కనుక ఇక్కడ ఉండవద్దు. మీరంతా ఆలస్యం చెయ్యకుండా ప్రభాస తీర్థానికి వెళ్ళండి అని శ్రీకృష్ణుడానతిచ్చాడు. నారాయణుని మాటలు ఆలకించి యాదవులందరూ భార్యలతో, బిడ్డలతో, మిత్రులతో కలిసి ఏనుగులనూ, గుర్రాలనూ, సైన్యాలనూ తీసికొని వేగంగా ప్రభాస తీర్థానికి వెళ్ళారు. అప్పుడు జ్ఞాన వంతుడైన ఉద్ధవుడు తన మనస్సులో ఈ

విషయమంతా తెలుసుకొని లక్ష్మీవల్లభా! శ్రీహరీ! దీనజనులకు కల్పవృక్షం వంటివాడవూ, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవూ అయిన నీవే మాకు దిక్కు అని స్తుతించాడు.

## తొంబై ఆరవ అధ్యాయము – ఏకాదశ స్కంధము

**జవాబులు :** 1. 3. విదేహ ఋషభ సంవాదము   2. 4. ఋషభులు
3. అంతర్ధానమయ్యారు

* * *

# తొంబై ఏడవ అధ్యాయము - ఏకాదశ స్కంధము

**1. శ్రీకృష్ణుడు ఉద్ధవునికి పరమార్థోపదేశం చేయడం 2. అవదూత -యదు సంవాదం 3. శ్రీకృష్ణ బలరాములు వైకుంఠానికి వెళ్ళడం**

**1) ప్రశ్న :** శ్రీకృష్ణుడు ఉద్ధవుని పైగల వాత్సల్యంతో ఉద్ధవా! ఒకరోజు యదురాజు దగ్గరకు ఎక్కడి నుండియో ఒక యోగివచ్చాడు. ఆ యోగి ఏ వేషం ధరించి ఉన్నాడని శ్రీకృష్ణుడు చెప్పాడు?

**జవాబు :** 1. సర్వాలంకార శోభితంగా 2. శంకర వేషంలో 3. మహర్షిలా 4. మహారాజ వేషంలో

**2) ప్రశ్న :** ఒకనాడు శ్రీకృష్ణుడు ఉద్ధవునితో నేటికి ఎన్నవరోజు ద్వారక సముద్రంలో కలిసి పోతుందని చెప్పాడు?

**జవాబు :** 1. ఐదవరోజు 2. ఏడవరోజు 3. ఎనిమిదవ రోజు 4. తొమ్మిదవరోజు

**3) ప్రశ్న :** శ్రీకృష్ణుడు ఉద్ధవునితో నీవు భగవంతుని చేరడానికై, ఇప్పటి వరకు నేను నీకు తెలిపిన అతితీవ్రమైన యోగనిష్ఠతో బదరికా వనం చేరి అచట ఈ యుగం చివరిదాకా ఉండుమని చెప్పాడు. కాగా కృష్ణుడు ఉద్ధవునకు ఉపదేశించిన ఆ యోగం పేరేమి?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** వాసుదేవునితో ఉద్ధవుడు దేవా! భక్తులు నిన్ను ఎలా కొలవాలి? నీవు వారి కోరికలనెలా తీరుస్తావు? అని అడుగగా భగవంతుడు ఏ రీతిగా ఆయన సందేహాన్ని తీర్చాడు?

**జవాబు :** ఉద్ధవుడడిగిన ప్రశ్నలకు నారాయణుడు ఉద్ధవా! నేను రజస్సు, సత్యము, తమస్సు అనే మూడు గుణాలతో కూడి మూడు మూర్తులను ధరించి సృష్టి యొక్క పుట్టుకకూ, ఉనికికీ, నాశనానికీ కారణుడనై వర్తిస్తాను. కాగా

రూపం లేని నేను అన్ని వర్ణాలకూ సమమైన పూజా పద్ధతి చెపుతాను విను. రాతితో గాని, మట్టితో గాని, కొయ్యతోగాని తమ ఆచారం ప్రకారం ఒక ఆకారం కల్పించి ఒక పేరుపెట్టి కొందరు పూజిస్తారు. కంచుతో గాని, సీసంతోగాని, వెండితోగాని, బంగారంతో గాని చేసిన ప్రతిమలు శ్రేష్ఠమైనవి. ఈ విధంగా నా ప్రతిరూపాలలో నా భావాన్ని ఉంచి కొలచిన వారికి నేను ప్రసన్నుడనవుతాను. ఈలోకంలో మనుషులకు ధ్యానం నిలువదు. కనుక ఎన్నో విధాలుగా ఉండే దేవతా ప్రతిమలలో బాగా అందంగా ఉండే రూపాలలో నేను ప్రసన్నుడనై ఉంటాను. కనుక నన్ను పాలసముద్రంలో పవళించి ఉన్నవానినిగా భావించాలి. తరువాత శుభ్రమైన వస్త్రాలనూ, ఆభరణాలనూ, పూల దండలనూ, మైపూతలనూ అర్పించి, దివ్యమైన అన్నపానాలతో షోడశోపచారాలతో, రాజోపచారాలతో, బాహ్యమైన పూజలు చేయాలి. నాకిష్టమైన పదార్థాలను సమర్పించిన అనంతరం ప్రతిదినమూ మానసిక పూజా పద్ధతులతో నన్ను సంతుష్టి పరచాలి. దివ్యమైన వస్త్రాలతో, భూషణాలతో, ప్రకాశిస్తూ, శంఖము, చక్రము, కిరీటము మొదలైన వానితో అలంకృతుడనైన నన్ను దివ్యమంగళ విగ్రహునిగా భావించి ధ్యాన పరవశుడైనా భక్తుడు నాయందు కలుస్తాడు అని స్వామి ఉద్ధవునకు తాను తన భక్తులను ఎలా ఉద్ధరిస్తాడో విపులంగా తెలపాడు.

**5) ప్రశ్న :** పరీక్షిన్మహారాజు శ్రీశుకయోగితో మహర్షీ! ఉద్ధవుని బదరికా వనానికి పంపించిన తరువాత శ్రీకృష్ణ బలరాములేమైనారు? యాదవులెలా ప్రవర్తించారు? ద్వారకా పట్టణమేమైంది? అని ప్రశ్నించగా యోగివర్యుడు మహారాజుకు ఏ విధంగా తెలిపాడు?

**జవాబు :** దుష్టశిక్షణ, భక్తరక్షణ నిర్వహించి, బలరామునితో కూడి శ్రీకృష్ణుడు వెళ్ళిపోగా, యాదవులు మహర్షుల శాపవశులై తాము మద్యపాన మత్తులై ఈర్ష్యతో పోట్లాడుకోవటం మొదలు పెట్టారు. అది యుద్ధానికి దారితీసి ఆ యుద్ధాలతో ఒకరిని ఒకరు చంపుకోవటం మొదలుపెట్టారు. మునుల శాపం

కారణంగా పుట్టిన ముసలాన్ని అరగదీసిన పొడిలో మొలచిన తుంగ బెత్తాలతో అలసిపోయేలా కొట్టుకున్నారు. శాప ఫలంగా తుంగకు రోకళ్ళ బలం వచ్చింది. ఆ యుద్ధంలో యాదవులు అందరూ చనిపోయారు. ఇదంతా చూచి చిరునవ్వుతో బలరామ కృష్ణులు ఆ ప్రదేశం విడిచి వెళ్తూ బలరాముడు ఒక మార్గాన పోయి యోగమార్గంతో అనంతునిలో కలిసిపోయాడు. పరమాత్ముడైన శ్రీకృష్ణుడు మరో మార్గంలో వెళ్ళి గుబురుగా ఉన్న ఒక పొదచాటున పడుకొని విశ్రాంతి తీసికొంటూ ఒక కాలు మీద మరొక కాలు పెట్టి ఆడిస్తూన్నాడు. ముసలాన్ని అరగదీయు సమయంలో, చివరములికిగా మిగిలిన భాగాన్ని యాదవులు పారవేసిన దానిని, బాణానికి చివరగా ఉపయోగించుకొన్న బోయవాడు వేటకు వచ్చాడు. వాడికి తన కాలును అటూ, ఇటూ ఆడిస్తున్న శ్రీకృష్ణుని కాలు ఒక లేడి చెవిలాగా కనిపించి, ఆ బాణంతో కొట్టాడు. ఆ బాణం తగిలి శ్రీకృష్ణుడు 'హా' అని అన్నాడు. వాడు అరుపు విని దగ్గరకువచ్చి జగదీశ్వరుడైన కృష్ణుని చూచి భయంతో స్వామి పాదాలు పట్టి తెలియక అపరాధం చేశాను అని దీనంగా దుఃఖించాడు. వానిని చూచి కృష్ణుడు, నీవెందుకు దుఃఖిస్తావు. ఇదంతా నా సంకల్పముతోనే జరిగింది. నీవు నిమిత్త మాత్రుడివి. ఇంతే అని ఆ బోయకు సద్గతిని ప్రసాదించాడు. ఆ సమయంలో దారుకుడు వచ్చి చేతులు జోడించి నీ కన్నులెత్తి మమ్ము దయతో చూడు అంటూ దుఃఖించాడు. అప్పుడు నారాయణుడు దారుకునితో నేటికి ఏడు రోజులలో ద్వారక సముద్రంలో కలిసిపోతుంది. నీవు వెళ్ళి అక్రూరునికి యాదవ పెద్దలకు జరిగినదంతా చెప్పి, స్త్రీలనూ, పిల్లలనూ, వృద్ధులనూ హస్తినాపురానికి తీసికొని వెళ్ళమని అర్జునునితో చెప్పు అని అన్నాడు. దారుకుడు తిరిగి వెళ్ళి కృష్ణుని మాటలు వివరంగా అందరికీ చెప్పాడు. ఆయన చెప్పినట్లు చేసినంతలో ద్వారకా నగరం పూర్ణ జలాలలో మునిగి పోయింది. ఎవరికీ ప్రవేశించటానికి వీలులేని స్థితికి వెళ్ళి పోయింది. అప్పుడు పరమేశ్వరుడైన కృష్ణుడు నూరుకోట్ల సూర్యుల తేజస్సుతో నారదాది మునులూ, బ్రహ్మ, రుద్రాదులూ, దేవతలూ జయజయ

ద్వానాలు చేస్తుండగా సర్వమంగళ ప్రదమైన తన స్థానాన్ని తాను చేరుకున్నాడు. నా స్థాన ప్రాప్తిని నేనే కల్పించుకొన్నాను. మీరందరూ సుఖంగా ఉండండి అని దేవతలను ఆశీర్వదించాడు.

**తొంబై ఏడవ అధ్యాయము – ఏకాదశ స్కంధము**

**జవాబులు :** 1. 2. శంకర వేషంలో  2. 2. ఏడవరోజు

3. సాంఖ్యయోగం

* * *

## తొంబై ఎనిమిదవ అధ్యాయము - ద్వాదశ స్కంధము

**1. శుకయోగి పరీక్షిత్తునకు భావికాల గతులు చెప్పడం 2. చతుర్యుగాలలోని ధర్మవివేచనం 3. తక్షకుని విషాగ్నికి పరీక్షిత్తు మృతిచెందగా జనమేజయుడు సర్పయాగం చేయడం**

**1) ప్రశ్న :** శుకయోగితో పరీక్షిత్తు ఇంతవరకూ శ్రీకృష్ణుని అవతారానికి సంబంధించిన విషయాలు చెప్పావు. ఇంక భవిష్యత్తులో జరుగబోయే వాటిని గురించి చెప్పుమని అడుగగా, మహర్షి ఆ విధంగా చెప్పే క్రమంలో శైశు నాగులు అనే పేరుతో ప్రసిద్ధులైన రాజులు ఈ భూమిని ఎంతకాలం పరిపాలిస్తారు అని చెప్పాడు?

**జవాబు :** 1. మూడువందల ముప్పది ఏళ్ళు 2. మూడువందల నలుబది ఏళ్ళు
3. మూడువందల ఏబది ఏళ్ళు 4. మూడువందల అరవై ఏళ్ళు

**2) ప్రశ్న :** శుకయోగి రాబోయే కాలంలో జరిగే విషయాలను తెలుపుతూ మహారాజా! కొంతకాలానికి రాజులు అంతరించి, శూద్రప్రాయులైన వారు రాజ్యపాలనం చేస్తారు అని చెప్పాడు. వారిని లోకంలో ఏ పేరుతో పిలుస్తారు?

**జవాబు :** 1. చాళుక్యులు 2. పల్లవులు
3. మ్లేచ్ఛులు 4. మౌర్యులు

**3) ప్రశ్న :** శుకమహర్షి కాలవర్తనా క్రమాన్ని తెలుపుతూ, 'కలి' ప్రవేశమైన వేయి దివ్య సంవత్సరాలు గడచి నాలుగవపాదంలో ఏ యుగ ధర్మం నడుస్తుందని చెప్పాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** పరీక్షిన్మహారాజు శుకయోగితో మహర్షీ! కాల గమనం చేత ఏర్పడే ప్రళయాలు ఎన్ని? ప్రళయ కాలాలలో ఏమి జరుగుతుంది అని ప్రశ్నించగా మహర్షి ఏరీతిగా పరీక్షిత్తుకు తెలిపాడు?

**జవాబు :** శుకయోగీంద్రుని పరీక్షిన్మహారాజు కాలగమనాన్ని గురించి, ప్రళయాన్ని గురించి అడుగగా మహర్షి రాజా! కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలను కలిపి పలికే యుగ చతుష్టయాలు ఒక వెయ్యి గడిస్తే బ్రహ్మకు ఒక పగలు. అట్లే రాత్రికూడా. ఇటువంటి రాత్రి, పగలు కలిపి బ్రహ్మకు ఒక రోజు. దానిని నైమిత్తిక ప్రళయం అంటారు. అప్పుడు విధాత లోకాలన్నింటినీ తన ఆత్మలో చేర్చుకొని నిద్రిస్తాడు. అప్పుడు ప్రకృతి అంతరిస్తుంది. దానిని ప్రాకృత ప్రళయం అంటారు. ఇట్టి కాలమానంతో మూడు వందల అరవై ఐదు రోజులు బ్రహ్మకు ఒక్క సంవత్సరము. ఇటువంటి సంవత్సరాలు నూరు గడిస్తే బ్రహ్మకు అవసానకాలం వస్తుంది. అప్పుడు నూరేళ్ళపాటు వానలు కురువవు. భూమియందు పుట్టిన అన్నిద్రవాలను సూర్యుడు తన కిరణ సముదాయం చేత కాల్చిపీల్చివేస్తాడు. తరువాత నూరు సంవత్సరాలు విడవకుండా విపరీతమైన వాయువులు వీస్తాయి. అటు తరువాత నూరు సంవత్సరాలు విపరీతమైన వర్షాలు పడి భూమి జలమయం అయిపోతుంది. తరువాత పంచ భూతాలు తమ తమ ప్రాకృతిక గుణాలను పోగొట్టుకొని సత్వాది గుణాలు తిరిగి కాలంచేత ప్రేరేపింప బడిన ప్రకృతిలో లీనమై పోతాయి. ప్రకృతి అనేది అనాదిగా ఉంది. దానికి నాశనం కాని మార్పుకాని లేదు. దానిని మూల భూతమైన పదార్థంగా చెబుతారు. కాలగమనం చేత ప్రపంచానికి భిన్నభిన్నమైన దశలు కలుగుతుంటాయి. పరమాత్మ యొక్క స్వరూపమే కాలం. నిత్య ప్రళయము, నైమిత్తిక ప్రళయము, ప్రాకృతిక ప్రళయము, అత్యంతిక ప్రళయము అని ప్రళయాలు నాలుగు విధాలు. ఆయా కాలాలలో సంభవించే నారాయణుని యొక్క లీలలనూ, అవతారాలనూ, బ్రహ్మాదులు కూడా చెప్పలేరు. కాగా పరీక్షిన్మహారాజా! నేను నాకు తెలిసి నంతవరకూ చెప్పాను. సంసారమనే మహా సముద్రాన్ని దాటడానికి 'విష్ణుకథ' అనే నావ ఒక్కటే సాధనం. మరొకటేదీ సాధనం కాలేదు. సహాయ పడలేదు. నేను చనిపోతాను అన్న భయాన్ని పూర్తిగా మనస్సులో నుంచి విడిచిపెట్టు. జన్మించిన మానవుల కందరికీ మరణించడం కూడా నిత్య ధర్మం. కాబట్టి ఆ శ్రీహరిని ధ్యానించుకో!

దీనివల్ల నీవు మానవ లోకంలో జన్మించడం జరగదు. మాధవ లోకమైన వైకుంఠంలో నివసించి, అక్కడ సౌఖ్యాలు అనుభవించే యోగం కలుగుతుంది అని శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు తెలిపాడు.

**5) ప్రశ్న :** జనమేజయుడు సర్పయాగాన్ని ఎందుకు చేయవలసి వచ్చింది? ఏ రీతిగా ఆ యాగాన్ని నిర్వహించాడు.

**జవాబు :** పరీక్షిత్తుతో శుకయోగి నాకు తెలిసినంత వరకు విష్ణుకథలను నీకు తెలిపాను. నీవు మరణ భయాన్ని వీడి నిరంతరము నారాయణ ధ్యానంలోనె ఉండుమని చెప్పి, తాను స్వచ్ఛంద సంచారియై వెళ్ళిపోయాడు. అటు పిమ్మట పరీక్షిత్తు మహావిష్ణువును ఏకాగ్ర చిత్తంతో ధ్యానింపసాగాడు. అప్పుడు ముని బాలకుడైన శృంగి శాపప్రేరణకు వశుడైన తక్షకుడు పరీక్షిత్తును కాటువేసే సమయమాసన్నమై నందున బ్రాహ్మణ వేషము ధరించి వస్తూ ఉండగా కశ్యపుడను బ్రాహ్మణుడు పాము విషానికి విరుగుడు వేయగల సమర్థుడు. అతడు పరీక్షిత్తును చేరవస్తూ ఉండగా తక్షకుడు అతడికి అంతులేని సంపదనిచ్చి వెనుకకు పంపించి వేశాడు. అనంతరం తక్షకుడు యోగ సమాధిస్థితిలో ఉన్న పరీక్షిన్మహారాజును కాటు వేయగా, ఆయన ఆ క్షణమే తక్షకుని విషాగ్ని వల్ల బూడిదగా మారిపోయాడు. ఈ విధంగా జరిగినదంతా మహారాజు కుమారుడైన జనమేజయుడు విని క్రోధావేశాన్ని పొంది, సర్పాలన్నీ నాశనం కావాలన్న సంకల్పంతో యజ్ఞం చేస్తూ ఉండగా సృష్టిలోని పాములన్నీ వేలకువేలు నాశనము కాసాగాయి. తక్షకుడు మాత్రము తాను ఇంద్రుని మందిరంలో ఆశ్రయం పొంది ఉన్నాడు. యజ్ఞ నిర్వహణచే ఋత్విక్కులు ఇంద్రునితో సహా తక్షకుని ఆవాహన చేశారు. అంతట ఇంద్రునితో సహా తక్షకుడు ఉన్న విమానము కదిలింపబడింది. ఆకాశము నుండి ఇంద్ర సహితమైన విమానము తక్షకునితో సహా యజ్ఞకుండలో పడిపోవుట చూచి దేవగురువు బృహస్పతిజనమేజయునితో మహారాజా! నీవు తక్షకుని చంపతగదు. ఈతడు నీ తండ్రి మునిబాలకుని శాప పాశబద్ధుడై ఆ విధంగా చేశాడేగాని వేరుకాదు. కాగా ఓ రాజా! చావు

బ్రతుకులు భూమిమీద ఉండే సకల జీవసముదాయానికి ఎల్లప్పుడూ కలుగుతూ ఉండేదే. ఇది సహజం. సర్పాలు, చోరులు, అగ్ని, విద్యుత్తు, ఆకలి దప్పులు, రోగాలు మొదలైనవి జనుల మరణాలకు నిమిత్త కారణాలు మాత్రమే. అందువలన నీవు ప్రాణులను హింసించునట్టి ఈ అభిచార హోమాన్ని నిలిపివేయి అని పలికిన దేవగురువు బృహస్పతిని గౌరవించి సర్పయాగాన్ని విరమించి ఆయనను సాదరముగా పూజించాడు అని సూతుడు శౌనకాది మహర్షులకు తెలిపాడు.

**తొంబై ఎనిమిదవ అధ్యాయము – ద్వాదశ స్కంధము**

జవాబులు : 1. 4. మూడువందల అరవై ఏళ్ళు 2. 3. మ్లేచ్ఛులు
3. కృతయుగం

* * *

## తొంబై తొమ్మిదవ అధ్యాయము - ద్వాదశ స్కంధము

**1. శ్రీవేదవ్యాసుడు వేదాలను పురాణాలను లోకంలో ప్రచారం చేయడం 2. మార్కండేయో పాఖ్యానం 3. చైత్రాది మాసాలలో సంచరించే ద్వాదశాదిత్యుల క్రమాన్ని తెలపడం**

**1) ప్రశ్న :** భగవంతుడైన చతుర్ముఖ బ్రహ్మ అక్షర సముదాయాన్ని కల్పించాడు. ఆ అక్షర సమామ్నాయం తోడ్పాటుతో తన ముఖాల నుండి వేదాన్ని పుట్టించాడు. ఆ వేదాన్ని అందరికి అందుబాటులోకి తీసుకొనివస్తూ వేదవ్యాసుడు నాలుగు భాగాలుగా చేసి తన శిష్యుల ద్వారా ప్రచారం చేయించాడు. ఆ క్రమంలో మొదటిదైన ఋగ్వేదాన్ని ఎవరికి నేర్పించాడు?

| **జవాబు :** | 1. వైశంపాయనుడు | 2. పైలుడు |
|---|---|---|
| | 3 జైమిని | 4. సుమంతుడు |

**2) ప్రశ్న :** యజుర్వేదాన్ని ఉపదేశం పొందిన వైశంపాయనుడు, తన శిష్యుడైన యాజ్ఞవల్క్యునికి ఉపదేశించాడు. ఈయన తన గురువుపట్ల చేసిన అపరాధం కారణంగా తానేర్చుకొన్న వేదాన్ని గురువుగారి కోరిక పై 'వమనం' చేశాడు. అటు తరువాత యాజ్ఞవల్క్యుడు ఎవరిని గురించి తపస్సు చేసి యజుర్మంత్ర సంహితను పొందాడు?

| **జవాబు :** | 1. బ్రహ్మ | 2. విష్ణువు |
|---|---|---|
| | 3. శివుడు | 4. సూర్యుడు |

**3) ప్రశ్న :** సూత మహర్షితో శౌనకాదులు మహర్షీ! నీవు తెలిపిన వేదాలను గురించి, పురాణాల గురించి చెప్పినవన్నీ విని ధన్యులమైనాము. ఇంకనూ ఈ సంసార సముద్రాన్ని దాటే మార్గం కూడా చెప్పుమని అడుగగా సూతమహర్షి వారికి ఏ కథనాన్ని వినిపించాడు?

**జవాబు :** జవాబుల కాలంలో ఉంది.

**4) ప్రశ్న :** శౌనకాది మహర్షులకు సూత మహర్షి మార్కండేయో పాఖ్యానాన్ని ఏ రీతిగా తెలిపాడు?

**జవాబు :** శౌనకాదుల కోరిక మేరకు సూతుడు మహర్షులారా! పూర్వం పుత్ర సంతానార్థియై మృకండుడను మహర్షి భగవంతుని గురించి తపస్సు చేశాడు. అంతట శివకేశవులిరువురూ ప్రత్యక్షమై వరం కోరుకోమన్నారు. ఆ తపస్వి గుణ సంపద కలిగిన కుమారుడు కావాలని ప్రార్థించాడు. వాళ్ళిద్దరూ సమ్మతించి అతనికి కోరిన వరాన్నిచ్చారు. ఆ వర ప్రభావంగా మృకండునికి మార్కండేయ మహర్షి పుట్టాడు. ఆతడు నియమ నిష్ఠలతో భగవధ్యానంలో ఉండగా మృత్యువు వచ్చి తనపాశంతో కట్టివేయగా మార్కేండేయుడు ఆ మృత్యువును భగవదనుగ్రహం వలన తృణీకరించి చిరంజీవత్వాన్ని సాధించి వేల సంవత్సరాల పాటు ఉగ్రమైన తపస్సు చేశాడు. ఆ మార్కండేయుని తపో తీవ్రతను భంగంచేయాలని ఇంద్రుడు తనదైన శైలిలో అనేక ప్రయత్నాలను చేశాడు. కాని అవి ఏవీ ఆయన ముందు నిలువలేదు. భగవంతుడైన హరి, హరులను ఇరువురిని దర్శించి భగవన్మాయను తెలుసుకున్నాడు. నరనాయణులను దర్శించాడు. నారాయణుని అనుగ్రహం వలన కల్పాంతాలలో భగవంతుని మాయ యొక్క అద్భుత లీలలను దర్శించాడు. భృగువంశ సంజాతుడైన మార్కండేయుడు ఈ కల్పము వాడే యైనప్పటికి, నారాయణుని అనుగ్రహం వలన అనేక కల్పాంతములందు జరిగెడు సృష్టి ప్రళయాంత విశేషాలు, ఆయన కొరకే కల్పింప బడినది. పరమ భక్తాగ్రేసరుడైన మార్కండేయునికి అనుభవానికి వచ్చులాగున చేసిన మహావిష్ణువు మాయను ఎఱిగిన వారు ఈ రీతిగా గ్రహించారు. ఈ విధంగా సూతమూర్షి మార్కండేయో పాఖ్యానాన్ని మహర్షులకు తెలిపాడు.

**5) ప్రశ్న :** సంవత్సరం పొడవునా ఏ మాసము నందు సూర్యుడు ఏ పేరుతో ఎలా సంచరిస్తాడు? శ్రీభాగవతాన్ని శుకయోగి తెలుపుతూ ఫలస్థుతిని ఏరీతిగా తెలిపి ముగించాడు?

**జవాబు :** ప్రపంచానికి నేత్రం వంటి వాడైన సూర్యుడు చైత్ర మాసం మొదలుకొని కడవరకూ ఏ నెలలో ఏ పేరుతో ఎలా సంచరిస్తాడో తెలుపుమని శౌనకాదులు అడుగగా సూత మహర్షి ఈ విధంగా చెప్పాడు. చైత్రం నుంచి పన్నెండు మాసాలలోను, సౌరగణ సప్తకం అంటే సూర్య సంబంధమైన ఏడు మూర్తులూ

వాటి గుణాలూ ఈశ్వరుని యోగంచేత ఎన్నో విధాలుగా సంచరిస్తూ ఉంటాయి. శ్రీమన్నారాయణ స్వరూపుడైన సూర్యభగవానుడు ఒకే రూపం గలవాడు. అయినప్పటికి మహర్షులు కాలమూ, దేశమూ, క్రియా మొదలైన వాటి భేదాన్నిబట్టి అనేక విధాలుగా వర్ణిస్తూ భావిస్తూ ఉన్నారు. కాగా సూర్యుడు చైత్ర మాసంలో ధాత అనే పేరు ధరిస్తాడు. వైశాఖంలో అర్యముడు, జేష్ఠంలో మిత్రుడు, ఆషాఢంలో వరుణుడు, శ్రావణంలో ఇంద్రుడు, భాద్రపథంలో వివస్వంతుడు, ఆశ్వయుజంలో త్వష్ట, కార్తీకంలో విష్ణువు, మార్గశీర్షంలో అర్యముడు, పుష్యమాసంలో భగుడు, మాఘంలో పూషుడు, ఫాల్గుణంలో క్రతువన్న పేర్లతో విరాజిల్లుతుంటాడు. సంవత్సరం పొడవున ప్రతి నెలలోనూ ఆరుగురు పరిజనులు అనుసరించి రాగా, ఉభయలోక వాసులకు లౌకికా ముష్మిక ఫలాలను ప్రధానం చేస్తూంటాడు. సూర్యునికి ముందు భాగాన ఋగ్యజుస్సామాధర్వ వేద మంత్రాలను పఠిస్తూ ఋషులు ప్రస్తుతింపగా, ముందరి భాగంలో అప్సరసలు నాట్యం చేస్తుండగా, గంధర్వులు గానం చేస్తుండగా, బ్రహ్మవేత్తలైన అరవైవేల మంది వాలఖిల్యులు ఎదురుగా నిల్చి స్తోత్రం చేస్తూ నడుస్తుండగా, మిక్కిలి బలమైన మత్తేబాలు వేగంగా రథం లాగుతూండగా, ఆది అంతమూ లేని ఆదిత్యుడు ప్రతి కల్పంలోనూ ఈ విధంగా కాలాన్ని నడిపిస్తూ తేజరిల్లుతూ ఉంటాడు. కావున వీటినన్నింటినీ వాసుదేవమయమని తెలుసుకో మరియు నేను నీకు వినిపించిన ఈ భాగవతపు పురాణాన్ని వ్రాసినా, చదివినా, వినినా భవబంధాలు తొలగి నారాయణుని సాన్నిధ్యాన్ని పొందుతారు. అని పరీక్షిన్మహారాజుకు శుకయోగీంద్రుడు చెప్పిన విధంగా పౌరాణికులలో ఉత్తముడైన సూతుడు శౌనకుడూ మొదలైన ఋషిశ్రేష్ఠులకు చెప్పాడు.

**తొంబై తొమ్మిదవ అధ్యాయము – ద్వాదశ స్కంధము**

**జవాబులు :** 1. 2. పైలుడు    2. 4. సూర్యుడు
3. మార్కండేయో పాఖ్యానము

**శ్రీమద్భాగవత మహాపురాణము – ప్రశ్నావళి సంపూర్ణము**

ఓం శాంతి శ్శాంతి శాంతిః

* * *

**యదక్షర పదభ్రష్టం, మాత్రహీనం చ యద్భవేత్**
**తత్సర్వం క్షమ్యతాం దేవ। నారాయణ । నమోస్తుతే ॥**

తా॥ స్వామీ నారాయణమూర్తీ! అక్షరంలోగాని అక్షరావయవంలోగాని ఏదైనా లోపం ఉంటే దానిని నీవే క్షమించుము. నీకు నమస్కారము.

పురాణాలలో శ్రేష్ఠమైన శ్రీ భాగవతాన్ని శ్రవణం చేసేవారు, పఠనం చేసేవారూ, లిఖించేవారూ, ఆయువూ, ఆరోగ్యమూ, ఐశ్వర్యమూ కలిగి విష్ణులోక సాయుజ్యాన్ని పొందుతారు. లక్ష్మీ రమణుడైన విష్ణు దేవుని కథలను వినడంలో ఆసక్తికలవాడూ, భూ రమణుడూ అయిన పరీక్షిత్తుకు శుకమహర్షి నిపుణంగా పంద్రెండు స్కంధాల శ్రీమద్భాగవత మహాపురాణాన్ని వినిపించాడు.

స్వస్తి

## రాయితీ పదాల పరిచయము

| | | |
|---|---|---|
| కణ్వమహర్షి | = | ఇతడు పూరు వంశస్థుడు, అయిన అప్రతిరథుని కొడుకు. శకుంతల పెంపుడు తండ్రి, ఈతని వంశస్థులు కాణ్వాయులు అయినారు. |
| విశ్వామిత్రుడు | = | గాధిపుత్రుడు వశిష్టునితోడి స్పర్థచే తపస్సు చేసి బ్రహ్మర్షి అయ్యాడు. ఇతడు మహాకోపిష్ఠి గాన అనేక సందర్భాలలో తాను కష్టపడి సంపాదించిన తపోబలాన్ని, దుర్వినియోగము చేయవలసి వచ్చింది. |
| నారదుడు | = | బ్రహ్మ మానస పుత్రుడు. ఈతడు పూర్వజన్మ వాసనా ఫలంచేత, బ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూషలుచేసి ఆ పుణ్యంతో బ్రహ్మ మానస పుత్రుడయ్యాడు. |
| దూర్వాసమహర్షి | = | అత్రి మహర్షికీ అనసూయకు రుద్రాంశమున పుట్టినవాడు. ఇతని సహోదరుడు సోముడు, దత్తాత్రేయుడు. ఇతడు మహా కోపిష్ఠి. ఇతని శాపకథలు అనేకములు కలవు. |
| నన్నయ | = | మహాభారత కావ్యాన్ని ఆంధ్రీకరించిన ముగ్గురు కవులలో నన్నయ మొదటివాడు. |
| శ్రీనాథుడు | = | భక్త కవిపోతన సమకాలికుడు. హరవిలాసము, రుక్మిణీ కల్యాణము, శృంగార నైషధము లాంటి కావ్యాల కృతులను ఎన్నింటినో వెలయించిన మహాకవి. |
| అల్లసాని పెద్దన | = | మనుచరిత్రను ప్రబంధీకరించిన మహాకవి శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజములలో మొదటివాడు. |

| | | |
|---|---|---|
| తెనాలి రామలింగకవి | = | పాండురంగ మాహాత్మ్యాన్ని ప్రబంధీకరించిన కవి. శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలోని కవి. |
| ప్రభాసుడనే వసువు | = | అష్టవసువులలో ఒకడు. ఇతడే భీష్ముడుగా జన్మించాడు. భార్యయోగసిద్ధి. కొడుకు విశ్వకర్మ. |
| ఉపరిచరవసువు | = | ఈయన వీర్యంవల్లనే సత్యవతి జన్మించింది. |
| ప్రత్యూషుడనే వసువు | = | అష్టవసువులలో ఒకడు. |
| ధరుడనే వసువు | = | అష్టవసువులలో ఒకడు. ధూమ్ర ప్రజాపతుల కుమారుడు. ఇతని భార్య కల్యాణి. |
| కళావతి | = | తుంబురుని వీణ |
| కచ్ఛపి | = | సరస్వతీదేవి చేతిలోని వీణ |
| బృహతి | = | విశ్వావసుని వీణ |
| మహతి | = | నారదుని చేతిలోని వీణ |
| ద్రుష్టధ్యుమ్నుడు | = | ధ్రుపద మహారాజు కుమారుడు. ద్రౌపదికి అన్న |
| అర్జునుడు | = | పాండవ మధ్యముడు. మహాభారత యుద్ధంలో తన బిడ్డలందరినీ పోగొట్టుకొని దుఃఖిస్తున్న ద్రౌపదిని ఓదార్చినవాడు. |
| విదురుడు | = | ధృతరాష్ట్రుని మంత్రి. నీతికుశలుడు. |
| శ్రీకృష్ణుడు | = | నారాయణుని అవతార పురుషుడు. అర్జున సారథియై కురుక్షేత్ర సంగ్రామాన్ని నడిపించిన వాడు. |
| బ్రహ్మశిరోనామకాస్త్రం | = | ఒక దివ్యాస్త్రము. అల్పులపై దీనినిప్రయోగించరాదను నియమము ఉంది. అశ్వత్థామ కురుక్షేత్ర |

| | | |
|---|---|---|
| | | సంగ్రామం చివరలో అపాండవ మగుగాక అని ప్రయోగించిన అస్త్రం. |
| వారుణాస్త్రం | = | వరుణుడు అధిష్ఠాన దేవతగా కల్గిన అస్త్రం. |
| పాశుపతాస్త్రం | = | పశుపతి శివుడు అధిష్ఠాన దేవతగా కల్గిన అస్త్రం. |
| నారాయణాస్త్రం | = | శ్రీమన్నారాయణుడు అధిష్ఠాన దేవతగా కల్గిన అస్త్రం. |
| జనకరాజర్షి | = | మిథిలాపురాధిపతి. ఇతడు మహాజ్ఞాని. తత్త్వవేత్త. సంసారాన్ని వదలకనే ముక్తిని పొందాడు. |
| బలరామదేవుడు | = | శ్రీకృష్ణుని అన్న. ఆదిశేషుని అంశమున వసుదేవునికి రోహిణియందు పుట్టిన కొడుకు. |
| వసుదేవుడు | = | బలరామ కృష్ణుల తండ్రి. శూరసేనుని కొడుకు. దేవకీదేవి భర్త. |
| భీష్ముడు | = | కురుక్షేత్ర సంగ్రామం తరువాత తన వారందరిని చంపు కొన్నానన్న బాధతో ఉన్న ధర్మరాజుకు సకల ధర్మాలు ఉపదేశించి ఆయనను స్వస్తచిత్తునిగా చేసినవాడు. శంతనుని కుమారుడు. |
| వేదవ్యాసుడు | = | పరాశర మహర్షి కుమారుడు. వేదరాశిని నాలుగు భాగాలుగా చేసి, పద్దెనిమిది పురాణాలను రచించి లోకోపకారం చేసిన మహనీయుడు. |
| ధౌమ్యుడు | = | పాండవులకు పురోహితుడు. |
| విష్ణురాతుడు | = | ఉత్తరాభిమన్యుల కుమారుడు. పరీక్షిత్తుకు మొదటగా పెట్టిన పేరు విష్ణురాతుడు. శుకయోగి వలన భాగవత పురాణాన్ని శ్రవణం చేసినవాడు. |

జనమేజయుడు = పరీక్షిత్తు కుమారుడు. తన తండ్రి సర్పదష్టుడై మరణించాడని తెలిసి కృద్ధుడై, సర్పయాగాన్ని చేసిన రాజు.

ప్రతివింధ్యుడు = ధర్మరాజుకు ద్రౌపదికి పుట్టినవాడు.

శృతకీర్తి = ద్రౌపది కుమారుడు. ఉప పాండవులలో ఒకడు.

శృంగిమహర్షి = శమీకమహర్షి కుమారుడు, పరీక్షిత్తును శపించిన వాడు.

శమీకమహర్షి = వేటకై వచ్చిన పరీక్షిన్మహారాజు దాహశాంతికై ఈ మహర్షి ఆశ్రమం చేరాడు.

శక్తి = అరుంధతీ వసిష్టుల కుమారుడు.

రఘుమహారాజు = ఇక్ష్వాకువంశంలో ప్రసిద్ధి గాంచిన రాజు. అజమహారాజు తండ్రి.

హరిశ్చంద్ర మహారాజు = సూర్యవంశపురాజు, సత్యమునకై, భార్య బిడ్డలను అమ్ము కొనుటకు కూడా వెనుదీయని సత్యవాది.

ఖట్వాంగు మహారాజు = అతి తక్కువ సమయంలో తనకు మృత్యువు ఆసన్నమైనదని ఎరిగి, శ్రీహరి నామస్మరణంతో మోక్షాన్ని పొందాడు.

రోమశ మహర్షి = ఇంద్రుని పంపున ధర్మరాజునకు అర్జునుడు ఇంద్రలోక మందున్నాడు అని ఎఱిఁగించి అతనిచే తీర్థయాత్ర చేయించినవాడు.

అత్రిమహర్షి = బ్రహ్మ మానస పుత్రులలో ఒకడు. భార్య అనసూయ. ఈతడు తన తపో బలముతో త్రిమూర్తుల అంశలచే సోమ, దుర్వాస, దత్తాత్రేయులను కుమారులుగా పొందాడు.

| | | |
|---|---|---|
| మార్కండేయమహర్షి | = | మృకండు మహర్షి కొడుకు. తాను భగవచ్చింతనతో మృత్యుంజయుడై చిరంజీవత్వాన్ని సాధించాడు. |
| మైత్రేయ మహర్షి | = | కుశీలవుని కొడుకు. పరాశరుని శిష్యుడు. ఈతనికి పరాశరుడు విష్ణు పురాణాన్ని చెప్పాడు. ఇతడు కామ్యకవనమందున్న పాండవుల వద్ద నుండి ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి దుర్యోధనునికి హితోపదేశము చేయగా, దానిని అతడు వినకపోగా దుర్యోధనుని శపించాడు. |
| హిరణ్యకశ్యపుడు | = | జయవిజయులకు సనకాదుల శాపం కారణంగా శ్రీహరికి విరోధిగా పుట్టినవాడు. ప్రహ్లాదుని తండ్రి. శ్రీహరి నరసింహావతారంతో ఇతనని నిర్జించాడు. |
| హిరణ్యాక్షుడు | = | జయవిజయులు సనకాదుల శాపకారణంగా శ్రీహరికి వ్యతిరేకులుగా పుట్టిన వారిలో ఒకడు. నారాయణుని ఆదివరాహావతారం ఎత్తడానికి కారణభూతుడు. ఆది వారాహవతారంలో స్వామి చేతిలో మరణించి వైకుంఠం చేరాడు. |
| మధుకైటభులు | = | కల్పాంతంలో భూమి జలమయమై ఉన్నప్పుడు మహావిష్ణువు వటపత్రశాయియై ఉన్నప్పుడు ఆయన చెవుల నుండి పుట్టి, అసురీ ప్రవృత్తితో బ్రహ్మదేవుని హింసింపబోగా ఆయన మహావిష్ణువును శరణు వేడగా మహావిష్ణువు వారిరువురను సంహరించాడు. |
| ప్రలంబుడు | = | ఒకానొక అసురుడు. వీడు బలరాముని చంప వలయునని గోపాల రూపమున అతని ఆటలు ఆడవచ్చి కడపట అతనిచే సంహరింపబడ్డాడు. |

ధ్రువుడు = ఉత్తానపాదునికి సునీతికి పుట్టిన బిడ్డ. నారద ఉపదేశం వలన ఐదేండ్ల వయస్సులోనే ఘోరమైన తపస్సుచేసి విష్ణువును ప్రత్యక్షము చేసికొని తల్లితోగూడ అత్యున్నత పదవిని పొందాడు.

అంబరీషుడు = హరిభక్తుడు. ఏకాదశీ వ్రతమాచరించి, భగవత్కృపా కటాక్షం వలన దుర్వాసుని పరీక్షలో నెగ్గి, నారాయణుని భక్తులలో మేటియైనాడు.

ప్రహ్లాదుడు = హిరణ్యకశ్యపుని కుమారుడు. కశ్యప వంశీయుడు. శ్రీహరి నారసింహ రూపమున ఆతనిని రక్షించాడు.

బలిచక్రవర్తి = ప్రహ్లాదుని మనుమడు. ఇతడు మహాశూరుడు. ముల్లోకములను జయించి చక్రవర్తి అయ్యాడు. వామనావతారమున శ్రీహరి ఈతనిని మూడడుగుల నేల యాచించాడు. నారాయణుని కరుణ వలన సుతలానికి ఏలిక అయ్యాడు.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు = త్రిమూర్తులు, సృష్టి, స్థితి, లయ కారకులు.

ఇంద్రుడు = దేవతలకు అధిపతి.

కపిలుడు = మహావిష్ణువు అవతారం, సాంఖ్యయోగాన్ని మునులకు, తన శిష్యులకు తెలిపి లోకాన నిలిపినవాడు.

మరీచి = బ్రహ్మ మానస పుత్రుడు. ఇతనికి కర్ధముని కూతురు కళయందు కశ్యపుడు అను కొడుకును పూర్ణిమ అను కూతురును కలిగారు.

| | | |
|---|---|---|
| సూతుడు | = | ఈయనకు ఉగ్రశ్రవసుడను పేరుకూడా కలదు. అనేక వ్రతకథలు, పురాణ గాథలను మహర్షులకు, మునులకు వినిపించిన వక్త. |
| కశ్యపప్రజాపతి | = | ఒక ప్రజాపతి. ఈయన దక్షప్రజాపతి కుమార్తెలలో పదమువ్వురను, వైశ్వానరుని కుమార్తెలలో ఇరువురను వివాహమాడాడు. |
| రుచిప్రజాపతి | = | స్వాయంభువ మనువు కుమార్తె ఆకూతిని వివాహ మాడాడు. |
| దక్షప్రజాపతి | = | ప్రజాపతులలో ఒకడు. బ్రహ్మ మానస పుత్రుడు. ఈతడు బ్రహ్మ ఆజ్ఞ చొప్పున మైధునక్రియ వలన సృష్టిచేయ నారంభించాడు. తత్పూర్వం స్పర్శేచ్ఛాదుల వలన సంతానం కలుగుచుండెనని తెలియవచ్చు చున్నది. |
| కర్ధమప్రజాపతి | = | తొమ్మిది మంది ప్రజాపతులలో ఒకడు. ఈయన కూతురు కళను మరీచికి ఇచ్చి వివాహము చేశాడు. |
| ఉత్తముడు | = | ఉత్తానపాదునికి సురుచికిని పుట్టినవాడు. ధృవునికి పినతల్లి కొడుకు. ఇతడు వేటాడుటకు వెళ్ళి ఒక యక్షునిచే చంపబడ్డాడు. |
| మరుత్తు | = | ఇక్ష్వాకుని తమ్ముని కొడుకు అయిన నాభాగుని వంశస్థుడు అగు అవీక్షిత్తు కొడుకు. ఈతని కొడుకు నరిష్యంతుడు. ఈతడు చేసినన్ని యజ్ఞములు ఎవరూ చేయలేదని ప్రతీతి. |

| | | |
|---|---|---|
| యజ్ఞుడు | = | రుచిప్రజాపతికిని స్వాయంభువ మనువు కూతురు ఆకూతికిని పుట్టినవాడు. ఈతడు మహావిష్ణువు అవతారం. |
| కుబేరుడు | = | దిక్పాలకులలో ఉత్తర దిక్కుకు అధిపతి. ఇతనిది అలకాపురీ నగరం. ఇతడు యక్షులకు, గుహ్యకులకును రాజు. |
| మయుడు | = | దితి పుత్రుడు. దానవ విశ్వకర్మ. కొడుకులు మాయావి, దుందుబి. కూతురు రావణుని భార్య మండోదరి. |
| స్వయంప్రభ | = | హేమ అను అప్సరస కూతురు. హనుమదాదులు సీతను వెదకుచు ఈమె ఉందు కాంచన బిలమును ప్రవేశించి వెలువడు దారి కానక పరితపించగా ఈమె తన తపో మహిమచే బిలము నుండి వెడలించెను. |
| పంచజని | = | విశ్వరూపుని కుమార్తె. ఋషభుని కుమారుడైన భరతుని భార్య. |
| శతధృతి | = | ప్రాచీనబర్హి భార్య, సముద్రుని కూతురు. ప్రచేతసుల తల్లి. |
| అర్చి మహాదేవి | = | పృథు చక్రవర్తి భార్య |
| భృగుమహర్షి | = | బ్రహ్మ మానస పుత్రులలో ఒకడు. ఈతని మనుమడు రాక్షస గురువు శుక్రాచార్యుడు. |
| వశిష్ఠుడు | = | బ్రహ్మ మానస పుత్రులలో ఒకడు. మహాతపస్సంపన్నుడు. ఇక్ష్వాకు వంశస్థుల కులగురువువైవస్వత |

| | | |
|---|---|---|
| | | మన్వంతరమున సప్తర్షులలో ఒకడు. ఇతని భార్య అరుంధతి. |
| వాలఖిల్యులు | = | సూర్యునికి ముందుభాగాన వేదసూక్తాలతో స్తోత్రాలు చేస్తూ జ్యోతిర్మయ స్వరూపాలు కలిగిన వారు. |
| సనకసనందాదులు | = | బ్రహ్మ మానస పుత్రులు. వీరు ఎల్లలోకముల యందు సంచరింపగల శక్తిగలవారు. |
| సప్తర్షులు | = | ఏడుగురు మహర్షులు. ఒక్కొక్క మన్వంత రమునకు ఈ సప్తర్షులు మారుతూ ఉంటారు. |
| దేవతలు | = | పరబ్రహ్మయైన నారాయణుడు సృష్టి చేయనెంచి బ్రహ్మను ఇంద్రాది దేవతలను సృజించాడు. |
| చండామార్కులు | = | శుక్రాచార్యుని కుమారులు. హిరణ్యకశ్యపుని వద్ద ప్రహ్లాదునికి చదువులు నేర్పినవారు. |
| లీలావతి | = | హిరణ్య కశ్యపుని భార్య. ప్రహ్లాదుని తల్లి. |
| లక్ష్మీదేవి | = | సంపదకు అదిష్టాన దేవత. మహావిష్ణువు భార్య. |
| స్వాయంభువుడు | = | మనువులలో ఒకడు. ఈయన కూతురు ఆకూతిని రుచి ప్రజాపతికి ఇచ్చి పెండ్లిచేశాడు. |
| స్వారోచిషుడు | = | మనువులలో ఒకడు. |
| ఉత్తముడు | = | మనువులలో ఒకడు. మూడవ మనువు. |
| తామసుడు | = | మనువులలో ఒకడు. నారాయణుడు తనను ప్రార్థించిన ముసలిబారిన పడిన ఏనుగును రక్షించినది ఈతడు మనువుగా ఉన్న కాలంలోనె జరిగింది. |

| | | |
|---|---|---|
| చరకుడు | = | ఆయుర్వేదంలో చరకునిది అందెవేసిన చేయి. చరక సంహింత అను ఆయుద్వేద సంహితను రచించినాడు. |
| చ్యవనుడు | = | భృగువునకు పులోమకు పుట్టినవాడు. చ్యవనునికి సుకన్య యందు ప్రమతియు మను కన్యక యందు ఔర్యుడును పుట్టారు. ఔర్యునకు రుచీకుడను కుమారుడును, రుచీకునకు జమదగ్ని, జమదగ్నికి పరశురాముడును పుట్టిరి. |
| చంద్రుడు | = | క్షీరసాగర మథన సమయంలో పుట్టాడు. ఈతడు ఓషధులకు, యజ్ఞాలకు, తపస్సుకు, నక్షత్రాలకు, బ్రాహ్మణులకు అధిపతి. |
| వైవస్వతుడు | = | శ్రీహరి మత్స్యావతార సమయంలో ఆయన అనుగ్రహాన్ని పొందిన సత్యవ్రతుడు, తరువాతి జన్మంలో శ్రాద్ధ దేవుడుగా ప్రఖ్యాతిగాంచాడు. ఈ శ్రాద్ధదేవునికి మరియొుక పేరు వైవస్వతుడు. |
| నృగుడు | = | వైవస్వత మనువు యొుక్క రెండవ కొడుకు. ఇక్ష్వాకుని తమ్ముడు. గొప్పదాత. అయినను తాను చేసిన పొరపాటు వలన ఊసరవెల్లిగా జన్మించటం జరిగినది. కాని శ్రీకృష్ణ దర్శనంతో అతని పాపము తొలగి పుణ్యగతి ప్రాప్తించింది. |
| శర్యాతి | = | వైవస్వత మనువు కొడుకులలో ఒకడు. ఇక్ష్వాకుని తమ్ముడు. ఇతనికి ఉత్తానబర్హి ఆదిగాగల ముప్వురు కొడుకులు కలిగారు. |
| ఇక్ష్వాకుడు | = | ఇతడు వైవస్వత మనువు కొడుకు. ఇతనికి వికుక్షి, నిమి, దండకుడు, విశాలుడు మొదలగు పుత్రులు అనేకులు కలిగారు. |

| | | |
|---|---|---|
| సుద్యుమ్నుడు | = | వైవస్వత మనువు కుమారుడు. ఇతనికి కొంత కాలం స్త్రీగాను, కొంతకాలం పురుషుడుగాను మారే పరిస్తితి ఉండగా వశిష్టానుగ్రహం వలన స్త్రీతత్వం పోయి పురుషుడుగానే మారగలిగాడు. |
| అసమంజసుడు | = | సగరుని కుమారుడు. పూర్వజన్మ ఫలితంగా చిన్నవయస్సులో దుర్మార్గుడుగా ఉన్నందున దేశ బహిష్కార శిక్షను అనుభ వించాడు. |
| దిలీపుడు | = | అంశుమంతుని కుమారుడు. సగరుని ముని మనుమడు. తన పితరులకు పుణ్యలోక గతులను కలిగించుటకై గంగను గూర్చి తపస్సు చేశాడు. కాని ఫలించలేదు. |
| భగీరథుడు | = | దిలీపుని కుమారుడు. తన పితరులకు పుణ్య లోకాలను కల్పించుటకై గంగను ప్రార్థించి, దివి నుండి భువికి గంగను తెచ్చి తన పూర్వుల భస్మరాసులను పావన గంగతో తడిపి వారికి ఊర్ధ్వలోక గతులు కల్పించిన చారిత్రక పురుషుడు. |
| అంశుమంతుడు | = | సగరుని మనుమడు. అసమంజసుని కుమారుడు. తన పినతండ్రులు వెళ్ళిన మార్గాన వెళ్ళి కపిలమహర్షిని దర్శించి ఆయన అనుమతితో యాగాశ్వాన్ని తెచ్చి అశ్వమేథ యాగాన్ని సగరునిచేత పూర్తి చేయించాడు. |
| నలుడు | = | నిషధ దేశపురాజు, వీరసేనుని కొడుకు. భార్య దమయంతి. కొడుకు ఇంద్రసేనుడు. కూతురు |

ఇంద్రసేన కలిపురుషుని వలన అనేక ఇడుముల పాలయ్యాడు.

కచుడు = దేవ గురువు బృహస్పతి కుమారుడు. రాక్షస గురువు శుక్రాచార్యుల వద్ద మృత సంజీవనీ విద్య నభ్యసించిన వాడు.

రంభ–మేనక –
ఊర్వశి–తిలోత్తమ = ఈ నలుగురు దేవసభలో నాట్యకత్తెలు. అప్సరసలు.

దశరథుడు = అజ మహారాజు కుమారుడు. అయోధ్యాధిపతి, శ్రీరామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులకు తండ్రి.

దత్తాత్రేయుడు = అత్రి, అనసూయలకు త్రిమూర్తుల అంశావతారంగా ప్రసిద్ధిగాంచినాడు. కార్తవీర్యార్జునుడు ఈయన వలన వరాలనుపొంది, అణిమాది అష్టసిద్దులను పొందాడు.

పూతన = కంసుని కొలువులో నున్న రాక్షసి. కామరూపి. పసిబిడ్డలను చంపే క్రమంలో పసివాడుగా ఉన్న కృష్ణుని చేతిలో మరణించింది.

శకటాసురుడు, తృణావర్తుడు,
వత్సాసురుడు = వీరందరూ కంసుని కొలువులో ఉన్న కామరూప విద్య కలిగి బలవంతులైన రాక్షసులు. అందరూ శ్రీకృష్ణునిచేత చంపబడ్డారు.

రోహిణి = వసుదేవుని భార్య. బలరాముని తల్లి.

యశోద = నందుని భార్య, కృష్ణుని తల్లి.

| | | |
|---|---|---|
| నందుడు | = | కృష్ణుని తండ్రి. పూర్వజన్మ పుణ్య ఫలంగా యశోదానందులు నారాయణుని లీలా మానుష రూపమైన కృష్ణునకు తల్లి దండ్రులైనారు. |
| దారుకుడు | = | శ్రీకృష్ణుని రథసారథి. |
| ఉద్ధవుడు | = | శ్రీకృష్ణుని మంత్రి, చెలికాడు. పరమ భక్తుడు. |
| సాత్యకి | = | యాదవులలోని భోజవంశంలోని శిని అను నతనికి సత్యకుడు కుమారుడు. ఈతని కుమారుడు యుయుధానుడు. ఈయననే సాత్యకి అని కూడా పిలుస్తారు. |
| శ్రీథాముడు | = | ఒక గోప బాలుడు, బలరామ కృష్ణులు దూడల వద్దకు కాపుకాసేటప్పుడు, తమకు తోడుగా వచ్చిన వారిలో ఒకడు. |
| గర్గమహర్షి | = | నందాది యాదవులకు పురోహితుడు. |
| కాలయవనుడు | = | నారదుని ఉపదేశంతో మధురపైకి దండెత్తిరాగా శ్రీకృష్ణుడు నిరాయుధుడై ఈతనిని కొండగుహలో ముచికుందుని చేత భస్మమగునట్లు చేశాడు. |
| జరాసంధుడు | = | కంసుని భార్యలైన అస్తి, ప్రాస్తి అనువారలకు తండ్రి. అమిత బలవంతుడు. మగధ సామ్రాజ్యాన్ని గిరివ్రజపురాన్ని రాజధానిగా చేసికొని పాలించిన వాడు. |
| కృతవర్మ | = | ఈతడు హృదికుని కుమారుడు. శ్రీకృష్ణుని తండ్రి వసుదేవుకి పినతండ్రి. |
| శిశుపాలుడు | = | ఛేది దేశపురాజు, వసుదేవుని చెల్లెలు సాత్వతీ (శతదృవ) దమఘోషుల కుమారుడు. ధర్మరాజు |

| | | |
|---|---|---|
| | | రాజసూయంలో శ్రీకృష్ణుని నిందించి ఆయన చేతనే సంహరింపబడ్డాడు. |
| శంబరాసురుడు | = | దనువంశస్తుడు. ప్రద్యుమ్నుడు పుట్టిన తోడనే పురిటింట జొచ్చి ఆ శిశువును గొంపోయి సముద్రమున వేసిన రాక్షసుడు. వీడు అతి మాయావి. ప్రద్యుమ్మునిచే చంపబడ్డాడు. |
| బాణాసురుడు | = | బలిచక్రవర్తి కుమారుడు. అనిరుద్ధుని మోహించిన ఉషాకన్య తండ్రి. శివపూజా దురందరుడు. శత్రుభయంకరుడు. |
| దంతవక్త్రుడు | = | శిశుపాలుని తమ్ముడు. ఈతడును శ్రీకృష్ణుని చేతిలో మరణించాడు. |
| మాయావతి | = | శంబరాసురుని ఇంట పాతివ్రత్యాన్ని నడుపుచు, ప్రద్యుమ్యుని కొరకు వేచి ఉన్న రతీదేవి. |
| రతీదేవి | = | మన్మధుని భార్య |
| ధాత్రేయిక | = | మహాభారతంలో ద్రౌపది చెలికత్తె |
| ప్రియంవద | = | శకుంతల చెలికత్తె |
| మురాసురుడు | = | నరకాసురుని నగరమైన ప్రాగ్జ్యోతిష నగర రక్షకుడు. |
| చారుమతి | = | రుక్మి కుమార్తె |
| రుక్మలోచన | = | అనిరుద్ధుని వివాహమాడినది. రుక్మి మనుమరాలు. |
| రుక్మవతి | = | రుక్మి కుమార్తె. ప్రద్యుమ్నుని వివాహమాడినది. |
| భద్ర | = | శ్రీకృష్ణుని అష్ట భార్యలలో ఒకతె. |

| | | |
|---|---|---|
| సాత్యకి | = | యాదవ వంశీయుడు. శ్రీకృష్ణుని బంధువు. |
| సాంబుడు | = | శ్రీకృష్ణునకు జాంబవతి యందు పుట్టినవాడు. |
| ప్రద్యుమ్నుడు | = | శ్రీకృష్ణునకు రుక్మిణి యందు పుట్టినవాడు |
| రావణుడు | = | పౌలస్త్యుడు. లంకాపురాధినేత. |
| ఉగ్రసేనుడు | = | శ్రీకృష్ణుని తాతగారు. కంసుని తండ్రి. |
| లక్షణ | = | శ్రీకృష్ణుని అష్ట భార్యలలో ఒకతె |
| శకుంతల | = | మహాభారతంలోని దుష్యంతుని భార్య. భరతుని తల్లి |
| ఉషాకన్య | = | బాణాసురుని కుమార్తె. అనిరుద్ధుని భార్య. |
| రాజసూయ యాగం | = | భూమిమీద ఎదురులేని రాజు చేసే యాగం. ధర్మరాజు చేసినది. |
| పుత్రకామేష్టి | = | పుత్రులు కలగాలనే కోరికతో చేసే యజ్ఞం |
| విశ్వజిత్‌యాగం | = | బలిచక్రవర్తి చేసిన విశ్వకల్యాణ కారకమైన యాగం. |
| దీర్ఘసత్రయాగం | = | లోక కల్యాణార్థం వేయి సంవత్సరాలు నిర్వహించే యాగం. |
| సాళ్వుడు | = | సాళ్వదేశాధిపతి |
| సహదేవుడు | = | జరాసంధుని కుమారుడు. తండ్రి మరణానంతరం గిరివ్రజానికి రాజైనవాడు. |
| రుక్మి | = | భీష్మక మహారాజు కుమారుడు రుక్మిణికి అన్నగారు. |

| | | |
|---|---|---|
| సుధాముడు | = | శ్రీకృష్ణుని చిన్ననాటి స్నేహితుడు. కుచేలుడు. |
| బహుళాశ్వుడు | = | శ్రీకృష్ణుని కాలమున మిథిలాపురము నేలినరాజు. శ్రీకృష్ణునకు ఆతిథ్యమిచ్చి పూజించినరాజు. |
| సీరధ్వజుడు | = | మిథిలా పురాధిపతి సీతాదేవి తండ్రి. రామాయణం. |
| కుశధ్వజుడు | = | ఊర్మిళాదేవి తండ్రి. జనకుని తమ్ముడు. |
| రోమపాదుడు | = | మిథిలనేలిన రాజు. జనక వంశస్థుడు. |
| శృతదేవుడు | = | బహుళాశ్వుడు రాజుగా మిథిలా నగరము నేలిన కాలంలో మిథిలలో ఉన్న కృష్ణభక్తుడు. కృష్ణునకు ఆతిథ్య మిచ్చిన వాడు. |
| కుమారస్వామి | = | దేవసేనాని, ఈశ్వరుని కుమారుడు. |
| మథురానగరం | = | కంస సంహారం అయిన తరువాత, శ్రీకృష్ణాదులు ఉగ్రసేనుని రాజు చేసుకొని పాలించిన రాజధాని నగరం. |
| ద్వారకానగరం | = | జరాసంధుని, కాలయవనులను ఎదిరించు, వ్యూహంలో భాగంగా కృష్ణుడు సముద్రంలో ఒక సుందర నగరాన్ని నిర్మింపజేసి మధురను వీడి అక్కడ జేరాడు. అదే ద్వారక. |
| కుశస్థలి | = | రైవత దుర్గమున ఉన్న పట్టణము. మధురాపురము జరాసంధునిచే కాల్చబడిన తరువాత కొంత కాలము శ్రీకృష్ణునకు రాజధానిగా ఉండెను. తొలుత ఇది ఆనర్ధదేశానికి రాజధానియై యుండెను. |

| | | |
|---|---|---|
| హస్తినాపురం | = | అజమీఘుని తండ్రియగు హస్తిచే నిర్మించి నందున ఈ నగరమునకు ఈ పేరు వచ్చింది. ఇది కౌరవులకు రాజధాని. ఇది ఇప్పుడు గంగానదిలో మునిగియున్నది. ప్రస్తుతము ఢిల్లీ పట్టణమునకు తూర్పున అరువది మైళ్ళ దూరంలో ఉన్నది. |
| చాళుక్యులు | = | భారతదేశాన్ని పాలించిన రాజులలో పేరెన్నికగన్న దేశీయరాజులు. |
| పల్లవులు | = | భారత భూభాగాన్ని ఏలిన దేశీయ రాజులు. |
| మౌర్యులు | = | ముర అనే శూద్ర స్త్రీ గర్భ సంజాతులు కావున వీరికి మౌర్యులను పేరు వచ్చినది. |
| మ్లేచ్ఛులు | = | భారతదేశాన్ని ఏలిన ఇతర దేశాల సూద్రజాతి వారు, హిందూ ధర్మేతరులు. |
| పైలుడు | = | వ్యాస శిష్యుడు – ఋగ్వేద పండితుడు. యజుర్వేదాన్ని నేర్చుకున్నాడు. |
| వైశంపాయనుడు | = | వేదవ్యాసుని శిష్యులలో ఒకడు. జనమేజయ మహారాజుకు మహాభారతాన్ని చెప్పిన మహర్షి. |
| జైమిని | = | వ్యాస శిష్యుడు. వ్యాసునివద్ద సామవేదాన్ని గ్రహించాడు. |
| సుమంతుడు | = | వ్యాస శిష్యుడు. వ్యాసుని వద్ద అధర్వవేదాన్ని అభ్యసించాడు. |

**పురాణం అంటే తరతరాల సంస్కృతిని, సంప్రదాయాలను తెలియజెప్పే చారిత్రక విజ్ఞాన సర్వస్వం. శ్రీమద్భాగవతం సకల**

**వేదసారం. దీనిని రచించిన వారికి వినిపించిన వారికి, విన్న వారికి పాపరాశి తొలగి పుణ్యం ప్రాప్తించి, తత్కారణంగా వైకుంఠుని చరణ సన్నిధానం దక్కుతుంది.**

సర్వేజనాః సుఖినోభవంతు
సమస్త సన్మంగళా నిబంతు
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

* * *